# ప్రౌఢవ్యాకరణ ఘంటాపథము

(త్రిలిఙ్గ లక్షణశేషము - అను, ప్రౌఢవ్యాకరణము)

నికషోపలానుబంధ సహితము


వ్యాకర్త : బహుజనపల్లి సీతారామాచార్యులు

వ్యాఖ్యాత : వంతరాం రామకృష్ణారావు





విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన్ భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్-500 001.

Proudha Vyakarana Ghantapathamu – with restructured Appendix
Commentator: Vantharam Ramakrishna Rao
Grammarian: Bahujanapalli Sitharamacharyulu (1827-1891)

ప్రచురణ నెం. : 2125

ప్రతులు : 1000

వి.పి.హెచ్. ప్రకృత
ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 1999



ముఖ చిత్రం: ఉమ

వెల : రూ.80/-

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ – 500 001
విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం, కాకినాడ,
గుంటూరు, అనంతపురం, హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్ హైదరాబాద్ - 29. ఫోన్: 3229831

# అంకితము

క. మాతర పితౄణమీఁగుట
నాతరమా? లేక లేకనసుఁ గన్న మిమున్
భ్రాంతిగ భజించు కోరిక
చేతంజేఁత నగునట్టి సేవయొనర్తున్.

క. పుట్టు కృతార్థతఁబొరయఁగఁ
బట్టితిని గలమ్ము మీకువలె సేవింపన్
గట్టితిని గంకణమునజు
పట్టపు దేవికిని దత్కృపారసదృష్టిన్

క. అతి సులభగమ్యము పరి
ష్కృత వివాదాంశ సముపబృంహితము ప్రతి
ష్ఠిత శాస్త్రార్థముపజ్ఞా
గతశాస్త్రకృదాశయమొక ఘంటాపథమే

ఆ. అని ప్రసిద్ధిగన్న యనితర సాధ్యమీ
వ్యాఖ్యఁ జేసినాఁడ నంకితంబు
నధికభక్తి లక్ష్మణాంబా చిరంజీవు
లార! తల్లిదండ్రులార! మీకు.



# పీఠిక

1996లో, బాలవ్యాకరణ ఘంటాపథమును బునర్ముద్రించినట్లే, యిప్పుడు ప్రౌఢవ్యాకరణ ఘంటాపథమును బునర్ముద్రించిన, విశాలాంధ్ర ప్రచురణాలయమువారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములర్పించు చున్నాను.

విద్యార్థుల, యధ్యాపకుల, జిజ్ఞాసువుల, చిరకాల వాంఛిత మీనాఁటికి నెఱవేఱినందులకు సంతోషించుచున్నాను. వారి సంపూర్ణ సహకారము నభ్యర్థించుచున్నాను.

1. ఈ ముద్రణములో ఆవశ్యకములయిన చేర్పులు మార్పులు చేయఁబడినవి.
2. సద్యః పరిశీలనకు వీలుగా ననుబంధము పునర్విభజింపఁబడి, వ్యాఖ్యాన మున నాయావిషయ సంఖ్యలు సూచింపఁబడినవి. దీనితో ననుబంధ విషయపరిశీలనకు సౌలభ్యమేర్పడినది.
3. అతి ప్రధానములయిన రెండు వ్యాసములకు సమాధానములు శాస్త్ర దృష్టితో సంఘటింపఁబడినవి.

ఘంటాపథములందుఁజెప్పని విషయము పేక్ష్యమనియు, (ఘంటాపథా నుక్తత్వాదు పేక్ష్యమ్.) ఘంటాపథ విరుద్ధవిషయమప్రమాణమనియు, (ఘంటాపథ విరుద్ధత్వా దప్రమాణమ్.) గ్రహింపవలెనని, వినయపూర్వక విజ్ఞప్తి.

యమ్.ఐ.జి. 83,
సమతానగర్,
విశాఖపట్టణము–44.

ఇట్లు
వంతరాం రామకృష్ణారావు
ప్రిన్సిపాల్ (రిటైర్డ్)

# వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు

## [14-10-1980 లేఖ]

### ప్రౌఢవ్యాకరణ ఘంటాపథము:

"మీరు చేసిన విమర్శనము తిరుగులేనిదిగా వెలయుచున్నది."

"సూత్రస్థ పదములకెల్ల, 'అవయవశః' అర్థము తుదిని చేయుచు వచ్చిన కృత్యవిచారణ, మిగుల ఆకర్షణీయముగా నున్నది."

"మీ వ్యాఖ్యానములలో (బాలప్రౌఢ ఘంటాపథములలో) నీనాటికున్న వ్యాకరణ సర్వస్వమును విస్పష్టమగుచు మీ లక్షణ గ్రంథ పరిశోధన విశేషము వెల్లడి యగుచున్నది."

"సకల వివాదాంశ సమ్యక్పరిష్క్రియా, పటుతరోపజ్ఞావిభాసితులు – కావుననే, గుణదోషములను మొగమోటలేక చాలనీ న్యాయమునఁ జక్కఁగఁ బరిష్కరించిన మీ పరిశ్రమమునేమని మెచ్చవలెనో తెలియకున్నది"

కాకినాడ,
14-10-1980.

– వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి

# * ఉపోద్ఘాతము

పండితోత్తముండును సజ్జనాగ్రేసరుండు నగు మజ్జనకుండు నాయెడ స్వామిభావంబును దాసభావంబును నెఱపి మిత్రభావంబు నెఱపం బ్రారంభించు తఱి నాకు యథోచితంబుగఁ గవితాధార యొకింత గలుగ, తోడనే నాకు బాలవయోఽవస్థాకాలవాస స్థానంబై యున్న నాగపట్టణంబను దివ్యదేశంబున దివ్యమంగళ విగ్రహంబుతో నన్వర్థాభిధానుండై వేంచేసి యుండెడు శ్రీసౌందర్య రాజ స్వామినిఁ బద్మరూపంబునం బ్రస్తుతింప మతివొడమి, ఏను దన్నామాంకితంబుగ సాంతము శబ్దాలంకార సహితంబై యుండ నొక్క శతకంబు గావించితి. తదనంతరము విద్యావిచార తత్పరుండనై కొన్ని హాయనంబులు కడపి యంత నాంధ్రశబ్దరత్నాకరంబను నకారాది నిఘంటు వొకటి వ్రాయు నుద్దేశముతో గ్రంథశోధనము సేయం దొరకొని తద్విఘ్న నిరాసార్థంబు తదధిదేవతా స్తవం బొనరింపం దలంచి తదంకితంబుగ సాంతము నర్థాలంకార సహితంబై యుండ నొక్క శతకంబు రచియించితి. అంతట నా నిఘంటువు వ్రాయనుద్యమించి వ్రాయుచుఁ దన్మాలంబున విద్యార్థిజన సహాయంబుగ వైకృతదీపిక, సంస్కృతాంధ్ర ద్రవిడ హూణభాషా సహితంబగు పదార్థ నామకోశము, బాలచంద్రోదయము, అలఘు కౌముది, త్రివిధంబగు నీతిమాలయను నీ పుస్తకంబులను గ్రమంబుగ విరచించి ముద్రింపించి పిమ్మట భారతాదిగ్రంథములయందు సంగ్రహించి యుంచిన నీతిపద్యములను గొని స్త్రీజన సామాన్య పఠనయోగ్యంబగు సతీధర్మ సంగ్రహంబను నొక పుస్తక మేర్పఱిచి యచ్చువేయించి, అట్లు మిగులఁ బూనికతోఁ బ్రారంభించి వ్రాయుచుండిన యా గొప్ప నిఘంటువును వ్రాసి పరిసమాప్తిఁ బొందించితిని. ఇంతకు ముందు నా షష్టిపూర్తి సమయంబునఁ బ్రపన్న పారిజాతమను నొక ప్రపత్తిగ్రంథము నఱువది పద్యములు గలదానిగా నొకటి సంతరించి ముద్రింపించితిని. తుద కిప్పుడు తద్భారతాది గ్రంథ పరిశోధనంబుచే దొరకిన విశేషలక్షణ ప్రయోగముల నేర్చికూర్చి త్రిలిఙ్గలక్షణ

---

* మొదటికూర్పు (1885 ఫిబ్రవరి).

శేషంబను నొక యపూర్వవ్యాకరణమును దీని వ్రాసితిని. ఇందలి లక్షణము లసాధారణములనియు నియ్యది విద్యార్థుల కత్యంతోపకారకమనియు మంచి మనసుతోఁ బరికించు వారలకెల్లఁ జక్కఁగాఁ దెల్లము కాఁగలదు. కాన శక్తిమంతులు యథాశక్తిని దీనిని విద్యార్థుల యుపయోగమునకుఁ దేవలయునని యేను మిక్కిలి కోరికగలవాఁడనై యున్నాఁడను.

బ. సీతారామాచార్యులు

To
**His Highness**
**The Honourable Maharajah**

**Mirja Sri Vijaya Ananda Gajapati**
**Maharajah Manya Sultan Bahadur of**
VIZIANAGARAM, K.C.I.E.,

This book is respectfully, dedicated by Kind Permission.

**By The Author**

# సంకేతాక్షర వివరణములు

| సంకేతము | గ్రంథము | గ్రంథకర్త |
|---|---|---|
| అచ్చరా | అచ్చతెనుఁగు రామాయణము | కూచిమంచి తిమ్మకవి |
| అని | అనిరుద్ధచరిత్ర | కనుపర్తి అబ్బయ |
| అము | ఆముక్తమాల్యద | శ్రీకృష్ణదేవరాయలు |
| ఉ.రా. | ఉత్తర రామాయణము | కంకంటి పాపరాజు |
| ఉ. హరి | ఉత్తర హరివంశము | నాచనసోమన |
| కవిక | కవికర్ణ రసాయనము | సంకుసాల నృసింహకవి |
| కళా | కళాపూర్ణోదయము | పింగళి సూరన |
| కాశీ | కాశీఖండము | శ్రీనాథుఁడు |
| క్షేత్రయ | క్షేత్రయపదములు | క్షేత్రయ |
| చంద్ర | చంద్రభానుచరిత్ర | తరిగొప్పుల మల్లన |
| చంద్రా | చంద్రాంగదచరిత్ర | పైడిమర్రి వేంకటపతి |
| జై | జైమినిభారతము | పిల్లలమర్రి పినవీరభద్రకవి |
| నిర్వ | నిర్వచనోత్తర రామాయణము | తిక్కన |
| నై | నైషధము | శ్రీనాథుఁడు |
| పర | పరమయోగి విలాసము | సిద్ధరాజు |
| పాంచా | పాంచాలీపరిణయము | కాకమానిమూర్తి |
| పాండు | పాండురంగమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి |
| పారి | పారిజాతాపహరణము | నంది తిమ్మన |
| ప్రభా | ప్రభావతీ ప్రద్యుమ్నము | పింగళి సూరన |
| భర్తృ | భర్తృహరి సుభాషితము | ఏనుఁగు లక్ష్మణకవి |
| భల్లా | భల్లాణచరిత్ర | మల్లవరపు వాలేశ్వరుఁడు |
| భాగ | భాగవతము | పోతన |
| భాను | భానుమతీ పరిణయము | రెంటూరి రంగరాజు |
| భార | భారతము | కవిత్రయము |
| భాస్కర | భాస్కరశతకము | మారద వెంకయ్య |
| భీమ | భీమఖండము | శ్రీనాథుఁడు |
| భోజ | భోజరాజీయము | అనంతామాత్యుడు |
| మార్క | మార్కండేయపురాణము | మారన |
| యయ | యయాతి చరిత్ర | పొన్నెగంటి తెలగన |
| రా | భాస్కర రామాయణము | భాస్కరాదులు |
| రా.వి | రాజవాహన విజయము | కాకమాని మూర్తి |
| రాఘ | రాఘవపాండవీయము | పింగళి సూరన |
| రామా | రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రుఁడు |

| | | |
|---|---|---|
| రుక్మాం | రుక్మాంగద చరిత్ర | ప్రౌఢకవి మల్లన |
| లక్ష్మీ | లక్ష్మీనృసింహావతారము (నృసింహపురాణము) | ఎఱ్ఱాప్రెగడ |
| వసు | వసుచరిత్ర | రామరాజభూషణుఁడు |
| వి.పు. | విష్ణుపురాణము | వెన్నెలకంటి సూరన |
| విక్ర | విక్రమార్క చరిత్ర | జక్కన |
| విజ | విజయవిలాసము | చేమకూర వేంకటకవి |
| విజ్ఞా | విజ్ఞానేశ్వరీయము | కేతన |
| వీర | వీరభద్రవిజయము | పోతన |
| వేం.పంచ | పంచతంత్రము | వేంకటనాథుఁడు |
| శశాం | శశాంకవిజయము | శేషము వేంకటపతి |
| శివ | శివయోగసారము | కొలని యాది గణపతిదేవకవి |
| శుక | శుకసప్తతి | పాలవేకరి కదిరీపతి |
| శేష | శేషధర్మము | సిద్ధకవి |
| సత్య | సత్యభామా సాంత్వనము | లింగనమఖి కామేశ్వరకవి |
| సా | సారంగధర చరిత్ర | చేమకూర వేంకటకవి |
| సుమతి | సుమతిశతకము | |
| స్వా | స్వారోచిష మనుసంభవము | అల్లసాని పెద్దన |
| హరి | హరివంశము | ఎఱ్ఱాప్రెగడ |
| హరిశ్చ | హరిశ్చంద్రోపాఖ్యానము | శంకరకవి |

# వ్యాఖ్యాన, తదనుబంధోదాహృత గ్రంథసూచిక

| | |
|---|---|
| అచ్చ.రా | అచ్చతెలుఁగు రామాయణము |
| అడిదము. చాటు | అడిదము సూరకవి చాటువు |
| అప్పక | అప్పకవీయము |
| అమర | అమరకోశము |
| అహో | అహోబల పండితీయము |
| ఆం.చిం. | ఆంధ్రశబ్ద చింతామణి |
| ఆంధ్రనా | ఆంధ్రనామ సంగ్రహము |
| ఆం.భా. | ఆంధ్రభాషార్ణవము |
| ఆం.భూ. | ఆంధ్రభాషాభూషణము |
| ఆం.శే. | ఆంధ్రనామశేషము |
| ఆది | ఆదిపర్వము |
| ఆను | ఆనుశాసనిక పర్వము |
| ఆపస్తంబ | ఆపస్తంబధర్మసూత్రములు |
| ఆముక్త | ఆముక్తమాల్యద |
| ఆరణ్య | ఆరణ్యపర్వము |
| ఆశ్రమ | ఆశ్రమవాసపర్వము |
| ఆశ్వ.గృహ్య | ఆశ్వలాయన గృహ్యసూత్రములు |
| ఉద్యో | ఉద్యోగపర్వము |
| ఉ.రా. | ఉత్తర రామాయణము |
| ఉ.హ. | ఉత్తర హరివంశము |
| ఏ.కో. | ఏకాక్షర కోశము |
| కర్ణ | కర్ణపర్వము |
| కళా | కళాపూర్ణోదయము |
| కవి.చిం. | కవి చింతామణి |
| కవిజ | కవిజనసంజీవని |
| కవిజన | కవిజనమండనము |
| కవిజనా | కవిజనాశ్రయము |
| కవిచిం | కవిచింతామణి |
| కవిసం | కవిసంశయవిచ్ఛేదము |
| కాళహ | కాళహస్తిమాహాత్మ్యము |
| కావ్యప్ర | కావ్యప్రకాశిక |
| కావ్యమీ | కావ్యమీమాంస |
| కావ్యాలం | కావ్యాలంకారసంగ్రహము |
| కాశీ | కాశీఖండము |
| కు.సం. | కుమారసంభవము |
| కొం.స. | శ్రీ కొంపెల్ల సత్యనారాయణ గారు |
| క్రీడా | క్రీడాభిరామము |
| చండ.ప్రా. | చండప్రాకృత వ్యాకరణము |

| | |
|---|---|
| చిం.పరి | చింతామణి విషయపరిశోధనము |
| చి.ని. | చిన్నయసూరి నిఘంటువు |
| ఛందో | ఛందోదర్పణము |
| జై.భా. | జైమిని భారతము |
| తత్త్వ | ప్రౌఢవ్యాకరణ తత్త్వబోధినీ టీక |
| తర్క | తర్కసంగ్రహము |
| తర్క.దీ | తర్కసంగ్రహదీపిక |
| త్రి.ని. | త్రికాండశేషము |
| త్రి.ప్రా. | త్రివిక్రమ ప్రాకృత శబ్దానుశాసనము |
| దశ | దశకుమార చరిత్ర |
| దశా. | దక్షిణ హిందూస్థాన శాసనము |
| దేశీ | దేశీనామమాల |
| ద్రోణ | ద్రోణపర్వము |
| ద్వంద్వ | ద్వంద్వయుద్ధోపశమనము |
| ద్విరేఫ | ద్విరేఫవర్ణదర్పణము |
| ధ్వన్యా | ధ్వన్యాలోకము |
| నరస | నరసభూపాలీయము |
| నానా | నానార్థ రత్నమాల |
| నారా | నారాయణీయవృత్తి |
| నిర్ణయ | నిర్ణయసింధువు |
| నిర్వ | నిర్వచనోత్తర రామాయణము |
| నీలా | నీలాసుందరీ పరిణయము |
| నృసింహ | నృసింహపురాణము |
| పండితా | పండితారాధ్యచరిత్ర |
| పరమ | పరమయోగి విలాసము |
| పరిభా | పరిభాషేందు శేఖరము |
| పాంచా | పాంచాలీపరిణయము |
| పాండు | పాండురంగమాహాత్మ్యము |
| పాణి | పాణినీయము |
| పారిజా | పారిజాతాపహరణము |
| ప్రబంధ | ప్రబంధరాజవేంకటేశ్వర విజయ విలాసము |
| ప్రా.ప్ర. | ప్రాకృతప్రకాశము |
| ప్రా.మం. | ప్రాకృతమంజరి |
| బసవ | బసవపురాణము |
| బహులా | బహులాశ్వచరిత్ర |
| బా.ఉద్యో | బాలవ్యాకరణోద్యోతము |

| | |
|---|---|
| బా.ఘంటా | బాలవ్యాకరణ ఘంటాపథము |
| బా.ర | బాలవ్యాకరణ రమణీయము |
| బాలమ | బాలమనోరమ (సి.కౌ.టీక) |
| బాలస | బాలసరస్వతీయము |
| బా.సా.పే. | బాలవ్యాకరణ సారస్య సర్వస్వ పేటిక |
| భాగ | భాగవతము |
| భా.రా. | భాస్కర రామాయణము |
| భీమ | భీమఖండము |
| భీష్మ | భీష్మపర్వము |
| భై.మి.వ్యా. | భైరవమిశ్రుని వ్యాఖ్య |
| భోజరా | భోజరాజీయము |
| మను | మనుచరిత్ర |
| మ.భా. | మహాభాష్యము |
| మ.భా.ఉ. | మహాభాష్యోద్ద్యోతము |
| మ.భా.ప్ర. | మహాభాష్యప్రదీపము |
| మార్కం | మార్కండేయపురాణము |
| ము.కౌ. | ముక్తలక్షణ కౌముది |
| ముగ్ధ–దుర్గా | ముగ్ధబోధ–దుర్గాదాసటీక |
| ముగ్ధ–శ్రీరామ | ముగ్ధబోధ–శ్రీరామతర్కవాగీశుని టీక |
| మే.ని. | మేదినీకోశము |
| మోనియర్ | మోనియర్ విలియమ్స్ |
| య | యయాతి చరిత్ర |
| రంగరాట్ | రంగరాట్ ఛందము |
| రాఘవ | రాఘవపాండవీయము |
| రామా | రామాభ్యుదయము |
| రుక్మాం | రుక్మాంగదచరిత్ర |
| ల.మ. | లఘుమంజూష |
| ల.శ.శే. | లఘుశబ్దేందుశేఖరము |
| వరాహ | వరాహపురాణము |
| వసు | వసుచరిత్ర |
| వాక్యప | వాక్యపదీయము |
| వాల్మీకి | వాల్మీకిచరిత్ర |
| వా.వ్యా. | వాఙ్మయవ్యాసములు |
| వికృ | వికృతి వివేకము |
| విక్రమా | విక్రమార్కచరిత్ర |
| వి.పు. | విష్ణుపురాణము |
| విరాట | విరాటపర్వము |
| విశ్వ | విశ్వకోశము |
| వెం.సూ. | వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు |
| వై.చం. | వైకృతచంద్రిక |
| వై.పా. | వైయాకరణపారిజాతము |
| వ్యక్తి | వ్యక్తివివేకము |
| వ్యా.సం.స. | వ్యాకరణసంహితా సర్వస్వము |
| శబ్దక | శబ్ద కల్పద్రుమము |
| శబ్దల | శబ్ద లక్షణ సంగ్రహము |
| శబ్దస్తో | శబ్ద స్తోమమహానిధి |
| శ.ర. | శబ్ద రత్నాకరము |
| శ.రే. | శకటరేఫ నిర్ణయము |
| శల్య | శల్యపర్వము |
| శశాం | శశాంకవిజయము |
| శాంతి | శాంతిపర్వము |
| శివత | శివతత్త్వసారము |
| శివయో | శివయోగసారము |
| శుక | శుకసప్తతి |
| శృ.నై. | శృంగారనైషధము |
| శృ.శా. | శృంగారశాకుంతలము |
| శ్రీనా.చాటు | శ్రీనాథుని చాటువు |
| సం.భాగ. | సంస్కృత భాగవతము |
| సంశో. | మహాభారత సంశోధిత ముద్రణము |
| సం.హరి | సంస్కృత హరివంశము |
| సభా | సభాపర్వము |
| సర్వల | సర్వలక్షణసార సంగ్రహము |
| సాం.ని. | సాంబనిఘంటువు |
| సా.ద. | సాహిత్యదర్పణము |
| సా.ర. | సాహిత్యరత్నాకరము |
| సి.కౌ. | సిద్ధాంత కౌముది |
| సుదక్షి | సుదక్షిణాపరిణయము |
| సూ.ని. | సూర్యరాయాంధ్ర నిఘంటువు |
| స్త్రీ | స్త్రీపర్వము |
| స్వర్గా | స్వర్గారోహణపర్వము |
| హ.న. | హరిశ్చంద్ర నలోపాఖ్యానము |
| హర | హరవిలాసము |
| హిరణ్య | హిరణ్యకేశి గృహ్యసూత్రములు |
| హేమ.ప్రా. | హేమచంద్రుని ప్రాకృత శబ్దానుశాసనము |

# విషయసూచిక



## ప్రౌఢవ్యాకరణ ఘంటాపథ నికషోపలానుబంధము

# ప్రౌఢవ్యాకరణ ఘంటాపథము

## సంజ్ఞా పరిచ్ఛేదము

క॥ సత్యము శ్రేయము జనులకు
సత్యము దక్కొండు లేదు సద్ధర్మమదే
యత్యలఘు తపః ఫలమిదు
నిత్యతఁ బాటిల్లు దాన నిఖిలార్థంబుల్.

### ఆంధ్ర భాషకు వర్ణంబు లేఁబది యైదు. 1

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః.

క ఖ గ ఘ ఙ; చ ౘ ఛ జ ౙ ఝ ఞ; ట ఠ డ ఢ ణ; త థ ద ధ న; ప ఫ బ భ మ; య  ర ల వ శ ష స హ ళ.

ఌకార గ్రహణము సంస్కృత ప్రాకృత భాషా వ్యాకరణజ్ఞుల సమ్మతము. అయ్యది మంత్రశాస్త్ర ప్రసిద్ధము. యవలల వలె రేఫంబును బ్రయత్న భేదంబుచే ద్వివిధంబుగాన శబ్దశాసనాదులచేత నలఘు రేఫము వర్ణాంతరముగా గ్రహింపఁబడదయ్యె. క్షకారము సంస్కృత వ్యాకరణముల యందును, నిఘంటువుల యందును, షాంతపద మధ్యమునందుఁ బఠింపఁబడుటంజేసి యది వర్ణాంతరము గాదు; సంయుక్తాక్షరమని తెలియవలయు.

వ్యా. ఆంధ్రభాషకు వర్ణములు=55. ఆంధ్రభాష యనఁగా సంస్కృత సమము, నాచ్ఛికమునను భాష. అచ్చ తెనుఁగు వర్ణములు=36. సంస్కృత సమములనుగూడి వ్యవహరింపఁబడు వర్ణములు=19. మొత్తము 36+19=55 వర్ణములు. ఈ సూత్రము, బా. సంజ్ఞా 3, 4 సూత్రముల సమాహారము.

ఌకారము:- ఌకారము పాణినీయ సమ్మతము కాకుండుటచే, నిది సంస్కృతమునఁ గలదా? యను ప్రశ్న పుట్టును. ఈ ప్రశ్నకు సమాధానముగా– "ఌకార గ్రహణము సంస్కృత ప్రాకృత వ్యాకరణజ్ఞుల సమ్మతము" అని తెలుపఁబడెను. దీని భావమిది. ఌకారము పాణినీయేతర సంస్కృత వ్యాకరణములకు సమ్మతమగుటచే, నిది సంస్కృత వ్యాకరణజ్ఞులకు సమ్మతము. ఌకారము సంస్కృతమునఁ గలదని కొందఱు ప్రాకృత వ్యాకర్తలు తలంచుటచే, నిది సంస్కృతమునఁ గలదనుట ప్రాకృత వ్యాకరణజ్ఞులకు సమ్మతము. ఇట్లు ఌకారము సంస్కృత ప్రాకృత వ్యాకరణజ్ఞుల మతమున సంస్కృతములోఁ గలదని తాత్పర్యము. ఌకారము సంస్కృతమున నుండుఁగాక! ఆంధ్రవర్ణ సమామ్నాయమున దీనిని గ్రహింపనేల? యన్న ప్రశ్న దీనిపై నుదయించును. దీనికి సమాధానముగా–– "అయ్యది మంత్రశాస్త్ర ప్రసిద్ధము" అని చెప్పఁబడెను. మంత్రశాస్త్ర ప్రసిద్ధికి, నాంధ్రభాషకు, సంబంధమేమనఁగాఁ, గావ్యారంభమున, మంత్రశాస్త్ర ప్రసిద్ధమగు మాతృకాపూజ చేయవలెనను నియమము గలదు. మాతృకా పూజలో ఌకారమును లిఖింపవలసిన యావశ్యకత కలదు. మాతృకా పూజలో నుపయోగముండుటచే ఌకార మాంధ్రవర్ణ సమామ్నాయమున గ్రహింపఁబడెనని భావము. (చూ. అనుబంధము, విషయసంఖ్య 13).

అలఘు రేఫము:- అలఘువులగు, య–వ–ల– అను వర్ణములు వర్ణాంతరములు కానట్లే యలఘురేఫమును వర్ణాంతరము కాదని నన్నయాదుల యభిప్రాయము. కావున నిది ప్రత్యేక వర్ణముగా గ్రహింపఁబడలేదు. (చూ.బా.సంజ్ఞా 18–ఘంటా).

క్ష వర్ణము:- ఇది సంయుక్తాక్షరమే కాని ప్రత్యేక వర్ణము కాదు. ఇందులకుఁ బ్రమాణములు–– (i) ఇది సంస్కృత వ్యాకరణములందు షకారాంతముల మధ్యఁబఠింపఁబడినది. (ii) ఇట్లే, సంస్కృత నిఘంటువులయందు షకారాంత పదముల మధ్యఁ బఠింపఁబడినది. క్ష వర్ణము వేఱు వర్ణమే యయినచో క్షాంతములు వేఱుగాఁ బేర్కొనఁబడి యుండెడివి. కావున, క్య, క్ర – మున్నగువాని వలె క్ష వర్ణము సంయుక్తాక్షరమే కాని, ప్రత్యేక వర్ణము కాదు. (చూ. అనుబంధము, విషయసంఖ్యలు–30, 58.).

## నిర్దేశ విధానోచ్చారణంబులం దలఁచుగ 'అ' వర్ణాదులు కార ప్రత్యయాంతములును 'ర' వర్ణ మిఫప్రత్యయాంతము నగు. 2

ఉ: అ కారమునకు, ఉ కారము వచ్చును. క కారమునకు, గ కారము వచ్చును. ల కారమునకు, రేఫము వచ్చును. మొ॥ అకారము, ఇకారము, ఉకారము, రేఫము. మొ॥ తలఁచుగ ననుటచేఁ గేవల వర్ణోచ్చారణమునం దీవిధి నిత్యము కాదని తెలియునది.

వ్యా. నిర్దేశమునందును విధానమునందును నుచ్చారణమునందును దలఁచుగా, అవర్ణాదులు 'కార' ప్రత్యయము చివరఁగలవి యగును. రవర్ణము ఇఫ ప్రత్యయము చివరఁగలది యగును. అనఁగా, అవర్ణాదులకు కార ప్రత్యయము, రవర్ణమునకు ఇఫ ప్రత్యయము చివరఁజేరునన్న మాట. నిర్దేశ విధానములకు:- అకారమునకు, ఉకారము వచ్చును. ఇట, అకారము, అన్నది నిర్దేశము. అకారమునకు విధించినది గనుక

ఉకారము - అన్నది విధానము. నిర్దేశింపఁబడిన అ వర్ణమునకు, కారప్రత్యయము కలిగి అకారమని యయినది. ఇట్లే విధింపఁబడిన ఉ వర్ణమునకును, కారప్రత్యయము కలిగి ఉకారమని యయినది. కకారమునకు, గకారము వచ్చును - అను వాక్యమున కవర్ణము - నిర్దేశము, గవర్ణము - విధానము. రెంటికిని, కారప్రత్యయము వచ్చి, క+కార=కకారము, గ+కార=గకారము, ననియైనవి. లకారమునకు రేఫము వచ్చును - అనుచో, లవర్ణము - నిర్దేశము. రవర్ణము-విధానము. లవర్ణమునకు కార ప్రత్యయము కలిసి, ల+కార=లకారము - అయినది. రవర్ణమునకు ఇఫ ప్రత్యయము కలిగి, ర+ఇఫ=రేఫము - అని యయినది. ఉచ్చారణమునకు:- అకారము, ఇకారము, ఉకారము, రేఫము. మొ॥ తలఁచుఁగ - అనుటచేఁ గేవల వర్ణోచ్చారణమునం దీవిధి నిత్యము కాదు. అనఁగాఁ గేవల వర్ణోచ్చారణమున నీ ప్రత్యయములు రాకపోవచ్చును. ఉదా॥ అ-ఆ-క-గ-య-ర-ల-వ, ఇత్యాదిగా నుచ్చరింపవచ్చునన్న మాట. నిర్దేశ విధానములందును నీప్రత్యయములు రాకపోవచ్చును. చూ.3సూ.

**విమర్శ:-** (i) కార ప్రత్యయము, ఇఫ ప్రత్యయము సంస్కృత వ్యాకరణమునవే విధింపఁబడియున్నవి. (వర్ణాత్కారః, రస్యేఫః - వార్తికములు) కావున నీ సూత్రము త్యాజ్యము. అలఘు రేఫమునకుఁగార ప్రత్యయమేయగునని వేఱుగా సూత్రింపవలెను. (ము.కౌ.సంజ్ఞా 1) (ii) నిర్దేశ విధానోచ్చారణంబులన్ - అని కాక నిర్దేశంబున - అన్నచోఁ జాలును. విధానోచ్చారణములను వేఱుగాఁ బేర్కొనుట స్పష్ట ప్రతిపత్తి కననగును.

## ఒకచో హ్రస్వంబు దీర్ఘంబగు. 3

నిర్దేశ విధానంబులం గా రేఫ ప్రత్యయములు రానియెడల హ్రస్వమునకు దీర్ఘము వచ్చునని యర్థము, ఉ: 'ఆ' కు- 'ఊ' వచ్చును. 'కా'కు - 'గా' వచ్చును. 'లా'కు - 'రా' వచ్చును.

**వ్యా.** ఒకచో, ననఁగా కారప్రత్యయము, ఇఫ ప్రత్యయము 2 చే రానప్పుడు, హ్రస్వమునకు దీర్ఘమగుననియర్థము. ఎట్లన, (i) అకారమునకు, ఉకారము వచ్చును - అని 2 చే - కార ప్రత్యయమగును. కార ప్రత్యయము కాని పక్షమున అ-ఉ వర్ణములు దీర్ఘములై ఆకు, ఊవచ్చును-అని యగును. ఇట్లే క కారమునకు గ కారము వచ్చును - అనుచో, కార ప్రత్యయము రానప్పుడు క గల మీఁది హ్రస్వమయిన అకారము దీర్ఘమై, కాకు గా వచ్చును - అని యగును. (ii) లకారమునకు రేఫము వచ్చును - అనుచో, 2చే కారప్రత్యయము, ఇఫ ప్రత్యయము కాని పక్షమున లరల మీఁది హ్రస్వమయిన అకారము దీర్ఘమై, లా కు రా వచ్చును - అని యగును. (చూ. అనుబంధము, మూలములు.).

## దీర్ఘంబు దీర్ఘంబ. 4

నిర్దేశ విధాన విషయములయిన వర్ణములు దీర్ఘములయ్యేనేని యవి యట్లే యుండు ననియర్థము.

**ఉ:** ఐకి ఔ వచ్చును. మొ॥

**వ్యా.** నిర్దేశమునకును, విధానమునకును, 2చే - విషయములయిన వర్ణములు దీర్ఘములైనచో, నవి యథాప్రకారముగా దీర్ఘములుగానే యుండిపోవునని యర్థము. ఉదా॥ ఐకి ఔ వచ్చును. మొ॥.

**విమర్శ:-** దీర్ఘమునకు హ్రస్వ ప్రాప్తియే లేదు గనుక నీ సూత్ర మనావశ్యకమన

నగును గాని, హ్రస్వములు 3 చే – దీర్ఘములయి, దీర్ఘములు దీర్ఘములుగానే యున్నప్పుడు నిర్దేశ విధానములకు విషయములైన వర్ణములు హ్రస్వములా? దీర్ఘములా? యన్న సందేహము కలుగవచ్చును. సందర్భమునుబట్టి యీ విషయము నిర్ణయించుకొనవలసినదే కాని దీర్ఘములు నిర్దేశ విధానములలో హ్రస్వములగునని మాత్రము భ్రమపడరాదనుట కీసూత్రమహోబల పండితీయానుసారము రచింపఁబడెను. కావున నీసూత్రము స్పష్ట ప్రతిపత్తి కుద్దిష్ట మనఁదగును. (చూ. అనుబంధము మూలములు (ii) ఐఔలకు హ్రస్వములు లేనేలేవు గనుక వ్యాకర్త వేఱే యుదాహరణమునిచ్చుట యుక్తము. "ఐకారం బీతుల్యంబు" అను బా. తత్సమ 65వ, సూత్రము దీనికిఁ జక్కని యుదాహరణము. చూ. తత్సమ 65–ఘంటా.).

## ఒకానొకచో జకారం బుభయంబు నగు. 5

శ్లేషయందు జకార మొక్కటియె యొక యర్థమున దంత్యమును వేఱొక యర్థమునఁ దాలవ్యము నయ్యెడునని యర్థము.

ఉ: అకట! పాండురాజ యశమెన్నవైతి. రాఘ 1ఆ–31. (ఇట జకారము భారతార్థమునందు దంత్యము, రామాయణార్థము నందుఁ దాలవ్యము నగునని యెఱుంగవలయు.)

వ్యా. ఒకానొకచో ననఁగా శ్లేషలో జకారము, ఉభయంబున్=దంత్యమును దాలవ్యమును, నగునని యర్థము. ఒక యర్థమున దంత్యమును వేఱొక యర్థమునఁ దాలవ్యము నగునని భావము. అకట పాండురాజ యశమెన్నవైతి – అని రాఘవ పాండవీయము. పాండురాజ! యశము, ఎన్నవైతి – అని భారతార్థమునఁబదచ్ఛేదము. "రాజు శబ్దంబొక్కటి దంత్య యుక్తంబు కానంబడియెడి" (బా–సంజ్ఞ 10) అను బాల వ్యాకరణ వృత్తిచే, పాండురాజ–అను చోటి జకారము దంత్యమగునని వ్యాకర్త యాశయము. పాండుర + అజ యశము+ఎన్నవైతి – అని రామాయణార్థమునఁ బదచ్ఛేదము. ఈ పక్షమున "అజ" శబ్దమునందలి జకారము తాలవ్యమగును. ఇట్లొకటే జకారము శ్లేషలో వేర్వేఱు పదచ్ఛేదములతో దంత్యమును దాలవ్యమును నగుచున్నదని భావము.

విమర్శ:- (i) పాండురాజ! యను సంబోధనమునందలి జకారము తాలవ్యమే కాని దంత్యము కాదు. (చూ. బా. సంజ్ఞ 10–ఘంటా) కావునఁ బై రాఘవపాండవీయ ప్రయోగము సరియైన లక్ష్యము కాదు గాని చజలు రెండును శ్లేషలో నుభయములగు నవకాశము మాత్రము గలదు. (ము.కౌ. సంజ్ఞ 4) (ii) సంస్కృత సమమగు రాజశబ్దమునందలి జకారము తాలవ్యమేయగును. (చూ.6 సూ; అనుబంధము. విషయసంఖ్యలు – 31; 59.).

## రాజు వైకృతంబని కొందఱందురు. 6

(అప్పుడు తత్సమంబునందలి చజలు దంత్యములు కావని యూహించునది.)

ఉ: తే. రాజు చూడంగఁ జెప్పంగరాని కడిమి, నీటి యలఁ గ్రుమ్మి నొంచిరి లేటిమగల. య. 2 ఆ–17. మొ॥.

వ్యా. రాజు శబ్దము వైకృతమని కొందఱు చెప్పుదురు. వైకృతము="ప్రాకృతసమము, తద్భవమునగు భాష" – శ.ర. ఇట రాజు శబ్దము వైకృతమనఁగాఁ దద్భవమన్నమాట. ఈ పక్షమునఁదత్సమ రాజు–శబ్దమునందలి జకారము చిన్నయసూరి తెల్పినట్లు (బా.సంజ్ఞ 10) దంత్యము కాదనియుఁ దాలవ్యమే యనియు గ్రహింపవలెను. అనఁగా, రాజు–అను

తాలవ్య జకార యుక్త రూపము సంస్కృతసమము. రాజే—అను దంత్య జకార యుక్త రూపము తద్భవము. రాజు చూడంగఁ జెప్పంగ రాని కడిమి—అను యయాతి చరిత్ర ప్రయోగమును బట్టి తద్భవ రాజు శబ్దము గలదనక తీరదు. ఏలయన, యయాతి చరిత్ర యచ్చ తెనుఁగు కావ్యము. కావున నిందలి రాజు శబ్దము సంస్కృత సమము కానేరదు.

విమర్శ:- అచ్చ తెనుఁగుఁ గావ్యములందే కాక కేతనాది లాక్షణికుల మతమునందును, నచ్చ తెనుఁగుఁ గోశములందును దద్భవమగు రాజే శబ్దము గలదు. కావున రాజు – తత్సమమనియు, రాజే—తద్భవమనియు నిర్ణయించుటయే సముచితము. (చూ. అనుబంధము. విషయసంఖ్యలు—31; 59.).

## నకారం బసాధారణంబు ద్రుతంబు. 7

ప్రత్యయాగమావ్యయాత్మకమై యుత్వవిశిష్టమయిన నకారంబు ద్రుత సంజ్ఞకంబని యర్థము. ద్రుతమనఁగా నొల్లనియెడ మఱిఁగి పోవునది యనుట.

ఉ: ప్రత్యయాత్మకమైన నకారమునకు—తాను, నేను, ధనమును, వనమును, చదువుచున్నాను, చదువఁగలను. మొ॥ ఆగమాత్మకమయిన నకారమునకు – నన్నును, నాచేతను, చదువుచును, చదువుదును, మొ॥ అవ్యయాత్మకమయిన నకారమునకు – అన్నయును, తమ్ముండును, మఱియును, ఏనియును మొ॥ వలయుచో నీద్రుతంబునందలి యత్వంబునకు లోపంబగు. ఉన్నాను – ఇత్యాదులయందు ద్రుతంబునందలి యుకారంబునకు లోపంబు గలుగదు. శబ్దశాసనుఁడు "ద్రుతాఖ్యోనః" అని కేవల నకార గ్రహణము చేయుట ద్రుతమునకు స్థిరత్వసిద్ధికై యని తెలియవలయును.

వ్యా. అసాధారణమగు నకారము ద్రుతము. ప్రత్యయాత్మకము, నాగమాత్మకము, నవ్యయాత్మకమునై ఉత్వముతోఁ గూడుకొన్న నకారము, (న్+ఉ=ను) అనఁగా నువర్ణము ద్రుత సంజ్ఞకంబు=ద్రుతమను పేరుగలదియని యర్థము. ద్రుతము=ఒల్లనియెడన్=అక్కఱలే నప్పుడు—లోపించినను నర్థము చెడనప్పుడు మఱిఁగిపోవునది=తిరోహితమగునది. అనఁగా, లోపించునదియని భావము. ఉదా॥ నన్నును=నన్ను. మొ॥ ఇట్లు చెప్పుటచే నావయవిక నకారము ద్రుతముకాదు. ఏలయన— (i) ఆవయవికనకారము ప్రత్యయాత్మకముగాని, యాగమాత్మకముగాని, యవ్యయాత్మకముగాని కాదు. (ii) ఆవయవిక నకారమును దొలఁగించినచో నర్థమును జెడును. ఉదా॥ పేను, చేను, వీనిలోని నువర్ణమును దొలఁగించినచో (పే, చే) నర్థము చెడును. కాఁగా, నిందలి నువర్ణము ద్రుతము కాదు.

(1) ప్రత్యయాత్మకమైన ద్రుతమునకు:- తాను, నేను – వీనిలోనిది ప్రథమా ప్రత్యయమగు నువర్ణము. తా+ను=తాను. నా+ను=నే+ను=నేను. (చూ. బా. ఆచ్ఛిక 24—ఘంటా) ధనమును, వనమును – వీని లోనిది ద్వితీయా విభక్తి ప్రత్యయమగు, నువర్ణము. చదువుచున్నాను, చదువఁగలను—వీనిలోనిది క్రియాప్రత్యయమగు నువర్ణము.

విమర్శ:- తాను, నేను పదములయందలి నువర్ణము ద్రుతమనుట ప్రయోగ విరుద్ధము, పూర్వ లాక్షణిక మత విరుద్ధము. (చూ. అనుబంధము – విషయసంఖ్య—14; ము. కౌ – సంజ్ఞ 6.).

(2) ఆగమాత్మకమయిన ద్రుతమునకు:- నన్నును, నాచేతను, చదువుచును, చదువుదును, మొ.

విమర్శ:- (i) నన్ననులోని నువర్ణ మాగమాత్మకముకాదు; ప్రత్యయాత్మకమే. (చూ. బా. సంధి 2, ఆచ్ఛిక 24-ఘంటా) (ii) చదువుచును, చదువుడును - అనుచో, చువర్ణక డువర్ణకములు ద్రుతాంతములుగా నిర్దేశింపఁబడి యున్నవి. (బా. క్రియా 42, 43) కావున నివి ప్రత్యయాత్మకములే గాని యాగమాత్మకములు కావు. నాచేతను-అనుదానిలోని నువర్ణము మాత్ర మాగమాత్మకము. (బా. తత్సమ 8).

(3) అవ్యయాత్మకమయిన ద్రుతమునకు:- అన్నయును, తమ్ముండును, మఱియును. ఏనియును. మొ॥ వీనిలోని నువర్ణమవ్యయము. అన్న+ను=అన్న+యును=అన్నయును. ఇట్లే, మఱి+ను=మఱియును. ఏని+ను=ఏనియును. తమ్ముండు+ను=తమ్ముండును. (చూ. శబ్ద 118 చూ.)

కావలసినచో నీద్రుతమునందలి యుత్వమునకు లోపమగును. ఉదా. తాన్, నేన్, ధనమున్, వనమున్, నన్నున్, నాచేతన్, చదువుచున్, చదువుడున్, అన్నయున్, తమ్ముండున్, మఱియున్, ఏనియున్. బా. సంధి 20చే - సిద్ధించు నవసాన ద్రుత స్వర లోపమే యిట సూచింపఁబడినది. ఉన్నాను - ఇత్యాదులలోని ద్రుత స్వరమునకు లోపము రాదు. ఉన్నాను=ఉన్నాన్-కాదు. చదువఁగలను=చదువఁగలన్-కాదు.

విమర్శ:- ఉన్నాను, చదువఁగలను-అను చోట్ల, బా. సంధి 20 చేఁబ్రాప్తించు ద్రుతలోపము సహితము లేదని చెప్పవలెను. ఉన్నాను=ఉన్నా-కాదు. చదువఁగలను=చదువఁగల-అనికాదు. (ము. కౌ. సంధి 16).

"శబ్దశాసనుఁడు, ద్రుతాఖ్యోనః-అని కేవల నకారగ్రహణము చేయుట ద్రుతమునకు స్థిరత్వసిద్ధికై యని తెలియవలయును." అనఁగా నువర్ణము ద్రుతమయినప్పుడు "ద్రుతాఖ్యోనుః" అని నన్నయ, యాంధ్రశబ్దచింతామణిలో సూత్రించి యుండునుగదా! నః-అనియేల సూత్రించెను? అని ప్రశ్నించుకొని, నః-అని సూత్రించినచో నువర్ణమునకు ద్రుతమను ప్రత్యేక సంజ్ఞ సిద్ధించును. అప్పుడు స్థిర సంజ్ఞ సిద్ధింపకుండఁబోవును. కావున నువర్ణమునకు ద్రుతసంజ్ఞతోపాటు స్థిరసంజ్ఞయుఁ గలుగుటకు నః-అని సూత్రింపఁబడెనని వ్యాకర్త యభిప్రాయము. నః-నువర్ణము, ద్రుతాఖ్యః= ద్రుతమను పేరుగలది-అని యర్థము.

విమర్శ:- స్థిరత్వసిద్ధికై నః-అని నన్నయ సూత్రించెననుట సరికాదు. నన్నయ మతమునఁ బొల్లు నకారము ద్రుతమగుటచే నః-అని సూత్రించినారు. (చూ. అనుబంధము. విషయసంఖ్య-32.).

## అక ప్రత్యయాంతావ్యయంబు కళయు. 8

వ్యతిరేకార్థక భూతకాలికాసమాపక క్రియ ద్రుత ప్రకృతికము కాదని యర్థము.

ఉ: ఉ. కాదనకిట్టిపాటి యుపకారముఁ దక్షకుఁ డేకవిప్రసం, బోధనఁజేసి చేసె, భార ఆది. 1ఆ-124, హర్ష మద మాన విషాదములం దొరంగనీక తొలఁగఁ ద్రోపు, భార. శాంతి. 2ఆ-253, ప్రాణ వ్యపాయంబు లే, క తగన్ హరి, ఉ.3ఆ-203. మొ॥ (ప్రయోగములిట్లుండ, క. అనఘ యిదియేటి తపమే, మనుపమ దుఃఖితులమగుట నాధారము లే, కను సంతానోచ్ఛేదం, బున వ్రేలెద మధమ లోకముల తెరువు సనన్. భార. ఆది.2ఆ-139. ఇందు, "లేకను" అని ద్రుతాంతముగా నుండుట వలనం

గొందఱయ్యది ద్రుతప్రకృతికమని భ్రమియించెదరు.) (చూ. శబ్దపరిచ్ఛేదము. 116వ, సూత్రము.)

వ్యా. అక-ప్రత్యయ మంతమందుఁగల యవ్యయము కళయే కాని ద్రుత ప్రకృతికము కాదు. బాలవ్యాకరణమునందలి కజీ వర్ణకమే (బా. క్రియా 39 సూ.) యిట "అక" ప్రత్యయమనఁబడెను. 'కజీ' చేరునప్పుడు ధాతువు నుత్వమున కత్వమగును. (బా. క్రియా 20 సూ.) ఉ॥ అను+కజీ=అన్+అ+క=అనక. అత్వము కవర్ణకముతోఁ గలిపి 'అక' అని వ్యవహరింపఁబడె నన్నమాట. ఇదే వ్యతిరేకార్థక భూతకాలికా సమాపక క్రియ యనఁబడెను. భూతకాలికాసమాపకక్రియ = క్త్వార్థకము. (సంధి 2) కావున వ్యతిరేకార్థక భూతకాలికాసమాపక క్రియ = వ్యతిరేక క్త్వార్థకమన్నమాట. కాఁగా, వ్యతిరేక క్త్వార్థకము కళయే కాని ద్రుతప్రకృతికము కాదని తాత్పర్యము. ఇందులకుఁ బ్రయోగములు-(i) కాదనకిట్టి. కాదనక+ఇట్టి-అనుచో, కాదనక-అను వ్యతిరేక క్త్వార్థకము కళ గనుకనే, బా. సంధి 4చే - కాదనకిట్టి, కాదనక యిట్టి యను రూపము లేర్పడును. ఇట కాదనకిట్టి - ప్రయుక్తము. ఇది ద్రుతప్రకృతికమేయయినచో, కాదనకిట్టి-అను రూపమేర్పడదు. ఏలయన, కాదనకన్+ఇట్టి-అని నిల్పినచో, బా. సంధి 9చే - సంధిలేదు గాన, కాదనకనిట్టి-అని కావలసినదే. "కాదనకిట్టి" అని కాదన్నమాట. కావున, కాదనకిట్టి - అను ప్రయోగమునుబట్టి వ్యతిరేక క్త్వార్థకము కళయేయని తెలియుచున్నది. (ii) తొఁరంగనీక తొలఁగఁ ద్రోవు-అనుచో, ఈక, అనునది ద్రుతప్రకృతికముయినచో, ఈకఁదొలఁగ-కావలసివచ్చును. అప్పుడు ప్రాసతప్పును గావున నిదియుఁగళ యనుటకే సాధకము. (iii) ఇట్లే లేక తగన్ - అనుచో లేక - ద్రుతప్రకృతికమఁయినచో, లేకఁదగన్-అయి ప్రాసభంగ మేర్పడును. కాఁగా, వ్యతిరేక క్త్వార్థకము కళయేయనుట కీ ప్రయోగములు ప్రబల ప్రమాణములుగ నున్నవి. ఆధారములేకను-అను ప్రాసఘటిత ప్రయోగమును జూచి కొందఱిది ద్రుతప్రకృతికమని భ్రాంతిపడుదురు. లేక-అనుదానిపై శబ్ద 116 సూత్రముచే సముచ్చయార్థక నువర్ణము చేరి, లేకను-అను రూపమేర్పడును. లేకను=లేకయును-అని యర్థము. కనుక వ్యతిరేక క్త్వార్థకము ద్రుతప్రకృతిక మనుట కిది సాధకము కాదని భావము.

విమర్శ:- (i) బాలవ్యాకరణమున, కొట్టక, తిట్టక, అను వ్యతిరేక క్త్వార్థకములు కళలుగానే చూపఁబడియున్నవి. (బా. సంజ్ఞా 13) కావున, లేకను-అను ప్రయోగ విషయమునఁ గలుగు భ్రాంతిని నివారించి వ్యతిరేక క్త్వార్థకము కళయే యన్న విషయము నీ సూత్రము స్థిరపఱుచుచున్నది. కాన నిది బాలవ్యాకరణ సూత్రమునకు వివరణ ప్రాయము. (ii) కజీ-అనుదానిని "అక" అని వ్యవహరించుట పొరపాటు. ఈక, లేక-అను చోట్ల 'అక' ప్రత్యయములేదు. క ప్రత్యయమే కలదు.

### తద్భవములందును నలఘురేఫము గలదు. 9

ఉ: కఱకంఠుఁడు, కాఱియ, గఱి, గొఱపము, గొఱ్ఱె, గోఱజము, జీలకఱ్ఱ, పిఱికి, పెఱ, మోఱకు, ఱాఁగ మొ॥

కఱకంఠుఁడు-గరకంఠ శబ్ద భవము. కాఱియ-కారికా శబ్ద భవము. గఱి-గరుచ్ఛబ్దభవము. గొఱపము-కురప శబ్దభవము. గొఱ్ఱె- కురరీ శబ్ద భవము. గోఱజము-గోరోచనా శబ్దభవము, జీలకఱ్ఱ- జీరక శబ్దభవము. పిఱికి-భీరుక శబ్దభవము. పెఱ-పర శబ్ద భవము. మోఱకు-మూర్ఖ

శబ్దభవము. ఊఁగ–లంకా శబ్దభవము. మొ॥ (చూ. ప్రయోగములు–ఆంధ్ర శబ్దరత్నాకరము).

వ్యా. "శకటరేఫము తత్సమ తద్భవములందు లేదు" అని బాలవ్యాకరణమునఁ గలదు. (బా. సంజ్ఞా 18) శకటరేఫము (అలఘురేఫము) తద్భవములందు లేదను బాలవ్యాకరణాశయము నీసూత్రము సవరించుచున్నది. "కొఱపము–గొఱపము. (సం. క్షురప్రః. ప్రా. ఖురప్ప)=గుఱ్ఱములను తోమెడు సాధన విశేషము. కొఱపమనఁగ క్షురప్రము పరఁగు–ఆం.భా 2–199" (సూ.ని.) క్షురప్ర శబ్దమునకీ యర్థము నిఘంటువులలోఁగనఁబడదు. కురపశబ్దము. శ.ర. లోఁగలదు. సూ.ని.లో లేదు. సంస్కృత నిఘంటువులందును గానరాదు.

విమర్శ:- తద్భవములలో నరుదుగా నలఘురేఫము గలదు. (చూ. అనుబంధము. విషయసంఖ్యలు–8; 11) కఱకంఠుఁడు. సమాస 27–చూ.

## కారము క్షార శబ్దభవము. 10

ఇందు సారూప్యము గనఁబడెడి. క్షార శబ్దము కటు శబ్దపర్యాయంబునగు. "త్రిరాత్ర ముభయో రధశ్శయ్యా, బ్రహ్మచర్యమ్, క్షార లవణ వర్జనఞ్చ" అని ఆపస్తంబ సూత్ర వాక్యము.

వ్యా. బాలవ్యాకరణమున "కటుః–కారో–కారము" అని కారము–ప్రాకృతసమముగా నిర్దేశింపఁబడినది. (బా. సంజ్ఞా 19) ఇది ప్రాకృతసమము కాదనియు క్షార శబ్దభవమనియుఁ ప్రౌఢవ్యాకర్త యీ సూత్రమున సవరణము ప్రతిపాదించెను. ఇది క్షార శబ్దభవమనుటకుఁ జూపిన యుపపత్తులు – (i) సారూప్యము:– సరూపమనఁగా; సమానమయిన రూపము. సరూపముయొక్క భావము సారూప్యము. అనఁగా నాకార సామ్యమని తాత్పర్యము. క్షార శబ్దమునకు కారము – అను రూపమునకు నాకార సామ్యము కనఁబడుచుండుటచేత నిది క్షార శబ్దభవము కానోపునని భావము. (ii) క్షార శబ్దము కటుశబ్ద పర్యాయముగాను గనఁబడుచున్నది. "క్షార లవణ వర్జనఞ్చ" అని యాపస్తంబ సూత్ర వాక్యము. ఇట లవణ శబ్దము వేఱుగానుండుటచే, క్షారము=లవణము – అని యర్థము చెప్పుటకు వీలులేదు. కావున నిట, క్షారము=కటువు, అని యర్థము. కాఁగా, క్షారము=కారము, అనుచో నాకార సామ్యముండుటచేతను, క్షార శబ్దమునకుఁ గటువను నర్థముండుట చేతను క్షార శబ్దభవము కారమని వ్యాకర్త యాశయము.

విమర్శ:– ఈ ప్రౌఢవ్యాకర్త చూపిన సవరణ సరికాదు. ఏలయన– (i) కారో – కారము, అనుచో కారో – అను ప్రాకృతరూపమునకును "కారము" అను దానికిని సారూప్యము స్పష్టముగాఁ గలదు. కావున సారూప్యము కొఱకు బాలవ్యాకరణమును సవరింపవలసిన పనిలేదు. (ii) క్షార శబ్దమునకుఁగటు వనునర్థమాపస్తంబ సూత్రవాక్యమునఁగలదనుట భ్రాంతి మూలకము. ఇట క్షార శబ్దమునకు విడ్లవణమని యర్థము. గుడమను నర్థమును గలదు. కొన్ని రకముల పప్పులులోనగునవి క్షార గణమన్న ధర్మశాస్త్ర వ్యవహారముగలదు. క్షార శబ్దమునకుఁగటువను నర్థమే లేదు. కాన సూత్రము త్యాజ్యము. (చూ. అనుబంధము. విషయసంఖ్యలు–1; 33.).

## కోట పేఁటలు వైకృతములు. 11

ఉ: కోట్ట శబ్దభవము కోట. పింఠా శబ్దభవము పేఁట. "కోట్టార ఘట్ట

హట్టాశ్చ" అని అమర త్రిలిఙ్గ శేషము. "పింఠావిటజనాశ్రయః" అని అమరపద పారిజాతము. కోట్ట శబ్ద పర్యాయంబుగా సంస్కృతంబునఁ గోటశబ్దంబు నొక్కండు గానంబడియెడి. దానివలనఁ గలిగినదందురేని యపు డది కుండలోనగు వానివంటిదని యెఱుంగవలయును. పేఁట శబ్దార్థము ప్రకృతియగు పింఠా శబ్దార్థముకంటె నించుక భిన్నముగా నున్నది. అది వికృతియందు సహజంబ. (చూ. వైకృతదీపిక).

వ్యా. కోటపేటలు బాలవ్యాకరణమున దేశ్యములుగాఁజూపఁబడియున్నవి. (బా. సంజ్ఞా 21) ఇట కోటపేఁటలు తద్భవములని సవరణము ప్రతిపాదింపఁబడినది. (i) కోట–ఇది కోట్ట శబ్దభవము. దీనిని "కోట" శబ్దభవమని చెప్పినను జెప్పవచ్చును. ఏలయన, సంస్కృతములో "కోట్ట" శబ్ద పర్యాయముగ "కోట" శబ్దము కనఁబడును. ఈ పక్షమున నిది కుండ–లోనగు తద్భవముల వంటిదని తెలిసికొనవలెను. అనఁగా, 'కుండ' శబ్దభవము కుండ–అయినట్లే, కోట శబ్దభవము, కోట– అగునన్నమాట. (ii) పేఁట–ఇది పింఠా శబ్దభవము. ప్రకృతియగు పింఠాశబ్దమునకు విటజనాశ్రయమని యర్థము. విటజనాశ్రయము=విటులు నివసించు చోటు. వికృతియగు పేఁట శబ్దమునకు శాఖానగరమని యర్థము. ఇంచుక యర్థభేదము కలుగుట వికృతిలో సహజమే కావున పింఠా శబ్దభవము పేఁట కావచ్చును. వైకృతము=చూ 6.

విమర్శ:- (i) కోట శబ్దము తద్భవమనుట మతాంతరముగా గ్రాహ్యము. (ii) బాలవ్యాకరణమున నిర్బిందుకమగు పేఁట శబ్దము దేశ్యముగఁ జూపఁబడినది. (బా. సంజ్ఞా–21. ఘంటా) ఈ విషయమును గమనింపక సబిందుకమగు పేఁట శబ్దమును, పింఠా శబ్దభవమని యిటఁ బ్రతిపాదించుట యప్రసక్తము. కానఁ ద్యాజ్యము. (చూ. అనుబంధము. విషయసంఖ్య–2.).

## ప్రాణగొడ్డ మగ్రామ్యంబు నాఁదగు. 12

ఇయ్యది ప్రాణకుట్టక శబ్దభవము. అంచపదము, అంచయాన, లోనగువాని వంటిది. (చూ. ఆంధ్రశబ్దరత్నాకరము.)

వ్యా. ప్రాణగొడ్డము–అనునది గ్రామ్యమనియు, నయినను బెద్దలు వ్యవహరించిన మాటగావున గ్రాహ్యమనియు బాలవ్యాకరణమునఁ జెప్పఁబడెను. (బా. సంజ్ఞా 23) ఇది యగ్రామ్యమని యిట సవరణ ప్రతిపాదింపఁబడెను. అగ్రామ్యమనఁగా గ్రామ్యము కానిది. గ్రామ్యము=లక్షణ విరుద్ధము. (బా. సంజ్ఞా 22) కావున, అగ్రామ్యము=సలక్షణమని తాత్పర్యము. ఈ పక్షమునఁ బ్రాణగొడ్డము, ప్రాణకుట్టక శబ్దభవము. సమస్తపద తద్భవములలో నొకమాట మార్పుచెంది యొకటి మాఱకుండుట గలదు. ఉదా॥ హంసపదము=అంచపదము, హంసయాన=అంచయాన. ఈ యుదాహరణములలో హంసశబ్దము 'అంచ'గా మార్పుచెందినది. పదము, యాన, అనునవి మాఱలేదు. ఇట్లే ప్రాణకుట్టకము– ప్రాణగొడ్డము, అనుచో, కుట్టక శబ్దము "గొడ్డము"గా మాఱినది. ప్రాణశబ్దము మాఱలేదు. కనుక నిది సమస్తపద తద్భవమగును. ఈ పక్షమున నిది గ్రామ్యము కాదు. అగ్రామ్యమే. కాఁగా, ప్రాణగొడ్డము – బాలవ్యాకరణమతమున ననింద్య గ్రామ్యము. ప్రౌఢవ్యాకరణమతమున నగ్రామ్యము.

విమర్శ:- ప్రాణగొడ్డము సమస్తపద తద్భవమనుట సముచితమే. ఏలయన––– (i) బాలవ్యాకరణ పక్షమున, ప్రాణగొడ్డము వైరిపదము. వైరిపదము ప్రాచీన ప్రామాణిక కవి

సమ్మతము, ప్రాచీన లాక్షణిక సమ్మతము కాదు. (ii) వైరిపదమును దోషముగాఁ చేర్కొనిన కేతనయే దీనిని దశకుమారచరిత్రమునఁ బ్రయోగించియున్నాఁడు. కావున నిది వైరిపదమనుట యత్యంత విరుద్ధము. (iii) సమస్తపద తద్భవములు పెక్కులు పూర్వకావ్యములలోఁ గలవు. (అంతఃపురము=అంతిపురము – మొ॥) సమస్తపద తద్భవ పక్షమున గ్రామ్యతకుఁ బ్రసక్తియేలేదు. ఈ కారణములచేఁ బ్రాణగొడ్డము ప్రాణకుట్టక శబ్దభవమనుటయే యథార్థము. (చూ. అనుబంధము – విషయసంఖ్య–3.).

## కపిల శబ్దభవము కవిల శబ్దంబొందు గానంబడెడి. 13

ఉ: అక్కర॥ అవసరజ్ఞుండయి వ్యాసుఁడేతెంచె నంత నత్తపసి, కవిల గడ్డంబును గవిల జడలును గవిల కన్నులును, దవిసయన్నువ నల్లనైన దీర్ఘవుఁదనువును జూచి, యువిద కన్నుంగవ మొగిచి తెఱవక యుండె భయమున. భార. ఆది. 4ఆ–252.

వ్యా. కపిల కన్నులు, కపిల గడ్డము, కపిల జడలు – అనునవి గ్రామ్యములనియుఁ బెద్దలు వ్యవహరించినవి గనుక గ్రాహ్యములనియు బాలవ్యాకరణమునఁ జెప్పఁబడెను. (బా. సంజ్ఞా 23 సూ.) అనఁగా నివి వైరిపదములని బాలవ్యాకరణాశయము. ఇవి కపిల శబ్దభవమగు కవిలశబ్దముతో జరిగిన యాచ్ఛిక సమాసములే కాని వైరిపదములు కావని ప్రౌఢవ్యాకర్త యాశయము.

విమర్శ:– ఇవి కవిల శబ్దముతో జరిగిన యాచ్ఛిక సమాసములను ప్రౌఢవ్యాకర్త యభిప్రాయము సముచితమే. కారణములివి––– (i) కపిల–పాఠపక్షమున నన్నయ పద్యములో. ప–వ ప్రాస యేర్పడుచున్నది. పవ ప్రాస పూర్వ కవి సమ్మతము పూర్వ లాక్షణిక సమ్మతము కాదు. కావున కవిల–పాఠమే యుక్తము. (ii) వైరిపదము ప్రాచీన ప్రామాణిక కవులకుఁ బ్రాచీన లాక్షణికులకు సమ్మతము కాదు. కావున కపిల – పాఠము నన్నయ ప్రయుక్తము కానేరదు. కవిలశబ్ద పక్షమున గ్రామ్యతకుఁ బ్రసక్తియే లేదు. కాఁగా కవిల శబ్దాంగీకారమే సమంజసము.

కవిలశబ్దమును బ్రాకృత భవమనుట యుక్తముగఁ గనఁబడును. చూ. అనుబంధము. విషయసంఖ్య–4.

## గ్రామ్యంబు తత్తజ్జాతి వర్ణనంబునం బ్రయోగార్హంబగు. 14

ఉ: మొక్కేము సామి, రామా 2ఆ–7. ఎ.గీ॥ ఇతని, సూసినామేలు బాగెము సేసినాము. య.1ఆ–120 మొ॥.

వ్యా. ఆయా జాతుల వర్ణనమున గ్రామ్యము ప్రయోగింపఁదగునని యర్థము. గ్రామ్యజనుల సంభాషణమునందుఁ బాత్రౌచిత్యమునుబట్టి గ్రామ్యమును వాడవచ్చునని భావము. మొక్కేముసామి, సూసినామేలు బాగెము సేసినాము–అనునవి యెఱుకుల వచనములు గనుకఁ బాత్రోచితముగ గ్రామ్యము ప్రయుక్తమయ్యెనని తాత్పర్యము.

విమర్శ:– అనుకరణమున గ్రామ్యము గ్రాహ్యము కావచ్చునుగాని, తక్కిన వాక్యముల న్నియు సల్లక్షణ భాషలోనే యుండుటచే, నీ మాటలు మాత్రమే గ్రామ్యములోనుండుట పొసఁగదు. ముద్రణలో– మొక్కెదము, "వేసమును మేలుబాగెము సేసియుంట" అను పాఠములే కలవు. ఈ పక్షమున గ్రామ్యతకుఁ బ్రసక్తియే లేదు. (అనుబంధము. విషయసంఖ్య–61)

## ఒకానొకచో ననుకరణ విరహితంబుగ సంస్కృతవాక్యంబు గానంబడియెడి. 15

ఉ: తే. అంటితి నమశ్శివాయ పాపాత్ము రాలి. జై 4ఆ–71.

వ్యా. అనుకరణమున సంస్కృత వాక్యములు ప్రయోగింపవచ్చునని యాంధ్రశబ్ద చింతామణియందుఁ గలదు. (అనుకృతేస్తి వాక్యంతు–ఆం. చిం.) సంస్కృత వాక్యము లనుకరణమున నెట్లువాడవలెనో చింతామణి వికృతి వివేకములయందే కాక బాలవ్యాకరణ మునందును నిరూపింపఁబడెను. కావున ననుకరణ విరహితముగ సంస్కృత వాక్యములు ప్రయోగింపరాదని తెలియుచున్నది. అనుకరణము లేకుండ నరుదుగా సంస్కృత వాక్యము ప్రయోగింపవచ్చునని యిటఁ జెప్పఁబడినది. నమశ్శివాయ–అనునది యుదాహరింపఁబడినది. శివాయ=శివునికొఱకు, నమః=నమస్కారము– అని యర్థము.

విమర్శ:- ఇట నమశ్శివాయ–అనునది యనుకరణ విరహితముగ నున్న సాధారణ సంస్కృత వాక్యముకాదు. ఇది పాప పరిహారార్థము పాత్ర నోట వెలువడిన పంచాక్షరీ మంత్రము, కాన నిట్టి విశేషస్థలములలోనే సంస్కృత వాక్యమనుకరణ విరహితముగ నుండునని యుదాహరణ స్వారస్యముచే గ్రహింపవలసియుండును. (చూ. అనుబంధము. విషయసంఖ్య–61.)

## జయపదం బనుకరణ విరహితంబ తఱచుగనగు. 16

ఉ: తరువోజ. జయపూతనాఘాత జయదైత్యదమన ... దయనిమ్ము జీవిత దానమ్ము నాకు. హరి. పూ 7 ఆ–58. మ. జయనారాయణ పుండరీక నయనా శార్జ్గి జగన్నాయకా. ఉ. హరి. 6 ఆ–20. మొ॥ తఱచుగననుటచే ఒక్కొక్కచో ననుకరణ సహితంబు నగునని యెఱుంగవలయు.

వ్యా. జయ (=జయింపుము) – అను సంస్కృత క్రియాపదము తఱచుగా ననుకరణము లేకుండనే ప్రయోగింపఁబడునని యర్థము. జయపూతనాఘాత – ఇత్యాదులుదాహరణములు. తఱచుగ ననుటచే నొకచో ననుకరణ సహితమును గావచ్చునని తెలుపఁబడెను. (చూ. అనుబంధము. విషయసంఖ్య–61.)

విమర్శ:- పై ప్రయోగములయందలి "జయ" పదము జయజయ ధ్వనులలోని, జయపదమే కాని "జయింపుము" అను నర్థమునిచ్చు సామాన్య క్రియాపదము కాదని యుదాహరణ స్వారస్యమునుబట్టి గ్రహింపవలెను. లేనిచో, ఓ రామా! నీవు జయింపుము –– అనుచో, ఓరామా నీవు జయ–వంటి రూపములు సాధువులు కావలసివచ్చును.

ఇది ఘంటాపథము

★ ★ ★

# సంధి పరిచ్ఛేదము

**శ్రేష్ఠతా వాచకములగు నార్యాంబాద్యర్థక శబ్దంబులు పరంబు లగుచో నన్ని యచ్చులకు సంధి నిత్యము. 1**

ఉ: రామయ్య, సామయ్య, సీతమ్మ, లక్ష్మమ్మ, మొ॥ ఆది శబ్దము అన్న అక్క అప్పలను దెలిపెడు.

వ్యా. శ్రేష్ఠతను బోధించు, ఆర్యాంబాద్యర్థక శబ్దములు పరములగునపుడన్ని యచ్చులకు సంధి నిత్యము. ఆర్య+ అంబా+ఆది+అర్థక+శబ్ద = ఆర్యాంబాద్యర్థక శబ్దములు. ఆర్యశబ్దము, అంబా శబ్దము మొదలగువానియొక్క యర్థముగల శబ్దములార్యాంబాద్యర్థక శబ్దములు. ఆర్య=అయ్య, అంబా=అమ్మ. ఆది శబ్దములనుటచే అన్న, అక్క, అప్ప – అన్నవి గ్రాహ్యములు. కాఁగా, శ్రేష్ఠతను బోధించెడు, అయ్య, అమ్మ, అన్న, అక్క, అప్ప – అను శబ్దములు పరములగుచో నచ్చులన్నింటికి సంధి నిత్యమని భావము. రామ+అయ్య=రామయ్య; సామి+అయ్య=సామయ్య; సీత+అమ్మ=సీతమ్మ; లక్ష్మి+అమ్మ=లక్ష్మమ్మ. వీనిలో రామయ్య సీతమ్మ యనునవి అత్వమునకు, సామయ్య, లక్ష్మమ్మ యనునవి ఇత్వమునకు నుదాహరణములు.

విమర్శ:- అయ్య, అమ్మ, లోనగువానికి శ్రేష్ఠుఁడు, శ్రేష్ఠురాలు – అను నర్థములు లేవు. కాన వీనిని శ్రేష్ఠతా వాచకములనరాదు. ఇవి శ్రేష్ఠార్థ గోచరములు. అనఁగా వీనికి సమాసవృత్తియందు శ్రేష్ఠత లక్షణార్థము.

**ఇ ప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి. 2**

భూతకాలికాసమాపక క్రియయొక్క యికారమునకుఁ బ్రామాణిక ప్రయోగములందును గొన్నియెడల సంధి గనఁబడుచున్నదని యర్థము.

ఉ: చాపము నాకందిమ్మనుడు. భార. విరా 4 ఆ–112. వెఱచిట్లంబుధి నాథనందనులు దోర్వీర్యంబు సాలించి యం, దఱుపాఱంగ, నిర్వ 5 ఆ–88. ఎఱింగెఱింగినా, వలువిది యేల కట్టుకొని వచ్చును దానవి. భాగ 9 స్కం–515. శా. నేఁడేతెంచు ప్రయత్నమున్న నకటా నీచేతఁ జెప్పింపఁడే? ప్రభా 4 ఆ–146. మొ॥

వ్యా. ఇ ప్రత్యయ మంతమందుఁగల యవ్యయమునకు సంధియుఁ గనబడుచున్నది. బా. క్రియా 38చే – క్త్వార్థమున విధింపఁబడిన ఇ ప్రత్యయము చివరఁగలిగిన ధాతువిట, ఇప్రత్యయాంతావ్యయ మనఁబడెను. (అవ్యయము=చూ. వాక్య 3.) ఇదే భూతకాలికాసమాపక క్రియ యనియు వ్యవహరింపఁబడినది. క్త్వార్థమగు ఇత్తు "సమానాశ్రయంబులం బూర్వకాలంబునందు" (బా. క్రియా 38) విధింపఁబడినది; కాన

భూతకాలికమగును. ఈ 'ఇ' ప్రత్యయముతోఁ గూడుకొనిన ధాతువసమాపక క్రియయగును. (చూ.వాక్య 7) కాఁగా భూతకాలికా సమాపక క్రియయొక్క ఇకారమున కనఁగా, క్త్వార్థమైన ఇకారమునకు, సంధి ప్రామాణిక ప్రయోగములలోఁ గనఁబడునని ఫలితార్థము. "క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు" అను బాలవ్యాకరణ సూత్రమునకిది సవరణము. (బా. సంధి 8) ఉదా॥ అంది+ఇమ్ము=అందిమ్ము; వెఱచి+ఇట్లు = వెఱచిట్లు; ఎఱింగి+ఎఱింగి = ఎఱింగెఱింగి; చెప్పి+అంపఁడే=చెప్పంపఁడే.

విమర్శ:- (i) అందిమ్ము-క్త్వార్థకసంధికి లక్ష్యము కాదు. ఇది శబ్దపల్లవము. (చూ. అనుబంధము విషయసంఖ్య - 15). (ii) వెఱచిట్లు-అనుచో వెఱనిట్లు-అను పాఠాంతరము గ్రాహ్యము. క్త్వార్థక సంధి తిక్కన సమ్మతము కాదు. (భీతిన్=భయముతో) (iii) చెప్పంపఁడే - అనుపాఠము సరికాదు. చెప్పండెయె, వ్వాఁడీరీతి యెఱింగెనో - అను ముద్రిత పాఠమే సరిగానున్నది. (iv) క్త్వార్థక సంధి యలసతామూలకమగుటచేఁబ్రయోగ యోగ్యముగాదు.

## కొన్నియెడలఁ బ్రామాణిక ప్రయోగంబులం ద్రుతంబున కచ్చు పరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి. 3

ఉ: మ. ఘనచక్రాయుధ నిష్ఠురక్షతగళద్రక్తాస్య సర్వాంగుని, న్ననుభూతాప్రతిమ ప్రగల్భ పరివాదాంతర్ధితోద్విక్రమున్. ఉ. హరి 6ఆ-226. సర్వము న్నతని దివ్య కళామయమంచు విష్ణునం, దుల్లము సేర్చి, భాగ 7స్కం. మ. తరుణీ శాత కటాక్షవీక్షల కొనల్దార్కొన్న చోట్లుం బలె, న్నురు శోభా విభవాకరంబు లగుచున్ రోమాంకుర స్థానముల్, పరఁగున్. కళా 7ఆ-108. (నన్నయభట్టారకుఁడు "అన్నిష్ట సఖినూఁది యున్నదాని" అని ప్రయోగించి "లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య" అని సంశ్లేషమును నిషేధించుట ప్రయోగ వైరళ్యసూచనార్థంబని యెఱుంగునది.)

వ్యా. కొన్నిచోట్లఁ బ్రామాణిక ప్రయోగములలో ద్రుతమున కచ్చుపరమగునపుడు ద్విత్వము కనఁబడును. సర్వాంగునిన్+అనుభూత=సర్వాంగునిన్న్+అనుభూత: సర్వాంగునిన్ననుభూత. ఇట్లే, సర్వమున్+అతని=సర్వమున్నతని. చోట్లుంబలెన్+ఉరు=చోట్లుంబలెన్నురు. బా సంధి9చే-సర్వాంగునిన్+అనుభూత=సర్వాంగుని ననుభూత-ఇత్యాదిగా రూపములేర్పడును. కానఁగొన్నిచోట్ల ద్విత్వము కలుగునని యిటఁబూరింపఁబడినది. నన్నయ "అన్నిష్టసఖి నూఁది యున్నదాని" (ఆది 3-140) అని ప్రయోగించెను. అన్+ఇష్టసఖి=అన్నిష్టసఖి. ఇట్లు ద్రుతద్విత్వమును బ్రయోగించియు "లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య" (ఆం. చిం. సంధి 9) అని యాంధ్రశబ్దచింతామణిలో ద్రుతమునకు సంశ్లేషమును నిషేధించెను. ఇట్లు ప్రయోగించియు, నిషేధించుట ద్రుత ద్విత్వముల వైరళ్యమును, అనఁగా నరుదుగా నుండుటను, సూచించుటకొఱకని తెలుపఁబడెను. అచి = అచ్చునకుఁబూర్వ మవ్యవహితముగనుండు, ద్రుతస్య=ద్రుతమునకు, లుక్సంశ్లేషౌ=లోప సంశ్లేషములు; న=లేవు-అని పైచింతామణి సూత్రమున కర్థము.

విమర్శ:- లుక్ సంశ్లేషౌ నాచి ద్రుతస్య- అను చింతామణి సూత్రమువందలి సంశ్లేషమునకు, ద్రుతము మీఁది హల్లుతోఁ గూడుకొనుటయని యర్థముకాదు. ద్రుతము

పూర్వస్వరమున కంగమగుట సంశ్లేషమని నన్నయ యాశయము. (చూ-చిం.పరి.) విస్తరమునకు-చూ. అనుబంధము. విషయ సంఖ్య - 16. ద్రుతద్విత్వవిధానమను సరణేయముకాదు.

## చిట్టడవిఁ జిట్టి. 4

ఇయ్యది తదితరంబులకును నుపలక్షణంబని యెఱుంగునది.

ఉ: చిట్టడవి, చిట్టాముదము, చిట్టీఁదు, చిట్టుదుకు, చిట్టెలుక, చిట్టెలకి- ఇత్యాదులందుఁ బూర్వ పదంబు చిట్టి శబ్దమని యర్థము. ఇవి సంజ్ఞావాచకములు గాన సంధి నిత్యము. హల్లు పరంబగుచో ద్విత్వంబునకు లోపంబు వైకల్పికంబు. చిట్టిచాఁప, చిటిచాఁప. చిట్టి తాళము, చిటి తాళము. మొ.

వ్యా. చిట్టడవిన్=చిట్టడవి-అను రూపమునందు, చిట్టి=పూర్వపదము చిట్టి శబ్దమని యర్థము. చిట్టడవి-అనునది తక్కిన శబ్దములకు బోధకము. అనఁగా, చిట్టాముదము లోనగు శబ్దములందును బూర్వపదము చిట్టిశబ్దమని యీసూత్రము తెలుపునన్న మాట. బాలవ్యాకరణమున చిఱు శబ్ద అకారమున కచ్చుపరమగునపుడు ద్విరుక్తటకారము విధింపఁ బడెను. (బా. సంధి 12) చిఱు+ఎలుక=చిట్టెలుక- అని యుదాహరింపఁబడెను. కావున చిఱు+అడవి=చిట్టడవి-ఇత్యాదిగా "చిఱు"శబ్దము బాలవ్యాకరణ పక్షమునఁ బూర్వపదమగును. చిఱుశబ్దము పూర్వపదము కాదనియు "చిట్టి" శబ్దము పూర్వపదమగుననియు నిట సవరణము చెప్పఁబడినది. సంజ్ఞావాచకములగుటచే, చిట్టి+అడవి=చిట్టడవి-ఇత్యాదిగా సంధి నిత్యమని తెలుపఁబడినది. చిట్టి శబ్దమునకు హల్లు పరమగునపుడు ద్విత్వమునకు లోపము వైకల్పికముగ నగునని సూచింపఁబడినది. చిట్టి+చాప=చిటిచాఁప, చిట్టిచాఁప-ఇత్యాది.

విమర్శ:- (i) కుఱు+ఉసురు=కుట్టుసురు-ఇత్యాదులలో ఱకారమునకు ద్విరుక్తటకారము నంగీకరింపక తీరదు. కావున చిఱు+అడవి=చిట్టడవి-ఇత్యాదులలో ఱకారమునకు ద్విరుక్తట కారము నంగీకరించుటయే యుక్తము. (ii) చిఱు+ఎలుక-అనునది శబ్ద చరిత్రానుకూలమగు పదచ్ఛేదము. కాన దానిని నిర్హేతుకముగ భగ్నముచేయుట సముచితముకాదు. చిట్టి శబ్దమున ద్విత్వలోపము కలుగునని చెప్పవలసిన పనిలేదు. చిటి-అను రూపము అక్కటాదులలోఁ జేర్కొనఁబడియే యున్నది. కాన బాలవ్యాకరణముచేతనే సిద్ధించును. (బా. ప్రకీర్ణక 8) కాఁగా నీసూత్రము, త్యాజ్యము.

## కొన్ని యెడలఁ దెనుఁగులమీఁది సాంస్కృతిక కతపలకు గదవలు గానంబడియెడి. 5

కొన్ని యెడల ననఁగాఁ బ్రాసంబులందని యర్థము. ఉ. వీ, ర ల్గోపించిన నంతకుండుఁ జెడు మీరా యోర్చువారు? ఉ. హరి 4ఆ-53 ఇట్లు దపంబు సేయుచుండుదు. నిర్వ 5ఆ-8. వేవణములు. విజ్ఞా. ప్రా.కాం. 4.మొ॥

వ్యా. బాలవ్యాకరణమున "తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు." (బా. సంధి 14) అని చెప్పఁబడెను. కొన్ని చోట్ల ననఁగాఁబ్రాసలలో సాంస్కృతిక కతపలకు గదవలు కనఁబడునని యీసూత్రము బాల వ్యాకరణమును సవరించుచున్నది. ఉదా: వీరల్+కోపించిన=వీరల్గోపించిన. "ల్గ" ప్రాసలో నున్నది.

వీరల్-తెనుఁగుశబ్దము. కోపించిన-లోని కకారము సాంస్కృతిక పరుషము. ఇట,క కారము గకారమైనది. ఇట్లు+తపంపు=ఇ,ట్లు దపంబు. దకారము ప్రాసగతము. ఇట్లు-తెనుఁగు. తపంబు-లోని తకారము సాంస్కృతిక పరుషము. ఇట, తకారము దకారమయినది. వేయి+పణములు=వేవణములు. వేయి-తెనుఁగు. పణములు-లోని పకారము సాంస్కృతిక పరుషము. ఇట పకారము వకారమైనది. వకారము ప్రాసగతము. వేవణములు:- "వేయి+లు"+"పణ+లు"-అలౌకిక విగ్రహము. బా. సమాస 25చే-వేయి+పణ. అచ్చిక 21చే-వే+పణ. ఈ ప్రౌఢ5చే-వే+పణ. బా. తత్సమ 12చే-వేవణ+లు. తత్సమ 40 చే-వేవణ+ము+లు=వేవణములు.

విమర్శ:- (i) ప్రాసంబులందనుటచేఁ బ్రాసేతరస్థలములలో, కతపలకు గదవలు కనఁబడవని చెప్పవలసి వచ్చును. ప్రాసములలోఁ జెల్లినది ప్రాసేతరములలోఁ జెల్లదనుట సముచితము కాదు. (ii) బా. సంధి 14 సూత్రము వ్యస్తస్థలములకుఁ జెందినది గావున దానికి సవరణముగ నుద్దిష్టమయిన యీ సూత్రములో వేవణములు - అను సమస్తరూపము నుదాహరించుట సమంజసము కాదు. (చూ. అనుబంధము. విషయసంఖ్యలు - 17;18.)

## కొన్నియెడల ద్వంద్వంబునం బదంబు మీఁది చతపలకు సదవలు గానంబడవు. 6

ఉ: అందచందములు. అని 5ఆ-91. అప్పాచెల్లెంద్రు. నిర్వ3ఆ-96. కండతుండెములు. రామా. రాకపోకలు. భాగ 10స్కం. మొ.

వ్యా. "ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవలగు" (బా. సంధి 15) అని ద్వంద్వమున గసడదవలు బాలవ్యాకరణమున నిత్యముగ విధింపఁబడెను. ఇటఁ గొన్ని చోట్ల చతపలకు సదవలు కనఁబడవని సవరణము చెప్పఁబడెను.

ప్రక్రియలు:- అందచందములు-ప్రక్రియకు- చూ. సమాస 29. అప్పాచెల్లెంద్రు:- ప్రక్రియకు- చూ. సమాస 28. కండతుండెములు:- "కండ+ము"+"తుండియ+ము"- అలౌకిక విగ్రహము. బా. సమాస 25చే- కండ+తుండియ. బా. సంధి 15చే- తకారమునకుఁ గావలసిన దకారము నీ ప్రౌఢ 6 సూత్రము నిషేధించును. కావున-కండతుండియ ప్రాతిపదికమగును. బా. తత్సమ 12చే-కండతుండియ+లు. తత్సమ 40చే-కండతుండియ+ము+లు, అచ్చిక 24చే-కండతుండె+ము+లు=కండతుండె ములు-అగును. రాకపోకలు:- "రాక+ము"+"పోక+ము"-అలౌకిక విగ్రహము. బా. సమాస 25చే-రాక+పోక. బా. సంధి 15చే-పకారమునకుఁ గావలసిన వకారము నీ ప్రౌఢ 6 సూత్రము నిషేధించును గావున, రాకపోక-ప్రాతిపదిక మగును. బా. తత్సమ 12చే- రాకపోకలు-అని యేర్పడును.

విమర్శ:- అప్పాచెల్లెంద్రు-తిక్కనపాఠము కానేరదు. ఆయన భారతమునందే కాక నిర్వచనోత్తర రామాయణమునందును గసడదవాదేశమును నియమబద్ధముగనే వాడెను. (అనుబంధము-విషయసంఖ్య-62) కావున, అప్పఁజెలియలు-అను తాళపత్త్రమాతృకాపాఠము గ్రాహ్యము. (వ్యా.సం.స 1257 పు) అన్నాదమ్ములు - అనుచో, అన్నందమ్ముని-అను వీరేశలింగముప్రతి పాఠము గ్రాహ్యము-(అనుబంధము. విషయసంఖ్య - 35)

## సర్వపర్యాయంబయిన యెల్లశబ్దమునకు సప్తమియు అసమాసంబున విశేష్యమునకు ముందు ప్రయోగంబునుం జూపట్టెడు. 7

ఉ: తే. ఎఱిఁగె సకలశాస్త్రంబుల నెల్లయందు, నధిక సాత్వికుఁడస్తీకుఁ

డనఁగ జనులు. భార ఆది 2ఆ-159. తే. ఎల్ల యందును దా వసియించుటెల్ల, యదియుఁ దనయందు వసియించుటం(డు వాసుదేవుఁడను పేరికర్థంబు. భార. ఉద్యో 2-325. నేనొకఁడనే భిక్షానకున్ వత్తునో, యెల్లన్ శిష్యులఁగొంచు వత్తునొ. భీమ 2ఆ-120.

వ్యా. బాలవ్యాకరణమున (i) "సర్వపర్యాయంబయిన యెల్లశబ్దంబు ద్రుతాంతంబయిన యవ్యయంబు" అని చెప్పఁబడెను. ఇది యవ్యయము కాదనుట కీసూత్రమున సర్వపర్యాయంబయిన యెల్ల శబ్దమునకు సప్తమి చూపట్టునని తెలుపఁబడెను. ఎల్లయందు - అను నన్నయ తిక్కనల ప్రయోగము లుదాహరింపఁ బడెను. అవ్యయమనఁగా లింగ విభక్తి వచన శూన్యము. ఇట, ఎల్లయందు, అని సప్తమి కన్పట్టుటచే నిది యవ్యయము కాదని తాత్పర్యము. (ఇది సర్వనామముగఁ బేర్కొనఁబడెను. శబ్ద 86సూ.) (ii) "దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబులేదు." (బా. సంధి 24) అని బాలవ్యాకరణమునఁ జెప్పఁబడెను. ఇది సరికాదనియు నసమాసంబున విశేష్యమునకు ముందు ప్రయోగము చూపట్టుననియు నీ ప్రౌఢవ్యా. సూత్రమునఁ దెలుపఁబడెను. "ఎల్లన్ శిష్యుల"నను శ్రీనాథ ప్రయోగ ముదాహరింపఁబడెను. ఎల్లన్ శిష్యుల ననునది సమాసమన్నచో బా. సంధి 24చే-ద్రుతములోపించి, ఎల్లశిష్యులనని కావలసి వచ్చును. కావున నిది యసమాసమున ఎల్లశబ్దము విశేష్యమునకు ముందు ప్రయోగింపవచ్చుననుటకు సాధకముగాఁ జూపఁబడెను. అసమాసము గావుననే-ఎల్లన్ శిష్యుల అనుచో ద్రుతములోపింపలేదన్న మాట.

విమర్శ:- ఈ ప్రౌఢవ్యాకరణాశయము సమంజసమే. (చూ. అనుబంధము. విషయసంఖ్య 12)

## తామర కాకు పరంబగునపుడు పుగాగమంబగు. 8

ఉ: ఉ. తామరపాకు నీరు బలెఁ దల్లడమందిరి పౌరులందఱున్. ఉ. హరి. 3ఆ-35.

వ్యా. తామరశబ్దమునకు, ఆకు శబ్దము పరమగునపుడు పుగాగమ మగును. పుక్+ఆగమ=పుగాగమము. క కారముతో నిర్దేశించుటచేఁ దామర శబ్దమునకుఁ జివర నీయాగమము చేరును. (బా. సంధి 28-ఘంటా) పువర్ణములోని ఉత్వముచ్చారణార్థకము. పకారమే యాగమ మగును. తామర+ఆకు=తామరప్+ఆకు=తామరపాకు.

ప్రక్రియ:- "తామర+ము" + "ఆకు+వు" - అలౌకిక విగ్రహము. బా. సమాస 25చే-తామర+ఆకు. ఈ 8చే-తామరప్+ఆకు=తామరపాకు-ప్రాతిపదిక మగును. బా. తత్సమ 48చే-తామరపాకు+వు. తత్సమ 57చే- తామరపాకు.

విమర్శ:- (i) పుగాగమంబగు-అనుటచే, పుగాగమము నిత్యముగఁ గావలసివచ్చును. (ii) ఆముదపాకు, తములపాకు - అనువాని సామ్యమున, తామరపాకు - అనునపపాఠమేర్పడి యుండును. నిజమునకు తామరై-అను, తమిళరూపమును బట్టియు, యడాగమ రూపమే యేర్పడును. తామరయొక్క+ఆకు=తామరయాకు (సుదక్షి3-164) పక్షమున-తామరాకు, అని కావచ్చును. చింతాకు (పాండు 5-39) చింతయాకు (పాండు 4-275) (నీరువలె-అనుముద్రణములు సరికావు. చూ. సమాస 38.)

తలచుగఁ గర్మధారయ సమాసంబునం బెన్నాదుల కడహల్లున
కచ్చు పరంబగునపుడు ద్విత్వంబు గానం బడియెడి. 9

ఉ: పెన్నదరులు, రా. యు. కాం. 1131. పెన్నరదము. రుక్మాం 3ఆ–180. పెన్నుద్ది. పాండు 3ఆ–6. పెన్నూఁత. శివ.2ఆ. పెన్నొడలు. భోజ 6ఆ–329. కన్నాకు (కను+ఆకు) భార. భీష్మ 1ఆ–36. పల్లలపు (పలు+అలపు) హరిశ్చ. 4ఆ–109 మొ॥ తలచుగ ననుటచే, "అన్నిష్ట సఖి నూఁదియున్న దాని" (అను+ఇష్టసఖి) భార. ఆది. 3ఆ–140. అన్నుర్వీశుఁడు. నిర్వ 5ఆ. పెన్నురము. రా. యు. కాం 1014 ఇత్యాదులు గ్రాహ్యంబులు. (పెను–పెనుపు శబ్ద లుప్తశేషము.)

వ్యా. కర్మధారయమునఁ బెను మున్నగు శబ్దముల తుది హల్లున కచ్చు పరమగునపుడు తలచుగ ద్విత్వము కనఁబడును. పెను–అనునది సమాస 36చే–పువర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. కనుక లుప్తశేష మనఁబడెను. పెను, కను, పలు, అను–అను వానిలోని ఉత్వమునకు, ద్విత్వ విధాన సామర్థ్యముచే లోపము కలుగును. పిమ్మట ద్విత్వము. పెన్+అదరులు=పెన్న్ + అదరులు=పెన్నదరులు. ఇట్లే పెన్+అరదము= పెన్నరదము. పెన్+ఉద్ది=పెన్నుద్ది. పెన్+ఊఁత=పెన్నూఁత. పెన్+ఒడలు=పెన్నొడలు. కన్+ఆకు=కన్నాకు. పల్+అలపు=పల్లలపు. తలచుగ ననుటచేఁగర్మధారయమున సంస్కృతసమము పరమగునపుడును వ్యస్తమున సంస్కృతసమము పరమగునపుడును ద్విత్వము కనఁబడును. అన్+ఇష్టసఖి=అన్నిష్టసఖి. అన్+ఉర్వీశుఁడు= అన్నుర్వీశుఁడు. ఇవి వ్యస్తములు. పెన్+ఉరము=పెన్నురము–ఇది కర్మధారయము. (చూ. అనుబంధము. విషయసంఖ్యలు – 34;38).

**ప్రక్రియలు:–** "పెనుపు+లు" + "అదరు+లు"; "పెనుపు+వు" + "అరద+ము"; "పెనువు+వు" + "ఉద్ది+సు"; "పెనుపు+వు" + "ఊఁత+ము"; "పెనుపు+వు" + "ఒడలు+వు"; "పెనుపు+వు" + "ఉర+ము"; అనునవి యలౌకిక విగ్రహములు. బా. సమాస 25చే–విభక్తిలోపము. పెనుపు+అదరు; పెనువు+అరద; పెనుపు+ఉద్ది; పెనుపు+ఊఁత; పెనుపు+ఒడలు; పెనుపు+ఉర. ప్రౌఢ. సమాస 36చే–"పు" లోపము: పెను+అదరు; పెను+అరద; పెను+ఉద్ది; పెను+ఊఁత; పెను+ఒడలు; పెను+ఉర. ఈ9చే–ద్విత్వ విధాన సామర్థ్యమున, ఉత్వలోపము. పెన్+అదరు; పెన్+అరద; పెన్+ఉద్ది; పెన్+ఊఁత; పెన్+ఒడలు; పెన్+ఉర. పిమ్మట ద్విత్వము: పెన్నదరు, పెన్నరద, పెన్నుద్ది, పెన్నూఁత, పెన్నొడలు, పెన్నుర–ప్రాతిపదికములు. పెన్నదరు–బా. తత్సమ 12చే– పెన్నదరు+లు=పెన్నదరులు – అగును. పెన్నరద, పెన్నుర–అనువానికి బా. తత్సమ 39చే– ముువర్ణకము: పెన్నరదము. పెన్నురము. పెన్నుద్ది–అనుదానిపై ననుక్తన్యాయమున 'సు' చేరును. పెన్నుద్ది+సు. బా. తత్సమ 57చే 'సు' లోపము: పెన్నుద్ది. పెన్నూఁత– బా. తత్సమ 39చే– ముువర్ణకము: పెన్నూఁత+ము: పెన్నొడలు–తత్సమ48చే– వువర్ణకము: పెన్నొడలు+వు. తత్సమ57చే– విభక్తిలోపము: పెన్నూఁత, పెన్నొడలు. కన్నాకు:– "కను+వు" + "ఆకు+వు"; "పలు+వు" + "అలపు+వు"– అలౌకిక విగ్రహములు. బా. సమాస 25చే– కను+ఆకు; పలు+అలపు. ఉత్వలోపము: కన్+ఆకు; పల్+అలపు. ద్విత్వము: కన్నాకు, పల్లలపు–ప్రాతిపదికములు బా. తత్సమ48చే– కన్నాకు+వు; పల్లలపు+వు. తత్సమ 57చే. కన్నాకు, పల్లలపు. అను+ఇష్టసఖి; అను+ఉర్వీశుఁడు–

బా. ప్రకీర్ణక16చే- అన్+ఇష్టసఖి; అన్+ఉర్వీశుఁడు ఈ9చే- అన్నిష్టసఖి, అన్నుర్వీశుఁడు. పక్షమున-అనునిష్టసఖి, అనునుర్వీశుఁడు (బా. సంధి 33)

## కొన్నిచోట్ల షష్ఠీసమాసంబునం దుకారంబున కచ్చుపరంబగు నపుడు నుగాగమంబునకు లోపంబు నగు. 10

ఉ: గోకులమిల్లులు దప్పకుండ లక్ష్మీపతి గ్రుమ్మరున్ గడియ సేపున రేపున. హరి. పూ 5ఆ-203 సీ. దినవెచ్చమునకునై తన మేనఁగల సొమ్ము, కొడుకక బచ్చింటఁ గుదువ వైచు. పాండు 3ఆ-16. శిరసందంబరయన్. కళా 7ఆ-126. మొ॥

వ్యా. "షష్ఠీ సమాసమునందుకార ఋకారముల కచ్చుపరమగునపుడు నుగాగమంబగు" (బా. సంధి 34) అని బాలవ్యాకరణమున సూత్రింపఁబడెను. ఈ బాలవ్యాకరణ విహితమగు నుగాగమమునకు, ఉకారము మీఁద లోపము సహిత మగునని యీ ప్రౌఢవ్యాకరణ సూత్రమునఁ జెప్పఁబడెను. గోకులముయొక్క+ఇల్లులు. బా. సంధి 34చే- గోకులము+ను+ఇల్లులు. ఈ ప్రౌఢ 10వ, సూత్రముచే- నుగాగమము లోపించినచో, గోకులము+ఇల్లులు. బా. సంధి 1చే- గోకులమిల్లులు. నుగాగమము లోపింపని పక్షమున నచ్చుపరమగుటచే ద్రుతస్వరములోపించి-గోకులమున్+ఇల్లులు-అని నిలుచును. బా. సంధి 9చే- గోకులమునిల్లులు-అగును. ఇట్లే, బచ్చుయొక్క+ఇంటన్= బచ్చును+ఇంటన్: బచ్చింటన్, బచ్చునింటన్. శిరసుయొక్క+అందంబు=శిరసును+అందంబు: శిరసందంబు, శిరసునందంబు- అనురూపము లేర్పడును.

ప్రక్రియలు:- "గోకులము+యొక్క" + "ఇల్లు+లు"; "బచ్చు+యొక్క" + "ఇల్లు+అందు"; "శిరసు+యొక్క" + "అంద+ము" - అనునవి యలౌకిక విగ్రహములు. బా. సమాస 25చే- విభక్తి లోపము: గోకులము+ఇల్లు; బచ్చు+ఇల్లు; శిరసు+అంద. బా. సంధి 34చే- గోకులము+ను+ఇల్లు; బచ్చు+ను+ఇల్లు; శిరసు+ను+అంద. ఈ ప్రౌఢ 10చే- నుగాగమము లోపించిన పక్షమున=గోకులము+ఇల్లు; బచ్చు+ఇల్లు; శిరసు+అంద. బా. సంధి 1చే- సంధిజరిగి గోకులమిల్లు, బచ్చిల్లు, శిరసంద - ప్రాతిపదికము లగును. గోకులమిల్లు-బా. తత్సమ 12చే- గోకులమిల్లులు. బచ్చిల్లు-బా. తత్సమ 7చే- బచ్చిల్లు+అందు. ఆచ్ఛిక 31చే- బచ్చు+టి+అందు. 36చే బచ్చి+టి+అందు. 33చే- బచ్చింటి+అందు. 38చే-బచ్చింటి+అ. తత్సమ 8చే- బచ్చింటి+అను. సంధి 11చే బచ్చింటను.

విమర్శ:- (i) ఈ పూరణము గ్రాహ్యమే. తిక్కనాదులును నుగాగమము నుపేక్షించి యున్నారు. (చూ. అనుబంధము విషయసంఖ్య-36) (ii) నుగాగమమునకు లోపము విధించుటవలనఁ బ్రక్రియా గౌరవమేర్పడినది. నుగాగమము గొన్నియెడలఁ గనఁబడదన్నచో సౌలభ్యమేర్పడి యుండెడిది.

## పూ పూవు. 11

అసమాసంబునం బూ శబ్దము పూవు శబ్దముయొక్క పర్యాయముగాఁ గానంబడియెడినని యర్థము.

ఉ: ఎ.గీ. కాలకంఠుని శిరసు పూ గగన గంగ, కాశీ 1ఆ-2.

వ్యా. అసమాసమున, పూవు శబ్ద పర్యాయముగ, పూ శబ్దము కనఁబడునని యర్థము. బా. సంధి 36చే– సమాసమున, పూవు శబ్దము తొలియచ్చుమీఁది వర్ణముల కెల్ల లోపము రాఁగా, పూ–అను లుప్తశేష మేర్పడును. అట్లుకాక, పూ–అను నేకాక్షర శబ్దమే కలదని యిట సూత్రింపఁబడెను. ఈ సూత్రము సంధి పరిచ్ఛేదము నందలిది గావునఁ బ్రాఁతాది సూత్రమునఁ బూవుశబ్దము చేర్పనక్కఱలేదను నాశయము వెల్లడియగుచున్నది. ఈ పక్షమున, పూవు+రెమ్మ=పూవురెమ్మ– అనియు పూ+రెమ్మ=పూరెమ్మ–అనియు రూపసాధన చేయనగును. పూవు+తోఁట=పూవుఁ దోఁట (బా. సంధి 25) – అగును. పూ+తోఁట, అనుచో దీర్ఘమునకు, బా. సంధి 25చే– నుగాగమము రాదు. కావున "ఇటఁ బోఁడి పరంబగుచో నెల్లెడల నుమ్మగు" (సమాస 19) అను వాక్యమునందలి, పోఁడి శబ్దము తదితరముల కుపలక్షణ మననగును. (చూ. అనుబంధము విషయసంఖ్య – 5) కాన నిట నుగాగమము కలుగును. నుమ్=నుక్. నుమ్–లోని మకారముద్దిష్టమునకుఁ జివర నువర్ణ మాగమ మగునని తెలుపును. (చూ. సమాస 19) పూ+తోఁట. నుమాగమము: పూ+ను+ తోఁట. ద్రుతకార్యము=పూఁదోఁట.

కాఁగా, పూవు శబ్దముతో, పూరెమ్మ పూవురెమ్మ, పూఁదోఁట, పూవుఁదోఁట– వంటి ద్వివిధరూపములు సాధించుట బాలవ్యాకరణ పద్ధతి. (బా. సంధి 36, 37, 25) పూవురెమ్మ, పూవుఁదోఁట, వంటి వానిని పూవు శబ్దముతోను, పూరెమ్మ, పూఁదోఁట వంటి వానిని, పూ శబ్దముతోను సాధించుట ప్రౌఢవ్యాకరణ పద్ధతి యన్నమాట. (అనుబంధము. విషయసంఖ్య–37)

విమర్శ:- పూవుశబ్దముతో ద్వివిధ రూపములు బాలవ్యాకరణముచేతనే సరళముగా సిద్ధించుచుండుటచేఁ బై సవరణ మనావశ్యక మనవచ్చునుగాని, పూ+తోఁట–ఇత్యాదులందు పూ శబ్దమునకు నుగాగమమగునని మాత్రము చెప్పవలెను. లేనిచో, పూతోఁట–వంటి యప్రయుక్తరూపము లేర్పడవలసివచ్చును. (అనుబంధము. విషయసంఖ్య – 5)

### సమాసమందుఁ దత్సమంబు పరంబగునపుడును నుమాగమాదులు గానంబడియెడి. 12

ఉ: ముంగోపము, వింజామరము. మొ॥ (వెల్ల+చామరము) సంధియందు వర్ణవికారము. (చూ. సమాసపరిచ్ఛేదము. 7 సూ)

వ్యా. సమాసమున సంస్కృతసమము పరమగునపుడును, నుమాగమము మున్నగు వ్యాకరణకార్యములు కనఁబడును. బాలవ్యాకరణమునఁ బ్రాఁతాది సూత్రమున కిచ్చిన యుదాహరణములాచ్ఛికములే యగుటచే (బా.సంధి 36) సంస్కృతసమములు పరమగు నపుడును నుమాగమాదులు కనఁబడునని యిటఁ దెలుపఁ బడెను. నుమ్–లోని మకారముద్దిష్టమునకుఁ జివర నువర్ణ మాగమమగునని తెలుపును. (సమాస 19) కెంధూళి–అన్నది బాలవ్యాకరణమున సూచింపఁబడియున్నను (బా. సంధి 38) కెంపు+ధూళి–అనుచోట మాత్రమే సంస్కృతసమము పరమగుచోఁ దొలియచ్చుమీఁది వర్ణములకు లోపముకలుగుననియు నితరత్ర కలుగదనియు సందేహించుట కవకాశము కలదు. కాన నీసూత్రము బాలవ్యాకరణమునకు వివరణముగ నుద్దేశింపఁబడినట్లు గ్రహింపఁదగును. ముందు+కోపము=ముంగోపము. వెల్ల+చామరము=వింజామరము. ఇట సంధియందు వర్ణ వికారము కలిగెను. అనఁగా, వెవర్ణము 'వి' వర్ణమయ్యెను. వీని ప్రక్రియకు–చూ. సమాస 7 వ్యాఖ్య.

## అను కొను లోనగు ధాతుజ విశేషణముల యంత్యోకారమునకు హల్లు పరంబగునపుడు లోపంబు వైకల్పికంబు. 13

ఉ: గిరివ్రజ మన్పురంబు. భార. సభా 1ఆ–172. జడిగొన్ కోర్కు లనింతి తాను మగ వేషంబూని. సత్య. 3ఆ–105. తొడు వింటివాఁడు చన్ ద్రోవఁబోక. ఆముక్త 6ఆ–78.

వ్యా. అను, కొను మొదలగు ధాతుజ విశేషణముల తుది, ఉకారమునకు హల్లు పరమగునపుడు లోపము వైకల్పికముగా నగును. బా. ప్రకీర్ణక 16 సూత్రమున, ధాతుజ విశేషణము లుదాహరింపఁబడలేదు. కాన, ధాతుజ విశేషణముల ఉత్వమునకు వ్యస్తతయందుత్వలోపమగుననుట కిదివివరణము. గిరివ్రజము, అను+పురంబు=అన్పురంబు. తొడువింటి వాఁడు. చను+ద్రోవన్=చన్ద్రోవన్ – ఇవి వ్యస్తరూపములు. (చూ. అనుబంధము. విషయసంఖ్యలు – 19;38) ధాతుజ విశేషణములు సమాస పూర్వపద ములగునప్పుడుత్వలోపమగుననుట పూరణము. జడిగొను+కోర్కులన్=జడిగొన్కోర్కులన్ – కర్మధారయము.

ప్రక్రియ:– జడిగొన్కోర్కులను: "జడిగొను+సు" + "కోర్కి+చేత"– అలౌకిక విగ్రహము. బా. సమాస 25చే– జడిగొను+కోర్కి. ఈ13చే– ఉత్వము లోపించిన జడిగొన్కోర్కి–ప్రాతిపదికమగును. బా. తత్సమ 3చే–జడిగొన్కోర్కి+చేత తత్సమ 31చే–జడిగొన్కోర్కి+లచేత. తత్సమ 45చే–జడిగొన్కోర్కులచేత. బా. కారక 22చే– జడిగొన్కోర్కులను. పక్షమున – అనుపురంబు, చనుద్రోవన్, జడిగొను కోర్కులన్. చనుద్రోవ+అందు=చనుద్రోవను – బా. కారక 22. ధాతుజ విశేషణము – బా. క్రియా.47.

## నెన్నడాదులన్ నెఱి దగు. 14

నెన్నడ, నెన్నడుము–ఇత్యాదులయందు నెఱిశబ్దము పూర్వపదంబుగా నుండుట యుక్తమగునని యర్థము. నెఱ పూర్ణార్థకము. నెఱి రమ్యార్థకము.

వ్యా. నెన్నడాదులన్=నెన్నడ మున్నగువానియందు, నెఱి=నెఱిశబ్దము, తగున్=యుక్తమని యర్థము. నెన్నడ, నెన్నడుము మున్నగు వానిలోఁ బూర్వపదము నెఱి శబ్దమనుట యుక్తమని భావము. బాలవ్యాకరణపక్షమున, నెఱ+నడ= నెన్నడ; నెఱ+నడుము=నెన్నడుము–అని పూర్వపదము 'నెఱ' శబ్దమన వలసి యున్నది. నెఱ=పూర్ణమని యర్థము. ఈయర్థము నెన్నడ, నెన్నడుము లోనగు వానియందు స్వరసముగాఁ గనఁబడదు. కావున, నెఱి+నడ=నెన్నడ, నెఱి+నడుము=నెన్నడుము–అని నెఱిశబ్దము పూర్వపదముగా గ్రహించుట యుచితమని ప్రౌఢవ్యాకర్త యభిప్రాయము. నెఱి=రమ్యమని యర్థము. రమ్యమైననడ, రమ్యమయిన నడుము–అనునర్థములు స్వరసముగా నుండు నన్నమాట.

ప్రక్రియ:– "నెఱి+సు" + "నడ+ము"; "నెఱి+సు" + "నడుము+వు" అలౌకిక విగ్రహములు. బా. సమాస 25చే– నెఱి+నడ; నెఱి+నడుము. బా. సంధి 39చే– నెన్నడ, నెన్నడుము. తత్సమ 39చే– నెన్నడ+ము; తత్సమ 48చే– నెన్నడుము+వు. తత్సమ 57చే– నెన్నడ, నెన్నడుము.

విమర్శ:– ఈ సవరణము సరికాదు. కారణములివి– (i) నెఱశబ్ద ముత్తమ గుణ వాచకమని కేతన వచించియున్నాఁడు. దీనికిఁ బ్రశస్తమను నర్థము ప్రయోగ సిద్ధము.

కాన, నెఱిశబ్దముతో నర్థము స్వరసముగానే సరిపడును. (ii) నెత్తుటి, నెమ్మది, నెవ్వడి లోనగుచోట్ల నెఱి శబ్దము సరిపడదు. నెఱిశబ్దమే చెప్పవలెను. కాన నెల్లరూపములను నెఱిశబ్దముతో సాధించుటయే సమంజసము. కాఁగా, నీ సూత్రము ప్రత్యాఖ్యేయము (చూ. అనుబంధము. విషయసంఖ్య–6)

## కొన్నియెడల నవర్ణంబు పరంబగునపుడు పూర్వపదాంత్య డకారంబు నకారంబగు. 15

**ఉ:** రెన్నాళ్లు. క. పదిదివము లైదు ప్రొద్దులు, పదిపడి రెన్నాళ్ల నొక్క పగలున్ రేయున్, భార. ఆది 1ఆ–68. మూన్నాళ్లు. ఎ.గీ, చెలఁగు మాసిన మూన్నాళ్ల సిగ్గుతోడఁ, బతి విలోకన మార్గంబు పరిహరించి. కాశీ 2ఆ–72. వేన్నీళ్లు. తే. ఏళ్ల నీళులనొండె వేన్నీళ్ల నొండెఁ, గడుగ జూతఁ దోమిన నొండెఁ గలుగు శుద్ధి. మార్కం. 3ఆ–254.

**వ్యా.** కొన్ని చోట్ల నకారము పరమగునపుడు పూర్వపదము తుది డకారము నకారమగును. డకారమనునది స్వరముతోఁ గూడిన డ కారమున కుపలక్షణము. రెండు+నాళ్లు. డువర్ణమునకు నకారము రెంన్+నాళ్లు. స్థిరము పరమగుటచే బిందులోపము: రెన్+నాళ్లు=రెన్నాళ్లు. ఇట్లే మూఁడు+నాళ్లు=మూన్నాళ్లు. వేఁడి+నీళ్లు=వేన్నీళ్లు. లక్ష్య నిర్దేశమును బట్టి; బా. సమాస 63చే– కావలసిన హ్రస్వము మూన్నాళ్లు వేన్నీళ్లు – అను చోట్లంగాదు.

**ప్రక్రియలు:–** రెన్నాళ్లు: "రెండు+లు" + "నాడు+లు" – అలౌకిక విగ్రహము. బా. సమాస 25చే– రెండు+నాడు. ఈ 15చే– రెంన్+నాడు. బా. సంజ్ఞా 16చే– స్థిరమునకు ముందు బిందువుండరాదు గాన లోపించును. రెన్+నాడు=రెన్నాడు– ప్రాతిపదికము. తత్సమ 12చే– రెన్నాడు+లు. ఆచ్ఛిక 12చే– రెన్నాడ్+లు. ఆచ్ఛిక 14చే– రెన్నాళ్లు. ఇట్లే మూన్నాళ్లు. వేన్నీళ్లు:– "వేఁడి+సు" + "నీరు+లు"– అలౌకిక విగ్రహము. బా. సమాస 25చే– వేఁడి+నీరు. ఈ ప్రౌఢ15చే– వేఁన్+నీరు. బా. సంజ్ఞా 16చే– బిందు లోపము: వేన్+నీరు=వేన్నీరు– ప్రాతిపదికము. బా. తత్సమ 12చే– వేన్నీరు+లు. ఆచ్ఛిక 13చే– వేన్నీళు+లు. ఆచ్ఛిక 12 సూత్రమునందలి ల కార మలఘులకారమున కుపలక్షణము. (చూ. ముక్తలక్షణ 2) కాన, ఉత్వలోపము: వేన్నీళ్+లు=వేన్నీళ్లు.

**విమర్శ:–** నిర్బిందుక "నాడు" శబ్దముతో రెన్నాళ్లు మూన్నాళ్లు–అనువాని ప్రక్రియను వ్యాకర్త యుద్దేశించుట సరికాదు. (చూ. అనుబంధము విషయసంఖ్య– 63) రెణ్ణాళ్లు – అనవలెననువ్యాఖ్య సరికాదు. (అనుబంధము విషయసంఖ్య – 39)

## హలవసానంబులు పరంబులగునపు డేమి శబ్దముయొక్క మికారమునకు లోపంబు వైకల్పికంబు 16.

**ఉ:** నీకే బ్రాఁతియే వెన్నలుం, బాలున్. హరి పూ. 5 ఆ–237, శవముక్రియ నుండెదిదే. భాగ 9 ం–408.

**వ్యా.** హల్లు, నవసానముఁ బరమగునపుడు, ఏమి–శబ్దుయొక్క "మి" వర్ణమునకు లోపము వికల్పముగా నగును. మికారము=మివర్ణము. కారప్రత్యయమిట వర్ణసమూహమునకుఁ జేర్పఁబడెను. హల్లునకు:– ఏమి+బ్రాఁతియే = ఏబ్రాఁతియే; పక్షమున– ఏమిబ్రాఁతియే.

అవసానమునకు:- ఇది + ఏమి=ఇదే. పక్షమున - ఇదేమి అవసానము చూ.బా. సంధి 20-ఘంటా.

విమర్శ:- (i) నీకే (నీకున్+ఏ.) నీవంటి రాచబిడ్డకే, వెన్నలుంబాలున్, బ్రాంతియే=బ్రాంతియా? అని యన్వయింపనగును. ఈ పక్షమున నిది సరియగు నుదాహరణముకాదు. (ii) ఉండెదిదే - అనుచో, ఉండెదవే - అను పాఠమును గ్రహించినచో నిదియు సరియైనది కాదు. (iii) ఏమి శబ్దమునకు, ర వర్ణము పరమగుచో, 'మి' లోపము వైకల్పికము. (అనుబంధము. విషయసంఖ్య-64)

## షష్ఠీసమాసమందలి నిలల మీఁది యచ్చులకు హల్లు పరంబగుచోఁ గొన్నియెడల లోపంబు గానంబడియెడి. 17

ఉ: శా. ప్రీతిన్ సూరెల నశ్వినీ సుతులు రాఁ బెంపొందు నింద్రున్వలెన్. ఉ. రా 2ఆ-33. తూలె రజనీచర భాస్కర బింబముల్రుచుల్, రామా 5ఆ-187. అబ్జాస నాంకముల్ పెంపు, చంద్రా1ఆ-87.

వ్యా. షష్ఠీతత్పురుష సమాసమునందలి నిలల మీఁది యచ్చులకున్=ని, ల-అనువాని మీఁది యచ్చులకు, అనఁగా నిగాగమ లడాగమములందలి యచ్చులకు, హల్లు పరమగునపుడు కొన్ని చోట్ల లోపము కనఁబడును. నిగాగమమునకు: ఇంద్రుని (యొక్క)+వలెన్=ఇంద్రున్ + వలెన్: ఇంద్రున్వలెన్. లడాగమమునకు:- బింబముల (యొక్క)+రుచుల్=బింబముల్+రుచుల్: బింబముల్రుచుల్. అంకముల(యొక్క)+పెంపు=అంకముల్ పెంపు.

ప్రక్రియలు:- (i) "ఇంద్రుని+యొక్క" + "వలెన్+సు" అలౌకిక విగ్రహము. బా. సమాస 25చే- ఇంద్రుని+వలెన్. ఈ 17 చే- ఇంద్రున్వలెన్-ప్రాతిపదికమగును. పదత్వసిద్ధికై యనుక్తన్యాయమున 'సు' చేరును. (బా. తత్సమ 44- ఘంటా) ఇంద్రున్వలెన్+సు. బా. తత్సమ 57చే-'సు'-లోపము; ఇంద్రున్వలెన్. (ii) "బింబము+లయొక్క" + "రుచి+లు" - అలౌకిక విగ్రహము. బా. సమాస 25చే- బింబముల+రుచి. ఈ 17చే- బింబముల్+రుచి=బింబముల్ రుచి-ప్రాతిపదికము. బా. తత్సమ 12చే- బింబముల్ రుచి+లు. తత్సమ 45చే-బింబముల్ రుచులు. బా. ప్రకీర్ణక 16చే-బింబముల్ రుచుల్. (iii) "అబ్జాసనాంకము+లయొక్క" + "పెంపు+వు" - అలౌకిక విగ్రహము. బా. సమాస 25చే- అబ్జాసనాంకముల+పెంపు. ఈ 17 చే- అబ్జాసనాంకముల్ పెంపు - ప్రాతిపదికము. బా. తత్సమ 48చే- అబ్జాసనాంకముల్ పెంపు+వు. తత్సమ 57చే- అబ్జాసనాంకముల్ పెంపు.

విమర్శ:- (i) బింబముల్ రుచుల్ - అన్నది సరియగు నుదాహరణముకాదు. పద్యములో బింబముల్ - అను ప్రథమాంతమే ప్రయుక్తము. వ్యాకర్త పద్యమును దప్పుగా నన్వయించుకొనెను. (చూ. అనుబంధము విషయసంఖ్య - 65) (ii) లట్టులో అత్వ లోపమలసతామూలకము. కాన, అంకముల్ పెంపు-గ్రాహ్యముకాదు.

## మధ్యమపురుష ముపర్ణకంబున కచ్చుపరంబగునపుడును గొన్నియెడల లోపంబు చూపట్టెడి. 18

ఉ: ఆడిదె నీదు పందెము. కళా 9 ఆ 106. భవచ్చిత్తేప్సితంబెద్దిచె, ప్పునినన్. మార్క 1ఆ-127.

వ్యా. "మధ్యమ పురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడు లోపము విభాషనగు" అని బాలవ్యాకరణమున సూత్రింపఁబడెను. "చూడు మనియె, వినుమనియె. ఇచ్చట నచ్చుపరంబయినది కాఁబట్టి లోపము లేదు" అని తెలుపఁబడెను. అచ్చుపరమగునపుడును మధ్యమ మువర్ణకమునకుఁ గొన్నిచోట్ల లోపము కనఁబడునని యిట సవరణము చెప్పఁబడెను. ఆడుము+ఇదె=ఆడు+ఇదె=ఆడిదె. చెప్పుము+అనినన్=చెప్పు+అనినన్: చెప్పనినన్.

విమర్శ:- (i) ఆడిదె–అపపాఠము. ఆడితె–అను ముద్రిత పాఠమే సాధువు (ఆడితె=ఆడితివా?) కాననిది సరియగు లక్ష్యముకాదు. (ii) చెప్పనినన్, అనుచో, చె, ప్పనినున్ సంతత సత్యపాలనునిగాఁ బుణ్యాత్ముగాఁ జూచితిన్–అను ముద్రితపాఠమే సలక్షణముగాఁ గనఁబడును. చెప్పనినన్ – అను పాఠమున యతిభంగము. కాననిదియు సరియగు లక్ష్యముకాదు. అయినను సూత్రము నిర్మూలముకాదు. కావుకావుము+అను= కావుకావను–అనుప్రయోగము గలదు. – (అనుబంధము. విషయసంఖ్య – 40) కాన, "ఒక" లోపము చూపట్టుననవలెను.

## ధ్వన్యనుకరణ శబ్దముల కనుధాతువు పరంబగుచోఁ గొన్నియెడల ముగాగమంబగు. 19

ఉ: కనకనమను. రామా 6 ఆ. సలసలమను. పాండు 5 ఆ–207 మొ॥

వ్యా. ధ్వన్యనుకరణ శబ్దములకు "అను" ధాతువు పరమగునపుడు కొన్నిచోట్ల ముగాగమమగును. మండుట, మెఱయుట, మరుగుట, యెగురుట, వడఁకుట మున్నగు వానికిది యుపలక్షణము. కనకన+అను = కనకనమ్+అను: కనకనమను. సలసల+ అను=సలసలమ్+అను: సలసలమను. (చూ. అనుబంధము. విషయసంఖ్య – 66)

## ధ్వన్యనుకరణ శబ్దంబులు ద్విరుక్తంబుల యగు. 20

ఉ: గడగడ, వడవడ, తళతళ, పెళపెళ మొ॥

వ్యా. ధ్వన్యనుకరణ శబ్దములు ద్విరుక్తములే యగును. అనఁగా రెండుసార్లు (ద్విః+ఉక్త) పలుకఁబడు నన్నమాట. గడ+గడ=గడగడ– ఇత్యాది. ద్విరుక్తంబుల అను నవధారణముచే, గడ–లోనగు వానిని ద్విరుక్తములుగానే వాడవలెను. ధ్వనియనునది కాంతిలోనగువాని కుపలక్షణము.

విమర్శ:- ధ్వన్యనుకరణ శబ్దములన్నియు ద్విరుక్తములే కావలసినపనిలేదు. కావున నుదాహరణస్వారస్యమునుబట్టి గడగడ లోనగునవి మాత్రము ద్విరుక్తములే యగునని గ్రహింపవలెను. (చూ. మూలములు)

## ఇయ్యవి క్రియా వ్యవహితంబులు నగు. 21

ఉ: వడవడ జమదగ్నిసూతి వడఁకెన్. రామా 4.140

వ్యా. ధ్వన్యనుకరణ శబ్దములు క్రియతో వ్యవధానము (=ఎడము) గలవియు నగును. వడవడ జమదగ్ని సూతివడఁకెన్. ఇట, వడవడ–ధ్వన్యనుకరణ శబ్దము. వడఁకెన్–క్రియ. ఈరెంటికి మధ్య జమదగ్నిసూతి–అనునది వచ్చుటచే వ్యవధానమేర్పడెను.

వ్యవహితంబులున్ – అను సముచ్చయముచే వ్యవహితములు గాకుండుటయుఁ గలదు. జమదగ్నిసూతి వడవడ వడఁకెన్ – అని యవ్యవహితమును గావచ్చును.

విమర్శ:- ఇది బా. కారక 37 సూత్రమునకు వివరణ ప్రాయమననగును.

## ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశంబగు. 22

ఉ: కమ్మనిలతాంతములకుమ్మొనసి. భార. ఆది. 5ఆ–137. మత్త. వృష్టిఁజే, సెమ్మహానది దీర్ఘికా సరసీ నదంబులు నిండఁగాన్ అర. 3ఆ–113.

వ్యా. ద్విత్వమకారప్రాసమున, ద్రుతమునకు మకారము పరమగుచో, మకార మాదేశమగును. ప్రాసంబున–అన్నది ప్రాసయతి కుపలక్షణము. లతాంతములకున్+మొనసి= లతాంతములకుమ్+మొనసి: లతాంతములకుమ్మొనసి. చేసెన్+మహానది=చేసెమ్+మహానది: చేసెమ్మహానది.

విమర్శ:- (i) ద్రుతమునకు మకారము పరమగుచో నరుదుగాఁ బూర్ణబిందువగుట నన్నయాది పూర్వలాక్షణికులకుఁ బూర్వకవులకు సమ్మతము. లతాంతములకుంమొనసి, చేసెంమహానది – అనునవే నన్నయపాఠములు. కాన మకారమునకు ద్విత్వమును విధించుట భ్రాంతిమూలకమగుటచే, నీ సూత్రము త్యాజ్యము. (ము.కౌ.సంధి 17) చూ. అనుబంధము. విషయసంఖ్య – 20.

## ఆమ్రేడితంబు పరంబగునపుడు కృతహ్రస్వంబునకు దీర్ఘంబగు. 23

ఉ: లేలెమ్ము, పోపొమ్ము. మొ॥

## ఇది సంధిపరిచ్ఛేదము

వ్యా. ఆమ్రేడితము పరమగుచోఁ గృతహ్రస్వమునకు దీర్ఘమగును. కృతహ్రస్వము=చేయఁ బడిన హ్రస్వముగలది. అనఁగా మొదట దీర్ఘమై యుండి, పిదప వ్యాకరణకార్యముచే హ్రస్వముగాఁ జేయఁబడినది. లేచు+ము=లే+ము: లెమ్ము (చూ.బా.క్రియా 101) పోవు+ము: పొమ్ము (చూ.బా.క్రియా 98) ఇట లే, పో–అనువాని దీర్ఘములు, బా. క్రియా 61చే– హ్రస్వములైనవి. కావున లెమ్ము, పొమ్ములలోని ఎ–ఒలు కృతహ్రస్వములు.

లేలెమ్ము:- శబ్ద 113చే– లెమ్ము+లెమ్ము–అని నిల్చును. బా. సంధి 49చే– లె+లెమ్ము. (ఇట ముపర్ణకము తోపాటు మాముడియు లోపించును.) ఈ 23చే– "లె" లోని కృతహ్రస్వమగు ఎకారమునకు దీర్ఘము: లే+లెమ్ము=లేలెమ్ము. ఇట్లే పొమ్ము+పొమ్ము=పొ+పొమ్ము=పోపొమ్ము (చూ. అనుబంధము విషయసంఖ్య – 41.)

## ఇది ఘంటాపథము

★ ★ ★

# శబ్ద పరిచ్ఛేదము

## నామ ప్రకరణము

### శబ్దములు విశేష్యములు విశేషణములని ద్వివిధంబులు. 1

ఉ: అయ్య, అన్న, అమ్మ, అక్క మొదలగునవి విశేష్యములు. తక్కినవి విశేషణములు.

వ్యా. శబ్దపరిచ్ఛేదము నామప్రకరణము, సర్వనామప్రకరణము నని ద్విధావిభజింపఁ బడినది. ఈ నామప్రకరణమునందలి శబ్దములు రెండు విధములు– (i) విశేష్యములు. అయ్య, అన్న, అమ్మ, అక్క మొ॥ (ii) విశేషణములు. అయ్య, అన్న, అమ్మ, అక్క మొదలగునవి కాక తక్కినవి. విస్తరమునకు చూ. 2,3–సూ.

### విశేష్యమునా విశేషణముచేఁ దెలుపఁబడు విశేషము గలది; విశేషణమునా జాత్యాది విశేషములను దెలుపునది. 2

వ్యా. విశేష్యము=విశేషణముచేఁ దెలుపఁబడు విశేషము కలది. విశేషణము= జాతిమున్నగు విశేషములనుదెలుపునది. ఉదా॥ అన్న బ్రాహ్మణుఁడు. ఇట బ్రాహ్మణుఁడను విశేషణముచే బ్రాహ్మణత్వము కలిగియుండుట యను విశేషము "అన్న" యందుఁగలదని తెలియుచున్నది. కాన అన్న శబ్దము విశేష్యము. విశేషణమునకు చూ–3 వ్యాఖ్య.

### విశేషణము జాత్యాది భేదంబులచే షడ్విధంబు. 3

అవి– జాతి ప్రయుక్త విశేషణము, క్రియాప్రయుక్త విశేషణము, గుణ ప్రయుక్త విశేషణము, ద్రవ్యప్రయుక్త విశేషణము, సంఖ్యా ప్రయుక్త విశేషణము, సంజ్ఞా ప్రయుక్త విశేషణము.

ఉ: జాతి ప్రయుక్త విశేషణమునకు–బ్రాహ్మణుఁడు.
క్రియా ప్రయుక్త విశేషణమునకు–పోవువాఁడు.
గుణ ప్రయుక్త విశేషణమునకు–నల్లనివాఁడు.
ద్రవ్య ప్రయుక్త విశేషణమునకు–ధనవంతుఁడు.
సంఖ్యా ప్రయుక్త విశేషణమునకు–ఒక్కఁడు.
సంజ్ఞా ప్రయుక్త విశేషణమునకు–దేవదత్తుఁడు. మొ॥

వ్యా. విశేషణము, జాతి మున్నగు భేదములచే నాఱు విధములు. (1) జాతి ప్రయుక్త విశేషణము – బ్రాహ్మణుఁడు. జాతి యనఁగా ననేక వ్యక్తులయందుండు ధర్మము. బ్రాహ్మణత్వమను జాతితోఁ గూడుకొనియుండువాఁడు – అను నర్థము నిచ్చు శబ్దముగాన,

బ్రాహ్మణుఁడు–జాతి ప్రయుక్త విశేషణము. (2) క్రియాప్రయుక్త విశేషణము–పోవువాఁడు. పోవుట యను క్రియతోఁ (పని, వ్యాపారము) గూడియుండువాఁడను నర్థమునిచ్చు శబ్దముగాన, పోవువాఁడు–క్రియా ప్రయుక్త విశేషణము, (3) గుణప్రయుక్త విశేషణము–నల్లనివాఁడు. నల్లన యను గుణముతోఁ గూడుకొని యుండువాఁడు–అను నర్థమునిచ్చు శబ్దముగాన, నల్లనివాఁడు–గుణ ప్రయుక్త విశేషణము, (4) ద్రవ్య ప్రయుక్త విశేషణము–ధనవంతుఁడు. ద్రవ్యమనఁగాఁబదార్థము=వస్తువు–అని యర్థము. (ద్రవ్యము=డబ్బు–అనికాదు.) ధనమను నది యొక ద్రవ్యము=పదార్థము. ధనమను పదార్థముతోఁ (=వస్తువుతో) గూడుకొని యుండువాఁడను నర్థము నిచ్చునది గాన, ధనవంతుఁడు–ద్రవ్య ప్రయుక్త విశేషణము. (5) సంఖ్యా ప్రయుక్త విశేషణము–ఒక్కఁడు. ఏకత్వ సంఖ్యతోఁ గూడుకొని యుండుట యను విశేషమును బోధించు శబ్దముగాన, ఒక్కఁడు–సంఖ్యాప్రయుక్త విశేషణము. (6) సంజ్ఞా ప్రయుక్త విశేషణము–దేవదత్తుఁడు. దేవదత్తుఁడనెడు సంజ్ఞ (=పేరు) గల వాఁడను నర్థము నిచ్చు శబ్దముగాన, దేవదత్తుఁడు సంజ్ఞా ప్రయుక్త విశేషణము.

సంఖ్యా ప్రయుక్త విశేషణ మేకాంతంబయి యమహద్విశేష్యక
మయ్యుఁ, దదంశాంతంబయి మహదమహ ద్విశేష్యక
మయ్యు, సమస్తంబు వ్యస్తంబు నగుచో విశేష్యంబు
క్రమంబుగ నుత్తరపదంబు నేకవచనాంతంబును,
పూర్వపదంబు బహువచనాంతంబు నగు. 4

తదంశము=ఆ యొకటి యొక్క భాగము. అనఁగాఁ బాతిక లోనగునది.

ఉ: డెబ్బదియొక్క రథము, రథములు డెబ్బది యొక్కటి; రెండున్నర మానిసి, మానుసులు రెండున్నర; రెండున్నర రూపాయ, రూపాయలు రెండున్నర. మొ॥

వ్యా. సంఖ్యాప్రయుక్త విశేషణము, ఏకాంతంబయి=ఒక శబ్దము చివరఁ గలదై, అమహద్విశేష్యక మయ్యున్=అమహద్వాచకము విశేష్యముగాఁ గలది యయ్యును, తదంశాంతంబయి=ఆ యొకటియొక్క భాగము, అనఁగా పాతిక, అర, మున్నగు శబ్దములు చివరఁగలదియై, మహదమహ ద్విశేష్యకమయ్యున్=మహద్వాచకము, నమహద్వాచకము విశేష్యములుగా గలదియయ్యును, సమస్తంబు వ్యస్తంబు నగుచోన్=సమాసమున నున్నది, విడిగానున్నది యగునపుడు, విశేష్యము వరుసగా (i) ఉత్తరపదమును, నేకవచనాంతమును (ii) పూర్వపదమును, బహువచనాంతమును నగును. ఎట్లనఁగా–

1. సంఖ్యాప్రయుక్తవిశేషణము, ఏకాంతమయి (=ఒకశబ్దము చివరఁగలదియయి) యమహద్విశేష్యకమయి (అమహద్వాచకము విశేష్యముగాఁ గలదియయి) (i) సమస్తమగుచో (= సమాసగతమగుచో)– విశేష్యముత్తరపదమును, నేకవచనాంతమును, నగును. ఉదా॥ డెబ్బదియొక్క రథము. ఇట, డెబ్బదియొక్క – సంఖ్యా ప్రయుక్తవిశేషణము. ఇది యేకాంతము. రథము–అను నమహద్వాచకమును విశేష్యముగాఁ గలిగి యున్నది. ఇది సమస్తము. కనుక, విశేష్యమగు రథ శబ్దముత్తర పదమును, రథము–అని యేకవచనాంతమును నైనది. (ఉత్తరపదము=సమాసమునందలి తుది యవయవము.) (ii) వ్యస్తమగుచో (సమాసమునలేనప్పుడు – విడిగానున్నప్పుడు) విశేష్యము పూర్వపదమును బహువచనాంతమును నగును. ఉదా॥ రథములు డెబ్బది యొక్కటి. ఇట, డెబ్బదియొక్కటి–సంఖ్యా

ప్రయుక్తవిశేషణము. ఇది యేకాంతము. కానదీని విశేష్యమగు నమహద్వాచక రథశబ్దము వ్యస్తమునఁ బూర్వపదమై, రథములు-అని బహువచనాంతమయినది.

2. సంఖ్యా ప్రయుక్త విశేషణము, తదంశాంతంబయి (= ఒకటియొక్క భాగములగు, అర మున్నగునవి చివరఁగలదై,) మహదమహద్విశేష్యకమై (=మహద్వాచకము, నమహద్వాచకము విశేష్యములుగాఁ గలదై) (i) సమస్తమగుచో (=సమాసగతమగుచో.)-విశేష్య ముత్తరపద మును, నేకవచనాంతమును నగును. ఉదా॥ రెండున్నర మానిసి, రెండున్నర రూపాయ. ఇట, రెండున్నర-సంఖ్యాప్రయుక్త విశేషణము. ఒకటియొక్క భాగమగు 'అర'శబ్దము చివరఁ గలిగియున్నది. మానిసి- మహద్విశేష్యము. రూపాయ-అమహద్విశేష్యము. సమస్తములగుటచే నీమహదమహ ద్విశేష్యము లుత్తర పదములు, నేకవచనాంతములు, నైనవి. (ii) వ్యస్తమగుచో-విశేష్యము పూర్వపదమును బహువచనాంతము నగును. ఉదా॥ మానుసులు రెండున్నర, రూపాయలు రెండున్నర. రెండున్నర సంఖ్యాప్రయుక్త విశేషణము. ఒకటియొక్క భాగమగు 'అర' శబ్దము చివరఁ గలిగియున్నది. దీని మహద్విశేష్యమగు మానిసి శబ్దమును, నమహద్విశేష్యమగు రూపాయ శబ్దమును, వ్యస్తమునఁ బూర్వపదములును, బహువచనాంతములు నైనవి.

**విమర్శ:-** (i) డెబ్బదియొక్క రథములు-అనియుఁ గావచ్చును. (చూ. ము. కా-కారక 25) ఇంత పెద్ద వాక్యమును సూత్రమనుట సూత్ర లక్షణమునకు విరుద్ధము. ఇట్లే తక్కిన చోట్లఁదెలియవలెను.

## అయ్యది యేకాంతంబు మహద్విశేష్యకంబు సమస్తంబుకాదు; వ్యస్తంబగుచో బహువచనాంతంబ యగు. 5

ఉ: పదునొక్కండ్రు రుద్రులు. మొ॥ (చూ. సమాస 26 సూ)

**వ్యా.** ఏకాంతంబు=ఒక్కశబ్దమంతమందుఁ గలదియు, మహద్విశేష్యకంబు=మహ ద్వాచకము విశేష్యముగాఁ గలదియు, నగు, అయ్యది=ఆ సంఖ్యాప్రయుక్త విశేషణము, సమస్తంబుగాదు= సమాసగతము కాదు. వ్యస్తంబగుచోన్=సమాసగతము కానప్పుడు, బహువచనాంతమే యగును. అనఁగా, ఒక్కశబ్దమంతమందుఁగల సంఖ్యాప్రయుక్త విశేషణము మహద్వాచకమగు విశేష్యముతో సమసింపదు. అసమాసమున నిది బహువచనాంతమే యగును. పదునొక్కండ్రు రుద్రులు. ఇట, పదునొక్క-అనునది యేకాంతము. రుద్రులు-అనునది మహద్విశేష్యము. కాన, పదునొక్క-అనునది యేకాంతమగు మహద్విశేష్యకము. ఇది మహద్విశేష్యముతో సమాసము కాదు. అనఁగా, పదునొక్కరుద్రులు-అని కాదు. వ్యస్తమున, 'పదునొక్కండ్రు'-అని బహువచనాంతమగును. ఇట, పదియు నొక్కండ్రు రుద్రులు-అను రూపము, సమాస 26 సూత్రముచే సిద్ధించుననువిషయము సూచితమయినది.

**విమర్శ:-** సంఖ్యాప్రయుక్త విశేషణము సైతము వ్యస్తమున బహువచనాంతమగునని బా. కారక 19 చేతనే గతార్థమగును. ఐనను బ్రసంగవశమున (చూ-4 సూ.) నిట్లు స్పష్టప్రతిపత్తికి సూత్రింపఁబడెనని భావింపనగును.

## విశేష్యంబు ప్రధానం బితరం బప్రధానంబు. 6

**వ్యా.** విశేష్యము ప్రధానము. ఇతరంబు=విశేష్యము కాక తక్కినది, యనఁగా విశేషణ మప్రధానము. అన్వయక్రమమున విశేష్యము ప్రధానమనియు విశేషణ మప్రధానమనియు భావము. చూ. 7 సూ.

## ప్రధానంబు పశ్చాద్వాచ్యంబగు. 7

అన్వయక్రమమునందు విశేషణములను ముందుచెప్పి కడపట విశేష్యమును జెప్పవలెననుట.

వ్యా. ప్రధానంబు=6వ సూత్రమునఁ బ్రధానమైనదిగా నిర్దేశింపఁబడిన ప్రధానము- అనఁగా విశేష్యము, పశ్చాత్+వాచ్యంబగు=వెనుకఁ జెప్పఁబడినదగును. అన్వయక్రమమున విశేషణమును ముందుచెప్పి విశేష్యమును వెనుకఁజెప్ప వలెనని తాత్పర్యము. ఉదా॥ అమహన్నపుంసకముల కదంతంబులకు ముపర్ణకంబగు. (బా.తత్సమ 39) ఇట, అదంతం బులకున్ అమహన్నపుంసకములకున్, అని విశేషణము ముందును, విశేష్యము వెనుకను నుండునట్లన్వయమును జెప్పవలెనన్నమాట. ఇట్లే యెల్లచోట్ల గ్రాహ్యము.

## ఒక్కచో విశేషణంబులును విశేష్యంబులగు. 8

ఉ: నారదుం డిట్లనియె మొ॥

వ్యా. విశేషణము లొక్కొక్కచోట విశేష్యములుగఁ బ్రయోగింపఁబడును. నారదుం డిట్లనియె. ఇట, నారదుండు-సంజ్ఞాప్రయుక్త విశేషణము. (చూ. 3 సూ.) ఇది విశేష్యముగా వాడఁబడినది.

## ఒక్కొక్కచో విశేష్య విశేషణంబులు వ్యత్యస్తం బులునగు. 9

ఉ: క. నీ మాఱుఁదల్లి త్రిభువన, భామారత్నంబు గంధవతి పై. హరి. పూ. 2అ-170ప.

వ్యా. ఒక్కొక్కచోట విశేష్య విశేషణములు, వ్యత్యస్తంబులున్=తాఱుమాఱైనవియు నగును. అనఁగా నొక్కొక్కచోట విశేష్యము విశేషణముగాను, విశేషణము విశేష్యముగాను దార్మాఱగునని భావము. ఉదా: నీ మాఱుఁదల్లి త్రిభువన భామారత్నంబు గంధవతిపై. మాఱుఁదల్లి - విశేష్యము. (చూ.1సూ.) గంధవతి - సంజ్ఞాప్రయుక్త విశేషణము. (చూ. 3సూ.) ఇట విశేష్యమగు మాఱుఁదల్లి విశేషణముగా వాడఁబడినది. విశేషణమగు గంధవతి విశేష్యముగా వాడఁబడినది. నీ మాఱుఁదల్లియుఁ ద్రిభువన భామారత్నంబు నగు, గంధవతిపై - అన్నమాట.

## తెనుఁగునం గొన్ని శబ్దములు విశేష్యవిశేషణంబు లుభయంబును నగు 10.

కొన్ని యనఁగాఁ గీడు ప్రభృతులును, నల్లాదులును.

వ్యా. కొన్ని యచ్చ తెనుఁగు శబ్దములనఁగాఁ గీడు-మున్నగు శబ్దములు నల్ల - మున్నగు శబ్దములు విశేష్యములు విశేషణములు రెండును నగును. కీడు-విశేష్యమగుటకు:- తామ్రమాదిగఁ గలయట్టి ధాతుచయము. కొలిమినిడి యూఁదఁ గీడెల్లఁ బోలియునట్లు (మార్కం. 3 ఆ.) కీడు=దోషము; అని యర్థము. విశేషణమగుటకు:- వారల తలంపులు కీడు. (భార. ఉద్యో. 3ఆ.) కీడు=కీడైనవి, దుష్టమైనవి - అని యర్థము. నల్ల - విశేష్యమగుటకు - అమ్మహాశ్వంబు ధవళదేహంబునందు, నల్లగలిగిన నీవిష్ట నాకుదాసి, వగుము. భార, ఆది 2 ఆ. నల్ల=నలుపు. విశేషణమునకు-ఈనల్ల తిరునామ మెచటదొరకె. (జై. 3ఆ.) నల్ల=నల్లనైన - అని యర్థము. (శ. ర)

## విశేషణంబులు కొన్ని వ్యవహితంబులునగు. 11

ఉ: క. ఈలోకంబున వెదకితి, మేలెల్లెడఁ గాన వరుని. నిర్వ 3 ఆ–42.

వ్యా. కొన్ని విశేషణములు వ్యవహితంబులున్=వ్యవధానము (ఎడము) గలవియు, నగును. అనఁగా విశేషణమునకు విశేష్యమునకు మధ్య వేఱుపదములు వాడుటచే రెండింటికి వ్యవధాన మేర్పడునని యర్థము. ఉదా: మేలెల్లెడఁ గాన వరుని. మేలు–విశేషణము. వరుని–విశేష్యము. (మేలైన వరుని) ఈ రెండింటికి మధ్య, ఎల్లెడఁగాన–అనునది చేరుటచే వ్యవధానము కలిగెనని భావము.

విమర్శ:- ఇట, మేలెల్లెడవరునిఁ గాన–అనునది యుపపాఠము. మేలిల్లెడు వరునిఁ గాన–అను వ్రాఁతప్రతుల పాఠమే గ్రాహ్యము. మేలిల్లు=శ్రేష్ఠమగు, ఒప్పు. కాన నీసూత్రము త్యాజ్యము.

## విశేషణంబులు కొన్ని యెడల విశేష్య లక్షకంబులగు 12.

ఉ: క. దేవతల కప్రియంబులు, గావించి మనుష్య లధమగతులగుదు రిలన్, గావున వారికి నిష్టము గావింపుము నన్నుఁ బ్రీతిఁగావుము తరుణీ. (అప్రియంబులు=అప్రియకార్యములను; ఇష్టము=ఇష్టకార్యము.) భార. అర 2 ఆ–50 చ. పరమపతివ్రతన్ సభఁ దపస్వినిఁ బాండవధర్మపత్ని ధర్మరతన యోనిజన్ బ్రకృతి మానవభామినిగాఁ దలంచి దె,ప్పరములు పల్కఁగాఁ దగునె? (దెప్పరములు=దెప్పరపు మాటలను) భార. సభా 2 ఆ–255 వ. బెట్టిదంబులంగాని చక్కం బడఁడు. (బెట్టిదంబులన్=బెట్టిదపు మాటలచేత) భార. అర. 6ఆ–173 మొ॥

వ్యా. కొన్నిచోట్ల విశేషణములు, విశేష్య లక్షకంబులు=విశేష్యములను లక్షణావృత్తిచే బోధించునవి, అగునని యర్థము. ముఖ్యార్థమునకు బాధకలుగు నప్పుడు రూఢిని బట్టి కాని, ప్రయోజనమును బట్టి కాని ముఖ్యార్థముతో సంబంధము గల వేఱొక యర్థమును స్ఫురింపఁజేయు శబ్దశక్తి లక్షణ యనఁబడును. (ముఖ్యార్థబాధే తద్యోగే రూఢితోఽథ ప్రయోజనాత్–కావ్యప్ర) లక్షణావృత్తిచే బోధింపఁబడు నర్థమును లక్ష్యార్థమందురు. "లక్షకము=లక్ష్యార్థమును తెలిపెడు శబ్దము" (శ. ర.) ఉదా: అప్రియంబులు – అను విశేషణము, అప్రియ వాక్యములను అను లక్ష్యార్థమును దెలుపును. ఇట్లే ఇష్టము=ఇష్టకార్యము, దెప్పరములు=దెప్పరపు మాటలు, బెట్టిదంబులన్=బెట్టిదపు మాటలచేత–అని లక్ష్యార్థములు గ్రహింపవలెను.

## ఓశబ్దం బొక్కచో సంబోధ్యవాచకమునకు ముందితరశబ్ద వ్యవహితంబయి కానంబడియెడి. 13

ఒక్కచో ననఁగా సంబోధ్యవాచకంబు క్రియాజన్య విశేషణ పూర్వకం బగు నపుడనియు, ఇతర శబ్దంబనఁగా ఆ క్రియాజన్య విశేషణమునకు సంబంధించిన పదమనియు నర్థము.

ఉ: ఓ వినువీథినున్న ఖచరోత్తములార! వీర 2 ఆ 124 ఓ, తో యజనేత్రుఁగాంచిన వధూమణి విజ 3 ఆ-125.

వ్యా. ఓ శబ్దము, ఒక్కచోన్, అనఁగా సంబోధ్యవాచకము క్రియాజన్య విశేషణ పూర్వకమగునపుడు సంబోధ్యవాచకమునకు ముందు, ఇతరశబ్దవ్యవహితంబయి, అనఁగా – ఆ క్రియాజన్య విశేషణమునకు సంబంధించిన పదముచే వ్యవధానము (ఎడము) గలదై, కనఁబడునని యర్థము. ఓ శబ్దమునకును, గ్రియాజన్య విశేషణము ముందుగాఁ గలిగిన సంబోధ్య వాచకమునకు నాక్రియాజన్య విశేషణమునకు సంబంధించిన పదముచే వ్యవధానము కలుగునని భావము. ఓ వినువీధినున్నఖచరోత్తములార – అనుచో, ఖచరోత్తములు–సంబోధ్యవాచకము. ఉన్న – క్రియాజన్య విశేషణము, అనగా ధాతుజవిశేషణము. (బా, క్రియా 44-47) క్రియా=ధాతువని యర్థము. (క్రియాధాతుః – ఆం, చిం.) కాన, క్రియాజన్య శబ్దము, ధాతుజశబ్దార్థక మగును. ఉన్న ఖచరోత్తములార – అనునది క్రియాజన్యవిశేషణపూర్వకమగుసంబోధ్య వాచకము. దీనికిని, ఓ శబ్దమునకును, ఉన్న – అను క్రియాజన్యవిశేషణమునకు సంబంధించిన "వినువీథిన్" అను శబ్దముచే వ్యవధానము కలిగినది. ఓ, తోయజనేత్రుఁగాంచిన వధూమణి. ఇట వధూమణి – సంబోధ్యవాచకము. కాంచిన – క్రియాజన్య విశేషణము. కాన, కాంచిన వధూమణి – క్రియాజన్యవిశేషణ పూర్వకమగు సంబోధ్యవాచకము, ఓ శబ్దమునకును, దీనికిని, కాంచిన – అనుక్రియాజన్య విశేషణమునకు సంబంధించిన, తోయజనేత్రున్ – అను దానిచే వ్యవధానము కలిగినది.

బాలవ్యాకరణమున "ఇది (ఓ శబ్దము) సంబోధ్యవాచకంబునకు ముందే ప్రయోగింపం బడును" అని తెలుపఁబడెను. (తత్సమ 14) ముందేయనగాఁ బరమందుఁ గాదనియుఁ బూర్వమందనియు నర్థము. ఓ రాముఁడ–ఇత్యాదిగా నుదాహరింపఁబడెను. అనఁగా సంబోధ్యవాచకమునకు ముందవ్యవహితముగ, ఓ శబ్దముండునట్లుదాహరింపఁబడెనన్నమాట. క్రియాజన్య విశేషణమునకు సంబంధించిన పదముచే వ్యవధానమును గలుగవచ్చునని యీ ప్రౌఢవ్యాకరణ సూత్రము స్పష్టపఱుచుచున్నది. కాన నిది బాల వ్యాకరణ సూత్రమునకు వివరణ మననగును.

## రోశబ్దంబొండు సంబోధనంబున స్త్రీవాచకంబునకుఁ బరంబుగనగు; అయ్యది హ్రస్వాంతంబును నయ్యెడి. 14

ఉ: చ. కమలదళాక్షిరో వినవుగా గలయొక్కటి గంటి వేకువన్. ప్రభా 1ఆ-122. చ. రమణిరొ భృత్యులందు నపరాధము గల్గిన నాయకుల్ స్వప, క్షమ దలపోసి యుగ్రతర శాసనముందెగి చేయరు. భాగ. 4స్కం-788 మొ. (ఒకానొక యాధునిక గ్రంథమునందు, అన్నరొ, ఏనుంగురొ, అని ప్రయోగములు కానంబడుచున్నవి. వానికిఁ బ్రామాణిక ప్రయోగములు కానంబడవు)

వ్యా. రో– అనుశబ్దమొకటి సంబోధనమునందు స్త్రీ వాచకమునకుఁ బరముగనగును. అది హ్రస్వాంతమును నగును. ఉదా: కమలదళాక్షిరో. ఇట, కమలదళాక్షి – స్త్రీవాచకము. దీనికిఁ బరముగ 'రో'శబ్దము సంబోధనమునవైనది. కమలదళాక్షిరో=ఓకమలదళాక్షి – అని యర్థము. హ్రస్వాంతమునకు – రమణిరొ=ఓ రమణీ అని యర్థము. ఒక యర్వాచీన కావ్యమున, అన్నరొ, ఏనుంగురొ అను ప్రయోగములు గలవు, అన్న, ఏనుఁగు శబ్దములు

స్త్రీవాచకములు కావు. అన్నరొ, ఏమంగురొ - వంటివానికిఁ బ్రామాణిక ప్రయోగములు కనఁబడవు. (చూ. మూలములు)

## దేశ్యంబులం గొన్నియెడల స్త్రీవాచక స్త్రీసమంబులగు సంబోధ్య వాచక శబ్దంబులమీఁద నేకవచనంబునఁ గాన శబ్దంబొందును, అల యను న్వయంబొందును గానంబడియెడి. అల దీర్ఘాంతంబు నగు. 15

ఉ: భవ్యరతి దేవతాచార పరమ పుణ్య, ధర్మ మేమఱకుండుమీ తల్లికాన నైష 7 ఆ-9. మాసామికాన. సా. 1ఆ-73 (ఈ కవి పాపజాతి కాన-అని ప్రయోగించినాఁడు. అది విచార్యము.)

ఉ: అక్కల కన్యకాత్వమిటు లాఱడివోవ నకారణంబనీ, కెక్కడి చూలువచ్చె? నిర్వ 2 ఆ-24. చ. తొడిఁబడ నమ్మలక్కలని తూలుచు దీనత దోయిలొగ్గుచున్. ఆము 2 ఆ-59. క. వ్రేలెడు వెంద్రుక లిరుగడఁ, దూలఁగఁ దలయూఁచుఁ దొప్పదొప్పన నోరిం, గేలనడచికొను సెలవుల, లాలలుదొరఁగంగ నన్నలా యని యొఱలున్. ఉ. హరి 4 ఆ-302.

వ్యా. దేశ్యములందుఁ గొన్నిచోట్ల స్త్రీవాచకములగు సంబోధ్యవాచకముల మీఁదను, స్త్రీసమములగు సంబోధ్యవాచకముల మీఁదను నేకవచనమున 'కాన' శబ్ద మొకటియు, అల-అను నవ్యయమొకటియుఁ గనఁబడును. అల దీర్ఘాంతమును నగును. స్త్రీవాచకములకు - తల్లికాన=ఓతల్లీ! అని యర్థము. అక్క+అల=అక్కల. అనఁగా, ఓయక్కా! అని యర్థము. అమ్మ+అల=అమ్మల. అనగా, ఓయమ్మా! అని యర్థము అన్న+అలా=అన్నలా. ఇది 'అల' దీర్ఘాంతమగుటకుదాహరణము. అక్కల, అమ్మల - అనుచోట్ల స్త్రీవాచకములకు సంధిజరిగినది. బా. సంధి 4లోని బహుళగ్రహణముచే అత్తునకు 'అల' పరమగుచో సంధి నిత్యము. సామికాన - అను నుదాహరణమును బట్టి దేశ్యములందే కాక తద్భవములందు సహిత మరుదుగా కాన శబ్దము చేరునని గ్రహింపనగును. స్వామి శబ్దభవము=సామి. పాపజాతికాన - అనుచో, కానశబ్దము పాపజాతి - అను సంస్కృతసమముపై వాడఁబడినది. ఇది విచార్యము. చూ. మూలములు.

విమర్శ:- తల్లి, అక్క, అమ్మ - అను స్త్రీవాచకములు సహితము స్త్రీ సమములే యగుటచే నివి స్త్రీసమశబ్దముచేతనే గతార్థములు కావచ్చును. కాన స్త్రీవాచకములను వేఱుగాఁ బేర్కొనుటచే స్త్రీవాచకములు కాని స్త్రీసమముల కీకార్య మరుదుగా నగునని వ్యాకర్త యభిప్రాయము.

## హలవసానంబులు పరంబగునపుడు లురువర్ణకంబుల యుత్వంబు నకు లోపంబు వైకల్పికంబుగ నగు. 16

ఉ: మ. వితతోల్కాశని పుంజ మొక్కొయనఁగా విన్వీధి నిక్షిప్త ప, క్షతివాతాహతిఁ దూలి తూల శకలాకారంబులై వారిద, ప్రతతుల్ సాల్పడి నల్గడంజెదరఁ నాఁ బాఱె న్మనోవేగుఁడై, పతగేంద్రు డమృతాంతికంబునకుఁ

దత్పాలుర్ భయంబందఁగన్. భార. ఆది 2 ఆ-91, ఇట్లు - భూసురోత్తముల్, భూపాలుర్. మొ॥

వ్యా. హల్లు, నవసానముఁ బరమగునపుడు, ఉ-రు, వర్ణకముల ఉత్వమునకు లోపము వైకల్పికముగా నగును. ఉవర్ణకమునకు - ప్రతతులు+సొల్పడి=ప్రతతుల్ సొల్పడి. రువర్ణకమునకు - తత్పాలురు+భయంబందఁగన్=తత్పాలుర్ భయంబందఁగన్. ఇవి హల్లుప రమగునప్పటి యుదాహరణములు. అవసానమునకు: భూసురోత్తములు=భూసురోత్తముల్. భూపాలురు=భూపాలుర్. మొ॥

బా. ప్రకీర్ణక 16 సూత్రముచే ఉవర్ణమునకు హల్లుపరమగునప్పుడు బహుళముగను రువర్ణమున కవసానము పరమగునపు డరుదుగను, ఉత్వలోపము జరుగ వచ్చును. కాన నీ ప్రౌఢవ్యాకరణ సూత్రము బాలవ్యాకరణమునకు వివరణము.

విమర్శ:- రువర్ణకమున కవసానము పరమగునప్పుడుత్వలోపమునకు, భూపాలుర్ - అని యుదాహరింపఁబడెను. దీనికిఁ బ్రయోగములు చూపకపోవుట సరికాదు. (చూ. అనుబంధము - విషయసంఖ్య - 42)

## మహత్సమూహార్థక శబ్దం బమహత్కార్య యుక్తం బయ్యుఁ దద్విశేషణ క్రియలు మహత్కార్య యోగ్యంబులు విభాషనగు. 17

ఉ: ఎ. గీ. ముని నికాయమెల్ల, వివిధ పుణ్య కథలు వినువేడ్క నతనిఁ బూజించిరి. భార. ఆది 1 ఆ-27.క. గీర్వాణ ప్రభుఁడాదిగ, గీర్వాణ గణంబుకాలకేయులతోడన్, గర్వించి రణము చేసి ర,ఖర్వ పరాక్రములు కడిమిఁ గడు నుద్ధతులై. భార. అర. 3 ఆ-41. అయ్యిరు దెగలు పగఱ గారే తమలోన్. నిర్వ 4-84 మొ॥ పడనడతురు గన్న నిన్నుఁ బ్రమథగణంబుల్ - నిర్వ 4-84 మొ॥ విభాష ననుటచే - క. విషధర కుక్షి నసంఖ్యము, నిషాదగణముండి ధారుణీ ప్రజకుఁగడున్, విషమమును జేయు వారి ని,మిషమునభక్షించిచను మమిత్ర విఘాతీ! భార. ఆది 2 ఆ 58. సీ. నెత్తమ్ము లేకొండనెత్తమ్ములందాడు విద్యాధరీకోటి విటుల తోడ. స్వా 4ఆ-78. ఇత్యాదులూహ్యంబులు.

వ్యా. మహత్సమూహార్థక శబ్దంబు=మహత్తులయొక్క సమూహమును బోధించు శబ్దము, అమహత్కార్య యుక్తంబయ్యున్=అమహద్వాచకములకు రావలసిన వ్యాకరణ కార్యములతోఁ గూడుకొన్నదైనను, తద్విశేషణక్రియలు=దాని విశేషణములు, క్రియలు, మహత్కార్యయోగ్యంబులు=మహద్వాచకములకు రావలసిన వ్యాకరణ కార్యములకుఁ దగినవి, విభాషనగును. ఉదా: ముని నికాయము పూజించిరి. ఇట, ముని శబ్దము మహత్తు, కాన నికాయశబ్దము మహత్సమూహార్థకము. ఇది నికాయము - అని యమహత్తులకు రావలసిన మువర్ణకముతోఁ గూడుకొని యున్నది. (బా. తత్సమ 39) అయినను, మహద్వాచకమునకు రావలసిన, పూజించిరి - అనుక్రియ దీనికిఁ గలిగినది. (విభాషగనుక, ముని నికాయము పూజించెను - అను నమహత్కార్యమును నగును. బా. క్రియా 25) అఖర్వ పరాక్రములు కడునుద్ధతులై, గీర్వాణగణంబు రణముచేసిరి - అనుచో, అఖండ పరాక్రములు, కడు నుద్ధతులు-అను విశేషణములును, చేసిరి-అను క్రియయు మహత్కార్యముల నందెను.

(పక్షమున-అఖండ పరాక్రమము, గీర్వాణగణము, కడునుద్ధతమై రణము చేసెను - అని యుండును.) ప్రమథగణంబుల్ పడనడతురు - అనుచోఁబడనడతురు - అని క్రియ మహత్కార్యమునందినది. (పక్షమున - ప్రమథగణంబుల్ పడనడచును - అనియు నుండును.) అయ్యిరుదెగలు పగఱగారే - అనుచో, తెగలు - మహత్సమూహమును బోధించు నమహద్వాచకరూపము. (ఇరుదెగలవారు - మహద్రూపము) కారే - అనునది మహత్తులకు రావలసిన క్రియ (పక్షమున - అయ్యిరుదెగలు పగఱగావే - అని యుండును.) విభాషననుటచే నమహత్కార్యములొక పక్షమునఁ గావచ్చు ననుటకు - ఉదా: నిషాదగణము, విషమమును జేయున్. ఇట, చేయున్ - అని క్రియ యమహత్కార్యము నందియున్నది. (చేయుదురు-మహద్రూపము) విద్యాధరీకోటి నెత్తములాడున్. ఇట, ఆడున్-అని క్రియ యమహత్కార్యము నందియున్నది. (పక్షమున - ఆడుదురు.) సూత్రమున మహత్సమూహార్థక శబ్దంబని కలదు. కాని విద్యాధరీకోటియాడున్ - అనుచో మహతీసమూహార్థక శబ్ద మమహత్కార్యమునందినట్లుదాహరింపఁ బడుటచే మహతీ సమూహార్థక శబ్దము యొక్క క్రియమాత్రము మహత్కార్య యోగ్యముగ విభాషనగునని గ్రహింపనగును. (చూ. అను బంధము విషయసంఖ్య - 67)

## జడ పదంబులమీఁది తోడకు మెయి మైలు వికల్పంబుగ నగు. 18

ఉ: అందఱుఁ గూడి మోసలకు నర్థిమెయిం జనుదెంచి. నిర్వ 2 ఆ-5.చ. ముక్తి కున్ముఖత వహింపఁగా వలయు మోహముఁ బాయఁగఁ ద్రోచి భక్తిమైన్. లక్ష్మి 4 ఆ - 158 మొ॥

వ్యా. జడవాచకముల మీఁది తోడ ప్రత్యయమునకు మెయి, మై-అనునవి వికల్పముగ నగును. అర్థి+తోడ=అర్థి+మెయి. భక్తి+తోడ=భక్తి+మై.బా. తత్సమ.8చే-నుగాగమము: అర్థిమెయి+ను=అర్థిమెయిని. భక్తిమై+ను=భక్తిమైని. (బా. తత్సమ 26, 65) అర్థిమెయిని + చనుదెంచి = ద్రుతకార్యము: అర్థిమెయింజనుదెంచి. భక్తిమైని - బా. సంధి 20 చే-భక్తిమైన్.

## కువర్ణకంబు పరంబగునప్పుడు కవిత్రయంబు వారి ప్రయోగంబులం దక్కఁ దక్కిన మహాకవి ప్రయోగంబులందునుం గొన్నియెడల నగాగమంబు చూపట్టెడు. 19

ఉ: సీ. సంగరమునకు నుత్సవముకేగెదు క్రియ, సొలవక చనియెదు శూరులార! ఉ. హరి. 6ఆ-140. ఉ లాలనఁగ్రొత్త బెబ్బులి కళాసము వెట్టిరి యాసనంబుగా, గోలయు సాధువైన యొక కోమటికిన్ నిషధేంద్రు బచ్చుకున్. నై. 6 ఆ-115. ఆ. వెలఁది సోయగంబు వీక్షింప వినుతింప, వేయి కన్ను లమరవిభునకిచ్చి, రెండువేల జిహ్వ లండజాధీశ్వరు, కొసఁగఁ బోలుఁ బంకజోద్భవుండు. విక్ర. 4ఆ-16. ఉ. బలవంతపుఁ బాపము దెచ్చుకొంటి వే,లా నగుఁబాటుకోర్చి. భోజ 5 ఆ-95 మొ. (ఇట్టి ప్రయోగములం బట్టి యాగమ శాస్త్ర మనిత్యమగుట వలనఁ దక్కిన చోట్ల నకారాగమము రాకుండినను దోషంబు లేదనియు, కుత్సార్థ దోష

విస్ఫురణంబు కలుగక 'పు'వర్ణాంత శబ్దముల మీఁద నకారాగమము వచ్చుట కేతత్సూత్రారంభ ప్రవృత్తియై యుండును, గాన నచ్చోమాత్ర మయ్యది యత్యావశ్యకమనియుఁ దోఁచుచున్న యది.)

వ్యా. బాలవ్యాకరణమున "కువర్ణకంబు పరంబగునపు డుకారబుకారంబులకు నగాగమంబగు (తత్సమ 28) అని నగాగమము నిత్యముగ విధింపఁబడియున్నది. కవిత్రయేతర మహాకవి ప్రయోగములలోఁ గొన్నిచోట్ల నీ నగాగమము కనఁబడదని యీ ప్రౌఢవ్యాకరణ సూత్రము సవరించుచున్నది. ఉత్సవము+కు=ఉత్సవముకు. బచ్చు+కు=బచ్చుకు. అండజాధీశ్వరు+కు=అండజాధీశ్వరుకు. నగుబాటు+కు=నగుబాటుకు. ఉత్సవమునకు–ఇత్యాదులెట్లును గ్రాహ్యములేయగును. కుత్సార్థము స్ఫురించునుగావున, (కుత్స=జుగుప్స) పువర్ణాంతములకు నగాగమము తప్పక వచ్చుటకు బాలవ్యాకరణ సూత్రారంభ ప్రవృత్తియైయుండును. అనఁగా, బాలవ్యాకరణమున, నగాగమము నిత్యముగ విధించుట పువర్ణాంత శబ్దములకు నగాగమము తప్పక వచ్చునని చెప్పుటకన్నమాట. పువర్ణాంతశబ్దములకు నగాగమ మత్యావశ్యకమనియుఁ దక్కిన చోట్ల నాగమ శాస్త్ర మనిత్యమను పరిభాషచే (ఆగమశాస్త్రమనిత్యమ్–పరిభా 96) నీ నగాగమము నిత్యము కాదనియు నీ వివరణమునకుఁ దాత్పర్యము.

విమర్శ:- (i) కవిత్రయప్రయోగములనఁగా, భారతప్రయోగములు. (అనుబంధము. విషయసంఖ్య – 68) (ii) కుత్సార్థస్ఫూర్తి యశ్లీల దోషమగునుగాని, చ్యుతసంస్కారము కాదుగాన, పువర్ణాంతములకు నగాగమము నిత్యమనుటకు బాలవ్యాకరణ సూత్ర ముద్దిష్టమనుట సరికాదు. చింతామణి భారత ప్రయోగముల ననుసరించి, బాలవ్యాకరణమున నగాగమము నిత్యముగ విధింపఁబడెను. (పువర్ణాంతములకు నగాగమము రాకుండుటకు – చూ ము. కౌ తత్సమ 7) (iii) సంస్కృతసమములకు నగాగమమునిత్యమనుట లెస్స. ఉత్సవముకు, ఇత్యాదులనుసరణీయములుకావు.

## కంటె వర్ణకంబు పరంబగునపుడును గొన్ని యెడల నగాగమంబు చూపట్టెడి. 20

ఉ: త్రత్కతుశతంబునకంటె సుతుండు మేలు.భార,ఆది4ఆ–93.క.

మనయింటిచేటు చూచితె, మనుకుల సత్తముఁడు తొలఁగె మైథిలినిన్ భూ, జనవాదంబుమహాత్ముల, యనఘ చరిత్రమునకంటె నధికంబగుటన్. నిర్వ 9ఆ–52 మొ॥

వ్యా. "కువర్ణకంబుపరంబగునపు డుకారబుకారంబులకు నగాగమంబగు." (బా. తత్సమ 28) అని బాలవ్యాకరణమునఁ గలదు. కువర్ణకమేకాక కొన్నిచోట్ల 'కంటె' వర్ణముపరమగునపుడును, నగాగమము కనఁబడునని యిటఁబూరింపఁబడెను. క్రతుశతంబు+కంటె=క్రతుశతంబు+న+కంటె=క్రతుశతంబునకంటె. చరిత్రము+కంటె–చరిత్రము+న+కంటె=చరిత్రమునకంటె. క్రతుశతంబుకంటె, చరిత్రముకంటె – అనురూపము లెట్లును గలుగును. (చూ. మూలములు)

## ఉదంతములగు నమహాత్తుల కందువర్ణకము పరంబగు నపుడును నగాగమంబు కొన్నియెడలఁ గానంబడియెడి. 21

ఉ: చ. దేవ నీ, వనిమిష నాయకత్వమున యందభిషిక్తుఁడవై ముదంబుతో,

నను౯ బనిగొమ్ము. భార. ఆర 5ఆ-226. క, వినుపిండదాన సమయం, బునయందును భక్తి పూర్వముగ దీని౯ బఠిం,చిన నయ్యన్నంబమృతము, నెనయుఁదురగమేధఫలమునిచ్చుఁగృతాత్మా! హరి. పూ. భా 2ఆ-147. సీ. సంతరించితి నిండు జవ్వనంబునయందు, హర్షనైషధకావ్య మాంధ్రభాష. కాశీ 1ఆ-7 క. జననాథ నన్నునడుగఁగ౯, జనుదెంచిన కార్యమేను సర్వంబు మనం, బునయందు మున్న యెఱుఁగుదు, విను చెప్పెద నీకు౯ దగునె విడువఁగ భార్యన్. మార్క. 5ఆ-183 ఉ. డక్కఁగ వ్రాసితిన్ మును పటమ్మునయందు సుశర్మ పాపముల్. పాండు 5ఆ-80మొ॥

వ్యా. "కువర్ణకంబు పరంబగునపు డుకార బు కారంబులకు నగాగమంబగు" (బా. తత్సమ 28) అనుసూత్రముచే, కు వర్ణకము పరమగునపుడు నగాగమమగును. ఉదంతములగు నమహద్వాచకములకు, అందువర్ణకము పరమగునపుడును గొన్నిచోట్ల నగాగమము కనఁబడునని యిటఁ బూరింపఁబడెను. ఉదా॥ నాయకత్వము+అందు=నాయకత్వము+న+అందు. బా. సంధి 11 సూత్రముకడ "అంద్వవగాగమంబులు పరంబగునపుడు యథాసంభవంబుగా గ్రహించునది." అని చెప్పఁబడెను. ఇట, అందు పరమగుటచే యథాసంభవముగ సంధి లేదు. బా. సంధి 3చే- నాయకత్వమున- య్+అందు=నాయకత్వమునయందు- అగును. ఇట్లే, సమయంబు+అందును=సమయంబున+అందును: సమయంబునయందును. జవ్వనంబు+అందు= జవ్వనంబున+అందు =జవ్వనంబునయందు. మనంబు+అందు=మనం బున+అందు=మనంబునయందు. పటమ్ము+అందు=పటమ్మున+అందు = పటమ్మునయందు.

విమర్శ:- (i) ఈ సూత్రమును, భా. తత్సమ 28వ, సూత్రమునకుఁ బూరణముగ రచించుట భ్రాంతి మూలకము. "ఆగమ ముపువర్ణంబులకందు వర్ణకము పరంబగునపుడు, నుగాగమంబు విభాషనకు (బా. తత్సమ 30) అను సూత్రమునకుఁ బూరణముగా సూత్ర రచన చేసి యుండవలసినది. అనఁగా, ఆగమము వర్ణంబున కందు వర్ణకము పరంబగునపుడు, గొన్నియెడల నగాగమంబు గానంబడియెడి-" అని సూత్రించి యుండవలసినదన్నమాట. (ii) సమాసంబునయందు (బా. తత్సమ 24) అని సూరిగారే వాడిరి. (అనుబంధము. విషయసంఖ్య - 69)

**తెనుఁగునం గొన్ని తత్సమ దేశ్యశబ్దములకంటెం బరంబుగ**
**నేకవచనంబున నీచత్వ ద్యోతకంబయి యిగాయను**
**నొక్క శబ్దంబును, దానిపై డువర్ణకాదులనుం**
**జూపట్టెడి. సంబోధనంబున డువర్ణకంబు**
**చూపట్టదు. తుది దీర్ఘంబునకు హ్రస్వంబు**
**వైకల్పికంబు. 22**

ఉ: ప్ర. బాలిగాఁడు, చిట్టిగాఁడు. సం. ప్ర. బాలిగా, బాలిగ; చిట్టిగా, చిట్టిగ; బాలిగానిన్, బాలిగాని చేతన్ - అని తక్కిన విభక్తులూహ్యంబులు. ఇట్లు గోపాలిగాఁడు మొ॥

వ్యా. ఆంధ్రభాషయందుఁ గొన్ని తత్సమ శబ్దములకు దేశ్యశబ్దములకుఁ బరముగా నేకత్వమున నీచత్వమును బోధించునదై 'ఇగా' అను శబ్దము కనఁబడును. దీనిపై 'డు'

ప్రత్యయాదులగును. బాల+ఇగా.బా సంధి 11చే-బాలిగా.బా. తత్సమ 22చే-బాలిగా+డుఙ్. తత్సమ 19చే- బాలిగాఁడు. ఇట్లే చిట్టి+ఇగా=చిట్టిగా+డుఙ్:చిట్టిగాఁడు. గోపాల+ఇగా=గోపాలిగా+డుఙ్: గోపాలిగాఁడు. డువర్ణకాదులు-అనుచోటి యాదిశబ్దముచే నిగాగ మాదులును గలుగును. బాలిగా+ను.బా తత్సమ 24చే-బాలిగాని+ను. తత్సమ 26 చే-బాలిగానిని. బా. సంధి. 20 చే- బాలిగానిన్. బాలిగా+చేతను. తత్సమ 24చే-బాలిగానిచేతను ఇత్యాది. సంబోధనమున డుప్రత్యయము చూపట్టదు. అనఁగా లోపించునని భావము. (అదర్శనంలోపః-పాణి) ప్రత్యయముచేరనిదే పదత్వము సిద్ధింపదు గావున డుప్రత్యయము చేర్చి లోపముచెప్పవలెను. బాలిగా+డుఙ్=బాలిగా. చిట్టిగా+డుఙ్=చిట్టిగా. ఈ దీర్ఘమునకు హ్రస్వము వైకల్పికముగ నగును. హ్రస్వము కలిగిన-బాలిగ, చిట్టిగ అను రూపము లేర్పడును. పక్షమున-బాలిగా, చిట్టిగా, అను రూపములుండును. (ప్ర=ప్రథమావిభక్తి. సం. ప్ర=సంబోధన ప్రథమావిభక్తి-అని గ్రహింపవలెను. చిట్టి - దేశ్యశబ్దము (చూ. మూలములు)

విమర్శ:- (i) సూత్రమున, తత్సమ శబ్దమునకుఁ బరముగా ఇగా-అగుననుట సరికాదు. బాల, గోపాల-అనునవి సంస్కృతశబ్దములుగాని తత్సమశబ్దములుకావు. (ii) ఏకవచనమున-అనుట సరికాదు. ఏకత్వమున నని యనవలెను. ఏలయన, ఇగా-అనునది యేకవచన ప్రత్యయము కాదు. వచనమనునది ప్రత్యయమునే, తెలుపును. (చూ. బా. తత్సమ 11)

## ద్విత్వయుక్తలాంతంబుమీఁది లులలకును రుర లాదేశంబులగు. 23

ఉ: మ. అరరే యల్లియ రామరాజు పెదతిమ్మాధీశు బాహాభయం, కర కౌక్షేయక ధార బోరునఁ గడంకం ద్రెళ్లు వీరారి మ, ల్లురకున్ మట్టియగుం దదీయ బలధూళుల్ సంగడాలొ వియ, చ్చర కాంతా స్తనపాళి విన్ గరిడే నాశ్చర్యంబు చర్చింపఁగన్. రామా 1ఆ-59మొ॥

వ్యా. ద్విత్వయుక్త=ద్విత్వముతోఁ గూడిన, లాంతంబు మీఁది=లవర్ణాంతము మీఁది (ల+అంత=లాంతము) అనఁగా "ల్ల" వర్ణముమీఁది, లులలకును=లుప్రత్యయమునకును లడాగమమునకును, రురలు=రువర్ణమును రవర్ణమును, ఆదేశములగును. లుప్రత్యయమునకు రువర్ణమును, లడాగమమునకు రవర్ణమును నగునన్న మాట. బాల వ్యాకరణమున, "అదంతంబయి దీర్ఘపూర్వ లోపధంబయిన మహత్తుమీఁది విభక్తి లకారంబునకు రేఫంబగు" (తత్సమ 38) అని చెప్పఁబడెను. ఇట ద్విత్వయుక్త లాంతము మీఁదను లులలకు రురలగునని పూరింపఁబడెను. లుప్రత్యయమునకు, మల్లురు:- మల్ల+లు. ఈ సూత్రముచే లువర్ణమునకు రువర్ణము: మల్ల+రు. బా. తత్సమ 21చే-మల్లు+రు=మల్లురు. లడాగమమునకు, మల్లురకును:- బా. తత్సమ 6చే మల్ల+కు. తత్సమ 8చే-మల్ల+కు+ను. తత్సమ 31చే-మల్ల+లకును. ఈ 23చే- లడాగమమునకు రవర్ణము: మల్ల+రకును. తత్సమ 21చే-మల్లు+రకును=మల్లురకును.

విమర్శ:- ఇట లులలకు రురలు నిత్యముగ విధించుట సరికాదు. మల్లులు అనునది భారత సమ్మతమగు రూపము కాన నీ విధి వైకల్పిక మనవలెను. (చూ-ము. కౌ.తత్సమ 13. అనుబంధము విషయసంఖ్య - 70)

## విధా శబ్దంబు సంస్కృతంబునం బుంలింగంబునగు. 24

ఉః "విధో విధానే హస్త్యన్నే ప్రకారే వేత సేపిచ" అని పుంలింగంబునందు, 'అజయుడు'. దీనికిఁ దత్సమంబునం బుంలింగ రూపముతోనే ప్రయోగముగాని స్త్రీలింగ రూపముతో లేదు. దంష్ట్రా శబ్దంబును బుంలింగముగాను గానంబడియెడి.

వ్యా. విధాశబ్దము సంస్కృతమునఁ బుంలింగము సహితమగును. అనఁగాఁ విధా–అను స్త్రీలింగ శబ్దమే కాక, విధ–అను పుంలింగ శబ్దమును గలదన్నమాట. పుంలింగ మగు విధశబ్ద మజయనిఘంటువునఁ బేర్కొనఁబడెను. కాన విధమను తత్సమరూపము నీ పుంలింగము, అదంతము, నగు విధ శబ్దమునుండి సాధించు కొనవలెనని తెలుపఁబడెను. విధ–ప్రాతిపదికము. బా. తత్సమ 39చే–విధము. అని యేర్పడును. బాలవ్యాకరణమున 'విధా' అను స్త్రీలింగశబ్దము కంధరాదులలోఁ జేర్పఁబడియున్నది. "విధాశబ్దమునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు" అని చెప్పఁబడినది. (బా. తత్సమ 66) అనఁగా విధము–అను తత్సమరూపము, విధాశబ్దమునుండి సాధింపఁబడినది. అట్లు విధాశబ్దమునుండి విధము అనురూపమును సాధింప రాదనియు, విధశబ్దమునుండి, విధము–అను రూపమునుసాధింపవలెననియుఁ ప్రౌఢవ్యాకర్తయభిప్రాయము. ఈ పక్షమున, విధా అను స్త్రీలింగ శబ్దమునకుఁ దత్సమ రూపమునఁ బ్రవేశము లేదు. విధ–అను పుంలింగమునకే ప్రవేశము కలదు. దంష్ట్రా అను స్త్రీలింగశబ్దము "కంధరాదుల"లోఁజేర్చి దంష్ట్రము, దంష్ట్ర– అనురూపములు బాలవ్యాకరణమున సాధింపఁబడెను. దంష్ట్రాశబ్దముకూడఁ బుంలింగముగఁ గనఁబడునని యిట సూచితము. అనఁగా నీ పక్షమున, దంష్ట్రా–అను స్త్రీలింగము నుండి, దంష్ట్ర–అను రూపమును సాధింపవలెను. (బా. తత్సమ 54) దంష్ట్ర– అను అదంత పుంలింగమునుండి దంష్ట్రము–అనురూపమును సాధింపవలెను. (తత్సమ 39) కాఁగా, దంష్ట్రాశబ్దమునుగూడ "కంధరాదుల"లోఁజేర్పనక్కఱలేదనిభావము.

**విమర్శ:**– (i) కంధరా–మున్నగు స్త్రీలింగములనుండి, కంధరము–లోనగు రూపములను సాధింపకతీరదు. కావున, విధా, దంష్ట్రా–అను సుప్రసిద్ధ స్త్రీలింగములను "కంధరా"దులలోఁ జేర్చుటయే సముచితము. (ii) విధా–అను సుప్రసిద్ధశబ్దమునకుఁ దత్సమమునఁ బ్రవేశములేదనుటయు, నప్రసిద్ధమగు దంష్ట్ర శబ్దమునకుఁ బ్రవేశము కలిగించుటయు సంతృప్తికరములుకావు. కావున నిట బాలవ్యాకరణమార్గమే సమంజసమనఁదగును. (చూ. అనుబంధము. విషయసంఖ్య – 9)

## అర్ఘాదుల కడయచ్చున కుత్వంబును, మీఁద వువర్ణకంబును వైకల్పికంబుగా నగు. 25

ఉః అర్ఘువు, అర్ఘము; ధర్మువు, ధర్మము; వర్గువు, వర్గము.
చ. అవని యరాజకంబయినయప్పుడు భూప్రజలందు సర్వధ,ర్మువులు దొలంగు దేవమునిముఖ్యులు వాయుదురోలివృష్టిలే, దవు మఱి యర్ఘువుల్ దఱుగునందురు కావునఁగాలయాపనం, బవితథవాక్య! చేయక రయంబున రాజ్యము నిల్పుమిత్తఱిన్. భార. ఆది. 4అ–148. వర్గువునందలి వువర్ణకంబొండె లోపించు. ఉః వర్గు

వ్యా. అర్థ మున్నగుశబ్దముల తుదియచ్చున కుత్వమును, మీఁద వుప్రత్యయమును వైకల్పికముగా నగును. అర్థ ప్రాతిపదికము. ఈ సూత్రముచే, అత్వమునకుత్వము మీఁద వువర్ణకము నయినచో అర్థువు–అగును. వైకల్పికముకనుక, ఉత్వమును వువర్ణకమును గలుగని పక్షమున, అర్థ–బా. తత్సమ 39చే– అర్థము, అగును. ఇట్లే, ధర్మ=ధర్ముపు, ధర్మము. వర్గ=వర్గువు, వర్గము. వర్గువులోని వువర్ణకమునకు లోపమొక పక్షమున నగును. (ఒండె=పక్షాంతరమును దెలుపు శబ్దము). వర్గు. వేఱొకపక్షమున, వర్గువు– అని యుండును. ఈ సూత్రమున విధించిన వువర్ణకము వుగాగమమున కుపలక్షణము. ఉదా: ధర్ముపులు, అర్థువులు. ధర్మ+లు=ధర్ము+లు. వుగాగమము: ధర్ము+వు+లు:ధర్ముపులు. ఇట్లే అర్థు+లు=అర్థు+వు+లు: అర్థువులు. (చూ. అనుబంధము విషయసంఖ్య – 71)

## రాహూ బాహూ శబ్దముల కంతట వువర్ణక లోపంబు వైకల్పికంబు. 26

ఉ: రాహువు, రాహు; రాహువులు, రాహులు; బాహువు, బాహు; బాహువులు, బాహులు – ఇత్యాదులు. సీ. అపమేఘమై యున్నయంబరమున, విద్యుత్సహస్రముల్ విలసిల్లె మఱిరాహు, పర్వంబుగాకయు భానుఁగప్పె. భార. సభా 2ఆ–29. తే. అగ్గలించి నాయెదుర బాహప్పలించి, కడవఁజాలిన మల్లురఁగాననెందు. భార. విరా. 2ఆ–7. మొ॥

వ్యా. రాహుశబ్దమునకు, బాహుశబ్దమునకు, అంతటన్=అన్ని విభక్తుల యందును, వుప్రత్యయ లోపము వైకల్పికముగా నగును. రాహువు, (బా. తత్సమ 50) బాహువు (తత్సమ 48) ఇత్యాదులు బాలవ్యాకరణముచే సిద్ధించునుగాని, రాహు, బాహు–ఇత్యాదులు సిద్ధింపవు. కావున నిట వువర్ణకలోపము వికల్పముగ విధింపఁబడెను. రాహు–ప్రాతిపదికము. బా. తత్సమ 50చే–రాహువు. ఈ 26చే–వువర్ణకము లోపించిన – రాహు. పక్షమున–రాహువు. రాహు+లు బా. తత్సమ 50వ సూత్రమునందలి వువర్ణకము వుగాగమమున కుపలక్షణమగుటచే–రాహు+వు+లు–అని నిల్చును. ఈ 26 సూత్రమున "అంతటన్" అనుటచే వువర్ణక లోపము వుగాగమ లోపమున కుపలక్షణమగును. కావున వుగాగమము లోపించిన రాహులు–అగును. పక్షమున–రాహువులు. బాహు–ప్రాతిపదికము. బా. తత్సమ 48చే–బాహువు. ఈ 26చే–బాహు+వు+లు. ఈ 26 సూత్రమునందలి వువర్ణకలోపము వుగాగమలోపమున కుపలక్షణముగావున, వులోపము: బాహులు. రాహు భానుఁగప్పె, బాహు+అప్పలించి–అని ప్రయోగములు. (చూ. మూలములు.)

విమర్శ:- రాహువులు, బాహువులు, లోనగు వానిలోనిది వుగాగముగాని, వువర్ణకముకాదు. (బా. తత్సమ 49) కాన, అంతటవువర్ణక లోపంబు–అనుటసరికాదు. రాహు+వు+లు–ఇత్యాదులలో వువర్ణకలోపము వుగాగమలోపమునకుపలక్షణమనవలెను. బాహులు–మున్న గురూపములు బా. తత్సమ 49 చేతనే సిద్ధించును. కాఁగా, అంతట–అనునది. త్యాజ్యము.

## విశ్వకర్ముఁడనియు రూపంబు. 27

ఉ: సీ. విశ్వకర్మునికూఁతు విశదలావణ్యస,ముజ్జ్వలఁ జేకొని మూఱిఁబోయి: హరి ఉ. 4ఆ–45.

వ్యా. "విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు" అను బాలవ్యాకరణసూత్రముచే (తత్సమ 75) విశ్వకర్మ-అనురూపము మాత్రమే సిద్ధించుచుండఁగా, విశ్వకర్ముఁడు-అనియు రూపముగల దని యిట సూత్రింపఁబడెను. విశ్వకర్మునికూఁతు-అను ప్రయోగమునుబట్టి విశ్వకర్ముఁడు-అనురూపము గలదని భావము. బా. తత్సమ 23చే-డుమంతములకే నిగాగమము ప్రాప్తించును. విశ్వకర్ముఁడు-అనురూపము లేనిచో విశ్వకర్మశబ్దము డుమంతముకానేరదు. (బా తత్సమ 20) డుమంతము కానిచో, విశ్వకర్మునియొక్క+కూఁతు=విశ్వకర్మునికూఁతు-అని నిగాగమము కలుగుట కవకాశములేదు. కాన, విశ్వకర్ముఁడు-అను రూపము సహితము గలదని తాత్పర్యము.

విమర్శ:- ఈ ప్రౌఢవ్యాకరణాశయము సమంజసమే. బాలవ్యాకరణ సూత్రము నన్నయ ప్రయోగానుసారి. (ఆది 8-70; 71; 103)

## దేశ్యమునం దక్కడాదులు నిత్యైకవచనాంతములు. 28

ఉ: అక్కడ, ఇక్కడ, ఎక్కడ, అచ్చటు, ఇచ్చటు, ఎచ్చటు మొ॥ ఆది శబ్దముచేత- ఇరులు, కేలు- మొ॥ కొందఱు, "ఇరులు, కేలు" శబ్దములు బహువచనాంతములందురు. అట్లు కాదు. ఇరులున నొంటిఁబోఁ బరసతినెట్టుట, విజ్ఞా. ప్రా. 105 కలభాషిణివేనలి యొక కేలఁబట్టి వేఱొక్క కేల, నొఱఁగత్తి పెఱికి. కళా 3ఆ-119. సీ. ఉపధాన వినిమయం బొండొండ చూపుటఁ, బెఱకేలు లణఁకువఁ బ్రిదిలి బిగియ. కవిక 4ఆ-180.

వ్యా. దేశ్యమునందున్=త్రిలింగదేశ వ్యవహారసిద్ధమగు తత్సమతద్భవేతర భాషయందు. (బా. సంజ్ఞ21) అక్కడ- లోనగునవి నిత్యైకవచనాంతములు. అక్కడ ఇక్కడ- మొ॥ ఆదిశబ్దముచే, ఇరులు, కేలు మున్నగు శబ్దములు గ్రహింపవలెను. కొందఱు, "ఇరులు, కేలు" శబ్దములు బహువచనాంతములందురు. కాని యదిసరికాదు. ఇరులునన్-అను ప్రయోగమునుబట్టి, ఇరులు-నిత్యైక వచనాంతమగును. బా. తత్సమ 11చే- నవర్ణక మేకవచనముగనుక, ఇరులున-అను ప్రయోగ మిది యేకవచనాంతమనుటకు నిదర్శనమని భావము. కేలు-నిత్యైక వచనాంతమనుటకు- ఒక కేలన్, వేఱొక్క కేలన్, పెఱకేలులు- అని యుదాహరింపఁడెను. ఒక, వేఱొక్కఅనువిశేషణములను బట్టియు, కేలన్-అను నొపవిభక్తికరూపమునుబట్టియు, కేలు- ఏకవచనాంతమనుటకు ఒకకేలన్, వేఱొక్కకేలన్-అనునవి సాధకములుగా నున్నవి. (చూ. మూలములు)

విమర్శ:- (i) ఇరులు నిత్యైకవచనాంతమే. (అనుబంధము. విషయసంఖ్య - 21) (ii) పెఱకేలులు - అని ప్రయోగమును జూపుచు, కేలు-నిత్యైక వచనాంతమనుట పొరపాటు. కేలు-ఏకవచనాంత రూపమే కాని నిత్యైక వచనాంతము కాదు. కేలులు, కేళ్లు- దీని బహువచన రూపములు. (చూ. అనుబంధము. విషయసంఖ్య - 21)

## సస్యవాచక శబ్దములును. 29

ఉ: ఆరుగ, చోడి, వరి, కంది, పెసర, మినుము. మొ॥

వ్యా. సస్యవాచకశబ్దములును నిత్యైకవచనాంతములు. 28వ సూత్రమునం దలి నిత్యైకవచనాంతములు- అను పదము 33 సూత్రమువఱకు ననువర్తించును. ఆరుగ-ఆరుగచేను-ఇత్యాది. (చూ. మూలములు.)

## కతిపయ సంభారవాచక శబ్దములును. 30

ఉ: ఆముదము, ఇంగువ, ఉప్పు, చింతపండు, చమురు, పసుపు మొ॥

వ్యా. కొన్ని సంభారములను దెలుపు శబ్దములును నిత్యైక వచనాంతములు. ఆముదము–ఇత్యాదులు. (సంభారము=సామగ్రి, పదార్థ సంచయము–శ.ర.)

విమర్శ:- ఉప్పు నిత్యైకవచనాంతము కాదు. ఉప్పులు–అనియుఁ బ్రయోగముగలదు. (చూ. అనుబంధము విషయసంఖ్య – 72)

## లోహవాచక శబ్దములును. 31

ఉ: ఇత్తడి, ఇనుము, కంచు, బంగారు, వెండి మొ॥

వ్యా. లోహమును బోధించు శబ్దములును నిత్యైకవచనాంతము లగును. ఇత్తడి – ఇత్యాదులు.

## సమానార్థకములయిన యీడెనసరిసాటి లోనగు దేశ్యవిశేషణ శబ్దములును. 32

ఉ: క. స్వరములు నురములు శిరములుఁ, గరములుఁ బెందొడలు మెడలుఁ గన్నులు వెన్నుల్, సురుచిర పదములు రదములు, నిరువురకుంజూడ నొక్కయీడైయునికిన్. రా. కిష్కిం. 192. క. పతిఁబడసి సుతులఁబడయఁగ, నతివలుగోరుదురు కోరినట్టుల తనకున్, బతిఁబడసి సుతులఁ బడసెను, సతులీభార్గవికి భాగ్యసంపద నెనయే! భార. ఆది. 3ఆ–171 సురపతి యమవరుణధనే, శ్వర కమలాసనుల దివ్యసభలెల్ల నరే, శ్వర చూచితి నవి దీనికి, సరిగావత్యంతవిభవ సౌందర్యములన్.భార – సభా 1ఆ–59. ఉ. హేమధరాధరేంద్రమున కెంతయుఁ బెద్ద ధృతిన్ భుజంగమ, స్వామికిమేలుచేయి పటువాగ్విభవంబున బుద్ధిసంపదం, దామరచూలికిన్ సరి ప్రధానులు దక్కినవారు సాటియే, మామిడి వీరభద్రున కమాత్యశిఖామణి కిప్పసుంధరన్. నై 1ఆ–28 మొ॥ సరులులేని దృక్ఖంజన శాబకముల–అని యొకచోఁబ్రయోగము కానఁబడుచున్నది. అది శబ్దాలంకార తత్పరత్వమునఁ బ్రౌఢముగాఁ జెప్పఁ బడినదని గ్రహింపవలయును.

వ్యా. సమానమను నర్థముగల, ఈడు, ఎన, సరి, సాటి మున్నగు దేశ్యములగు విశేషణములును నిత్యైకవచనాంతములయి యుండును. స్వరములు – ఒక్క యీడై యునికిన్ – అనుచో, స్వరములు మున్నగు విశేష్యములు బహువచనాంతములైయున్నవి. ఈడు–అనువిశేషణ మేకవచనాంతమయియున్నది. ఇట్లే, సతులుఎనయే, అవిసరిగావు, తక్కినవారుసాటియే–అను ప్రయోగములలో సతులు, అవి, తక్కినవారు – అనునవి బహువచనాంతములయి యుండఁగా, ఎన, సరి, సాటి – అనునవి యేకవచనాంతములై యున్నవి. బా. కారక 19చే–వీనికి బహువచనము కలుగ వలసియున్నది. ఈడు, లోనగునవి స్త్రీసమములగుటచే, బా. కారక 20చే– వీని బహువచనమున కేకవచనము బహుళముగానగును. కాన నీప్రౌఢవ్యాకరణ సూత్రము బా. కారక 20 సూత్రమునందలి

బహుళగ్రహణమునకు వివరణ మననగును. సరులులేని ద్రుక్షంజన శాబకములు- అనుచో, సరులు-అను బహువచనరూపము కనఁబడును. ఇది శబ్దాలంకారప్రీతిచేఁ జేయఁబడిన ప్రౌఢప్రయోగమని గ్రహింపవలెను. ఇరులు కురులు - ఉరులు - మరులు - సరులు. (చూ. కారక 16) ప్రౌఢప్రయోగమనఁగా, నసాధువని ఫలితార్థము.

విమర్శ:- సరులు-అసాధువనుట శాస్త్రానుగుణమే. (చూ. అనుబంధము - ప్రయోగమూలం వ్యాకరణమ్.)

## గుణరసవాచకములయిన దేశ్య విశేషణ శబ్దములును. 33

ఉ: ఈ కాళ్లు తెలుపు, ఆ కాళ్లు నలుపు; ఈ పండ్లుతీపు. ఆ పండ్లుపులుపు. మొ॥

వ్యా. గుణవాచకములు, రసవాచకములు నగు దేశ్యవిశేషణశబ్దములును నిత్యైకవచనాంతములగును. ఈకాళ్లు తెలుపు, ఆ కాళ్లు నలుపు-అనుచోట్ల, కాళ్లు అనువిశేష్యము బహువచనాంతమైనను, తెలుపు, నలుపు-అను గుణవాచకము లేక వచనాంతముగనే యున్నవి. ఈ పండ్లుతీపు. ఆ పండ్లుపులుపు - అనుచోట్ల, పండ్లు-అనువిశేష్యము బహువచనాంతమైనను, తీపు, పులుపునను రసవాచకము లేకవచనాంతములైనవి. బా. కారక 19చే- కావలసిన బహువచనము కాలేదు. తెలుపు, నలుపు, తీపు, పులుపు - అనునవి స్త్రీసమములగుటచే, బా. కారక 20చే- వీనికేక వచనము బహుళముగా నగును. కావున నీప్రౌఢ 33 సూత్రము బా. కారక 20 సూత్రమునందలి బహుళగ్రహణమునకు వివరణప్రాయము.

విమర్శ:- (i) గుణవాచకములునల్లాదులుగాఁ బ్రసిద్ధము. (బా. సమాస 12) కాన, రసవాచకములు గుణవాచకశబ్దము చేతనే గతార్థములన నక్కఱలేదు. (ii) లక్ష్యనిర్దేశమును బట్టి విశేష్యమునకుఁ దరువాత వాడినప్పుడు గుణరసవాచకము లేకవచనాంతములన నగును. (చూ. అనుబంధము. విషయసంఖ్య - 73)

## కొన్ని యవ్యయంబులు బహువచనాంత తుల్యంబులు నగు. 34

ఉ: అట్టు, అట్లు; ఇట్టు, ఇట్లు; ఎట్టు, ఎట్లు; నిచ్చ, నిచ్చలు. మొ॥

వ్యా. కొన్ని యవ్యయములు బహువచనాంతములతో సమానములు సహితమగును. అట్టు= అట్లు - ఇత్యాది. అట్లు = అట్టు - అనియే యర్థము. ఇట లువర్ణకము బహుత్వబోధకము కాదు. అట్లులోనగునవి విభక్త్యంతములవలెఁ గన్పట్టినను వీనికి విభక్త్యర్థములేదు. కాన నివి విభక్తి ప్రతిరూప కావ్యయములు (చూ. మూలములు)

## అందఱాదులు నిత్య బహువచనాంతములు. 35

ఉ: అందఱు, ఇందఱు, ఎందఱు, కొందఱు, పెక్కండ్రు, పలుగుండ్రు

వ్యా. అందఱు మొదలగునవి నిత్య బహువచనాంతములు. బాలవ్యాకరణమున "అన్ని మొదలగు శబ్దములాఱును...మహదర్థంబులు బహువచనాంతంబులగు" అని చెప్పఁబడెను. (ఆచ్ఛిక 24 వివరణము) కాన నీ ప్రౌఢవ్యాకరణ సూత్రము ప్రసంగవశమున ననువదించినది మాత్రమే యని తెలియవలెను.

## అదరులు లోనగు శబ్దములును. 36

ఉ: అదరులు, అఱువుళ్లు, ఎండువులు, మిడుఁగుఱులు, మొ॥ ఇవి వృత్తియం దేకవచనాంతముల యగు. ఉ అదరుటగ్గి. మొ॥

వ్యా. అదరులు–మున్నగు శబ్దములు నిత్యబహువచనాంతములు. నిత్యబహువచనాంతములు–అనునది 35 సూత్రము నుండి 38 సూత్రము వఱకు ననువర్తించును. ఈ శబ్దములు సమాసమున నేకవచనాంతములేయగును. (వృత్తి=చూ. బా. సంధి 31, సమాస 1– ఘంటా.) ఉదా॥ అదరు + అగ్గి. బా. సంధి 28చే – అదరుట్ + అగ్గి: అదరుటగ్గి. ఇట వృత్తియందు అదరు – అని యేకవచనాంతమే పూర్వపదమై యున్నది.

విమర్శ:– వృత్తియం దేకవచనాంతములయగు – అనువాక్యమునకు, టుగాగమ పక్షమున నివి యేకవచనాంతములగునని యుదాహరణ స్వారస్యముచే గ్రహింపవలెను. ఏలయన, అదరులయగ్గి, విడుఁగులుల గుంపు – వంటి రూపములు లడాగమ పక్షమున నేర్పడవచ్చును.

## తఱచుగ ధాన్యవాచక శబ్దములును.37

ఉ: ఆళ్లు, చోళ్లు, వడ్లు, కందులు, పెసలు, మినుములు, మొ॥ తఱచుగ ననుటచే బియ్యము, జీలకఱ్ఱ–ఇవి ధాన్యవాచకములయ్యును నిత్యైకవచనాంతములే యని గ్రహింపవలయును.

వ్యా. ధాన్యవాచక శబ్దములు తఱచుగా నిత్యబహువచనాంతములగును. ఆళ్లు–మొ॥ తఱచుగ– అనుటచే– బియ్యము, జీలకఱ్ఱ, యనునవి ధాన్యవాచకములయి నను నిత్యబహువచనాంతములు కావు. ఇవి నిత్యైకవచనాంతములే. (చూ. మూలములు)

విమర్శ:– బియ్యము, జీలకఱ్ఱ–అనునవి ధాన్యవాచకములనుట సరికాదు. 30 సూత్రమునకు లక్ష్యములనుట లెస్స. బియ్యము = పొట్టుతీసిన ధాన్యము.

## క్రీడా విశేష వాచక శబ్దములును. 38

ఉ: అచ్చనగాయలు, ఓమనగుంటలు, కనుమూసిగంతలు, గుజ్జెనగూళ్లు, బొమ్మపెండ్లిండ్లు, ఉప్పనఁబట్టెలు, కుప్పిగంతులు, గొబ్బిళ్లు, దాఁగిలిమ్రుచ్చులు, పుట్టచెండ్లు, బిల్లగోళ్లు, సరిబేసులు, మొ॥ ఒకానొక కవి యిందుఁ గొన్నిటి నేకవచనాంతములుగాఁ బఠించియున్నాడు. అది విచార్యము.

వ్యా. క్రీడా విశేషవాచక శబ్దములును నిత్య బహువచనాంతములగును. అచ్చనగాయలు–మొ. ఇవి యాటలలోని రకములు. ఒకానొక కవి యిందుఁగొన్ని క్రీడావిశేషవాచకముల నేకవచనాంతములుగా వాడెను. అది విచార్యము. అనఁగా నసాధువనుట. (చూ. అనుబంధము. విషయసంఖ్య–74.)

విమర్శ:– క్రీడావిశేషవాచకము లన్నియు బహువచనాంతములు కానక్కఱలేదు గానఁగొన్ని క్రీడావిశేషవాచకములు బహువచనాంతములగుననవలెను. (పెండ్లిండ్లు–అపపాఠము. పెండిండ్లు–సాధువు)

## తఱచుగా స్త్రీసమంబులగు దేశ్యశబ్దములకుఁ గడపలఁ గొన్నంటి కేకవచనంబునం బూజ్యతయందు గారు శబ్దంబగు.39

ఉ: అయ్యగారు, అమ్మగారు, తల్లిగారు, తండ్రిగారు, రాజుగారు, రాణిగారు, సెట్టిగారు, నాయఁడుగారు, దేవిగారు, మొ॥ చ. మామగా,

రనుటయ కాని మా దశరథావని భర్తకు మీకు భేదమే. ఉ. రా. ఆ–252 మొ॥ (నాయఁడుగారు, దేవిగారు, వీనికిఁ దఱచు శబ్దంబు శరణంబు.)

వ్యా. తఱచుగాఁ గొన్ని స్త్రీసమములగు దేశ్యపదముల చివర, ఏకవచనంబునన్ = ఏకవచనమునందు, అనఁగా, ఆస్త్రీసమములగు దేశ్యశబ్దము లేకవచనాంతములై యున్నప్పుడు, వాని చివరఁ బూజ్యతయందు, గారుశబ్దమగును. అయ్య + గారు = అయ్యగారు–ఇత్యాది. ఏకవచనంబునన్ – అనుటచే అయ్యలు–మున్నగు బహువచనాంతములపై "గారు" శబ్దము చేరదని తాత్పర్యము.(చూ. మూలములు) నాయఁడు–పుంలింగతుల్యము. దేవి–సంస్కృతసమము. (అనుబంధము. విషయసంఖ్య –75)

విమర్శ:- (i) ఉదాహృత శబ్దములలో – అయ్య, అమ్మ, రాజు, రాణి, సెట్టి మామశబ్దములు దేశ్యములుకావు; వైకృతములు. కావున దేశ్యశబ్దంబులకు – అని సూత్రించుట సరిగాదు. స్త్రీసమంబులకు–అన్నచోఁజాలును.

## ద్వితీయాదులందు రురి యగు. 40

**ఉ:** ద్వితీయాది విభక్తులయందు గారు శబ్దమునందలి రువర్ణము రివర్ణంబగునని యర్థము. అయ్యగారిన్, అయ్యగారితోన్, అయ్యగారికిన్ మొ॥

వ్యా. ద్వితీయాదులందున్ = ద్వితీయాది విభక్తుల కవ్యవహితముగఁ (= ఎడము లేకుండ) బూర్వమందుండు, "రు"= గారుశబ్దమునందలి రువర్ణము, "రి"= రివర్ణము, అగునని యర్థము. 39 చే – అయ్య+గారు = అయ్యగారు. బా. తత్సమ 2 చే–అయ్యగారు+ను. ఈ 40 చే– రువర్ణమునకు రివర్ణము. అయ్యగారి+ను. బా.తత్సమ 26 చే–అయ్యగారిని. బాల సంధి 20 చే– అయ్యగారిన్. అయ్యగారు+తోను = అయ్యగారితోను = అయ్యగారితోన్. అయ్యగారు+కును= అయ్యగారికిని: అయ్యగారికిన్. (అనుబంధము. విషయసంఖ్య–76)

## డుమంతంబులగు తత్సమాది శబ్దంబులకుం గొన్నింటికి ద్వితీయా బహువచనంబు మీఁదం బూజ్యత యందు గారునకు మాఱుగ వారగు.41

**ఉ:** శ్రీరాములవారు, వసిష్ఠులవారు, వ్యాసులవారు, స్వాములవారు, రాయలవారు మొ॥ శ్రీరాములవారిన్, శ్రీరాములవారితోన్. ఇత్యాదు లూహ్యంబులు.

వ్యా. డుమంతములైన కొన్ని తత్సమాది శబ్దములకు ద్వితీయా బహువచనము మీఁదఁ బూజ్యతయందు గారుశబ్దమునకు మాఱుగా, వారు శబ్దమగును. శ్రీరాములను+వారు. బా. సంధి 18 సూత్రమునందలి విభాషచే నిట ద్రుతలోపము నిత్యమని వ్యవస్థ కల్పింపవలెను. ద్రుతములోపించి = శ్రీరాముల+వారు = శ్రీరాములవారు–అగును. ఇట్లే, వసిష్ఠులను+వారు = వసిష్ఠులవారు, వ్యాసులను+వారు = వ్యాసులవారు, స్వాములను+వారు = స్వాములవారు. తత్సమాది – అనుచోటి ఆది శబ్దముచే, సంస్కృతసమముకాని, రాయశబ్దమున కీవిధి వర్తించును. ఉదా. రాయలను+వారు=రాయలవారు. "గారునకుమాఱుగ" అనుటచే గారుశబ్ద రువర్ణమున కగు 'రి'వర్ణము 40 చే–వారు శబ్ద రువర్ణమునకును నగును. శ్రీరాములవారు + ను = శ్రీరాముల వారిన్. శ్రీరాములవారు+తోను=శ్రీరాములవారితోన్–ఇత్యాది.

విమర్శ:- (i) డుమంతంబులగు తత్సమాది శబ్దంబులకున్-అనుట సరికాదు. తత్సమాదిశబ్దములు పదములగును గాని ప్రాతిపదికములుకావు. కాన నివి డుమంతములనిపించుకొనవు. (చూ. బా. తత్సమ 20) (ii) స్వామిశబ్దము డుమంతముకాదు. (iii) శ్రీరాములను ఇత్యాదులు ద్వితీయా బహువచనములనఁ బడెనుగాని వీనికి ద్వితీయార్థము కనఁబడదు. కనుక ద్వితీయా బహువచనంబు మీఁద- అనుటయు సరికాదు. పూజ్యతాతిశయంబున, ఉవర్ణకంబుమీఁది గారునకు వారగు, నగుచోనుత్వంబునకత్వంబగు-అని సూత్రింపఁదగును.

## అర్థవిశేషంబునం దేకత్వంబునను గొన్ని శబ్దముల మీఁద వారు చూపట్టెడు. 42.

ఉ: అయ్యవారు, (ఉపాధ్యాయుడు, పూజ్యుఁడగు బ్రాహ్మణుఁడు, అట్టివేలుపు) అమ్మవారు (స్త్రీ దేవత, పూజ్యయగు బ్రాహ్మణస్త్రీ) ఎ. గీ. చిత్రమిది యయ్యవారి సంసేవవేళ, నమ్మవా రుగ్గ డించిరో యనుచు నడిగె. కళా 5 ఆ-46. దేవరవారు. (పూజ్యులగు మీరు)

వ్యా. పూజ్యతయందే కాక మఱికొన్ని యర్థవిశేషములందు, ఏకత్వంబునను=41 చే-విధించినట్లు బహువచనముమీఁదనే కాక యేకవచనమునందును, గొన్ని శబ్దములమీఁద వారు-శబ్దము కనఁబడును. అయ్యవారు = ఉపాధ్యాయుఁడు, పూజ్యుఁడగు బ్రాహ్మణుఁడు, అట్టి వేలుపు-అనఁగాఁ బూజ్యుఁడగు వేలుపు-అని యర్థములు. ఇట్లే అమ్మవారు దేవరవారు అనుచో నర్థవిశేషములు చూపఁబడెను. కళాపూర్ణోదయ ప్రయోగమునందలి, అయ్యవారు=పూజ్యుఁడగు వేలుపు-బ్రహ్మ; అమ్మవారు=స్త్రీదేవత-సరస్వతి (చూ. అనుబంధము, విషయ సంఖ్య-77)

## పూజ్యతయం దొక్కచో నామ తదేతద్యుష్మదస్మచ్ఛబ్దంబుల యేక వచనంబునకు బహువచనంబగు. అగుచో సంబోధ్యవాచకంబు బహువచనాంతంబు కాదు. 43

ఉ: మద్గురువుల...నడిగిన వారలు నన్ను నీవంశమిఁకను క్షత్రవంశంబుగాఁ గలదనిరి. కళా 5ఆ-188. క. వీరెవ్వరయ్య ద్రుపద మహారాజులె. (ఇక్కడ నిందయందుఁ బూజ్యత) భార. ఆది 9ఆ-89. క. మీరలు వీరల విద్యా, పారము చనుటెఱుఁగవలయు, భార. ఆది. 6ఆ-3. శా. మాచిత్తంబున వేడ్కయుండు నది నీమాధుర్యధుర్యోరు వాగ్వైచిత్రిన్ సఫలంబు సేయుము. కళా 1ఆ-13, సంబోధ్యవాచకంబు బహువచనంబుగామికి: క. ఆతఁడు, మీకుం బ్రియ శిష్యుఁడఁట యమిథ్యావచనా! భార. ఆది 5ఆ. 240. మహితాత్మ మీరలిమ్మహినుండ. కళా 1ఆ-86 ఒక్కచో ననుటచే- ఆచార్యుఁడు ద్రోణునకున్ శిష్యుఁడ, భార. ఆది. 5 ఆ-237. మొ॥

వ్యా. పూజ్యతయందు, నామ+తద్+ఏతద్+యుష్మద్+అస్మద్+శబ్దంబుల=నామశబ్దముయొక్కయు, ఆ, ఈ, నీ, నా, శబ్దములయొక్కయు, నేకవచనమున కొక్కచో బహువచనమగును. అగుచో సంబోధ్యవాచకము బహువచనాంతము కాదు. ఏకవచనాంతమే యగును. నామశబ్దమునకు: గురువులనడిగిన-అనుచో, గురువు- నామశబ్దము.

పూజ్యతయందు గురుశబ్దము గురువులన్-అని బహువచనమయినది. తచ్ఛబ్దమునకు:- వారలు నన్ను నీవంశమిఁకను. ఇటఁబూజ్యత యందు, తచ్ఛబ్దమునకు (ఆ-శబ్దము) వారలు-అని బహువచనమయినది. (వాఁడు-ఏక వచనము) ఏతచ్ఛబ్దమునకు:- వీరెవ్వ రయ్య ద్రుపదమ,హోరాజులె? ఇటనిందయందుఁ బూజ్యత వివక్షింపఁగా, ఏతచ్ఛబ్దమునకు (ఈ-శబ్దము) వీరు-అని బహువచనమైనది. (వీఁడు-ఏ) యుష్మచ్ఛబ్దమునకు:- మీరలు వీరల విద్యాపారము. ఇటఁ బూజ్యత యందు యుష్మచ్ఛబ్దమునకు (నీ-శబ్దము) మీరలు-అని బహువచనమైనది. అస్మచ్ఛబ్దమునకు:- మాచిత్తంబున. ఇటఁ బూజ్యతయందు నస్మచ్ఛబ్దమునకు (నా-శబ్దము) మా-అని బహువచనమయినది. నామశబ్దమును, "ఆ, ఈ, నీ, నా" శబ్దములును, బహువచనములయినను సంబోధ్యవాచకము బహువచనాంతము కాదు. ఉదా॥ మీకుం, బ్రియశిష్యుఁడఁట యమిథ్యావచనా. ఇట, మీకు-అని యుష్మదర్థకమునకు బహువచనము కలిగినది. కాని సంబోధ్యవాచకము, అమిథ్యావచనా (=అమిథ్యావచనుఁడా) అని యేకవచనాంతముగానే యున్నది; బహువచనాంతము కాలేదు. (అమిథ్యావచనులారా-బహు.) మహితాత్మ! మీర లిమ్మహిమండ-అనుచో, మీరలు-అని యుష్మదర్థకమునకు బహువచనము కలిగినది. కాని, సంబోధ్యవాచకము, మహితాత్మ (=మహితాత్ముఁడా)-అని యేకవచనాంతముగానే యున్నది. బహువచనాంతము కాలేదు. (మహితాత్ములారా-బహు) సూత్రమున, ఒక్కచో= అనుటచేఁ బూజ్యతయందు బహువచనము నిత్యము కాదు. కొన్నిచోట్లఁ బూజ్యతయం దేకవచనములును బ్రయుక్తములగును. ఉదా॥ ఆచార్యుఁడు ద్రోణునకున్ శిష్యుఁడ. ఇటఁ బూజ్యతయందు, ఆచార్యుఁడు, ద్రోణునకున్-అని యేకవచనాంతములే వాడఁబడినవి. ఆచార్యులు, ద్రోణులకున్-అని బహువచనాంతములు కాలేదు. (చూ. మూలములు)

## సంబోధ్యవాచకంబు బహువచనాంతంబయ్యుఁ గ్రియలమీఁది యమ్మాదు లేకవచనాంతంబుల యగు. 44

ఉ: ఆ. మన యశోద చిన్ని మగవానిఁగనెనఁట, చూచి వత్తమమ్మ సుదతులార! భాగ. 10 స్కం. పూ. 184 మొ॥

వ్యా. సంబోధ్యవాచకము బహువచనాంతమయినను గ్రియాపదములమీఁది, అమ్మ-మున్నగు శబ్దము లేకవచనాంతములే యగును. సుదతులార-అను సంబోధ్యవాచకము బహువచనాంతమై యున్నది. ఐనను, వత్తము- అను క్రియాపదముమీఁది అమ్మ శబ్ద మేకవచనాంతమైయున్నది. అమ్మలార-అని బహువచనాంతము కాలేదన్నమాట.

## పూజ్యతాతిశయంబున యుష్మదర్థ బహువచనంబునకు మాఱుగా నాత్మార్థ బహువచనంబు ప్రయుక్తంబగు. 45

ఉ: స్వామీ! తాము దయచేయవలెను. మొ॥

వ్యా. పూజ్యతయొక్క యతిశయమునందు (ఎక్కువ పూజ్యత వివక్షించునపుడనుట) యుష్మదర్థముయొక్క (నీ-శబ్దము) బహువచనమునకు బదులుగా, నాత్మార్థముయొక్క (తా-శబ్దము) బహువచనము వాడఁబడును. మీరు, మీరలు-యుష్మదర్థ బహువచనములు. తాము, తారు తమరు - ఆత్మార్థ బహువచనములు. కావునఁ బూజ్యతాతిశయమున, మీరు, మీరలు- అనువానికి బదులుగా, తాము, తారు, తమరు - అనునవి వాడఁబడునని తాత్పర్యము, ఉదా॥ స్వామీ, తాము దయ చేయవలెను. ఇట, మీరు, మీరలు - అని కాక, తాము - అని వాడఁబడెను.

## సంబంధంబున యుష్మదస్మచ్ఛబ్దంబులకుం గొన్ని యెడల బహుత్వంబగు. 46

ఉ: మీయిల్లు, మాయిల్లు, మొ॥ మాయత్త పృథ్వీసమాన పృథాదేవి. భార. అర. 5ఆ-306.

వ్యా. సంబంధమున, యుష్మచ్ఛబ్దమునకు (నీ-శబ్దము), అస్మచ్ఛబ్దమునకుఁ (నా-శబ్దము) గొన్నిచోట్ల బహువచనమగును, మీయిల్లు, (మీయొక్క యిల్లు) అనుచో, సంబంధమున నీ - అను యుష్మదర్థకమునకు, మీ-అని బహువచనమయినది. మాయిల్లు, (మాయొక్క యిల్లు) మాయత్త (మాయొక్క యత్త) అనుచోట్ల, నా-అను నస్మదర్థకమునకు మా-అని బహువచన మయినది. కొన్నియెడల ననుటచే సంబంధమున నేక వచనములును గొన్నిచోట్ల సందర్భానుగుణముగఁ గావచ్చును. (అనుబంధము, విషయ సంఖ్య-78)

## కిమేకార్థక శబ్దంబులు క్రమంబున నజ్ఞాత వస్తూద్దేశ్య ప్రశ్నము నందును, నిర్దిష్ట స్త్రీపురుషాన్యతర ప్రశ్నమునందును; నిర్దిష్ట స్త్రీపురుషాన్యతర గ్రహణమునందును, అని ర్దిష్ట స్త్రీపురుషోద్దేశ్య వ్యాహారమునందును దఱచుగ బహువచనాంతంబు లగు. 47

ఉ: ఎవరక్కడ? సీతారాములిద్దఱిలో నెవరు మిక్కిలి కరుణగలవారు? ఈ స్త్రీపురుషులిద్దఱిలో దీని నొకరి కిమ్ము. ఒకరు పోయిన త్రోవ నొకరు పోరు. వారొక్కరే వచ్చిరి. ఇత్యాదులు గ్రాహ్యములు. తఱచుగ ననుటచే - సీతారాములిద్దఱిలో సీత మిక్కిలి కరుణగలదా? రాముఁడు మిక్కిలి కరుణగలవాఁడా? ఇత్యాది రూపముగా వాక్యమును వ్యాసము చేసియుఁ జెప్పనగునని తెలియవలయును. [నీవెవ్వరిత్యాది విశేషప్రయోగంబులుం గలవు. క.నీవెవ్వ రేమిపనికై, యేవలనికిఁ బోవుచునికి యిది? భార. విరా. 1ఆ-297. నీవు మునిసత్తమ యెవ్వఁడ వెట్టు లేను నీ, తనయుఁడనైతి మజ్జనని తానది యెవ్వరు? మార్క 5ఆ-253. ఉ. వారలఁజూచి పల్కు రఘువర్యుఁడు మీకిట జాతకర్మ సం,స్కారము లెవ్వ రుక్తవిధిఁ జల్పిరొగిన్ ధనురాది శాస్త్ర వి,ద్యారతులైతిరెవ్వరి కతంబున నేగతి యుద్ధచాతురిన్, నేరుచుకొంటి రెవ్వరవనిం దలిదండ్రుల పేరు నావుడున్. జై6ఆ-222. ఆ బ్రహ్మచారింజూచి మాయయ్య నీపేరెవ్వరనియడిగి. పర. 3ఆ-264. నీవెవ్వరు?... నామము మేఘవర్ణుఁడన్. జై.2ఆ-26. కొన్నియెడల నెవ్వరది పూర్వకంబయి కానంబడియెడి. సీ. అది యెవ్వరని ప్రతీహారులెవ్వరి నన్నఁ, దన్నుఁ గాఁదలఁచి చిత్తమున నులుకు. నై 3ఆ-14. అదియెవ్వరే పిలిచెదరు నన్నదియేమొ, యరసివచ్చెదనంచు సురిగె నొకతె. కళా 7ఆ-148 మొ॥]

వ్యా. కిమ్+ఏకార్థక, శబ్దంబులు=కిమర్థక శబ్దము, (=ఏ-శబ్దము) ఏకార్థక శబ్దము, (ఒక-శబ్దము) క్రమంబుననే=వరుసగా, అనఁగా, (1)కిమర్థకము (i) అజ్ఞాత వస్తు+ఉద్దేశ్య, ప్రశ్నమునందును= తెలియని వస్తువునుగూర్చి యుద్దేశింపఁదగిన ప్రశ్న యందును. (ii) నిర్దిష్ట స్త్రీపురుష+ అన్యతర, ప్రశ్నమునందును=నిర్దేశింపఁబడిన స్త్రీ పురుషవ్యక్తులలో నొక్కరియొక్క (అన్యతరము= రెండింటిలో నొకటి) ప్రశ్నయందును; (2) ఏకార్థకము-(i) నిర్దిష్టస్త్రీ పురుష+అన్యతర, గ్రహణమునందును=నిర్దేశింపఁబడిన, స్త్రీపురుష వ్యక్తులలో నొక్కరియొక్క, గ్రహించుటయందును, అనఁగా స్త్రీపురుష వ్యక్తులను నిర్దేశించి వారిలోనొకరిని గ్రహించుట యందును, (ii) అనిర్దిష్ట స్త్రీపురుష+ఉద్దేశ్య, వ్యాహారము నందును=నిర్దేశింపఁబడని, స్త్రీపురుషులనుగూర్చి యుద్దేశింపఁదగిన మాటయందును, అనఁగా, స్త్రీయని కాని పురుషుఁడని కాని యుద్దేశింపక సామాన్యరీతిని బలుకునపుడును; దఱచుగ బహువచనాంతములగునని యర్థము.

కాఁగా, (1) కిమర్థకము (=ఏశబ్దము) రెండుచోట్ల బహువచనాంత మగును. (i) తెలియని వస్తువు నుద్దేశించి చేయు ప్రశ్నమున బహువచనాంతమగును. ఉదా. ఎవరెక్కడ? అనుచో నక్కడ నెవరున్నారో తెలియదు. కనుక నా తెలియనివ్యక్తి నుద్దేశించి చేయుప్రశ్నమున, ఎవరు-అని కిమర్థకము బహువచనాంత మయినది. (ii) స్త్రీపురుషవ్యక్తులను నిర్దేశించి వారిలో నొకరిని గూర్చి చేయుప్రశ్నమునఁ గిమర్థకము బహువచనాంత మగును. ఉదా. సీతారాము లిద్దఱిలో నెవరు మిక్కిలి కరుణగలవారు? ఈ వాక్యమున సీతారాములను స్త్రీపురుష వ్యక్తులను (సీత-స్త్రీవ్యక్తి - రాముఁడు-పుంవ్యక్తి) నిర్దేశించి వారిలో నొకరిని గూర్చి చేయు ప్రశ్నకనుక, కిమర్థకము, ఎవరు- అని బహువచనాంతమయినది. (2) ఏకార్థకము (ఒక శబ్దము) కూడ రెండుచోట్ల బహువచనాంతమగును. (i) స్త్రీపురుష వ్యక్తులను నిర్దేశించి వారిలో నొకరిని గ్రహించునపుడు బహువచనాంతమగును. ఉదా. ఈ స్త్రీపురుషులిద్దఱిలో దీనినొకరికిమ్ము. ఇట స్త్రీపురుషులనిద్దఱను నిర్దేశించి వారిలో నొకవ్యక్తిని గ్రహించుటచే నేకార్థకము, ఒకరికి-అని బహువచనాంతమయ్యెను. (ii) స్త్రీయని గాని పురుషుఁడని గాని యుద్దేశింపక సామాన్యరీతిని బలుకునప్పుడు బహువచనాంత మగును. ఉదా. ఒకరు పోయిన త్రోవ నొకరు పోరు. ఇట స్త్రీయనిగాని పురుషుఁడనిగాని నిర్దేశింపక పోవుటచే నేకార్థకము, ఒకరు అని బహువచనాంత మయినది. అనఁగా, ఒకఁడని గాని, యొకతెయని గాని కాలేదన్నమాట. వారొక్కరే వచ్చిరి- అనుచో వచ్చిన వ్యక్తి స్త్రీయనిగాని పురుషుఁడని గాని నిర్దేశింపక పోవుటచే నేకార్థకము, ఒక్కరే-అని బహువచనాంతమయినది.

తఱచుగ-అనుటచే నిట్లు బహువచన మగుటతో నిమిత్తములేకుండఁగొన్ని చోట్ల వాక్యము నిట్లు వ్యాసముచేసి, అనఁగా విస్తరించి చెప్పనగును. ఉదా. సీతారాములిద్దఱిలో సీత మిక్కిలి కరుణగలదా? రాముడు మిక్కిలి కరుణగలవాడా? ఇట, కిమర్థముతో నిమిత్తములేకుండ వాక్యము విస్తరింపఁబడినది. సీతారాము లిద్దఱిలో నెవరు మిక్కిలి కరుణగలవారు? అను సంగ్రహవాక్యమే యిట్లు వ్యాసము చేసి చెప్పఁబడెనన్నమాట.

నీవెవ్వరు? మున్నగు విశేషప్రయోగములును గలవు. అనఁగా జ్ఞాతవస్తూద్దేశ్య ప్రశ్నమునందును (తెలిసిన వస్తువునుగూర్చి చేయు ప్రశ్నము) బహుత్వము వచ్చిన ప్రయోగవిశేషములు గలవని భావము. నీవెవ్వరేమిపనికై, యేవలనికిఁ బోవుచునికి యిది- అను విరాటపర్వ ప్రయోగమున, నీవెవ్వరు? అన్నది యెదుటి స్త్రీవ్యక్తి నుద్దేశించి చేసిన ప్రశ్నయగుటచే, నిది జ్ఞాతవస్తూద్దేశ్యప్రశ్నమే. ఐనను, నీవెవ్వతెవు? అని యడుగక,

నీవెవ్వరు–అని కిమర్థక బహువచనముతోనే ప్రశ్నించుట విశేషము. మజ్జనని తానది యెవ్వరు–అనుచో, జననియనుటచే నిర్దిష్ట వస్తువజ్ఞాతము కాదు. స్త్రీయనుట జ్ఞాతమే. (=తెలిసినదే) ఐనను, ఎవ్వతె–అని కాక, ఎవ్వరు–అనియే ప్రయుక్తము. ఎవ్వరవనిం దలిదండ్రుల పేరు? నీపేరెవ్వరు? అనుచోట్ల పేరు–అను విశేష్య మమహదేకవచనమయినను కిమర్థకము, ఎవ్వరు? అని మహద్బహువచనాంతమగుట విశేషము. నీవెవ్వరు?... నామము మేఘవర్ణుఁడన్–అను ప్రయోగమున నీవెవ్వరను ప్రశ్న యెదుటి పురుషవ్యక్తి నుద్దేశించి యడిగినదే కనుక వస్తువు జ్ఞాతమే. అయినను, నీవెవ్వఁడవు–అనికాక కిమర్థకము, ఎవ్వరు–అని బహువచనాంతమయినది. కొన్నిచోట్ల ఎవ్వరు–అనునది. "అది" శబ్ద పూర్వకముగఁ గనబడును. అనఁగా, ఎవ్వరు–అనుదానికి ముందు అది శబ్దము కనఁబడునన్నమాట. అది యెవ్వరు? అదియెవ్వరే–అనునవి యుదాహరణములు. (అనుబంధము. విషయసంఖ్య–79).

## దేశ్యంబునం గొన్నియెడల మహన్మహత్యర్థక బహువచనాంత నామంబులపై మరల బహువచన ప్రత్యయంబులు చూపట్టెడు. అచ్చో, వారు వీరు మీరు శబ్దంబుల యంత్యోకారంబున కకారంబగు. 48

ఉ: వేడుక కాండ్రురు, కోడండ్రురు, వెలయాండ్రురు పెక్కండ్రురు, చూపఱులు, ఒకరులు, మొ॥ వారలు, వీరలు, మీరలు. క. ఆడెడు వారలకిచ్చును, బాడెడువారలకు నిచ్చు బట్లకు నిచ్చున్, బాడబవరులకు నిచ్చును, వేడుక కాండ్రురకు నిచ్చు వివిధార్థంబుల్, విక్ర 2 ఆ–164 క. సుందరి నాకోడండ్రుర, యందభ్యర్థితవు నీవ. భార. సభా. 2 ఆ–257 సీ. వెలయాండ్రురను గొండియలఁ బరిచారికా, శ్రేణుల నొండొండ చెఱలువట్టు. హరి. ఉ. 6 ఆ–138. క. పెక్కు దెఱంగులఁ బాడికిఁ, బెక్కండ్రురతోడ నొకఁడు పెనఁగఁగఁ గార్యం, బొక్కటియగు నేనియుఁ దాఁ, బెక్కండ్రురతోడనైనఁ బెనఁగఁగ జెల్లున్. విజ్ఞా, వ్య. 60 ఎ. గీ. చూపఱులచూడ్కి కొక వింత సొబగొనర్చె. కళా 7 ఆ–78 మొ॥

వ్యా. దేశ్యపదములలోఁ గొన్నిచోట్ల, మహదర్థకములు, మహత్యర్థకములు (మహతీ+అర్థక)నగు బహువచనాంత ప్రాతిపదికములపై మరల బహువచనములు కనఁబడును. అట్టిచోట్ల, వారు, వీరు, మీరు శబ్దముల తుది, ఉత్వమునకు, అత్వమగును. మహదర్థకములగు, వేడుకకాండ్రు, (బా. అచ్ఛిక 7) పెక్కండ్రు (బా. అచ్ఛిక 24; ప్రౌఢ. శబ్ద 93) అను బహువచనాంతములును, మహత్యర్థకములగు, కోడండ్రు, వెలయాండ్రు (బా. అచ్ఛిక 11), అను బహువచనాంతములును, నీ సూత్రముచేఁ బ్రాతిపదికములై వీనిపై మరల బహువచనము చేరునని తాత్పర్యము. కాన, వేడుకకాండ్రు+లు; పెక్కండ్రు+లు, కోడండ్రు+లు; వెలయాండ్రు+లు–అని నిల్చును. నిర్దిష్టరూపముల ననుసరించి, బహువచన లకారమునకు రేఫముకలిగి, వేడుకకాండ్రురు, పెక్కండ్రురు, కోడండ్రురు, వెలయాండ్రురు–అను రూపము లేర్పడును. చూపఱు, (శబ్ద 95) ఒకరు (బా. అచ్ఛిక 24; ప్రౌఢ. శబ్ద 93) అను మహదర్థక బహువచనము లీసూత్రముచేఁ బ్రాతిపదికములై మరల బహువచనములు చేరును: చూపఱు+లు=చూపఱులు, ఒకరు+లు ఒకరులు. వారు,

వీరు, మీరు, అను రూపము లీసూత్రముచేఁ బ్రాతిపదికములై మరల బహువచనములు చేరును: చూపఱు+లు=చూపఱులు, ఒకరు+లు ఒకరులు. వారు, వీరు, మీరు, అను రూపము లీసూత్రముచేఁ బ్రాతిపదికములై బహువచనమునందిన పిదప వీనిఉత్వమునకు, అత్వమగును: వారు+లు=వారలు, వీరు+లు=వీరలు, మీరు+లు=మీరలు, వేడుకకాండ్రు+కు, కోడండ్రు+అందు, వెలయాండ్రు+ను; పెక్కండ్రు+తో – అను చోట్ల నీసూత్రముచే లడాగమమగును. నిర్దిష్టరూపములనుబట్టి లడాగమ లకారమునకు రేఫము కలుగును: వేడుక కాండ్రు+ల+కు= వేడుకకాండ్రు+ర్+అ+కు: వేడుకకాండ్రురకు. కోడండ్రు+ల+అందు=కో డండ్రు+ర్+అ+అందు: కోడండ్రుర+అందు. బా. సంధి 11చే–అందు, పరమగునపుడు సంధి యథాసంభవముగఁ గావచ్చునుగాన నిటసంధిలేదు. యడాగమముకలిగి, కోడండ్రు రయందు–అగును. వెలయాండ్రు+ల+ను=వెలయాండ్రు+ర్+అ+ను: వెలయాండ్రురను. పెక్కండ్రు+ల+తోడ పెక్కండ్రు+ర్+అ+తోడ: పెక్కండ్రురతోడ. చూపఱు+యొక్క= చూపఱు+ల+యొక్క: చూపఱులయొక్క. ఈసూత్రము "ఒకానొకచోనామంబు సంశ్లిష్ట బహువచనాంత తుల్యంబయి బహువచనంబు నెనయు" అను(ఆచ్ఛిక 17) బాలవ్యాకరణ సూత్రమునకుఁ బూరణము. (చూ. మూలములు)

విమర్శ:- (i) సూత్రమున బహువచనాంత నామంబులపై–అనుట పొరపాటు. బహువచనాంతము నామముకానేరదు. బహువచనాంతతుల్య నామంబులపై–అని యుండుట శాస్త్రీయము. (ii) కోడండ్రురు–లోనగునవి కేచిన్మతముగ గ్రాహ్యములు. (అనుబంధము. విషయ సంఖ్యలు 22; 80.)

## ముత్తియ శబ్దేతరంబులయందును దఱచుగ నిత్వలోపంబు గానంబడియెడి. 49

ఉ: కన్నియ, కన్య; దివ్వియ, దివ్య; కళ్లియము, కళ్యము; పళ్లియము, పళ్యము; వీడియము, వీడ్యము. సీ. నెయ్యపుఁగన్యకల ననవాలుఁ దూపుల జయించి. రాఘ 1ఆ–7. (చూ. శబ్దరత్నాకరము) తే. గువ్వ గ్రద్ద దివ్యాఅపుఁ బువ్వు గూబ, యిల్లుసొచ్చిన శాంతి సేయింపవలయు. భార. అను. 4ఆ–119. సీ. కళ్యాలఁ బదిలంబుగాని గుఱ్ఱంబులఁ, గ్రొత్తముట్టున కియ్యకొలుపు నెరవు. భార. విరా 1ఆ–65. ఉ. అంబుజబాంధవాన్వయ నృపాగ్రణీ! బోనమునేఁడు సూర్యపాకంబున నాయితంబయిన కజ్జము భోజనశాలలోనఁ బఖ్యంబిడినారు పంకజదళాక్షులు రెండవజాముగంట వ్రేయంబడె నారగింప సమయంబని చెచ్చెర విన్నవించినన్. కాశీ 5ఆ–307. ఎ. గీ. తరుణధావన ధగధగద్దశనమణుల, హత్తుకొల్పిరి లేఁతవీడ్యములడాలు, పర్వదినములఁ బామరప్రమద లుదిత, నియమ సంభావ నారంభ నిభృత బుద్ధి. పాండు 3ఆ–74. మొ॥

వ్యా. "ముత్తియశబ్దంబునందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి." (చూ. ఆచ్ఛిక 23. వృత్తి) అని బాలవ్యాకరణమునఁ జెప్పఁబడెను. ముత్తియశబ్దేతరము లందును దఱచుగా ఇత్వలోపము కనఁబడునని యిట సవరణము ప్రతిపాదింపఁబడెను. కన్నియ–ప్రాతిపదికము. బా. తత్సమ 39చే– కన్నియ+ము. ఈ ప్రౌఢ 49చే– ఇత్వలోపము: కన్న్య+ము.

ద్విత్వలోపము: (చూ. బా. అచ్చిక 23-ఘంటాపథము) కన్‌యు+ము=కన్య+ము. బా తత్సమ 57 చే-కన్య. కన్యకలనన-అని రాఘవ పాండవీయ ప్రయోగము. 'కన్యకలనన' అనుచో, కన్య-శబ్దము వైకృతమగుటచేతనే, క్రొత్త-అనునర్థము కలుగుట సహజమనియు, కన్యాశబ్ద సంస్కృతసమ మగు కన్య శబ్దమున కిట్టి యర్థము వ్యవహారమున లేదనియు శబ్దరత్నాకరమున వివరింపఁబడెను. దీనినే "చూ. శబ్దరత్నాకరము"-అని వ్యాకర్త సూచించినట్లు గ్రహింపవలెను. ఇటకన్యశబ్దము. సంస్కృతసమమన్నచోఁ గర్మధారయ పూర్వపదము త్రిక స్త్రీసమముగంత ధాతుజవిశేషణములలో నొకటి కావలెనను బాలవ్యాకరణ నియమమునకును భంగము కలుగును. (బా. సమాస 5) దివ్విుయ+ము-దివ్య+ము. బా. తత్సమ 57 చే-దివ్య. కల్లియ+ము=కళ్యము. కల్లియములను= కళ్యములను. బా. తత్సమ 43 చే-కళ్యాలను. పల్లియ+ము=పళ్యము. బా. తత్సమ 42 చే-పళ్యంబు. వీడియ+ము= వీడ్యము. వీడియములయొక్క=వీడ్యములయొక్క-ఇత్యాదిగాఁబ్రక్రియ లూహ్యము. (చూ. మూలములు)

విమర్శ:- ఈ సవరణ, పరిగ్రాహ్యము. (చూ. అనుబంధము విషయసంఖ్య-23)

**ఎద్దు దేవర శబ్దములకు లులలు పరంబులగునపుడు దకారంబునకు డకారంబును డకారంబు నుత్వంబునకు లోపంబును వికల్పము గాను, రేఫమునకు ళకారమును ళకారంబు నత్వంబునకు లోపంబును నిత్యముగాను గ్రమంబున నగు. 50.**

ఉ: ఎద్దులు, ఎడ్డులు, ఎడ్లు; ఎద్దులన్, ఎడ్డులన్, ఎడ్లన్; దేవళ్లు, దేవళ్లన్. మొ॥

వ్యా. ఎద్దు దేవర శబ్దములకున్=ఎద్దు శబ్దమునకు, దేవర శబ్దమునకు లులలు పరంబులగునపుడు= లుప్రత్యయము, లడాగమము పరములగునపుడు, క్రమముగా, అనఁగా (1) ఎద్దుశబ్దమునకు లులలు పరములగునపుడు (i) దకారమునకు డకారము వికల్పముగానగును. ఉదా. ఎద్దు+లు=ఎడ్డులు, ఎద్దులు. ఎద్దు+ను=ఎద్దులను, (బా. తత్సమ 31) ఎడ్డులను (ii) డకారముయొక్క ఉత్వమునకు లోపమును వికల్పముగా నగును. ఎడ్డు+లు=ఎడ్‌డ్+లు. జడ్డలోపము: ఎడ్+లు=ఎడ్లు. పక్షమున-ఎడ్డులు. ఎడ్డు+లను=ఎడ్‌డ్+లను: ఎడ్లను. పక్షమున-ఎద్దులను-అగును (2) దేవరశబ్దమునకు లులలు పరములగునపుడు రేఫమునకు ళకారమును ళకారముయొక్క అత్వమునకు లోపమును, నిత్యముగా నగును. దేవర+లు= దేవళ+లు. అత్వలోపము: దేవళ్+లు=దేవళ్లు. బా. తత్సమ 2చే-దేవర+ ను. తత్సమ 31చే-దేవర+లను. ఈ 50చే-రేఫకు ళకారము: దేవళ+లను. ళకారముయొక్క అత్వమునకు లోపము: దేవళ్+లను=దేవళ్లను (చూ. అనుబంధము. విషయసంఖ్య-81)

## సర్వనామ ప్రకరణము

**ఈ, ఏ, ఒక శబ్దములకంటెం బరంబయిన యంత శబ్దము నకారంబునకు లోపంబగు. అగుచో నీ యేల దీర్ఘము నకు హ్రస్వమును, ఒకకు వర్ణవ్యత్యయ సంహితలు నగు. 51.**

ఉ: ఇంత, ఎంత, కొంత (చూ. డెబ్బది) శబ్దశాసనుఁడు, "తచ్ఛబ్దాతః" అని సూత్రించిన సూత్రమునందలి తచ్ఛబ్ద మంత ప్రభృతులకు నుపలక్షణమని తెలియునది.

వ్యా. ఈ, ఏ, ఒక – శబ్దములకంటెఁ బరమయిన అంత శబ్దముయొక్క అకారమునకు లోపమగును. అగుచో, ఈ, ఏల దీర్ఘమునకు హ్రస్వమగును. ఉదా. ఈ+అంత–అనుచో, అత్వలోపము కలిగి, ఈ+ంత–అని నిల్చును. పిమ్మట ఈకి హ్రస్వము కలిగి, ఇ+ంత=ఇంత–అగును. ఇట్లే, ఏ+అంత=ఏ+ంత: ఎంత–అగును. ఒక శబ్దమునకు వర్ణవ్యత్యయమును సంహితయు నగును. ఒక+అంత–అనుచో మొదట అత్వలోపము. ఒక+ంత. పిమ్మట వర్ణవ్యత్యయము కలిగి, కఒ+ంత–అని నిలుచును. సంహిత కలిగి, కొ+ంత=కొంత–అగును. సంహిత=అర్ధమాత్రాకాలము కంటెఁ దక్కువ కాలమున వర్ణముల నుచ్చరించుట. అట్లుచ్చరించినప్పుడు వర్ణముల కలయిక సంభవించును. కాన, కఒ= కొ–అగునన్నమాట. చూ. డెబ్బది–అనఁగా వర్ణవ్యత్యయ సంహితలు డెబ్బది రూపసాధనమునఁ గలుగుట సూచితము. (శబ్ద 100 సూ) నన్నయ యాంధ్రశబ్ద చింతామణిలో "తచ్ఛబ్దాతః"–అని సూత్రించెను. ఈ సూత్రమునఁ దచ్ఛబ్దమునందలి (అది అవి శబ్దములందలి) అత్తునకు (తచ్ఛబ్ద+అతః) లోపము విధింపఁ బడినది. ఈ తచ్ఛబ్దము, 'అంత' మొదలగు శబ్దముల కుపలక్షణము (సూచకము.) అనఁగా అంత శబ్దమునందలి, అత్తులోపించునని చింతామణి సూత్రమునందలి తచ్ఛబ్దము సూచించుచున్నదని తాత్పర్యము. (చూ. అనుబంధము. విషయసంఖ్య 127)

అమహదర్థంబున భిన్నవస్తు సముదాయం బర్థంబగుచో<br>నేకవచనంబున నంతాదుల తకారంబునకు<br>ద్విరుక్త నివర్ణంబగు. 52.

ఉ: అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని.

వ్యా. అమహదర్థమున, భిన్నవస్తుసముదాయంబు=విడివిడిగా నున్న వస్తువుల సమూహము, అర్థమగునపుడు, ఏకవచనమున, అంత మున్నగువాని తవర్ణమునకు "న్ని" వర్ణమగును. అన్ని:–అంత=అంన్ని బా.సంజ్ఞా 16చే–స్థిరముపరమగుచో బిందు వుండరాదుగాన లోపించును: అన్ని. ఇట్లే, ఇంత=ఇంన్ని: ఇన్ని. ఎంత=ఎంన్ని: ఎన్ని. కొంత=కొంన్ని: కొన్ని. అన్నిగుట్ట ములు–అనుచో గుట్టములు–భిన్నవస్తు సముదాయము. ఏలయన గుట్టములు విడివిడిగానే యున్నవి కాని యేకరూపత నందలేదు. కాన,–అన్ని అయినది. అంతనూనె–అనుచో, నూనె–అనునది ద్రవరూపమున నుండుటచే నేకీభూతమగు సముదాయమగును గాని, భిన్న వస్తుసముదాయము కాదు. కావున నిట, అన్ని–ప్రయుక్తము కాదు. (చూ. మూలములు)

విమర్శ:– (i) తికారంబునకు=తవర్ణంబునకు–అనియర్థము నెన్నవలెను. వర్ణసముదాయము మీఁదను 'కార' ప్రత్యయము చేర్చుట వ్యాకర్తకు సమ్మతమే. (ii) ద్విరుక్త నివర్ణంబగు– అని సూత్రించుట సరికాదు. ద్విరుక్తనివర్ణము–నిని–అగునే కాని "న్ని" కాదు. ఇదంతమగుద్విరుక్తనకారమనవలెను. (iii) అన్ని–లోనగునవి యేకవచనాంతములయ్యు బహుత్వబోధకములగును. (చూ. బా. ఆచ్ఛిక 24–ఘంటా)

ఆ ఈ శబ్దములకును; ఏ శబ్దమునకును; మహదర్థమున నన్ని<br>విభక్తులయందును వకారంబు నిత్యంబు గాను; వైకల్పి<br>కంబుగాను; అమహదర్థంబునం బ్రథమేతర విభ

క్తులయందు వచనద్వయంబునం గ్రమంబునం
దకార వకారంబులు నిత్యముగాను
బూర్వాగమంబులగు. 53

ఉ: వాఁడు, వారు; వీఁడు వీరు; వానిన్, వారిన్; వీనిన్, వీరిన్; వానిచేతన్, వారిచేతన్; వీనిచేతన్, వీరిచేతన్; వేఁడు, ఏడు; వేరు, ఏరు; వేనిన్, ఏనిన్; వేరిన్, ఏరిన్; వేనిచేతన్, ఏని చేతన్; మొ॥ తే. పిలిచి చారులరావించి యిలయు దివియు, ముంచు కపివీర సేనల మించుఁగాంచి, వీరిలో ముఖ్యులెవ్వారు వేఁడు రాముఁ, డతని యనుజన్మఁడెట్టివాఁడనుచుఁ బలుక. రామా 7అ–192 మొ॥ దానిన్, వానిన్, దీనిన్, వీనిన్, దేనిన్, వేనిన్; దానిచేతన్, వానిచేతన్; దానియందున్; వానియందున్ మొ॥ అనుప్రయుక్తంబులగు నపుడు వీని కీరూపంబు లిట్లయగు ఉ: (చూ మీఁదు)

వ్యా. ఆఈ శబ్దములకును; ఏ శబ్దమునకును; మహదర్థమున నన్ని విభక్తుల యందును వకారము నిత్యముగాను; వైకల్పికముగాను; అనఁగా–ఆఈ శబ్దములకు మహదర్థమున నన్నివిభక్తులయందును, వకారము నిత్యముగాను; ఏశబ్దమునకు మహదర్థమున నన్ని విభక్తులయందును వకారము వైకల్పికముగాను; అమహదర్థమున ఈఆఏ శబ్దములు మూఁడింటికి, ప్రథమేతర విభక్తులయందు, వచనద్వయంబునన్= ఏకవచన బహువచనము లందు, క్రమంబునన్=వరుసగా, దకారవకారంబులు నిత్యంబుగాను–అనఁగా– ఆఈఏ శబ్దముల కమహదర్థమునఁ బ్రథమేతరవిభక్తులయందు, నేకవచనమున–దకారమును; బహువచనమున వకారమును; నిత్యముగాను, బూర్వాగమము లగునని యర్థము.

కాఁగా, (1) 'ఆఈ' శబ్దములకు మహదర్థమున నన్ని విభక్తులయందును వకారము నిత్యముగాఁ బూర్వాగమ మగును. ఆ శబ్దమునకు: వాఁడు, వారు, వానిన్, వారిన్, వానిచేతన్, వారిచేతన్ మొ॥ 'ఈ' శబ్దమునకు: వీఁడు, వీరు, వీనిన్, వీరిన్, వీనిచేతన్, వీరిచేతన్ మొ॥

ప్రక్రియ:– ఆ–ప్రాతిపదికము. బా. తత్సమ 22చే–ఆ+డుజ్. ఈ 53చేన్–ఆ+డుజ్=వా+డుజ్. బా. తత్సమ 19చే–వాఁడు. ఇట్లే, ఈ+డుజ్. వీఁడు. వారు, వీరు శబ్దములకు–చూ. 86. బా. తత్సమ 2చే–ఆ+ను. ఈ 53చే వ్+ఆ+ను=వా+ను. తత్సమ 24చే– వా+ని+ను. తత్సమ 26చే– వానిని. బా. సంధి 20చే– వానిన్. ఇట్లే వీనిన్– మొ। వారిన్– మొదలగువాని ప్రక్రియకు, చూ. శబ్ద 90.

(2) ఏశబ్దమునకు మహదర్థమున నన్నివిభక్తులయందును వకారము వైకల్పికముగఁ బూర్వాగమ మగును. ఉదా॥ వేఁడు, ఏఁడు; వేరు, ఏరు; వేనిన్, ఏనిన్; వేరిన్, ఏరిన్; వేనిచేతన్, ఏనిచేతన్; మొ॥

ప్రక్రియ:– ఏ–ప్రాతిపదికము. బా. తత్సమ 22చే–ఏ+డుజ్. ఈ 53చే–వకారము వికల్పముగఁ బూర్వాగమమగును. వ్+ఏ+డుజ్=వే+డుజ్. బా. తత్సమ 19చే– వేఁడు, పక్షమున– ఏ+డుజ్= ఏఁడు. ఏ+లు=వేరు–చూ.86 సూ. పక్షమున–ఏరు, వేనిన్, ఏనిన్–ఇత్యాదిగా రెండురూపములు గ్రాహ్యములు. (చూ. వానిన్.) వేరిన్–చూ. శబ్ద 90. పక్షమున–ఏరిన్.

(3) ఆఈఏల కమహదర్థమునఁ బ్రథమేతర విభక్తులయందు, ననఁగా ద్వితీయాదులందు (i) ఏకవచనమున దకారము పూర్వాగమ మగును. ఉదా॥ దానిన్, దీనిన్, దేనిన్;

దానిచేతన్, దానియందున్. మొ॥ (ii) బహువచనమున, వకారము పూర్వాగమ మగును. ఉదా॥ వానిన్, వీనిన్; వానిచేతన్, వానియందున్–మొ॥ (చూ. మూలములు)

ప్రక్రియ:– దానిన్– మొదలగువాని ప్రక్రియకు– చూ. శబ్ద 60. దానిచేతన్–మొదలగువాని ప్రక్రియకు– చూ. శబ్ద 61. అనుప్రయుక్తములగునపుడును వీనికి రూపములిట్లే యుండును. చూ. మీఁదు=54 సూ.

### కొన్నియెడల మహదర్థంబున నే శబ్దంబునకు వాఁడు వారును; అమహదర్థంబునం ద్రికంబున కది యవులును స్వార్థమున నేకబహువచనంబులం గ్రమంబుగ ననుప్రయుక్తంబు లగు. 54

ఉ: ఏవాఁడు, ఎవ్వాఁడు; ఏవారు, ఎవ్వారు; ఆయది, అయ్యది; ఆయవి, అయ్యవి; ఈయది, ఇయ్యది; ఈయవి, ఇయ్యవి; ఏయది, ఎయ్యది; ఏయవి, ఎయ్యవి.

వ్యా. కొన్నిచోట్ల మహదర్థమున, ఏశబ్దమునకు వాఁడు, వారు–అనునవి; అమహదర్థమునం ద్రికమునకు, అది, అవి– అనునవి స్వార్థమున నేకవచన బహువచనములందుఁ గ్రమముగా ననుప్రయుక్తము లగును. అనఁగా. (i) ఏ శబ్దమునకు మహదర్థమున నేకవచనమునందు, వాఁడు శబ్దము, బహువచనమునందు వారుశబ్దము, స్వార్థమున ననుప్రయుక్తము లగును. ఉదా॥ ఏ+వాఁడు=ఏవాఁడు. ఏ+వారు=ఏవారు. త్రికకార్యముచే (బా. సమాస 14,13) ఎవ్వాఁడు, ఎవ్వారు. (ii) త్రికమున కమహదర్థమున నేకవచనమునందు–అదిశబ్దము, బహువచనమునందు–అవి శబ్దము స్వార్థమున ననుప్రయుక్తములగును. ఆ+అది=ఆయది; ఆ+అవి=ఆయవి; ఈ+అది=ఈయది; ఈ+అవి=ఈయవి. ఏ+అది=ఏయది; ఏ+అవి=ఏయవి. త్రికకార్యముచే–అయ్యది–మున్నగు రూపములేర్పడును. స్వార్థంబున ననుటచేనివి ప్రకృతి యొక్క యర్థమునే యనువదించును. ఏవాఁడు=ఏఁడు, ఏవారు=ఏరు; ఆయది=అది; ఆయవి=అవి–అనియే యర్థము లన్నమాట. (చూ. మూలములు.)

### ఇట నేహ్రస్వంబగు. అగుచో వాదీర్ఘంబునకు హ్రస్వంబును; ద్విత్వంబునకు లోపంబును; విభాషనగు. 55

ఉ: ఎవ్వఁడు, ఎవఁడు; ఎవ్వరు, ఎవరు.

వ్యా. ఇటన్=54చే–వాఁడు, వారు శబ్దము లనుప్రయుక్తము లగునపుడు, ఏ=ఏశబ్దము, హ్రస్వంబగున్=హ్రస్వమగును. ఏ+వాఁడు; ఏ+వారు. త్రికకార్యముచే (బా. సమాస 14,13) ఎవ్వాఁడు, ఎవ్వారు–అగును. ఇట, ఏ–హ్రస్వమయినది. ఇట్లు హ్రస్వమగుచోట, వా–దీర్ఘమునకు హ్రస్వము విభాషనగును. హ్రస్వమయినచో–ఎవ్వాఁడు=ఎవ్వఁడు, ఎవ్వారు=ఎవ్వరు–అగును. వా–హ్రస్వమగునపుడు ద్విత్వమునకు లోపమును విభాషనగును. ఎవ్వఁడు=ఎవండు, ఎవ్వరు=ఎవరు. (చూ. అనుబంధము. విషయసంఖ్య–82; మూలములు)

### ఆ ఈ ఏ శబ్దములకుఁ బూజ్యతయందు మహదేకవచనంబునఁ దవర్ణాగమంబును, వానిదీర్ఘంబునకు వికల్పముగా హ్రస్వంబును;

మహత్త్వేకవచనంబున వానికంటెఁ బరంబయిన అక, అప, అమ శబ్దంబుల తొలి యకారమునకు లోపంబును, తుది యకారంబున కెకారాదేశంబు నగు. 56

ఉ: అతఁడు, ఆతఁడు; ఇతఁడు, ఈతఁడు; ఎతఁడు, ఏతఁడు; ఆకె (ఆ+అక+ఎ), ఆపె (ఆ+అప+ఎ), ఆమె (ఆ+అమ+ఎ), ఈకె (ఈ+అక+ఎ), ఈపె (ఈ+అప+ఎ), ఈమె (ఈ+అమ+ఎ), ఏకె (ఏ+అక+ఎ), ఏపె (ఏ+అప+ఎ), ఏమె (ఏ+అమ+ఎ).

వ్యా. (i) ఆ ఈ ఏ లకుఁ బూజ్యతయందు మహదేకవచనమున, తవర్ణ మాగమమగును. వీనిదీర్ఘములకు హ్రస్వము వైకల్పికముగా నగును. ఆ-ప్రాతిపదికము. బా. తత్సమ 22చే-ఆ+డుజ్. ఈ 56చే-ఆ+త+డుజ్. బా. తత్సమ 19చే-ఆతఁడు, ఆతండు. ఇట్లే, ఈ+డుజ్: ఈతఁడు. ఏ+డుజ్=ఏతఁడు-ఇత్యాది. వీనిదీర్ఘములకు హ్రస్వము వికల్పము. ఆతఁడు=అతఁడు, ఆతఁడు-ఇత్యాది. (ii) ఆ ఈ ఏ లకుఁ బూజ్యతయందు మహత్త్వేకవచనమునఁ (మహతీ+ఏకవచన) బరమగు, అక, అప, అమ శబ్దముల, తొలి అకారమునకు లోపమగును; దుది అకారమునకు, ఎత్వమగును. ఉదా॥ ఆ+అక. తొలి అకారమునకు లోపము: ఆ+క. తుది అకారమునకు, ఎత్వము: ఆ+క్+ఎ=ఆకె, ఇట్లే తక్కిన రూపములను సాధించుకొననగును.

ఆ ఈ శబ్దములును; ఏశబ్దమును; నమహదర్థంబునం బ్రథమా విభక్తి పరంబగునపుడు నిత్యముగాను, వైకల్పికముగాను గ్రమంబున హ్రస్వంబులగు. 57

ఉ: (చూ. మీఁది సూత్రము)

వ్యా. (i) ఆ ఈ శబ్దము లమహదర్థమునఁ బ్రథమావిభక్తి పరమగునపుడు నిత్యముగ హ్రస్వములగును.

(ii) ఏశబ్ద మమహదర్థమునఁ బ్రథమావిభక్తి పరమగునపుడు వైకల్పికముగా హ్రస్వమగును. ఉదాహరణమునకు-చూ. మీఁది సూత్రము=58 సూత్రము.

త్రికంబున కమహదర్థంబునం బ్రథమైకవచన బహువచనంబులం గ్రమంబుగ దివి వర్ణకంబులగు. 58.

ఉ: అది, అవి; ఇది, ఇవి; ఎది, ఏది; ఎవి, ఏవి.

వ్యా. త్రికమునకు, అమహదర్థమునఁ బ్రథమైన వచనమునందు 'ది' ప్రత్యయమగును. ఆ+ది; ఈ+ది; ఏ+ది; ప్రథమాబహువచనమునందు వి-ప్రత్యయమగును. ఆ+వి; ఈ+వి; ఏ+వి. 57 చే-"ఆ,ఈ" శబ్దములకు హ్రస్వము నిత్యముగా నగును. ఆ+ది=అది; ఆ+వి=అవి; ఈ+ది=ఇది; ఈ+వి=ఇవి. 57 చే-ఏశబ్దమునకు హ్రస్వము వైకల్పికముగా నగును. ఏ+ది=ఎది, ఏది. ఏ+వి=ఎవి, ఏవి (చూ. మూలములు)

హ్రస్వ వ్యస్త త్రికంబుమీఁది దివులకు ద్విత్వంబునగు. 59

ఉ: అద్ది, అవ్వి; ఇద్ది, ఇవ్వి; ఎద్ది, ఎవ్వి. ఇట్లనుటచే, అయ్యె దీత్యాదులయందు ద్విత్వంబు కలుగదని యూహింపవలయును.

వ్యా. హ్రస్వ=57 చే-హ్రస్వమైనదియు, వ్యస్త=విడిగా నున్నదియు నగు, త్రికంబుమీఁది, ది-వి, ప్రత్యయములకు ద్విత్వము సైత మగును. 58 చే-ఆ+ది. 57 చే-అ+ది. ఈ 59 చే-దివర్ణక దకారమునకు ద్విత్వము కలిగిన-అద్ది-అగును. ఇట్లే, ఆ+వి=అ+వి: అవ్వి.ఈ+ది=ఇ+ది:ఇద్ది. ఈ+వి=ఇ+వి:ఇవ్వి.ఏ+ది=ఎ+ది:ఎద్ది. ఏ+వి=ఎ+వి: ఎవ్వి. అయ్యది (ఆ+అది) ఇత్యాదులు వ్యస్తస్థలములు కాకుండుటచే (54 సూ.) ద్విత్వము కలుగదని యూహింపవలెను. అయ్యద్ది-వంటివి యేర్పడవనుట. (చూ. మూలములు)

## ద్వితీయైకవచన బహువచనంబుల రెంటను నివర్ణకంబగు. 60.

ఉ: దానిన్, వానిన్, దీనిన్, వీనిన్, దేనిన్, వేనిన్.

వ్యా. అమహదర్థమునఁ ద్రికమునకు ద్వితీయైకవచన బహువచనములు రెండింటి యందును 'ని' ప్రత్యయ మగును. ఆ-ప్రాతిపదికము. ఈ 60. చే-ఆ+ని. 53 చే-ద్+ఆ+ని=దా+ని; వ్+ఆ+ని=వా+ని.దానిన్ - ఇత్యాదిగా నిర్దేశించుటచే, నుగాగమము. దాని+ను, వాని+ను. బా. తత్సమ 26 చే-దానిని, వానిని. బా. సంధి 20చే-దానిన్, వానిన్, ఇట్లే, ఈ+ని=దీనిన్, వీనిన్; ఏ+ని=దేనిన్, వేనిన్. (చూ. మూలములు)

## అయ్యది తృతీయాది విభక్తులు పరంబులగుచో నాగమంబుగా నగు. 61.

ఉ: దానిచేతన్, వానిచేతన్. మొ॥

వ్యా. అమహదర్థమునఁ ద్రికమునకుఁ దృతీయాది విభక్తులు పరములగునపుడు, అయ్యది=60చే విధింపఁబడిన, నివర్ణకము, ఆగమంబుగాన్=ప్రత్యయ రూపమునఁగాక యాగమరూపమున, నగునని తాత్పర్యము. ఆ+చేతన్. 53 చే-ద్+ఆ+చేతన్=దా+చేతన్; వ్+ఆ+చేతన్ = వా+చేతన్. ఈ 61చే నిగాగమము. దా+ని+చేతన్=దానిచేతన్, వా+ని+చేతన్=వానిచేతన్. మొ॥ (చూ. మూలములు)

## అది యిది యెది యనువానికిఁ దృతీయాసప్తమ్యేక వచనంబుల యందు దాన దీన దేన ననియు, వాని బహువచనంబుల యందు వాన వీన వేన ననియు రూపంబులగు. 62.

ఉ: క. చనునెడ శ్రీరాముఁడు పా, వన నవనిజ రూపవైభవశ్రీనుల్లం, బున నిడి దాన విచిత్రా, తనురాగ ప్రౌఢి వచ్చి తనుఁ బైకొనఁగన్. రాఘ 2 ఆ-43. క. నలుఁగాన మివ్వనంబునఁ, గలవెప్పుడుఁ గొంతు ముగ్రకరులను సింహం, బుల బుక్షంబుల నిదిమ, ర్త్యుల కవిషయ మాతపంబు దూఱదు దీనన్. భార. ఆర 2 ఆ-106. కాననము గిరులు నదులును, నానా తీర్థములు భూజనంబుల కెల్లన్, భూనుత సాధారణములు, వానను ధర్మములు సేయవచ్చు నిజేచ్ఛన్. భార. ఆను 2 ఆ-395. ఎ. గీ. అనిన నలుగాలి వాన గోవును నశేష, శబ్దముల మంత్రమును లోహజాతిఁ గాంచ, నమును మనుజుల విప్రుండు సమధికత్వ, భాజనములంద్రు వేదప్రపంచ విదులు. భార శాంతి 1 ఆ-71. తే. కలవు నూఱులు వేలు లక్షలును గోటు, లప్రమేయముల్ ఘనమాయ లధిప నాకు, వానఁ దగులక

పోరాదు వనజభవున, కైన నభవునకైనను నన్యులెంత? లక్ష్మీ 4 ఆ-137. క. ధ్యానంబిం ద్రియవృత్తులు, మానించుట హింస గురుసమర్చనవిధి ని, త్యానుష్ఠానము తపమును, వీనం బరసేవ్య మెద్ది వినఁగా వలతున్. భార ఆను 4 ఆ-277. సీ. ఒక్కఁ డొక్కటిచేత నెక్కుచుఁ దఱుఁగుచుఁ, ద్రిగుణంబులును బ్రవర్తించు వీన, జనితంబులగుఁ బ్రీతి సంతాప మోహాదులు. భార ఆను 5 ఆ-250. ఎ.గీ. అని యెఱింగించి మఱియు నిట్లను నజుండు, స్వేదముద్భేద మండమన్ వీనఁబుట్టు...జరాయుజములు. భార. అశ్వ. 2 ఆ-144 మె॥ దేనన్, వేనన్, అనువానికిఁ బ్రయోగంబులు మృగ్యంబులు.

వ్యా. అది, ఇది, ఎది- అనువానికిఁ దృతీయా సప్తమ్యేకవచనములలో, దాన, దీన,దేన-అను రూపములును, దృతీయా సప్తమీ బహువచనములలో, వాన, వీన, వేన - అనురూపములును వరుసగా నగును. అనఁగాఁ దృతీయా సప్తమ్యేకవచనములందు- (i) అది శబ్దమునకు దాన-అనియు, (ii) ఇదిశబ్దమునకు, దీన-అనియు (iii) ఎది శబ్దమునకు, దేన-అనియు నగును. తృతీయా సప్తమీబహువచనములందు - (i) అది శబ్దమునకు, వాన-అనియు, (i) ఇది శబ్దమునకు, వీన-అనియు (ii) ఎది శబ్దమునకు వేన-అనియు రూపము లగునన్న మాట.బా. తత్సమరిచే-వీనికి, నుగాగమము కలుగును: దానను-ఇత్యాది ప్రయోగములు: రూపవైభవ శ్రీనుల్లంబుననిడిదానన్-అనుచో, దానన్= దానిచేత, రూపవైభవశ్రీచేతనని యర్థము. దూఱుదుదీనన్-అనుచో, దీనన్=దీనియందు, అనియర్థము, వాననుధర్మములుసేయవచ్చు-అనుచో, వానను=వానియందు-అని యర్థము. నలుగాలివానన్=నలుగాలివానియందు-(చతుష్పాత్తులయందు) అని యర్థము. వానఁదగులక పోరాదు. అనుచో, వానన్=వానియందని యర్థము. వీనంబరసేవ్య మెద్ది-అనుచో, వీనన్= వీనియందు-అనియర్థము, వీనజనితంబులగు - అనుచో, వీనన్=వీనిచేత-అని యర్థము. వీనఁబుట్టు-అనుచో, వీనన్=వీనియందు-అనియర్థము. దేనన్, వేనన్-అనురూపములకుఁబ్ర యోగములు మృగ్యములు= అన్వేషణీయములు. వెదకఁదగినవనుట. ప్రయోగావకాశమును దృష్టిలో విడుకొని యారూపములు నిర్దేశింపఁబడినట్లు గ్రహింపవలెను. (చూ. మూలములు; విషయసంఖ్య-83)

విమర్శ:- దాన-ఇత్యాదులు నిత్యముగ రావలసినపనిలేదు. దానిచేత, దానియందు- ఇత్యాదులును నుండును. కావనసూత్రమున 'కొన్నియెడల' అనుటయుక్తము.

పదాద్యంత గతం బాశబ్దం బమహదర్థకంబు సమస్తంబు
వ్యస్తంబునయి కొన్నియెడల నర్థశూన్యంబగు. 63

ఉ: తత్పురవప్రము పాదపీఠికా, శిరములకొప్ప నర్చనలు చేసిన పువ్వుల యవ్విధంబునన్. భార ఆది. 8ఆ-76. పాదుగాపు నాగతి. కళా 3 ఆ. చ. మఱిబావులు నూఱిటి కంటె నొక్క స,త్క్రతువది మేలు. భార. ఆది. 4ఆ-93.

వ్యా. అమహదర్థకము, పదాద్యంతగతంబు = (i) పదాదిగతము (ii) పదాంతగతము, అగు - "ఆ"శబ్దము, (i) సమస్తము (ii) వ్యస్తమునయి, యర్థశూన్యమగును. అనగా (i) నమహదర్థకము, పదాదిగతము, నగు "ఆ"శబ్దము సమస్తమయి కొన్ని యెడల నర్థశూన్యమగును. ఉదా పువ్వులయవ్విధంబునన్. అవ్విధంబునన్ - అనుచో, ఆశబ్ద

మమహదర్థకము, సమస్తము, (ఆ + విధంబు- కర్మధారయము, బా. సమాస 5 సూ.) ఇది పదాదిగతమయి యర్థశూన్య మగుచున్నది. పువ్వుల యవ్విధంబునన్ = పువ్వుల విధంబునన్ - అనియే, యర్థము. ఆ - శబ్దమున కర్థములేదు. ఇట్లే, పాడుగాపు నాగతి-అనుచో, ఆశబ్దమర్థశూన్యము. పాడుగాపు నాగతి = పాడుగాపుగతి-అనియే యర్థము. (ii) అమహదర్థకము, పదాంతగతము నగు "అ" శబ్దము వ్యస్తమయి కొన్నియెడల నర్థశూన్య మగును. ఒక్కసత్కృతువదిమేలు. సత్కృతువు+అది, అనుచో, అదిశబ్దమ మహదర్థకము, పదాంతగతము, వ్యస్తము నయి యర్థశూన్యమగుచున్నది. సత్కృతువది, మేలు=సత్కృతువుమేలు- అనియే యర్థము.

## తవర్ణకంబు స్త్ర్యర్థకంబగు. 64

వ్యా. త-అను ప్రత్యయము, స్త్ర్యర్థకంబు (స్త్రీ+అర్థక) స్త్రీయను నర్థము గలది, అగును. చూ. 65.

## అయ్యాది యేకత్వంబున సమాసగత షష్ఠ్యంత యత్కి-మర్థకాన్యైకార్థక శబ్దంబుల పయి నగు. 65

ఉ: ఎవ్వరిత, ఎవరిత; ఒక్కరిత, ఒకరిత; ఒక్కొరిత, ఒకొరిత. (వీనికి ఎవరియొక్క యాఁడుదియనియు, ఒకరియొక్క యాఁడుది యనియు, ఒక్క యాఁడుదనియు నర్థములు.)

వ్యా. అయ్యాది=తవర్ణకము, (64 సూ) ఏకత్వమున సమాసగతములగు, షష్ఠీ విభక్త్యంతములైన, యత్కిమర్థక+అన్యైకార్థక శబ్దంబులపయిన్=ఏ, ఒక్క-శబ్దముల మీఁద నగును. యత్కిమర్థకము=ఏశబ్దము. చూ. బా. అచ్చిక 24 ఘంటా. అన్యైకార్థకము=(అన్య+ఏకార్థక) అన్యశబ్దముయొక్కయు, నేకశబ్దముయొక్కయు నర్థముగలది. అనఁగా, ఒక్కశబ్దము. (ఇది యేకార్థకమని బాలవ్యాకరణ వ్యవహారము) ఏశబ్దమునకు:- "ఎవ్వరియొక్క"+త. బా. సమాస 25చే-ఎవ్వరి+త=ఎవ్వరిత-ప్రాతిపదికమగును. బా. తత్సమ 39చే-ఎవ్వరిత+ము, తత్సమ 57చే-ఎవ్వరిత. ఇట్లే, ఎవరియొక్క+త=ఎవరిత. ఒక్క శబ్దమునకు:- ఒక్కరియొక్క+త=ఒక్కరిత. ఒకరియొక్క+త=ఒకరిత. ఒక్కొరియొక్క+త=ఒక్కొరిత. ఒకొరియొక్క+త=ఒకొరిత. ఎవరిత=ఎవరియొక్కయాఁడుది యనియర్థము. ఒకరిత=ఒకరియొక్క యాఁడుది, ఒక్క యాఁడుది-అని యర్థములు. కనుకనే, 'ఒక్క' శబ్దమన్యైకార్థక మనఁబడినది.

ఎవరియొక్కయాఁడుది-ఇత్యాదిగాఁ జెప్పుటచే నేకవచనాంతముపై తవర్ణకము రాదు. అనఁగా, ఎవ్వనియొక్క+ఆఁడుది-ఇత్యాదులలో, తవర్ణకము రాదనుట. (ఎవ్వనిత-కాదన్నమాట.) ఏకత్వంబున ననుటచే-ఎవ్వరితలు-ఇత్యాదులు కలుగవు. ఎవరియాఁడుది-వంటిరూపములు సైతముండును.

విమర్శ:- సూత్రమున "సమాసగత" అనుట తద్ధితవృత్తికుపలక్షణము.

## దానియత్వంబున కిత్యేత్వంబులు పర్యాయంబున నగు. ఆదే శొత్వంబు మీఁది దాని కెత్వంబు రాదు. 66

ఉ: ఎవ్వరితి, ఎవరితి; ఎవ్వరితె, ఎవరితె; ఒక్కరితి, ఒకరితి; ఒక్కరితె, ఒకరితె; ఒక్కొరితి, ఒకొరితి; ఒక్కొరితె, ఒకొరితె.

వ్యా. (1) దాని=తవర్ణకముయొక్క (64సూ) అత్వమునకు, ఇత్త్వైత్వంబులు=ఇత్వము, ఎత్వము, పర్యాయముగా నగును. ఉదా॥ ఎవ్వరిత=ఎవ్వరితి, ఎవ్వరితె. ఒక్కరిత=ఒక్కరితి, ఒక్కరితె. ఇట్లే తక్కినవి. ఆదేశౌత్వంబుమీఁది దానికిన్ (ఆదేశ+ఓత్వ)=ఒక్కాదులకు నాదేశమైన ఓత్వముమీఁది తవర్ణకమునకు ఎత్వము రాదు. అనఁగా ఇత్వమొక్కటే వచ్చు నన్నమాట. ఓర్త=ఓర్తి. చూ. 69 సూ, (ఓర్తె-కాదు.)

## రేఫసంయుక్తంబగుచో నొక్కాక శబ్దంబుల మీఁది తకారంబున కుత్వంబునగు. 67

ఉ: (చూ, మీఁదు)

వ్యా. రేఫ సంయుక్తంబగుచోన్=రేఫముతో సంయోగముచెందునపుడు, ఒక్క. ఒక-శబ్దములమీఁది తకారమునకు, ఉత్వము సహితమగును. ఉదాహరణములకు-చూ. మీఁదు=68 సూ.

## తవర్ణకంబు పరంబగుచో రేఫంబుమీఁది యిత్తునకు లోపంబు విభాషనగు. 68

ఉ: ఎవ్వర్త, ఎవర్త; ఎవ్వర్తి, ఎవర్తి; ఎవ్వర్తె, ఎవర్తె; ఒక్కర్త, ఒకర్త; ఒక్కర్తి, ఒకర్తి; ఒక్కర్తు, ఒకర్తు; ఒక్కర్తె, ఒకర్తె; ఒక్కొర్త, ఒకొర్త; ఒక్కొర్తి, ఒకొర్తి; ఒక్కొర్తు, ఒకొర్తు; ఒక్కొర్తె, ఒకొర్తె.

వ్యా. తప్రత్యయము (64 సూ) పరమగునపుడు రేఫముమీఁది యిత్తునకు లోపము విభాషనగును. ఎవ్వరిత=ఎవ్వర్+త: ఎవ్వర్త. ఇత్యాది. (మూలములు-చూ.)

## కొన్నియెడల రేఫసంయుక్త తవర్ణకంబు ముందటి యొక్కాదుల కోత్వం బాదేశంబగు. 69

ఉ: ఓర్త, ఓర్తి, ఓర్తు.

వ్యా. రేఫముతో సంయోగము చెందిన తప్రత్యయమునకు(64 సూ)ముందుండు, ఒక్క-మున్నగువానికి, ఓత్వ మాదేశముగ నగును. ఒక్కరి+త. 68చే-ఒక్కర్+త=ఒక్క+ర్త. ఈ 69చే-ఒక్కకు, ఓత్వమాదేశమగును: ఓ+ర్త=ఓర్త. 66చే-తుదిఅత్వమునకు, ఇత్వము: ఓర్తి. (ఓర్తె-కాదు) ఒక్క+ర్త. 67చే-ఒక్క+ర్తు. ఈ 69చే-ఓ+ర్తు=ఓర్తు.

## ఎవ్వరితాదులందలి రివర్ణంబునకు లోపంబు విభాషనగు. 70

ఉ: ఎవ్వత, ఎవత; ఎవ్వతి, ఎవతి; ఎవ్వతె, ఎవతె; ఒక్కత, ఒకత; ఒక్కతి, ఒకతి; ఒక్కతె, ఒకతె; ఒక్కొత, ఒకొత; ఒక్కొతి, ఒకొతి; ఒక్కొతె, ఒకొతె. స్వార్థంబునం గప్రత్యయంబురా-ఎవ్వతుక, ఎవతుక; ఎవ్వర్తుక, ఎవర్తుక; ఒక్కతుక, ఒకతుక; ఒక్కొతుక, ఒకొతుక; ఒక్కర్తుక, ఒకర్తుక; ఒకొర్తుక, ఓర్తుక-అని రూపంబులు.

వ్యా. ఎవ్వరిత-మున్నగువానియందలి రివర్ణమునకు లోపము విభాషనగును. ఎవ్వరిత-ఎవ్వత, ఎవ్వరిత-ఇత్యాది. స్వార్థమున 'క' ప్రత్యయము రాఁగా, ఎవ్వతుక-మున్నగు రూపములు సిద్ధించును. ఎవ్వత+క, ఎవ్వతి+క-అనుచోట్ల 'క' ప్రత్యయము పరమగుచో

(బూర్వాచ్చులకుఁ అత్వేత్వములకు) ఉత్వమగునని గ్రహింపవలెను. ఎవ్వత+క=ఎవ్వతుక; ఎవ్వతి+క=ఎవ్వతుక. ఒక్కరుత-ఇత్యాదులలో, ఒక్కరుతు+క-అని గ్రహింపనగును.

## నీ మీ నే మే హల్లులకు లోపంబు విభాషనగు. 71

ఉ: ఈవు, నీవు; ఈరు, మీరు; ఏను, నేను; ఏము, మేము.

వ్యా. నీ, మీ-అను యుష్మదర్థక సర్వనామములయొక్కయు, నే, మే-అను నస్మదర్థక సర్వనామములయొక్కయు హల్లులకు-అనఁగా నకార మకారములకు లోపము విభాషనగును. నీవు=ఈవు, నీవు. మీరు=ఈరు, మీరు; నేను=ఏను, నేను; మేము=ఏము, మేము. ఉదాహరణ స్వారస్యముచే నీలోపము ప్రథమలోనే యని తెలియవలెను. నీచేత, మీచేత-ఇత్యాదులలో నమలు లోపింపవన్నమాట. (చూ. మూలములు)

## బహుత్వంబున మేకు నే విభాషనగు, 72

ఉ: నేము, మేము.

వ్యా. అస్మచ్ఛబ్దముయొక్క (నా-శబ్దము) ప్రథమాబహువచనమునందలి, మేకున్=మే-అనుదానికి, అనఁగా, మేముశబ్దమునందలి, మే-అనుదానికి, నే-అనునది విభాషనగును. మేము=నేము, మేము.

## నిన్ను నన్నుఁ దన్ను- వీనియందలి ద్విత్వమున కేనియు ద్విత్వయుక్త నువర్ణంబున కేనియు; మిమ్ము, మమ్ముఁ, దమ్ము-వీనియందలి ద్విత్వంబునకును లోపంబు వైకల్పికంబు. 73

ఉ: నినున్, నిన్; ననున్, నన్; తనున్, తన్; మిమున్, మమున్, తమున్. ఉ: నిన్, నమ్మినవారికెన్నఁడును నాశము లేదు గదమ్మ యీశ్వరీ! భాగ. 10 స్కం. 1752. నన్, నిలువం బెట్టితి. భాగ 10 స్కం. పూ. 1736. సీ. పనియేమిపంచినఁ బదపడి చేసెద, ననక తన్‌బంచిన యాక్షణంబ, చేయుచు. భార. ఆది. 3ఆ-110 మొ॥

వ్యా. (i) నిన్నున్, నన్నున్, తన్నున్-అనువానియందలి ద్విత్వమునకుఁ గాని, ద్విత్వయుక్త నువర్ణమునకు, (న్+ను)-అనగా "న్ను" వర్ణమునకుఁ గాని, లోపము వైకల్పికముగ నగును. నిన్నున్-ద్విత్వము లోపించిన, నినున్-అగును. నిన్నున్-లో, "న్ను" లోపించిన, నిన్-అగును. ఇట్లే తక్కినవి. (ii) మిమ్మున్, మమ్మున్, తమ్మున్-అనువానిలోని ద్విత్వమునకు లోపము వైకల్పికముగా నగును. మిమ్మున్-ద్విత్వములోపించిన-మిమున్. ఇట్లే తక్కినవి. ద్విత్వయుక్తనువర్ణ మనికాక, ఉదంతనుగు ద్విరుక్తనకారమనఁదగును.

విమర్శ:- (i) నినున్, ననున్, తనున్ - అనునవి, బా. ప్రకీర్ణక 7 చేతను, మిమున్, మమున్, తమున్-అనునవి, బా. ప్రకీర్ణక 8-చేతను సాధింపఁబడెను. వ్యాకర్త చూచుకొనలేదు. (ii) నిన్, తన్-అనువానికి హలవసానములు పరమగునప్పటి సంధికార్యములకు-ము.కౌ.సంధి. 15.

## తాము, తమరు తారు నగు. 74

ఉ: స్పష్టము

వ్యా. తాము, అనుదానికి, తమరు, తారు—అను రూపాంతరములు నగునని యిట నిర్దేశింపఁబడెను.

## నామ పునర్గ్రహణంబున భిన్నంబు నభిన్నంబునయి తచ్ఛబ్దార్థంబు తత్పర్యాయంబగు 75

ఉ: వాఁడె సురాసురులెల్ల నడ్డమై, వచ్చిన నైన రాక్షస వివాహమునం గొనిపోవు నిన్ను. భాగ, 10 స్కం. పూ. 1734 (వాఁడె—భిన్నరూపము. ఆ సుదర్శనాయుధుఁడనుట అభిన్నరూపము; సుదర్శనాయుధుఁడు—నామ పదము) ఎ.గీ. వివిధపుణ్యకథలు వినువేడ్క నతనిఁ బూజించిరి. భార ఆది 1ఆ. 27. (అతనిన్—భిన్న రూపము. అక్కథకుననుట అభిన్నరూపము; కథకుఁడు నామపదము) సీ. కలహంసపలికిన పలుకుల గణియించు, వడి దానిపోయిన వలన చూచు. భార. అర. 2ఆ—26. (దాని—భిన్నరూపము. ఆ కలహంస యనుట అభిన్నరూపము. కలహంస—నామపదము.) మొ॥

వ్యా నామపునర్గ్రహణంబునన్=నామపదమును (=వస్తువాచకమును, సుబంతమును—చూ. వాక్య 3సూ.) మరల గ్రహించుటయందు, భిన్నంబున్=ఆనామపదముతోఁ గూడుకొనియుండక వేఱుగా (విడిగా) నున్నదియు, అభిన్నంబున్=ఆనామపదముతోఁ గలిసియున్నదియు, అయి, తచ్ఛబ్దార్థంబు=ఆ—అను సర్వనామముయొక్క యర్థముగల శబ్దము, తత్పర్యాయంబగున్=ఆనామ పదమునకు సమానార్థకమగును. కాఁగా, నామపధమును మరలగ్రహింపవలసి వచ్చునప్పుడు, తచ్ఛబ్దార్థము విడిగాఁగాని, యానామపదముతోఁ గలిసిగాని ప్రయోగింపఁబడి, యానామపదమునకుఁ బర్యాయమగును. భిన్నమునకు:— (=నామపద ముతోఁగూడుకొని యుండక తచ్ఛబ్దార్థము విడిగా నుండుటకు) వచ్చెసుదర్శనాయుధుఁడు. వాడె...కొనిపోవునిన్ను. ఇటవాఁడె—అను తచ్ఛబ్దార్థము, సుదర్శనాయుధుఁడు—అను నామ పదమునకుఁ బర్యాయముగా వాడఁబడినది. ఇది నామపదముతోఁ గలిసియుండక విడిగా నుండుటచే భిన్నమున కుదాహరణము. అభిన్నమునకు:— (=తచ్ఛబ్దార్థము నామపదముతోఁ గూడుకొని యుండుటకు) వచ్చె సుదర్శనాయుధుఁడు. ఆ సుదర్శనాయుధుఁడె...కొనిపోవు నిన్ను— అన్నచో, సుదర్శనాయుధుఁడను నామపదమునకుఁ బర్యాయముగా, ఆ సుదర్శ నాయుధుఁడని వాడినట్లగును. ఆ—అను తచ్ఛబ్దార్థము, సుదర్శనాయుధుఁడను నామ పదముతోఁ గూడుకొనియుండుటచే నిది యభిన్నమున కుదాహరణమగును. భిన్నమునకు:— అక్కథకువలన, వివిధపుణ్యకథలు వినువేడ్కనతనిఁ బూజించిరి. ఇట, అతనిన్, అను తచ్ఛబ్దార్థము, కథకున్—అను నామపదమునకుఁ బర్యాయముగా వాడఁబడినది. ఇది నామపదముతోఁ గూడుకొనియుండక విడిగా నుండుటచే భిన్నమున కుదాహరణము. అభిన్నమునకు— అక్కథకువలన, వివిధపుణ్యకథలు వినువేడ్క నక్కథకుఁ బూజించిరి. అన్నచో, కథకున్—అను నామపదమునకుఁ బర్యాయముగా అక్కథకున్—అని వాడినట్లగును. ఇట, ఆశబ్దము (ఆ+కథకున్) కథకున్—అను నామపదముతోఁ గూడుకొనియుండుటచే నిది యభిన్నమున కుదాహరణమగును. భిన్నమునకు:— కలహంస పలికిన పలుకులు గణియించు, వడి దానిపోయిన వలన చూచు. ఇట, దానిన్—అను తచ్ఛబ్దము, కలహంస—అను

నామపదమునకుఁ బర్యాయముగా వాడఁబడినది. ఇది నామపదముతోఁ గూడుకొనియుండక విడిగ నుండుటచే భిన్నమైనది. అభిన్నమునకు:- కలహంస పలికినపలుకులు గణియించు. ఆ కలహంస పోయిన వలన చూచు-అన్నచో కలహంస-అను నామపదమునకుఁ బర్యాయముగా, ఆ కలహంస-అని వాడినట్లగును. ఇట, ఆ శబ్దము, కలహంస-అను నామపదముతోఁ గూడుకొనియుండుటచే నిది యభిన్నమున కుదాహరణమగును.

## ఒక్కొకచో నామంబె యగు. 76

ఉ: సీ. సురవరులర్థులై చూచుచు నుండంగ, నలు వరియించిన నాఁటియెగ్గు దలఁచి యిట్టి యాపదలు చేసిరో వేల్పు, లమరకోపమునన యయ్యెనాకు, నీవియోగదుఃఖము. భార. అర. 2ఆ-113. మొ.

వ్యా. ఒక్కొక్కచోట, నామపునర్గ్రహణమున, నామంబె=నామపదమే, తత్పర్యాయం బగునని యర్థము. (75 సూ.) అనఁగా నామపదమును మరల గ్రహించవలసి వచ్చునపుడు (నామపదము=వస్తువాచకము, సుబంతము-చూ. వాక్య 3 సూ.) నామపదమే కొన్నిచోట్ల నామపదమునకుఁ బర్యాయమగునని భావము. ఉదా॥ సురవరులర్థులై చూచుచు నుండంగ నలువరియించిన నాఁటియెగ్గు, దలఁచి యిట్టి యాపదలు చేసిరో వేల్పు, లమరకోపమునన యయ్యెనాకు నీవియోగ దుఃఖము. ఇట, సురవరులు-అను నామపదమునకుఁ బర్యాయముగా, వేల్పుశబ్దము, అమర శబ్దము, వాడఁబడెను. ఒక్కొకచో-అనుటచే, 75 చే - ఆపదలు చేసిరో వారు, వారి కోపమునన-అనియు, ఆపదలుచేసిరో యా సురలు, ఆ సురలకోపమునన-అనియుఁ దచ్ఛబ్దార్థము నామపద పర్యాయము కావచ్చును.

విమర్శ:- ఇట్టి ప్రయోగములు పర్యాయ ప్రక్రమభంగ దోషమునకు లక్ష్యములు. కాన, సూత్రము త్యాజ్యము. (అనుబంధము. విషయసంఖ్య-44)

## నామ తదేతద్యత్కిమర్థంబులకుం బునర్గ్రహణంబునఁ బ్రథమాద్యంతమయి పూర్వపరంబులుగ నాత్మార్థంబభిహితంబగు. 77

ఉ: తా, వచ్చెసుదర్శనాయుధుఁడు- భాగ. 10 స్కం. పూ. 1734. క. విదురుఁ డురు విషాగ్నులవలనన్, మానుగ నేమఱ కుండని, తాను బ్రబోధించె-భార. ఆది. 6 ఆ-151. (ఇటఁ దాశబ్దము పాదపూరణార్థకము. వచ్చె సుదర్శనాయుధుఁడు, విదురుఁడు ప్రబోధించె-అని యాత్మార్థ విరహితంబుగను జెప్పనగు.) ఆ. అడవిఁ దన్నుఁబాసి యరిగిన నలిగి గా, కున్నె యిట్లుసేయ నువిదకడఁగె. భార. అర. 2 ఆ-164. వ అదియును దన కమ్మనుజేశ్వరుం డపాయంబు సేయునకాఁదలఁచి. భార అర. క. ఆ-14. 2 కర్మములు మేలు నిచ్చును, గర్మంబులు గీడునిచ్చుఁ గర్తలు దనకున్, గర్మములు బ్రహ్మకైనను, గర్మగుఁడై పరులఁ దడవఁగా నేమిటికిన్? భాగ 10 స్కం. పూ. 32 మొ॥

వ్యా. నామ=నామపదమునకును, తద్, ఏతద్, యత్కిమర్థంబులకున్=ఆ, ఈ, ఏ అను సర్వనామములకును. పునర్గ్రహణంబునన్=మరల వానిని గ్రహించునప్పుడు, ప్రథమాది=ప్ర

థమ మొదలగు విభక్తులు, అంతమయి= చివరఁగలదయి, పూర్వపదంబులుగన్=పూర్వమును, బరమును, నగునట్లు, ఆత్మార్థంబు=తాశబ్దము, అభిహితంబగున్=చెప్పఁబడినదగును. అనఁగా, నామపదమును, ఆ ఈ ఏ-అను సర్వనామములను, మరల గ్రహింపవలసి వచ్చునప్పుడు, వానికిఁ బూర్వమునందుఁ గాని పరమునందుగాని ప్రథమాది విభక్త్యంతమగు తా-శబ్దము ప్రయోగింపఁబడునని తాత్పర్యము. నామపదమునకు:- పాదపూరణమున: తావచ్చె సుదర్శనాయుధుఁడు-అనుచో సుదర్శనాయుధుఁడు-అను నామపదమునకు ముందు తాశబ్దముయొక్క ప్రథమాంత రూపమగు తాను శబ్దమువచ్చినది. (తాను+వచ్చె=తావచ్చె. బా. సంధి. 18) విదురుఁడు... తాను ప్రబోధించె- అనుచో, విదురుఁడను నామపదమునకుఁ బరమందు తాను-శబ్దము వచ్చినది. ఈ రెండుచోట్ల "తా" శబ్దము పాదపూరణార్థకము. అనఁగా దీనికినర్థవిశేష మేమియులేదు. కాన, వచ్చెసుదర్శనాయుధుఁడు, విదురుఁడు...ప్రబోధించె-అని తాశబ్దము లేకుండను జెప్పవచ్చును. పునర్గ్రహణమున:- అడవిఁదన్నుఁ బాసి యరిగిన నలిగిగాఁకున్నె యిట్లుసేయ నువిదగడఁగె. ఇట ఉవిద-అను నామపదమునకు ముందు, 'తా' శబ్దముయొక్క ద్వితీయాంతమగు తన్నున్-శబ్దము వచ్చినది. అదియును దన కమ్మనుజేశ్వరుం డపాయంబు సేయునకాఁ దలఁచి-అనుచో, అదియును-అను ఆ-శబ్దమునకుఁ బరమందు, తా శబ్దము యొక్క షష్ఠ్యంతమగు తనకున్-అనునది వచ్చినది. ఈ, ఏ శబ్దముల కుదాహరణము లీయలేదు. ఊహ్యములు. కర్తలు దనకున్ గర్మములు- అనుచో, కర్మములు-అను నామపదమునకుఁ బూర్వమందు, తా శబ్దముయొక్క షష్ఠ్యంత రూపమగు, తనకున్-అనునది వచ్చినది.

విమర్శ:- కర్తలుదనకున్, గర్మములు-అనుచో, తనకున్=ప్రాణికి, అని యర్థము సెప్పుట యుచితము. కాననిది 78వ సూత్రమునకు లక్ష్యము (చూ. అనుబంధము. విషయసంఖ్య-85)

### ఆత్మార్థం బొకానొకచో నామాస్మదర్థాభిధాయియు నగు. 78

ఉ: తే. తనకు మఱితానె చుట్టంబు తానెతనకు, గతియుఁ దన్నిచ్చుచోఁ దాన కర్తయనఁగ, వనజనేత్ర! గాంధర్వ వివాహమతిర, హస్యమును నమంత్రకమును నగుచునొప్పు. (తనకున్=స్త్రీకనుట) భార. ఆది. 4ఆ-57. క. తనతొంటి కర్మరాశికి, ననుచరమై బహువికారమై మనమువడిన్, జనునింద్రియముల తెరువులఁ, దనువులు పెక్కైనఁ జెడవు తనకర్మంబుల్. భాగ 10 స్కం. పూ 30. (తన=ప్రాణియొక్క) మొ. తనకిష్టుఁడున్ సహో, ధ్యాయుఁడు నైనవాఁడు. (తనకున్=నాకు) భార. ఆది 1ఆ-24 తన తనుచ్ఛాయ మస్తకహీన మైతోఁచె. (తన తనుచ్ఛాయ=నాతనుచ్ఛాయ)జై. 7ఆ-13. నీవు చెప్ప నొడికంబునఁ బూనిన యీప్రబంధమ్ముం, దనకిపు డంకితంబు ప్రమదంబుగఁ జేయుము. (తనకున్=నాకున్.) రుక్మా 1ఆ-33. సీ. తమ సొమ్ము తమకిచ్చె ధర్మరాజని మహీ, సురులు దానము సేయఁ జూచినగరె. (తమసొమ్ము=మాసొమ్మొ, తమకున్=మాకు)జై. 1ఆ-68. మొ॥

వ్యా. ఆత్మార్థంబు=తా శబ్దము, ఒకానొకచోన్, నామ=నామపదముయొక్కయు, అస్మద్= అస్మచ్ఛబ్దముయొక్కయు, (=నాశబ్దముయొక్కయు) అర్థ=అర్థమును, అభిధాయి

యున్=బోధించునదియు, అగును. తా—శబ్దమరుదుగా నామపదముయొక్క యర్థమును, నా—శబ్దముయొక్క యర్థమును బోధించునని భావము. నామపదముయొక్క యర్థమును "తా" శబ్దము బోధించుటకు:— తనకు మఱితానె చుట్టంబు కానెతనకు, గతియు—అనుచో, తనకున్=స్త్రీకి, తానె=స్త్రీయే, చుట్టంబు, తానె=స్త్రీయే,తనకున్=స్త్రీకి, గతియు—అని యర్థము. ఇట స్త్రీ, స్త్రీకి—అను నామపదములయొక్క యర్థములను, తాను, తనకు—అను తా శబ్దరూపములు బోధించుచున్నవి. తన తొంటికర్మరాశికి – అనుచో, తన=ప్రాణియొక్క—అని యర్థము. ఇట, ప్రాణియొక్క, అను నామపదముయొక్క యర్థమును, తనయొక్క—అను తా శబ్దరూపము బోధించుచున్నది. నా— శబ్దముయొక్క యర్థమును, తా—శబ్దము బోధించుటకు:— తన కిష్టుఁడున్—అనుచో, తనకున్=నాకున్—అని యర్థము చెప్పఁబడెను. ఈపక్షమున, నాకున్—అను "నా" శబ్దముయొక్క యర్థమును, తనకున్—అను తా శబ్దరూపము బోధించుచున్నదని భావము. తన తను చ్ఛాయ—అనుచో, తన=నాయొక్క—అనియర్థము. కావున, నాయొక్క—అను, "నా" శబ్దముయొక్క యర్థమును, తనయొక్క—అను "తా" శబ్దరూపము బోధించుచున్నది. ఇట్లే, తనకిపుడంకితంబు—అనుచో, తనకున్=నాకున్, అని యర్థము. కావున, నాకున్—అను నా శబ్దముయొక్క యర్థమును, తనకున్—అను తా శబ్దము బోధించుచున్నది. తమసొమ్ముతమకిచ్చె—అనుచోట, తమ=మాయొక్క, సొమ్ము=సొమ్మె, తమకున్=మాకు, ఇచ్చెనని యర్థము చెప్పఁబడెను. కాన నీ పక్షమున, మాయొక్క, మాకు. అను, "నా" శబ్దముయొక్క యర్థములను, "తా" శబ్దము బోధించుచున్నది. (అనుబంధము. విషయసంఖ్య—45.)

విమర్శ:— తనకిష్టుఁడున్—అనుచో, తనకున్=నన్నయకు—అని యర్థము చెప్పఁ దగును. తమసొమ్ము తమకిచ్చె—అనుచో, తమసొమ్ము=మహీసురులసొమ్మే, తమకున్=మహీసురులకు, ఇచ్చెనని యర్థము నెన్నదగును. ఈ పక్షమున నివి నామపదము యొక్క యర్థములనే బోధించుచున్నట్లు గ్రహింపఁదగును. ఇవి నా శబ్దముయొక్క యర్థమును బోధించుచున్నవని యన నక్కఱలేదు. విషయసంఖ్య—45.

## కర్తృబహుత్వంబునఁ దనతనకుఁ దమతమయు నగు. 79

ఉ: క. తమతమ పుత్రుఁడుగాఁజి, త్తములం జేకొని దయను బృథగ్భావములేక ముదంబునఁ బెంచిరి. భార. అర. 3ఆ—209. మొ॥

వ్యా. తా—శబ్దమునకు సంబంధించిన కర్త లనేకమున్నప్పుడు తనతన—అనుదానికి, తమతమ—అనియునగును. తమతమ పుత్రుఁడుగా, అనుచోఁ గర్తృపదము, "భాములు నార్వురును"—అని (ఆర 3—208) బహువచనాంతమై యున్నది. కాన, తనతనకు—అనుదాని కిట, తమతమకు—అని యయినది. తమతమయున్—అను సముచ్చయముచే, "తనతనకు"—అనియు నుండవచ్చును. తమతమపుత్రుఁడుగా=తనపుత్రుఁడుగా,నని యర్థము.

విమర్శ:— తనతన—అనుటకు, చూ. అనుబంధము—విషయ సంఖ్య 46.

## ఒక్కొక శబ్దంబుల యత్వంబున కొత్వంబు విభాషనగు. 80

ఉ: ఒక్కఁడు, ఒక్కొఁడు, ఒకఁడు, ఒకొఁడు.

వ్యా. ఒక్క, ఒక శబ్దముల తుది అత్వమునకు, ఒత్వము విభాషనగును. ఒక్క=ఒక్కొ, ఒక్క. ఒక=ఒకొ, ఒక. ఒక్క+డుజ్=ఒక్కఁడు—ఇత్యాది.

### ఒక్కొకాదులకు డువర్ణకంబు పరంబగునపుడు మహదర్థంబున రురువుగాగమంబులును, అవి పరంబగుచోఁ గకారమునకు లోపంబును, కకారాదులకు లోపంబురా డువర్ణకమునకు ద్విత్వయుక్త డువర్ణంబును, అమహదర్థంబునం గకారాదులకు లోపబిందువులును విభాషనగు. 81

ఉ: ఒక్కరుఁడు, ఒక్కొరుఁడు; ఒకరుఁడు, ఒకొరుఁడు; ఒక్కరువుఁడు, ఒక్కొరువుఁడు, ఒకరువుఁడు, ఒకొరువుఁడు; ఒరుఁడు, ఒరువుఁడు; ఒడ్డు, ఒండు.

వ్యా. ఒక్కొ కాదులకున్ = ఒక్క, ఒక, మున్నగువానికి, అనగా, ఒక్క, ఒక, ఒక్కొ, ఒకొ-అను వానికి డుప్రత్యయము పరమగునపుడు మహదర్థమున-రు, రువుగాగమములును, అవి పరంబగుచోన్=రు, రువుగాగమములు పరమగునపుడు, కకారమునకు లోపమును, కకారాదులకున్=క్క, క, క్కొ,కొ-అను వానికిని, రురువుగాగమములకును, లోపమువచ్చునపుడు, డు ప్రత్యయమునకు ద్విత్వయుక్తడువర్ణమును (డ్డు); అమహదర్థమున-కకారాదులకున్=క్క,క, క్కొ, కొ- అను వానికిని, లోపబిందువులును విభాషనగును. (i) మహదర్థమున, రురువుగాగమము లగుటకు- ఒక్క+డుజ్. రుగారాగమముకలిగిన-ఒక్క+రు+డుజ్=ఒక్కరుఁడు. వుగాగమము కలిగిన=ఒక్క+రువు+డుజ్=ఒక్కరువుఁడు. ఇట్లే, ఒక, ఒక్కొ, ఒకొ-అను ప్రాతిపదికములనుండి రూపములను సాధించుకొనవలెను. మహదర్థమున, "రు, రువు"గాగమములు పరమగుచో, కకారము లోపించుటకు:- ఒక్క+డుజ్=ఒక్క+రు+డుజ్-అనుచో, క్క-లోపించిన-ఒ+రు+డుజ్=ఒరుఁడు-అగును. ఒక్క+రువు+డుజ్-అనుచో, క్క-లోపించిన-ఒ+రు+డుజ్=ఒరుఁడు-అగును. ఒక్క+రువు+డుజ్-అనుచో, క్క-లోపించిన-ఒ+రువు+డుజ్= ఒరువుఁడు - అగును. ఇట్లే, ఒక, ఒక్కొ, ఒకొ-అను ప్రాతిపదికములనుండి రూపసాధనము చేయనగును. కకారాదులు లోపించుచో డు ప్రత్యయమునకు "డ్డు" వర్ణమగుటకు:- ఒక+రు+ఁడు- అనుచో "క+రు" అను వానికి లోపముకలిగి, ఒ+ఁడు-అని నిల్చును. డు ప్రత్యయమునకు "డ్డు" ఆదేశమయి-ఒ+ఁడ్డు-అని నిల్చును. ద్విత్వమునకుముందు బిందువుండరాదుగనుక లోపించును: ఒడ్డు. (ii) అమహదర్థమున-కకారాదులకు (=క, క్క, కొ, క్కొ-అనువానికి)రు రువుగాగములు కలుగక లోపబిందువు అగుటకు:- ఒక+డుజ్. క-లోపము: ఒ+డుజ్. బా. తత్సమ 19చే-ఒండు. ఇట బా. సంధి 22చే- ఖండబిందువు లేదు. లోపబిందువులు-అనుచోటి బిందుశబ్దము బా. తత్సమ 19చే-వచ్చు బిందువునే యనువదించుచున్న దనవగును. విభాషనుటచే-పక్షమున ఒక్కఁడు-మున్నగు రూపము లుండును. ఒక్క+డుజ్-ఇత్యాదిగా నిల్చినను, ఒ+డుజ్=ఒండు-అని యేర్పడును. (చూ. మూలములు.) (ద్విత్వయుక్త డు వర్ణమనుట సరికాదు. ఉదంత ద్విరుక్తడకారమనఁదగును.)

### టివర్ణంబమహదర్థంబున నొక్కఁడాదుల డువర్ణకంబునకు విభాషనగు. 82

ఉ: ఒక్కటి, ఒక్కొటి; ఒకటి, ఒకొటి.

వ్యా. అమహదర్థమున ఒక్కఁడు-మున్నగువాని "డు" ప్రత్యయమునకు, "టి"వర్ణము విభాషనగును. డు వర్ణకంబునకు-అని సూత్రించినను, డు వర్ణకము డుజ్జుగా నిర్దేశింపఁబడి

యుండుటచే (బా. తత్సమ 22) డుజ్వర్ణకమునకే టి వర్ణమగునని గ్రహింపనగును. ఒక్క+డుజ్ = ఒక్క+టిః ఒక్కటి. ఒక్కొ, ఒక, ఒకొ శబ్దములనుండి యిట్లే రూపసిద్ధి జరుగును. విభాషనుటచే నమహదర్థమున, ఒక్కఁడు-ఇత్యాది రూపములు సయితముండును.

## ఎక్కటి యొక్కటి. 83

ఉః స్పష్టము.

వ్యా. ఎక్కటి-అనునది యొక్కటి శబ్దమునకు రూపాంతరమని యర్థము.

## ఒక శబ్దంబొక్కచో నల్పార్థకంబగు. 84

ఉః ఒకమున్నాఁట గదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షుచాపంబు భాగ. 9స్కం, 262. ఒకనూటేఁడుల్. మార్కం. 5 ఆ. 80. ఏమొకకొందఱము. విక్ర. 5ఆ-201 మొ॥

వ్యా. ఒకశబ్దము కొన్నిచోట్ల, అల్పశబ్దముయొక్క యర్థముగలది యగును. అనఁగా నల్పార్థమును బోధించునది యగునన్నమాట. పై ప్రయోగములలో ఒక శబ్దమల్పార్థకమని వ్యాకర్త యభిప్రాయము.

విమర్శః- (i) ఒక మున్నాఁటగదల్చితెచ్చిన- అనుప్రయోగమున, ఒక శబ్దమధికార్థకమే కాని యల్పార్థకముకాదు. (ii) ఒక శబ్దమునకింకను నర్థవిశేషములునుగలవు. అర్థనిర్దేశము నిఘంటువులపని. ఇది శబ్దశాస్త్రమునకు విషయముకాదు. "అర్థానా దేశనాత్"- అని యభియుక్తోక్తి. కాన సూత్రము త్యాజ్యము.

## ఒకా, నొకచో ననిర్దిష్టార్థమందొక శబ్దమునకుం బూర్వాగమంబగు. 85

ఉః ఒకానొకఁడు, ఒకానొకతె, ఒకానొకటి, ఒకచోననుటచే- ఒకఁడు, ఒకతె, ఒకటి. ఒకశబ్ద మొక్కాదుల కుపలక్షణము.

వ్యా. ఒకాన్+ఒకచో=ఒకాన్-అనునది. ఒకచో, అనిర్దిష్టార్థమందున్=నిర్దేశింపఁబడని వస్తువును దెలుపుటయందు, ఒకశబ్దమునకు, పూర్వాగమంబగున్=ముందఱ నాగమమగును. అనిర్దిష్టార్థమున ఒకశబ్దమునకు ముందు, ఒకాన్ శబ్దమాగమ మగునన్నమాట. ఒక-ఒకాన్+ఒకః ఒకానొక. బా. తత్సమ22చే- ఒకానొక+డుజ్. తత్సమ 19చే-ఒకానొకఁడు. ఒకానొక=ఒకానొకరియొక్క+త=ఒకానొకతె (శబ్ద 70) ఒకానొక+డుజ్. శబ్ద82చే- ఒకానొకటి. ఒకచోన్- అనుటచే ననిర్దిష్టార్థమున, ఒకఁడు, ఒకతె, ఒకటి-అనునవియునగును. ఒకశబ్దము, ఒక్క లోనగువానికి, ఉపలక్షణము=సూచకము. అనఁగా, ఒక్క, ఒక్కొ, ఒకొ-అను వానికి ముందు ఒకాన్-కావచ్చును. ఒకానొక్కఁడు, ఒకానొక్కొఁడు, ఒకానొకొఁడు, ఒక్కఁడు, ఒక్కొఁడు, ఒకొఁడు - అన్నవియు నుండును. (చూ. మూలములు)

## సర్వనామంబులకు మహదర్థంబునం దఱచుగ లులలకు రురలగు. 86

ఉః ఎల్లరు, ఎల్లరన్; వారు, వీరు, వేరు. మొ॥ తఱచుగ ననుటచే- తాము, మేము, తమ్ముn, మమ్మున్, మిమ్ము నిత్యాదిరూపంబులునగునని యెఱుంగునది.

వ్యా. మహదర్థమున సర్వనామములకుఁబరమ్మైన లులలకున్ = లు ప్రత్యయమునకును లడాగమమునకును, రు, రలగున్ = వరుసగా, రు–ర అగును లు=రు; ల=ర–అగు నన్నమాట. ఎల్ల+లు = ఎల్లరు,ఎల్ల+ను.బా. తత్సమ 31చే ఎల్ల+లను. ఈ 86చే– ఎల్ల+రను=ఎల్లరను. వా+లు=వా+రు:వారు. వీ+లు=వీరు. వే+లు=వేరు. (చూ.53) తెలుపుగ ననుటచే, తాము, మేము, తమ్ముఁన్, మమ్ముఁన్, మిమ్ముఁన్–ఇత్యాది రూపములలో లులకు రురలగుట ప్రసక్తముకాదు. (చూ. మూలములు)

విమర్శ:- తాము, తమ్ముఁన్ – ఇత్యాదుల ప్రక్రియలో లులలగుటయే ప్రసక్తముకాదు గనుక వానికి రురలుకావని చెప్పవలసిన పని లేదు. బహువచనమున, లులలుకాక ము, మ్ము– అనునవియు నగునని సూచించుటయే వ్యాకర్త యుద్దేశమన నగును.

## ఏఁడేరేదేవి శబ్దంబు లర్థవిశేషంబునం దీకారాం తంబులగు. 87

ఉ: ఏఁడే నా బలుమానికంబుల కొటారు. అచ్చ.రా.అయో.కాం 88. వారేరీ సిరిమూట కట్టుకొని పోవంజాలిరే. భాగ. 7స్కం 500. ఏదియే, దీ యిది చాలక్రొత్త. కళా 1ఆ–92. మొ॥హ్రస్వాంతంబులు నగు ఉ: వాఁడేడి, వారేరి. మొ॥ (అర్థవిశేషము–ఎక్కడ, ఎక్కడనున్నాఁడు ఇత్యాది.)

వ్యా. ఏఁడు+ఏరు+ఏది+ ఏవి, శబ్దము లర్థవిశేషముల యందు, ఈకారాంతము లగును. ఏఁడు=ఎవఁడు–అని యర్థము. ఏఁడు+ఈ=ఏఁడీ–అనఁగా ఎక్కడ? = ఎక్కడనున్నాడు– అనియర్థము. ఏరు=ఎవరు. ఏరీ=ఎక్కడనున్నారు. ఏది=యత్కిమర్థకము. ఏదియేదీ=ఏట్లెట్లూ–అనియర్థము. ("ఏది=ఎట్లు, ఏదియేదీ–కళా" శ.ర. ఇదే ప్రకరణో చితమైన యర్థము.) ఇవి హ్రస్వాంతములుగూడ నగును. ఏఁడి=ఎక్కడనున్నాఁడు. ఏరి=ఎక్కడనున్నారు–ఇత్యాది. (చూ.మూలములు)

## అంతాదులకు వారు పరంబగుచో వాకు లోపంబును రురలకు ఉఅ లాదేశంబు నగు. 88

ఉ: అందఱు, అందఱన్, మొ॥

వ్యా. అంత మున్నగువానికి, అనఁగా, అంత, ఇంత, ఎంత, కొంత–చూపు (95 సూ) శబ్దములకు, వారు–అను తచ్ఛబ్దము పరమగుచో, 'వా'కు లోపమును, రురలకు వరుసగా ఉఱులును (రు=ఱు;ర=ఱ) నగును. అంత+వారు. ఈ88చే అంత+ఱు. 89చే–అంద+ఱు=అందఱు. అంత+ఆ+లను. 53చే– అంత+వా+లను. 86చే– అంత+వా+రను. ఈ88చే– అంత+ఱను. 89చే– అంద+ఱను=అందఱను, అందఱన్. ఇట్లే తక్కినవి. (చూ. మూలములు)

విమర్శ:- వారు–అనునది ద్వితీయాది విభక్తులలోఁబరముకాదు. కావున సూత్ర మునఁదచ్ఛబ్దమనుట లెస్స.

## వా లోపంబు తఱి వాని తకారంబునకు దకారంబగు. 89

ఉ: అందఱు, ఇందఱు, ఎందఱు, కొందఱు.

వ్యా. వాలోపంబుతఱిన్ = వారు–లోని 'వా' లోపించునపుడు, వాని = అంతాదులయొక్క, తకారమునకు దకారమగును. చూ. 88 వ్యాఖ్య. (చూ.మూలములు)

## ద్వితీయాదులం దసంయుక్త రవర్ణకంబు నత్వంబున కిత్వంబు తఱచుగనగు. 90

ఉ: వారిన్, వీరిన్, వేరిన్, ఒకరిన్; వాండ్రన్, వీండ్రన్, వేండ్రన్, ఒకండ్రన్, మొ॥ తఱచుగ ననుటచే, ఇరువుర నిత్యాదుల యం దిత్వంబు కలుగదు.

వ్యా. ద్వితీయాదులందున్=ద్వితీయాది విభక్తులకు ముందవ్యవహితముగనుండు, అసంయుక్తమగు, రవర్ణకముయొక్క అత్వమునకు ఇత్వము తఱచుగానగును. వారిన్:– ఆ–ప్రాతిపదికము. బా. తత్సమ 2చే– ఆ+ను. తత్సమ 31చే–ఆ+లను. శబ్ద 53చే–వా+ల+ను. 86చే–వా+ర+ను. ఈ 90చే–వా+రి+ను. బా. తత్సమ 26చే– వారిని. బా. సంధి 20చే–వారిన్. ఇట్లే, వీరిన్–మొదలైనవి. అసంయుక్త రవర్ణకంబనుటచే– సంయుక్తరవర్ణకముయొక్క అత్వమునకు ఇత్వముకాదు. ఉదా॥ ఆ+లను, 53చే–వ్+ఆ+లను=వా+లను. 86చే– వా+రను. 93చే–వాండ్+రను=వాండ్రను: వాండ్రన్. ఇట ఇత్వము రాలేదు. ఇట్లే, వీండ్రన్–మొ. (చూ. 93) తఱచుగ–అనుటచే, ఇత్వము, "ఇరువురన్"–ఇత్యాదులలోఁ గాదు. ఇరు+ల+ను. 97చే–ఇరు+గు+లను. 86చే– ఇరుగు+ర+ను. బా. ఆచ్ఛిక 27చే–ఇరువు+రను=ఇరువురను; ఇరువురన్. ఇట అసంయుక్తమగు రవర్ణకము అత్వమునకు ఇత్వము కాలేదన్నమాట.(ఇరువురిన్–కాదనుట.)

## రురవర్ణకంబులు పరంబులగునపుడు సాధారణంబుగ సంఖ్యావాచ కంబులకు గువర్ణంబు పూర్వాగమంబగు. 91

ఉ: ఇరుగురు, మూగురు, నలుగురు, అయిదుగురు, ఏగురు, ఆఱుగురు, ఏడుగురు, వేగురు, పదుగురు మొ॥ సాధారణంబుగ ననుటచే–ఎనమండ్రు, తొమ్మండ్రు, ఇరువండ్రు, ముప్పండ్రు–ఇత్యాదులందు రాదని యెఱుంగునది.

వ్యా. సంఖ్యావాచకములకు, రురవర్ణకములు పరమగునపుడు సాధారణముగా, వానికి గువర్ణము పూర్వాగమమగును. అనఁగా, రురలకు ముందు గువర్ణ మాగమమగుననుట. రెండు+లు. 86చే–రెండు+రు. 97చే–ఇరు+రు. ఈ 91చే–ఇరు+గు+రు=ఇరుగురు. ఇట్లే, అయిదుగురు, ఆఱుగురు, ఏడుగురు, మూగురు, నలుగురు–చూ. 92. ఏను+రు. 92చే–ఏ+రు. ఈ 91చే–ఏ+గురు: ఏగురు. వేయి+రు. 92చే–వే+రు. ఈ 91చే–వే+గురు=వేగురు. సాధారణముగా ననుటచేఁ గొన్నిచోట్ల గువర్ణము పూర్వాగమము కాదు. ఉదా॥ ఎనమండ్రు. మొ॥ చూ. 92.

విమర్శ:– సూత్రరచన సరిగా లేదు. "సంఖ్యావాచకంబులకు గువర్ణంబు పూర్వాగమంబగు" అనుట విరుద్ధార్థమునిచ్చును. గువర్ణముచేరవలసినది రురలకు ముందుగాని, సంఖ్యావాచకములకు ముందు కాదు. (చూ. మూలములు)

## సంఖ్యావాచకంబులకు విభక్తి పరంబగునపుడు కొన్నింటి యంత్యాక్షరంబులకు లోపంబగు. 92

ఉ: మూగురు, నలుగురు, ఎనమండ్రు, తొమ్మండ్రు, ఇరువండ్రు,

ముప్పం(డ్రు మొ॥ అక్షరంబుల కనుటచే ఎనబం(డ్రు లోనగువానియం దుపాంత్యవర్ణంబునకును లోపంబు. కొన్నింటి యనుటచే, అయిదుగురు, ఆఱుగురు–ఇత్యాదులందు లోపంబు లేదు.

వ్యా. సంఖ్యావాచకములకు విభక్తి పరమగునపుడు కొన్ని సంఖ్యావాచకముల తుది యక్షరములకు లోపమగును. మూగురు:– మూఁడు+లు. 86చే–మూఁడు+రు. ఈ92చే–మూఁ+రు స్థిరము పరమగుటచే బిందులోపము. మూ+రు. 91చే–మూ+గురు= మూగురు. నలుగురు:– నాలుగు+లు. 86చే– నాలుగు+రు. ఈ 92చే–నాలు+రు. 99చే–నలు+రు. 91చే–నలు+గురు=నలుగురు. ఎనమం(డ్రు. తొమ్మం(డ్రు:– ఎనిమిది+లు; తొమ్మిది+లు, 86చే–ఎనిమిది+రు; తొమ్మిది+రు. ఈ 92చే–ఎనిమి+రు; తొమ్మి+రు. ఎనిమి+రు–అనుచో 101చే– ఎనిమిది నివర్ణమునకు, అత్వ: ఎనమి+రు; తొమ్మి+రు; 93చే– ఎనమి+ండ్+రు; తొమ్మి+ండ్+రు. 94చే– ఎనమ+ండ్+రు=ఎనమం(డ్రు; తొమ్మ+ండ్+రు = తొమ్మం(డ్రు. ఇరువం(డ్రు, ముప్పం(డ్రు:– ఇరువది+లు; ముప్పది+లు. 86చే– ఇరువది+రు; ముప్పది+రు; ఈ 92చే– ఇరువ+రు; ముప్ప+రు. 93చే– ఇరువ+ండ్+రు = ఇరువం(డ్రు; ముప్ప+ండ్+రు = ముప్పం(డ్రు. అక్షరంబులకున్ – అను బహువచన స్వారస్యముచే, అంత్యాక్షరమునకే కాక కొన్నిచోట్ల నుపాంత్యవర్ణమునకును లోపమగునవి వివరింపఁబడెను. ఉపాంత్యవర్ణము=అంత్య వర్ణమునకు సమీపవర్ణము. (ఉప=సమీపము) వర్ణశబ్దము స్వరసహితమగు హల్లును బోధించును. కావునఁ దుది యక్షరముదానికి ముందున్న యక్షరము రెండును లోపించునన్నమాట. ఉదా॥ ఎనబం(డ్రు. చూ. సమాస 24 వ్యాఖ్య. కొన్నింటి–అనుటచే, అయిదు+రు; ఆఱు+రు–అనుచోట్లఁ దుదియక్షరములు లోపింపవు. 91చే అయిదుగురు, ఆఱుగురు–అను రూపములు సిద్ధించును.

### రు ర వర్ణకంబులు పరంబులగునపుడు కొన్నింటికి నిత్యము గాను, గొన్నిటికి వైకల్పికముగాను, బిందుపూర్వక డకారంబు పూర్వాగమంబగు. 93

ఉ: ఎనమం(డ్రు, ఎనమం(డ్రన్; తొమ్మం(డ్రు, తొమ్మం(డ్రన్; ఇరు వం(డ్రు, ఇరువం(డ్రన్; ముప్పం(డ్రు, ముప్పం(డ్రన్; నలువం(డ్రు, నలువం(డ్రన్; ఏఁబం(డ్రు, ఏఁబం(డ్రన్; అఱువం(డ్రు, అఱువం(డ్రన్; డెబ్బం(డ్రు, డెబ్బం(డ్రన్; ఎనుబం(డ్రు, ఎనుబం(డ్రన్; తొంబం(డ్రు, తొంబం(డ్రన్; మొ॥ పెక్కం(డ్రు, పెక్కం(డ్రన్; పెక్కురు, పెక్కురన్; పదుం(డ్రు, పదుం(డ్రన్; పదురు, పదురన్; పదుగుం(డ్రు, పదుగుం(డ్రన్; పదుగురు, పదుగురన్; వాం(డ్రు, వాం(డ్రన్; వారు, వారిన్. మొ॥

వ్యా. కొన్ని సర్వనామములమీఁది రురవర్ణకములకు నిత్యముగాను గొన్ని సర్వనామము లమీఁది రురవర్ణకములకు వైకల్పికముగాను బిందుపూర్వక డకారము పూర్వాగమమగునని యుద్దిష్టార్థము. రువర్ణకమునకు:– ఎనమం(డ్రు, తొమ్మం(డ్రు–మొ॥ చూ. 92వ్యాఖ్య రవర్ణకమునకు–ఎనిమిది+ను, బా. తత్సమ31చే–ఎనిమిది+లను, శబ్ద86చే–ఎనిమిది+రను. 92చే–ఎనిమి+రను. 101చే–ఎనమి+రను. ఈ 93చే–ఎనమి+ండ్+రను. 94చే–ఎ నమ+ండ్+రను=ఎనమం(డ్రను; ఎనమం(డ్రన్. ఇట ఖండబిందు పూర్వక డకారమును నిలిపినను బా. అచ్చిక 15చే–ఖండము పూర్ణమగును. కాని, ప్రక్రియా సౌలభ్యదృష్టితో నిటఁ బూర్ణబిందుపూర్వక డకారమునే నిల్పఁదగును. తొమ్మిది+ రను. 92చే–తొమ్మి+రను. ఈ

93చే–తొమ్మి+ఁడ్+రను. 94చే–తొమ్మ+ండ్+రను = తొమ్మండ్రను; తొమ్మండ్రన్. ఇట్లే, యిరువండ్రన్–మొ॥ బిందు పూర్వక, డకారము వైకల్పికముగా నగుటకు:– పెక్కండ్రు: పెక్కు+లు. 86చే–పెక్కు+రు. ఈ 93చే–పెక్కు+ండ్+రు. 94చే–పెక్క+ండ్+రు=పెక్కండ్రు. పక్షమున–పెక్కు+రు=పెక్కురు. పెక్కండ్రను:– పెక్కు+లను, 86చే–పెక్కు+రను. ఈ 93చే– పెక్కు+ండ్+రను. 94చే– పెక్కండ్రను=పెక్కండ్రన్. పక్షమున–పెక్కు+రను=పెక్కురను: పెక్కురన్. పదుండ్రు– మొ:– పది+లు. 86చే– పది+రు. 102చే– పదు+రు. 93చే– పదు+ండ్+రు=పదుండ్రు. పక్షమున–పదు+రు=పదురు. పదు+రు– 91చే– పదు+గు+రు, ఈ 93చే– పదు+గు+ఁడ్+రు=పదుగుండ్రు. పక్షమున–పదు+గు+రు=పదుగురు. పదుండ్రన్– మొ॥:– పది+లను. 86చే– పది+రను. 102చే– పదు+రను. ఈ 93చే– పదు+ండ్+రను = పదుండ్రను: పదుండ్రన్. పక్షమున–పదు+రను = పదురను: పదురన్. పదు+రను. 91చే–పదు+గు+రను. ఈ 93చే–పదు+గు+ండ్+రను = పదుగుండ్రను: పదుగుండ్రన్. పక్షమున–పదు+గు+రను = పదుగురను: పదుగురన్. వాండ్రు:– ఆ+లు. 86చే– ఆ+రు. 53చే–వ్+ఆ+రు = వా+రు. ఈ 93చే– వా+ండ్+రు = వాండ్రు. పక్షమున–వా+రు=వారు. వాండ్రన్, వారిన్–చూ. 90 సూ. (చూ. మూలములు)

విమర్శ:– సూత్రరచన సరిగా లేదు. బిందుపూర్వకడకారము రురలకు ముందు చేరవలసియుండఁగా సర్వనామములకు ముందు చేరునట్లు సూత్రింపఁబడెను.

## బిందుపూర్వక డకారంబు పరంబగుచోఁ దుది యిత్వోత్వముల కత్వంబగు. 94

ఉ: ఉక్తము.

వ్యా. బిందుపూర్వక డకారము పరమగునపుడు సర్వనామముల తుది ఇత్వమునకు ఉత్వమునకు, అత్వమగును. ఉక్తము=వచింపఁబడినది. అనఁగా 92, 93 సూత్రములలో నిది ప్రసక్తమయ్యెనని భావము. ఇత్వ మత్వమగుటకు:– తొమ్మండ్రు–92సూ. ఉత్వమత్వమగుటకు:– పెక్కండ్రు–93 సూ.

## కొండొకయెడ ఌౡవర్ణకములు పరంబగునపుడును నత్వంబగు. 95

ఉ: చూపఌ, చూపౡన్. మొ॥

వ్యా. ఒకానొకచోట, (పూర్ణబిందుపూర్వక డకారము పరమగునపుడే కాక=94సూ) ఌ–ౡ వర్ణకములు పరమగునపుడు సహితము ఉత్వమునకు, అత్వమగును. చూపఌ:– చూపు+వారు. 88చే–చూపు+ఌ. ఈ 95చే–చూప+ఌ=చూపఌ. అనఁగాఁ జూచుట కలవారు. చూచు+పు=చూపు. (బా. కృదంత 11) చూపౡన్:– చూపు+వా+లను. 86చే–చూపు+వా+రను. 88చే–చూపు+ౡను. ఈ 95చే–చూపౡను=చూపౡన్.

## పలుశబ్దంబునకు రురలుపరంబులగునపుడు గువర్ణంబును, వలయుచో మీఁద బిందుపూర్వక డకారంబును విభాషనగు. 96

ఉ: పలుగురు, పలుగురన్; పలుగుండ్రు, పలుగుండ్రన్. మొ॥

వ్యా. పలుశబ్దమునకు "రు, ర"లు పరమగుచో గువర్ణమును, గావలసినచో నీ గువర్ణముమీఁద బిందుపూర్వకమగు డకారమును విభాషనగును. పలు+లు. 86చే–పలు+రు. ఈ 96చే–పలు+గు+రు=పలుగురు. వలయుచో బిందుపూర్వకడకారము: పలుగు+ండ్+రు = పలుగుండ్రు. ఇట ఖండబిందుపూర్వక డకారమును నిల్పి–పలుగు+ఁడ్+రు–అని చూపినను, బా. అచ్చిక 15చే–ఖండమెట్లును బూర్ణముగానగును. కావునఁ బ్రక్రియా సౌలభ్యమునకుఁ

వ్యాప్తమును నిల్పఁదగును. పలు+లను. 86చే-పలు+రను. ఈ 96చే-పలు+గు+రను=ప లుగురను. వలయుచో-పలు+గు+ండ్+రను= పలుగుండ్రను: పలుగుండ్రన్. బా. సంధి 20చే- ద్రుతస్వర లోపములు.

## ఇరు రెండున కాదేశంబగు. 97

ఉ: ఉక్తము

వ్యా. రురలు పరమగునపుడు ఇరుశబ్దము రెండుశబ్దమున కగును. ఉక్తము=వచింపఁ బడినది. ఉదా॥ ఇరుగురు-చూ. 91. ఈ యాదేశము సమాసమునందును నగును. సమాస 36.

## ఒకానొకచో నిరుగురున కిద్దఱాదేశంబగు. 98

వ్యా. ఇరుగురు-అనుదాని కొకానొకచో-"ఇద్దఱు" అన్నది యాదేశమగును. ఇరుగు-అనుదానికి, ఇద్ద- అనియు, రువర్ణకమునకు, ఱు-అనునదియు నాదేశములగు నన్నమాట. ఱ వర్ణకము ర వర్ణకమున కుపలక్షణము. ఇరువు+రను=ఇద్దఱను-ఇత్యాది.

## విభక్తి పరంబగుచో మూఁడునాలుగుల దీర్ఘంబునకు హ్రస్వంబు బహుళంబుగా నగు. 99

ఉ: ముగురు. (శేషముక్తము)

వ్యా. విభక్తి పరమగునపుడు-అనఁగా, రురలు పరమగునపుడు, మూఁడు, నాలుగు శబ్దముల దీర్ఘమునకు హ్రస్వము బహుళముగా నగును. ముగురు: మూఁడు+లు. 86చే-మూఁడు+రు. 92చే-మూఁ+రు. స్థిరము పరమగుటచే బిందు లోపము: మూ+రు. ఈ 99చే-ము+రు. 91చే-ము+గురు=ముగురు. దీర్ఘము హ్రస్వము కాని పక్ష మున-మూ+రు=మూగురు. శేషము=మిగిలినది, ఉక్తము=(ఇంతకుముందే) వచింపఁబడినది. ఉదా: నాలుగు+రు=నలుగురు-చూ.92 సూ.

## ప్రాప్తహ్రస్వంబులగు మూడేలమీఁది వర్ణంబులకు ద్విత్వంబు బహుళంబుగ నగు. 100

ఉ: ఉక్తము.

వ్యా. ప్రాప్తహ్రస్వంబులగు=పొందఁబడిన హ్రస్వము గలవియగు, మూడేల మీఁది.మూ, డే-అనువాని మీఁది, వర్ణములకు, ద్విత్వము బహుళముగా నగును. మూఁడు+రు=ము+గురు (చూ. 99) అని నిల్చును. ఇట మూఁడులోని, మూవర్ణమునకు "ము" అని హ్రస్వము ప్రాప్తించెను. కాన నిది ప్రాప్తహ్రస్వ మగు మూవర్ణమగును. ఈ 100చే-దీని మీది గకారమునకు ద్విత్వము బహుళముగా నగును. ము+గురు=ముగ్గురు. పక్షమున-ముగురు. ప్రాప్తహ్రస్వమగు డే-మీది వర్ణమునకు ద్విత్వమగుటకు, డెబ్బది-చూ. సమాస 24. ఉక్తము=ద్విత్వమగునన్న విషయముతప్పఁ దక్కినదంతయు నింతకు ముందే చెప్పఁబడెనని తాత్పర్యము.

## ఎనిమిది నివర్ణంబున కత్వంబగు. 101

ఉ: ఉక్తము

వ్యా. ఎనిమిది శబ్దమునందలి నివర్ణములోని ఇత్వమునకు, అత్వమగునని తాత్పర్యము. ఉదా: ఎనమండ్రు. ఉక్తము=వచింపఁబడినది. 92 సూత్రమునఁజెప్పఁబడెనని భావము. అత్వ

మేకవర్ణముగాన "ఎ" వర్ణములోని ఇత్వమునకే యాదేశమగును. (చూ. అనుబంధము. విషయ సంఖ్య-47.)

## పది యిత్వంబున కుత్వంబగు. 102

ఉ: ఉక్తము.

వ్యా. రురలు పరమగునపుడు, పదిశబ్దమునందలి ఇత్వమునకు ఉత్వమగును. పది+రు=పదురు. ఉక్తము=చూ. 93 సూ.

## కొన్నియెడల నవకగు కానంబడియెడి. 103

ఉ: క. వినవేడగు పర్వము మే, లనఁగా ద్రోణాభిషేక మాదిగఁ గల య, య్యెనిమిది పర్వములను న, త్యనుపమమై ద్రోణపర్వమమరున్ సభలన్. భార. ఆది. 1ఆ-47. క. అనుపమబలులగు కర్ణా, ర్జున వీరుల శౌర్యమహిమ శోభిల్లంగా, నెనిమిది యగు పర్వంబిది, యనఁ బరఁగుం గర్ణపర్వ మతిహృద్యంబై. భార ఆది 1ఆ-49. చ. పదియగువేయి నిండుటయుఁ బంక్తిముఖుండు మనంబునన్ ముదం, బొదవఁగ నిర్వికారమున నున్న శిరంబును గోయఁ జూచినన్. నిర్వ. 3ఆ-67 (ఇట్టియెడల అవయనియే యుండవచ్చును. అయినను గ్రంథములయందుఁ బాఠమిట్లుగపడుచున్నది.)

వ్యా. కొన్నిచోట్ల 'అవ' అను దానికి అగు-అనునది కనఁబడుచున్నది. బా. అచ్ఛిక 25చే-సంఖ్యకు పూరణార్థమున అవగాగమమగును. దానికి అగు-అన్నది యిటుఁ గనఁబడునని చెప్పఁబడెను. ఏడగుపర్వము, ఎనిమిదియగు పర్వము, పదియగు వేయి-అని ప్రయోగములు. ఏడు+అవ=ఏడు+అగు: ఏడగు-ఇత్యాది. ఈప్రయోగములలో, ఏడవపర్వము-అనురీతిని అవగాగమమునే నిల్పవచ్చును. ఏలయన నివి యతి ప్రాసాదిగతములుకావు. కాని, అగు-అను నుపలబ్ధపాఠమును బట్టి యిట్లు సూత్రింపఁ బడెను.

## మహద్విశేషణ సంఖ్యావాచకంబులకుం గొన్ని యెడల నమహత్కార్యంబు చూపట్టెడి. 104

ఉ: వ. ఇందుఁ బౌలోమకాలకేయులను నసురు లఱువది వేలుందురు. భార. అర. 4ఆ-81. సీ. జనవంద్యుఁడగు ధర్మ, తనయుని బంతి నిత్యంబు పసిఁడి, పళ్లెరంబులఁ గుడ్చు బ్రాహ్మణులతిపుణ్య, లెనిమిదివేలు సమిద్ధమతులు; యతులుపదివేలు వారల కనుదినంబు, నన్నపానంబులందు సహాయనగుదు. భార. అర. 5 ఆ-306 వ. కనక భూషణాలంకృతులయిన పరిచారకులు నూఱువేలు. భార. అర. 5ఆ-307 సీ. వారాకరంబులో వటపత్రశయనులౌ, నబ్జనాభులు నూఱునైదు పదులు. కాశీ 6ఆ-131. సీ. మూఁడర్బుదములు సముద్యద్భుజాటోప, విజయధౌరేయులు వీరభటులు. జై. 5ఆ-174 ఉ. వేఁడివెలుంగులోలిఁ బదివేల సహస్రములున్నభంగి నె, వ్వాఁడు వెలుంగు నట్టి బుధవత్సలుఁడేగె నదృశ్యమూర్తియై. భోజ

4ఆ–351. (కొన్నియెడల ననుటచే–పదివేవురు నూఱునేఁబండ్రు, (లేక) నూటయేఁబండ్రు–అని యిట్లు మహత్ప్రియుక్త రూపంబులుం గలవని యెఱుంగ వలయును. కడపటి యుదాహరణములయందలి సంఖ్యావాచకములు తత్సమములుగాన వానికట్టి రూపములు మూఁడర్బుదముల సంఖ్యలవారు, పదివేలసహస్రముల సంఖ్యలవారు–అని యేర్పడుచున్నవి.)

వ్యా. మహద్వాచకములకు విశేషణములగు, సంఖ్యావాచకములకుఁ గొన్నిచోట్ల నమహద్వాచకములకగు వ్యాకరణకార్యము కనఁబడునని యర్థము. అసురులు–అఱువదివేలు, అనుచో–అసురులు, మహత్తు. కాన దీనివిశేషణమగు సంఖ్యావాచకము మహత్తుకావలెను. కాని యిట నఱువదివేలు–అని యమహద్వాచక విశేషణమయినది. కొన్నియెడల–అనుటచే మహద్విశేషణము లెట్లును నగునని వివరింపఁబడెను. అనఁగా, అసురులు–అఱువది వేవురు–కావచ్చుననుట. ఇట్లే, బ్రాహ్మణులెనిమిదివేలు, యతులుపదివేలు, పరిచారకులు నూఱువేలు–అనుచో నమహత్కార్యములైనవి. బ్రాహ్మణులెనిమిదివేవురు, యతులుపదివేవురు, పరిచారకులు నూఱువేవురు–అను మహద్విశేషణములును గావచ్చును. అబ్జనాభులు నూఱు నైదుపదులు–అనుచో నమహత్కార్యమైనది. ఇట, నూఱునేఁబండ్రు, లేదా–నూటయేఁ బండ్రు, అను మహద్రూపములు సహితము కావచ్చును. వీరభటులు మూఁడర్బుదములు–అనుచో అర్బుదము–అను తత్సమ సంఖ్యావాచకమున కమహత్కార్యమయినది. దీనికి మహత్కార్యమయినచో– మూఁడర్బుదముల సంఖ్యల వారు–అని యగును. వేఁడివెలుంగులు పదివేల సహస్రములు–అనుచో సహస్రము–అను తత్సమవిశేషణమున కమహత్కార్యమయినది. పదివేల సహస్రముల సంఖ్యల వారు–అను మహద్రూపమును గావచ్చును.

విమర్శ:- ఇట్టి ప్రయోగము లనుసరణీయములు కావు.

## ఔపవిభక్తికాంతంబులగు చేయి నేయి లోనగు శబ్దంబుల యాద్యచ్చునకు హ్రస్వంబును, మీఁది హల్లునకు ద్విత్వంబును బ్రథమైకవచనంబునందు వైకల్పి కంబుగ నగు. 105

ఉ: చేయి, చెయి. చెయ్యి; నేయి, నెయి. నెయ్యి, మొ॥ ఇతర స్థలంబులయందు – ఉ: చేతితోన్, చేతికిన్; నేతితోన్, నేతికిన్. మొ॥

వ్యా. ఔపవిభక్తికములు చివరఁజేరఁదగిన, చేయి, నేయి, మున్నగు శబ్దముల తొలియచ్చునకు హ్రస్వమును; దొలియచ్చు మీఁదిహల్లునకు ద్విత్వమును; బ్రథమైకవచనమున వైకల్పికముగా నగును. చేయి–ఇటఁ దొలియచ్చునకు హ్రస్వము కలిగినచో, చెయి–అగును. పక్షమున–చేయి. ఆద్యచ్చుమీఁది హల్లునకు ద్విత్వము కలిగినచో–చేయి=చెయ్యి. బా. సమాస13చే–చెయ్యి. పక్షమున–చేయి. ఇట్లే, నేయి=నెయి; నేయి=నెయ్యి. పక్షమున–నేయి. ప్రథమైకవచనంబునందు–అనుటచే నితరవిభక్తులు పరమగునపుడు హ్రస్వద్విత్వములు కలుగవు. చేయి+తోన్=చేతితోన్. ఇట, చెయి, చెయ్యి–అనురూపములు కావు. (అనఁగా చెతితోన్, నెతితోన్–కావనుట.)

విమర్శ:- (i) చెయి, చెయ్యి–వంటిరూపములను బాలవ్యాకరణముచే సాధించినను (బా. ప్రకీర్ణక 6, 8, 12 సూ) బ్రథమైకవచనేతర స్థలములయందనిష్టరూపములు ప్రాప్తింప

వలసివచ్చును. (చెయి+లు=చెయులు, చెయ్యి+లు=చెయ్యులు–వంటి వేర్పడవలసివచ్చుననుట.) కావున నీసూత్రము పరిగ్రాహ్యమన నగును. (ii) ఔపవిభక్తికములు చేరఁదగు శబ్దములనుగూడ నౌపవిభక్తికములనియే యనవలెను. ఔపవిభక్తికాంతములనుట సరికాదు. (చూ–బా. ఆచ్ఛిక 28–ఘంటా)

## ఊరుచోటుమేన్వాదు లున్లుగ్విషయంబులు. 106

**ఉ:** ఊరులోనగువానికిఁ దృతీయ యందత్వము సంప్రాప్తింపదుగాన 'ఔపవిభక్తిక నామ్నామత్వంస్యా త్సప్తమీ తృతీయార్థే' అను సూత్రమున కవి విషయములుగాక "కేషాంచిదుంతా నాం నేతివిభక్తావునోలుక్స్యాత్" అను సూత్రమునకు విషయంబు లగుచున్నవని యెఱుంగ వలయును.

**వ్యా.** ఊరు, చోటు, మేను–మున్నగునవి ఉన్+లుక్=ఉన్, లోపించుటకు, విషయములు. ఊరు– మున్నగువానికిఁ దృతీయయందత్వము కలుగదు. కనుక నివి చింతామణియందలి "ఔపవిభక్తికనామ్నా మత్వంస్యాత్ సప్తమీ తృతీయార్థే" అను సూత్రమునకు విషయములు కావు. ఔపవిభక్తికనామ్నామ్=ఔపవిభక్తికములగు ప్రాతిపదికములకు, సప్తమీతృతీయార్థే=సప్తమ్యర్థమునందును, దృతీయార్థమునందును, అత్వం స్యాత్=అత్వమగును. తృతీయాసప్తములు రెండింటియందును, అత్వమగు శబ్దములే యీ సూత్రమునకు విషయములగును. ఊరు లోనగువానికి సప్తమ్యర్థమొక్కటే కలదు; తృతీయార్థములేదు. కాన నివి యీ సూత్రమునకు లక్ష్యములు కావని తాత్పర్యము. ఇవి, "కేషాంచిదుదంతానాం నేతివిభక్తా వునో లుక్ స్యాత్" అను చింతామణి సూత్రమునకు విషయములగును. కేషాంచిత్=కొన్ని, ఉదంతానామ్=ఉదంతములగు నౌపవిభక్తికశబ్దములకు, న ఇతి, విభక్తౌ=న–అను సప్తమీ విభక్తిప్రత్యయము పరమగునపుడు, ఉనః=ఉన్–అనుదానికి, లుక్=లోపము, స్యాత్– అగును. ఊరులోనగునవి యీ సూత్రమునకు విషయములగుటచే వీనికి సప్తమ్యర్థ మొకటే సిద్ధించును. బాలవ్యాకరణమున నివి "ఔపవిభక్తికనామ్నామ్" అను సూత్రమునకు విషయములుగాఁ జేసి సూత్రింపఁబడెను. ఇవి కేషాంచిత్–అను సూత్రమునకు విషయములుగాఁజేసి వేఱుగా సూత్రించుట యుక్తమని ప్రౌఢవ్యాకర్త యభిప్రాయపడెను.

**బాలవ్యా.** పక్షమున–ప్రక్రియ: బా.తత్సమ7చే–ఊరు+అందు. ఆచ్ఛిక 30చే–ఊరి+ అందు. ఆచ్ఛిక 38చే–ఊరి+అ. తత్సమ 8చే–ఊరి+అను. సంధి 11చే–ఊరను=ఊరియందు. ఊరి+చేత–అనుచో, ఆచ్ఛిక 38 సూత్రమునందలి బహుళగ్రహణముచేఁ దృతీయకు అత్వమాదేశముకాదని వ్యాఖ్యానించి సరిపెట్టనగును. ప్రౌఢ వ్యా. పక్షమున ప్రక్రియ: బా. కారక 18చే–ఊరు+న. (=ఊర్+ఉన్+అ) ఉన్–లోపించిన–ఊర్+అ=ఊర. బా. తత్సమ 8చే–ఊరను. లుక్–అనునది విభక్తిలోపమును దెలుపుట పాణినీయ వ్యవహారము. ఇట లోప మను నర్థమున వాడుట ప్రాకృతవ్యవహారానుసారి. (చూ. అనుబంధము. విషయసంఖ్య–128)

**విమర్శ:–** తృతీయా సప్తమ్యర్థములు గల శబ్దములను, సప్తమ్యర్థము మాత్రమే గల శబ్దములను, మూలము నందువలె వేర్వేఱుగా సాధించుటయుక్తమని ప్రౌఢవ్యాకర్త యాశయము. బాలవ్యాకర్త సంక్షేపదృష్టి నవలంబించెను. ప్రౌఢవ్యాకర్త విశ్లేషణ దృష్టి నవలంబించెను. (చూ. అనుబంధము విషయసంఖ్య–10)

## సద్రుతం బంత శబ్దంబు తనతమ పూర్వకంబు స్వయమర్థకంబగు. 107

ఉ: తనయంత, తనంత; తమయంత, తమంత. చ. వనిత తనంతఁదా వలచివచ్చినఁజుల్కనగాదె యేరికిన్. స్వా. 2ఆ-66 మొ॥

వ్యా. సద్రుతంబు=ద్రుతముతోఁ గూడినది, తనతమ పూర్వకంబు=తన, తమ-అనునవి ముందుగాఁ గలది, అగు, అంతశబ్దము స్వయమర్థకంబు="స్వయమ్" అను శబ్దముయొక్క యర్థముగలది, యగును. కర్త యేకవచనాంతమయినచో, తన శబ్దపూర్వకమును, గర్త బహువచనాంతమైనచో, తమశబ్దపూర్వకము, నగునన్నమాట. వనిత తనంత దావలచి వచ్చిన-అనుచో, తనంతను=స్వయముగా, అనియర్థము. తనకుఁదానే(తాను)వలచివచ్చెనని భావము. తమంతను స్వయముగా. అనఁగాఁ దమకుఁ దామే (తాముగా) అని భావము. తన+అంతను తనంతను. తనయంతను. (చూ. మూలములు)

## షష్ఠ్యంత తదేతద్యుష్మదస్మదాత్మ శబ్ద పూర్వకంబులగు ప్రథమాంత తదాది శబ్దంబు లవధారణార్థకాంతంబులు తఱచుగ స్వయమర్థకంబులగు. 108

ఉ: వానికివాఁడె, వీనికివీఁడె, నీకునీవె, నాకునేనె, తనకుఁదానె, వారికివారె, మొ॥ తఱచుగననుటచే-తనుదాన, తారుదారె-ఇత్యాదులు గ్రాహ్యములు. సీ. పొరలెత్తి ఘనసార తరువులఁ దనుదాన, తొరఁగిన పచ్చకప్పురపు రజము. స్వా. 2ఆ-55 తనుదానాపూర్ణప్రభల వెలయు. వసు. 1ఆ. మొ॥

వ్యా. షష్ఠ్యంత=షష్ఠీవిభక్త్యంతములగు, తద్=ఆ, ఏతద్=ఈ, యుష్మద్=నీ, అస్మద్=నా, ఆత్మన్=తా, శబ్దములు, పూర్వకంబులగు=ముందుగలవియగు, అవధారణార్థకాంతంబులు=అవధారణార్థము చివరఁగల వైన, అనఁగా, అ-ఎ-ఏలు అంతమందుఁ గలవైన, ప్రథమాంత=ప్రథమా విభక్త్యంతములగు, తదాదిశబ్దంబులు=తద్-మున్నగు శబ్దములు, అనఁగా, తద్ (ఆ) ఏతద్ (ఈ) యుష్మద్ (నీ), అస్మద్ (నా) ఆత్మన్ (తా), శబ్దములు, తఱచుగా, స్వయమర్థకంబులగున్=స్వయమ్-అను శబ్దముయొక్క యర్థముగలవి యగును. షష్ఠ్యంతములగు, ఆ ఈ నీ నా తా శబ్దములు ముందుగలిగి, అవధారణార్థకములు (అ ఎ ఏలు) అంతమందుఁగలిగిన, ప్రథమాంతములగు, ఆ ఈ నీ నా తా శబ్దములు, స్వయమర్థకము లగునని తాత్పర్యము. తచ్ఛబ్దమునకు:- (ఆ) వానికి వాఁడె, ఇట, వాఁడు+ఎ, అనుచో, వాఁడు-ప్రథమాంతమగు తచ్ఛబ్దము. ఇది, ఎ-అను అవధారణార్థకమంతమందుఁగలిగి యున్నది. వాఁడు-అనుదానికి ముందు, వానికిన్-అను షష్ఠ్యంతమగు తచ్ఛబ్దము గలదు. కావున నిటఁ బ్రథమాంత తచ్ఛబ్దము స్వయమర్థకమగును. ఉదా॥ వానికె వాఁడె వచ్చెను. అనుచో, వాఁడు స్వయముగా (తనంత) వచ్చె అని యర్థము. ఇట్లే వారికి వారె. ఏతచ్ఛబ్దమునకు:- (ఈ) వీనికివీఁడె. యుష్మచ్ఛబ్దమునకు (నీ) నీకునీవె, అస్మచ్ఛబ్దమునకు (నా):- నాకునేనె, ఆత్మశబ్దమునకు (తా): తనకుఁ దానె. తఱచుగా ననుటచే-తనుదాన, తారుదారె, మున్నగునవి గ్రాహ్యములు. అనఁగా వీనిలోఁ బూర్వపదములు షష్ఠ్యంతములు కాలేదు. తనుదాను-అనుచోఁ బూర్వపదము షష్ఠ్యంతము కాలేదు. ఇంతేకాక "తాన" అని తాను శబ్దము, అవధారణార్థకాంతమును గాలేదు. తఱచుగ-అనుటచే నరుదుగా నిట్టిరూపము లుండవచ్చునన్నమాట. (చూ. మూలములు)

## కొన్నియెడల షష్ఠ్యంత తదాదిశబ్ద పూర్వకంబులు గాకయు నవి స్వయమర్థకంబులగు. 109

ఉ: వాఁడే వచ్చెను. వాఁడు తనంత వచ్చెననుట—ఇత్యాదు లెఱుంగునది.

వ్యా. కొన్నిచోట్ల, అవి=ప్రథమాంతములగు, ఆ, ఈ, నీ, నా, తా శబ్దములు, షష్ఠ్యంత తదాది శబ్ద పూర్వకంబులు గాకయున్=షష్ఠ్యంతములగు, ఆఈనీ నా తా శబ్దములు (చూ. 108 సూ) పూర్వపదములుగాఁ గలవి కాకయు, స్వయమర్థకములగును. ఉదా॥ వాఁడేవచ్చెను. ఇట, 108చే- వానికి వాఁడే వచ్చెను. అని కావలసియుండఁగా నీసూత్రముచే, 'వానికి' అనునది పూర్వపదముగ రాలేదు. వాఁడేవచ్చెను=వాఁడు తనంత వచ్చెననుట.

## షష్ఠ్యంత తదేతద్యుష్మదస్మదాత్మ శబ్ద పూర్వకంబంతట శబ్దంబు పృథగర్థకంబగు. 110

ఉ: వానియంతట వాఁడున్నాఁడు. మొ॥

వ్యా. షష్ఠ్యంతములగు, తద్=ఆ, ఏతద్=ఈ, యుష్మద్=నీ, అస్మద్=నా, ఆత్మన్=తా, శబ్దములు ముందుగాఁ గలిగిన, అంతట శబ్దము, పృథగర్థకంబగున్=పృథక్—అను శబ్దము యొక్క యర్థము గలది యగును. పృథక్=వేఱు. వానియంతట వాఁడున్నాఁడు=వాఁడు వేఱుగా నున్నాఁడని యర్థము. వానియొక్క+అంతట=వానియంతట—అయినది.

## ఆదరార్థంబునం ద్విరుక్తియగు. 111

ఉ: కృష్ణకృష్ణ, హరిహరి మొ॥

వ్యా. ఆదరార్థమున, ద్విరుక్తియగున్=రెండుసార్లు పలుకుట యగును. అనఁగా నాదరార్థమునఁ గొన్నిశబ్దములు రెండుసార్లు పలుకఁబడును. కృష్ణకృష్ణ, హరిహరి. మొ॥

విమర్శ:- కృష్ణకృష్ణ—ఇత్యాదు లాదరార్థమున నగుననుట తృప్తికరము కాదు. అర్థ విశేషంబులందగు ననుట యుక్తము.

## అత్యంతార్థంబునందు నగు. 112

ఉ: ఔరౌర, కటకటా. మొ॥ కనికని, వినివిని మొ॥ తద్గుణౌఘముల్, వినివిని. కళా 6ఆ—209 మొ॥

వ్యా. అత్యంతమను నర్థమునందును ద్విరుక్తి యగును. ఔర+ఔర=ఔరౌర. ఇట నత్యంతాశ్చర్యమును దెలుపుటయందు ద్విరుక్తియయ్యెను. కటకటా—అనుచో, నత్యంత సంతాపమున, కటశబ్దమునకు ద్విరుక్తి కలిగెను. కనికని అనుచో, కని—అనునది మిక్కిలి యెక్కువగాఁ జూచుటయందు ద్విరుక్తినందెను. వినివిని—అనుచో నత్యంతమువినుటయందు ద్విరుక్తి కలిగెను.

## కొన్నియెడలం ద్వరితానాదరార్థంబుల రెంటను నగు. 113

ఉ: లేలెమ్ము, పోపొమ్ము మొ॥

వ్యా. కొన్నిచోట్లఁ ద్వరితార్థమునందును, ననాదరార్థమునందును ద్విరుక్తియగును. లెమ్ము+ లెమ్ము=లేలెమ్ము, పొమ్ము+పొమ్ము=పోపొమ్ము (సంధి 23) ఇట. లెమ్ము,

అనునది త్వరితార్థమున ద్విరుక్తినందెను. త్వరగా లెమ్మని యర్థము. పొమ్మ-అనునది యనాదరార్థమున ద్విరుక్తినందెను.

## కొన్నిశబ్దంబు లర్థవిశేషంబున ద్విరుక్తంబులయి యదంతంబులునగు. 114

ఉ: ఒండొండ, తరతరమ (ఇట నర్థవిశేషము క్రమముగా ననుట.)

వ్యా. కొన్ని శబ్దము లర్థవిశేషమున ద్విరుక్తంబులయి=రెండుసార్లు పలుకఁబడినవై, అదంతంబులున్=హ్రస్వమగు అకారమంతమునఁ గలవియు, నగును. ఒండు=ఏకము. ఒండు+ఒండు= ఒండొండ్+అ=ఒండొండ. క్రమముగా, అని యర్థవిశేషము. తరము= పురుషాంతరము. తరము+తరము. బా. సంధి 41చే-తరతరము. అదంతమయిన: తరతరమ్+అ=తరతరమ. ఇట, క్రమముగా, అని యర్థవిశేషము. అదంతంబులున్-అనుటచే నదంతములుకాకయు నుండవచ్చును. తరతరము=క్రమముగా-శ.ర. (చూ. మూలములు)

## నామపదంబు లార్యాద్యర్థ పరకంబులయి వ్యతిరేక వ్యంజక ప్రశ్నార్థకంబులగు. 115

ఉ: ఆ. నన్ను నేకార్థ సమవేతుఁ, బాడియయ్య యిట్టి పనికిఁ బనుప. భార. అర 2ఆ-36 అర్హమయ్య. ఉ. హరి. 6 ఆ-140 మొ॥

వ్యా. ఆర్యాద్యర్థపరకంబులయి=అయ్య-మున్నగు శబ్దములు పరమందుఁ గలవై, నామపదంబులు=నామవిభక్తులు చేరియేర్పడు పదములు. (సుబంతములు) వ్యతిరేకవ్యంజక= వ్యతిరేకార్థమును వ్యంజితముచేయు, ప్రశ్నార్థకములగును. పాడియయ్య? - అనునది పాడికాదను వ్యతిరేకార్థమును వ్యంజితము చేయు ప్రశ్నార్థకము. అర్హమయ్య? - అనునది యర్హము కాదను వ్యతిరేకార్థమును వ్యంజితము చేయు ప్రశ్నార్థకము.

## నామసర్వనామంబులకును గళలగు నవ్యయంబులకును గడపల సముచ్చయార్థవిశేష పాదపూరణంబులయందు నుశబ్దంబు తఱచుగ నగు. కళలగు నునుదంత శబ్దంబులమీఁద నయ్యది యువర్ణపూర్వకంబుగ విభాషనగు. మఱియు నది శేషషష్ఠియందు యొక్క-లోపించునపుడు లాగమాంత బహువచనంబు మీఁదను సముచ్చయమునం జూపట్టెడి. 116

లాగమాంత మనుట మీమాది పర్యుదాసార్థమని గ్రహించునది.

ఉ: ౧ సముచ్చయమునందు, నామపదములకు:- అన్నయుం దమ్ముండును, సతియుం బదియును, వాఁడును వీఁడును; చిన్నెయును వన్నెయును, నన్నును, నిన్నును; తనచేతను. మనచేతను; భూరిదక్షిణ మహాక్రతువులయు మొ॥ అవ్యయములకు:- చెప్పకయుఁ జూపకయు, ఏసియు వ్రేసియు, మొ॥

౨ అర్థవిశేషమందు నామపదములకు:- చ. పెం, పున జమదగ్ని సూనుఁడును బోలఁడు నిన్నని విందు వింటినే, ర్పున. భార,ఆది 5 ఆ-222. బానసమునం దిచ్చోటనే కాదు న, న్నేవీటన్ మిగులంగ నెవ్వఁడును లేఁడేభంగు లం జూచినన్. భార. విరా 1ఆ-218. క. తన పూర్వ తపఃస్థానం, బని యనురాగమున బదరినంతయుఁ జూడన్, మనమునఁ దలపోసి యొకం, డును మధ్యేరాత్రమునఁ గడుం గుతుకమునన్. వ. అచ్చోట వసియింపం జని హరి. ఉ. 5ఆ-158. ధీరమతులిట్లు చేసిన, వారెవ్వరుఁ గలరె? భార ఆది 7ఆ-247. చ. ఎంతయుం, దనరుఁ జళుక్య మన్మథుఁడు. భార. ఆది. 1 ఆ-5. చ. అనుటయుఁ బిన్ననవ్వు నగి. భార. ఉద్యో 3ఆ-52 క.....మెయిఁగల విలాస విభ్రమ లక్ష్మల్, దక్కుటయును నొక యొఱపై నెక్కొన. స్వా 4ఆ-69. మొ॥ అవ్యయములకు:- సీ. అమృతాశనంబు . సేయకయును దేవ! నా, కజరామరత్వంబు నందుటయును, భార. ఆది 2ఆ-107. క...పంక్తికంధరు నెట్లుం, జంపఁగఁ జాలక రోషము, పెంపునఁ గారాగృహమునఁ బెట్టఁగఁ బంచెన్. నిర్వ 7 ఆ. 62. క. పాటుపడి మూర్ఛవోయిం, బోటరి దైత్యుండు దెలిసి. ఉ. హరి. 4ఆ-235. మొ॥ 3 పాదపూరణమునందు, నామపదములకు:- అందఱున్ వివశులై. భార ఆది 5ఆ-258. రేయిపగలు నిద్రయునెప్పుడెఱుఁగక, భార అర. 1ఆ-26. ఇవ్వీరులకగు నభీష్టమిదియు మొదలుగాన్. భార ఆది. 8-59. చ. భాసిలుఁ దత్పురికోట మిక్కిలిన్, మహిమను. కళా. 1ఆ-8 ఎ.గీ. మున్నుముచ్చిచ్చును విరాళిగొన్న చోటు, స్వా 2ఆ 9. విపంచినిన్న మొదలున్ నీవంటమింజేసి. స్వా. 3 ఆ 57. ఇమ్మిహికాహార్యమునం జరింతు మెపుడున్. స్వా. 2 ఆ-45. ఇట్లు-అంతయు, పెద్దయు, తద్దయు మొ॥అవ్యయములకు:- ఆధారము లేకను (లేకను=లేకయును) భార. ఆది. 2 ఆ-142. ఊఱడకం దిగిచి, (ఊఱడకన్=ఊఱడకయును) భార ఆది 4 ఆ-19. ఎ.గీ. అనిలుఁడను దూత వోయి తోడ్కొనియుఁ దెచ్చె. భార ఆది. 3 ఆ-56 సీ. కమలాప్తుఁ డుదయింపకయు మున్న బుటుకున, మునుఁగు సంగమతీర్థమునకు నేగి, పాండు 5 ఆ-286. క. ఏనొకటి విన్నవించెద, దానవకుల మథన పెద్దతడవుననుండిం, బూని వినిపింపగలపని. ఉ.హరి 5 ఆ-293. మొ॥ తఱుచుగ ననుటచే-నుశబ్దము కొన్నిటి కొకప్పుడు వచ్చును. ఒకప్పుడు రాదని యర్థము గ్రహింపవలెను. దీని కుదాహరణములు పాదపూరణము నందలివి. విభాషననుటచే-నుశబ్దము కొన్నియెడల యువర్ణపూర్వకముగానే వచ్చుననియు, కొన్నియెడల యువర్ణపూర్వకమయ్యును గాకయు వచ్చుననియు

నర్థము, పరిగ్రహింప వలయును. యువర్ణపూర్వకముగానే వచ్చుటకు:- ఉ: అనుటయు మొ॥ యువర్ణపూర్వక మయ్యును గాకయు వచ్చుటకు:- ఉ: సీ. ఎంతయు సంయమవంతుఁడు సహదేవుఁ, డధ్యాత్మవిద్య నారాధ్యుఁడెంత, ననఘుండు ధౌమ్యుండు. భార. సభా 2ఆ-282. ఎ.గీ. తమ్మికొలను ప్రవేశించు తలిరుఁబోండ్ల, విలసనము లెంతనెంతయు వింతలయ్యె. కళా 6ఆ-228. రగడ. చేటునకెయగుఁ జాలుచేఁ గలుగు మేలెంత. స్వా. 3ఆ-84. క. ఒక గృధ్రమెంతఁ బ్రియమున, నొకచర్మముఁ గఱచికొనుచు నుడుపథ(ణ?)మున రా. భోజ 4ఆ-23. తే. అమరులెల్లను జల్లిరి సుమము లెంత. అధ్యా. బాల. కాం. 142. సీ. నిడుపునఁదూర్పును బడమరనై రెండు, కడల నంభోనిధిఁ గదిసియుండు. భార. భీష్మ 1ఆ-21. లేఁజిగురుఁ గొమ్మం జేవ గాకుండునే (కొమ్మన్=కొమ్మయును) వసు 3ఆ-173. పురారిం జేరలేఁడు. (పురారిన్=పురారియును) ఉ.హరి. 6ఆ-65. తపమిట్టిదిం గలదె? (ఇట్టిదిన్=ఇట్టిదియును) నిర్వ 5ఆ-22. నీవేమిని వేగిరపడక (ఏమిని=ఏమియును) హరి. పూ. 8ఆ-110. అల భీమనాథునకు నప్పటియుం బ్రణమిల్లి. రుక్మాం. 1ఆ-33. చ. వెల్లిదీజె రో, కలి దలఁజొట్టుమన్న క్రియగా నొకకొందఱు దాల్తురప్పటిన్, గలుషపథప్రవర్తనమె. కళా. 2ఆ-101. ఉ. ఓట యొకింత యేనియు సుయోధను చిత్తమునందు లేదు. భార. ఉద్యో 3ఆ-104. క. అమరఁగజాదంబు నీకు నభిమతమేనిన్. భార. అర. 2ఆ 221. మఱిం, దెనుఁగుం గబ్బములెన్నియేనియును. (మొదటిరూపము మఱియును) ప్రభా 1-6. ముక్తుండు వెండిన్ విపులఁబొడమనీ (మొ. రూ. వెండియును) పాండు 3ఆ-128. మొ॥

## ఇది శబ్దపరిచ్ఛేదము

వ్యా. నామపదములకు, సర్వనామములకుఁ, గళలగు నవ్యయములకుఁ జివర (i) సముచ్చయమునందును. (ii) అర్థవిశేషమునందును. (iii) పాదపూరణమునందును, "ను" శబ్దము తఱచుగా నగును. ఈ 'ను' శబ్దము, కళలగు ననుదంతములమీఁద విభాషగ, "యు"వర్ణ పూర్వకమగును. శేషషష్ఠియందు (బా. కారక15) యొక్క లోపించినప్పుడు, లాగమాంత (ల+ఆగను+అంత)=లడాగమమంతమందుఁగలిగిన, బహువచనముమీఁద, ను శబ్దము సముచ్చయార్థమునఁ గనఁబడును.

1. నామపదములకు (i) సముచ్చయమున:- అన్నయుం దమ్ముండును, సతియుం బతియును, చిన్నెయును వన్నెయును. అన్న+ను, తమ్ముఁడు+ను; సతి+ను, పతి+ను, చిన్నె+ను, వన్నె+ను. వీనిలో, అన్న, సతి, పతి, చిన్నె, వన్నె - అనునవి యనుదంతములగు (ఉదంతములుకాని) కళలు. కావున వీని, ను శబ్దమునకు ముందు, యు వర్ణము చేరును. అన్న+ను=అన్న+యును: అన్నయును. ఇత్యాది. తమ్ముండు- అనునది, ఉదంతమగుటచే,

ను శబ్దమునకు ముందు యు వర్ణము చేరదు. తమ్ముండును—అనియే యగును. క్రతువులయు—అనునది లడాగమాంతమున కుదాహరణము. క్రతువులయొక్క—అనుచో, యొక్క—లోపించి, ను శబ్దముచేరును. క్రతువుల+ను. క్రతువుల—అనునది యనుదంతమగు కళ యగుటచే—యు వర్ణము: క్రతువుల+యును= క్రతువులయును, బా. సంధి 20చే—క్రతువులయు. "లాగమాంతమనుట మీమాది పర్యుదాసార్థము." అనఁగా, మీయొక్క, మాయొక్క—మున్నగువానిలో, యొక్క లోపించినప్పుడు, నుశబ్దము చేరకుండుటకు సూత్రమున లాగమాంతములకు, నుశబ్దము కనఁబడునని చెప్పఁబడెను. లాగమాంతముల కనుటచే లాగమాంతములు కాని బహువచనములమీఁద, ను శబ్దము చేరదన్నమాట. మీయొక్క=మీ. మాయొక్క=మా. ఇట ను శబ్దముచేరదని భావము. పర్యుదాసము=నిషేధము, అని మాత్రమే యిట నర్థము నెన్నవలెను. (పర్యుదాస=నివారణే—శబ్దస్తో)

2. సర్వనామములకు— (i) సముచ్చయమున:— వాఁడును, వీఁడును, నన్నును, నిన్నును, తనచేతను, మనచేతను. వాఁడు+ను=వాఁడును; వీఁడు+ను=వీఁడును, నన్నును+ను=నన్నునును; నిన్నును+ను=నిన్నునును; తనచేతను+ను= తనచేతనును; మనచేతను+ను=మనచేతనును. నన్నునును+నిన్నునును; తనచేతనును+మనచేతనును—అనుచో, బా. సంధి 18చే—నన్నును+నిన్నునును; తనచేతను+మనచేతను; బా. సంధి 20చే—నన్నును నిన్నును; తనచేతను మనచేతను— అనురూపము లేర్పడును. సర్వనామములు సహితము నామపదములు గావచ్చునను నభిప్రాయముతో సర్వనామోదాహరణములు నామపదములతోఁ గలిపి చూపఁబడెను.

3. అవ్యయములకు—(i) సముచ్చయమున:— చెప్పక+ను, చేయక+ను, ఏసి+ను, వ్రేసి+ను. ఇవి యనుదంతములగు కళలగుటచే, యువర్ణము: చెప్పక+యును=చెప్పకయును—ఇత్యాది. చెప్పక, ఏసి—ఇత్యాదులు లాక్షణికావ్యయములు. (వాక్య 3 సూ.) (అయ్యును—చూ. అనుబంధము—48)

(1) నామపదములకు (ii) అర్థవిశేషమున:— పెంపున జమదగ్నిసూనుఁడును బోలఁడు నిన్ను—అనుచో, జమదగ్నిసూనుఁడును=జమదగ్నిసూనునంతవాఁడును, అని యర్థవిశేషము. అనుటయుఁ బిన్నవవ్వునగి. ఇట, నానంతర్యార్థ మర్థవిశేషము. అనుటయును=అన్నయనంతరము. విలాస విభ్రమలక్ష్మిల్, దక్కుటయును నొక యొఱపై—ఇట, తక్కుట+ను=తక్కుట+యును: తక్కుటయును—అగును. బా. సంధి. 21చే—తక్కుటయును+ను=తక్కుటయునును. అగును. తక్కుట సైతము—అని యిట నర్థవిశేషము.

(2) సర్వనామములకు (ii) అర్థవిశేషమున:— వ, న్నేవీటన్ మిగులంగ నెవ్వఁడును లేఁడు—అనుచో, ఎవ్వఁడును=ఏయొక్కఁడును, లేఁడను ప్రభావాతిశయ మర్థవిశేషము. బదరినంతయును—ఇట సాకల్యార్థ మర్థ విశేషము. ఒకండును—అనుచో నేకాకిత్వ మర్థ విశేషము. ఇట్లు సేసిన వారెవ్వరుఁ గలరె? ఎవ్వరును=ఏయొక్కరును. ఇట నెవ్వరును లేరను ప్రభావాతిశయమర్థ విశేషము. ఎంతయుం దనరుఁ జళుక్యమన్మథుఁడు. ఇట, ఎంతయును— అనుచో నత్యంతార్థ మర్థవిశేషము.

(3) అవ్యయములకు—(ii) అర్థవిశేషమున:— అమృతాశనంబు సేయకయును అనుచో—చేయకయును= చేయనప్పటికి—అని యర్థవిశేషము. ఎట్లుంజంపఁగఁ జాలక. ఎట్లును=ఏప్రకారము చేతను—అని యర్థవిశేషము. మూర్ఛవోయిం బోటరి దైత్యుండు దెలిసి. మూర్ఛవోయి+ను= మూర్ఛవోయిని=మూర్ఛవోయినప్పటికి—అని యర్థవిశేషము (ఇట యువర్ణము రాలేదు.)

(1) నామపదములకు—(iii) పాదపూరణమున:— నిద్రయునెప్పుడెఱుఁగక. నిద్ర

యును=నిద్ర- అనియే యర్థము. కాన నిట, నుశబ్దము పాదపూరణమున నైనది. భాసిలుఁ దత్పురికోట మిక్కిలిన్, మహిమను. మిక్కిలిని=మిక్కిలి. ముచ్చిచ్చును=ముచ్చిచ్చు. విన్న మొదలున్. మొదలును=మొదలు. చరింతు మెపుడున్. ఎపుడును=ఎపుడు. పెద్దయును=పెద్ద. తద్దయును=తద్ద.

(2) సర్వనామములకు (iii) పాదపూరణమున-అందఱున్ వివశులై. అందఱును=అందఱు. ఇదియు మొదలుగాన్. ఇదియును=ఇది. అంతయును=అంత.

(3) అవ్యయములకు (iii) పాదపూరణమున:- ఆధారము లేకను, లేకను(=లేకయును)=లేక, ఊఱడకన్ (=ఊఱకయును)=ఊఱడక. తోడ్కొనియుఁదెచ్చె. తోడ్కొనియును=తోడ్కొని. కమలాప్తుఁ డుదయింపకయు మున్న. ఉదయిం పకయును=ఉదయింపక. పెద్దతడవుననుండిం బూని. తడవున నుండి+ను=తడవున నుండిని(=తడవున నుండియును)=తడవుననుండి.

తఱచుగ-అనుటచే నుశబ్దము కొన్నిటి కొకప్పుడు వచ్చును. ఒకప్పుడు రాదు. దీని కుదాహరణములు పాదపూరణము నందలివి. అనఁగాఁ బాదపూరణమున నుశబ్దము కొన్నిచోట్ల వచ్చును, గొన్నిచోట్ల రాదు.

విభాషనుటచే-నుశబ్దము కొన్నిచోట్ల యువర్ణ పూర్వకముగానే వచ్చును. కొన్నిచోట్ల యువర్ణపూర్వకమయ్యు, యువర్ణ పూర్వకముకాకయు, వచ్చును. ఇట్లు విభాషకు వ్యవస్థ కల్పింపఁబడెనన్నమాట. ఇట్టి విభాషను వ్యవస్థిత విభాష యందురు. (చూ, బా. సంధి. 37 సూ-ఘంటా) యువర్ణము నుశబ్దమునకు ముందు నిత్యముగా వచ్చుటకు:- ఉదా॥ అనుటయు మొ॥ యువర్ణము నుశబ్దమునకు ముందొకచోట వచ్చుట, కొకచోట రాకపోవుటకు:- ఉదా. ఎంతయు సంయమవంతుఁడు సహదేవుఁ డధ్యాత్మ విద్య నారాధ్యుఁడెంత, ననఘుండు. ఇట ఎంతయును-అనుచో, నుశబ్దమునకు ముందు 'యు' వర్ణము వచ్చినది. ఆరాధ్యుడెంతన్-అనుచో, ఎంత+ను=ఎంతను, అని యయినది. ఇట, యువర్ణము రాలేదు. ఎంత నెంతయు, అనుచో ఎంతను+ఎంతయును-అని పదచ్ఛేదము. ఎంతను-అనుచో, యువర్ణము రాలేదు, ఎంతయును-అనుచో వచ్చినది. మేలెంత సుమము లెంత, అనుచో, ఎంతను-ప్రయుక్తము. బా. సంధి 20చే- ద్రుతలోపము కలిగినది. ఎంతఁ బ్రియమున-అనుచో, ఎంతను-అని యున్నది. ఇట 'యు' చేరలేదు. తూర్పును బడమరనై-అనుచో, పడమర+ను=పడమరను-అని ప్రయుక్తము, పడమరయును-అని"యు" వర్ణము చేరలేదు. లేఁజిగురుఁ గొమ్మం జేవ గాకుండునే. ఇట, కొమ్మను (=కొమ్మయును) అని యున్నది. 'యు' చేరలేదు. పురారిం జేరలేఁడు. ఇట, పురారిని-(పురారియును) అనుచో 'యు' చేరలేదు. ఇట్టిదిం గలదే. ఇట్టిది+ను=ఇట్టిదిని-(=ఇట్టిదియును) ఐనది. ఇట యువర్ణము రాలేదు. నీవేమిని వేగిరపడక. ఏమి+ను=ఏమిని-అనుచో 'యు' రాలేదు. (ఏమిని=ఏమియును) అప్పటియుం బ్రణమిల్లి-అనుచో, యువర్ణము వచ్చినది. అప్పటిన్ గలుషపథ ప్రవర్తనమె అనుచో, యువర్ణము రాలేదు. అప్పటి+ను=అప్పటిని. ఓట యొకింతయేనియున్-అనుచో, యువర్ణము చేరినది. ఇట్లే-ఎన్నియేనియును-అనుచోఁ జేరినది. అభిమతమేనిన్-అనుచో, యువర్ణము చేరలేదు. ఏని+ను=ఏనిని-అయినది. ఘుక్తుండు వెండిన్ విపులఁ బొడమనీ-అనుచో, యు వర్ణము రాలేదు. వెండి+ను=వెండిని-అని యైనది. (వెండిని=వెండియును) (చూ. మూలములు)

విమర్శ:- (i) పాదపూరణార్థకములకుఁ జూపిన కొన్నియుదాహరణములలో అర్థ విశేషములు కనఁబడును. (ii) చేటునకె యగుచూలుచేఁ గలుగు మేలెంత (స్వా)అను

ముద్రితపాఠమే సరియైనది. ఎంత-ప్రశ్నార్థకము. కావ నిది యీ సూత్రమునకు సరియగు లక్ష్యముకాదు. (iii) అన్నయుందమ్ముండును-లోనగునవి సముచ్చయార్థములనుట సరికాదు. ఇవి యితరేతర యోగార్థములు (చూ. అనుబంధము. విషయసంఖ్య-86) అన్నదమ్ములు=అన్నయునుదమ్ముఁడును. సతీపతులు= సతియును బతియును. చిన్నెవన్నెలు=చిన్నెయును వన్నెయును. ఇట్లివి, ద్వంద్వ సమాస విగ్రహవాక్యములు. కావ, వీనిని సముచ్చయములనుట సరికాదు. సముచ్చయ సంజ్ఞ లౌకికార్థమున వాడఁబడును. (బా. కాంక(3)ం) భిన్న పదార్థములనొకచోఁగూర్చుటయని సముచ్చయ శబ్దమున కర్థము. (iv) తల్లిందండ్రియు (మను(3)-98) - ఇతరేతర యోగమున, 'యు'లోపము. (v) ను శబ్దము, సముచ్చయాద్యర్థకమని గ్రహింపవలెను. ఆది పదముచే నర్థవిశేష పాదపూరణార్థములు గ్రాహ్యములగును.

ఇది ఘంటాపథము.

* * *

# కారక పరిచ్ఛేదము

## కారకంబులనం గర్మాదులు. 1

అవియాఱు–కర్మకారకము, కర్తృకారకము, కరణకారకము, సంప్రదాన కారకము, అపాదాన కారకము, అధికరణకారకము. క్రియాన్వయమును గలిగించునది. అనఁగాఁ గ్రియాన్వయము కలది యని కారక శబ్దార్థము.

వ్యా. కర్మ మున్నగునవి కారకములు. అవియాఱు. కర్మకారకము–ఇత్యాది.

విమర్శ:- క్రియాన్వయము గలది కారకమను భట్టోజీ దీక్షితుని మతమిటసూచితము. ఇది సరికాదు. (చూ. అనుబంధము. విషయసంఖ్య–87) క్రియాజనకము కారకము. (బా. కారక 1 సూ–ఘంటా.)

## ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱించియు ననుప్రయుక్తం బగు. 2

ఉ: క. మముగుఱించి నామగోత్ర, క్రమమున మీరర్చ సేయఁగా. హరి. పూ. 2 ఆ–61. సముచ్చయ గ్రహణము కూర్చి జ్ఞాపనార్థము.

వ్యా. ఉద్దేశార్థమునందు ద్వితీయ యగుననియు, నాద్వితీయకు, గుఱించియు ననుప్రయుక్తమగుననియు సూత్రార్థము. ఉదా॥ మముగుఱిచి. మమ్ము=మమును. (బా. ప్రకీర్ణక. 8) మమును+గుఱిచి= మముగుఱిచి. ఇట నుద్దేశార్థమున ద్వితీయయు, దానిపై గుఱిచి యను ప్రయుక్తమగుటయు జరిగెను. మముగుఱిచి=మమ్ముద్దేశించి–అని యర్థము. గుఱిచి–రాని పక్షమున, మమునర్చ సేయఁగా–అని యగును. గుఱిచియునని సముచ్చయమును గ్రహించుట కూర్చిజ్ఞాపనార్థము. అనఁగఁ జింతామణిలో విధించిన కూర్చి విభక్తిని బోధించుటకొఱకని యర్థము. మమును+కూర్చి – మముఁగూర్చి–అనియుఁ గావచ్చునన్నమాట. గుఱిచి–అనునది గుఱించి–అనుదాని కుపలక్షణ మననగును. గుఱిచియు=గుఱిచికూడ– అనియర్థము. (శబ్ద 116)

విమర్శ:- (i) ఉద్దేశార్థమున ద్వితీయ వేఱుగా విధింపఁబడలేదు. కాన గుఱిచి యనుప్రయుక్తమనుట చేతనే యుద్దేశార్థమున ద్వితీయయగును. (ii) ఇట, గుఱిచి–అనుప్రయుక్తమనఁబడెను. కూర్చి జ్ఞాపనార్థము–అనుటచేఁ గూర్చియు, ననుప్రయుక్త మనవలసియున్నది. కాని కూర్చి–అనునది చింతామణియందు విభక్తి ప్రత్యయముగా విధింపఁబడియున్నది. "కూర్చిలమునయో భవేద్వితీయా; కర్మప్రవచనీయకే కూర్చిః–" ఆం. చిం. కాన కూర్చిని గూడ ననుప్రయుక్తముగా గ్రహించుట ప్రౌఢవ్యాకర్త కభిమతమని గ్రహింపనగును. (iii) గుఱిచియు–అనుచోటి నుశబ్దమర్థవిశేషమున నయినది. కాన, సముచ్చయాద్యర్థక గ్రహణమనవలెను.

అయ్యాది వ్యవహితంబు నగు. 3

ఉ: సీ. అబ్జాసనుఁడు తన్ను నర్థితో గుఱిచి యు, జించుట గోరి సృజించె. సురల హరి. పూ. 2ఆ–98

వ్యా. అయ్యాది=గుఱిచి (2సూ)యనునది, వ్యవహితంబున్=వ్యవధానముగలదియు, అగును. 2చే–గుఱిచి, యనునది ద్వితీయమీఁద నిలుపవలెను. అట్లుకాక, ద్వితీయకు, గుఱిచికి వ్యవధానముగూడఁ గలుగవచ్చు నన్నమాట. తన్ను నర్థితో గుఱిచి–అనుచో తన్నును–అను ద్వితీయకు, గుఱిచికి మధ్య, అర్థితో– అనుపదము చేరుటచే వ్యవధాన మేర్పడినది. తన్నుగుఱిచి–అని యెట్లును నుండవచ్చును.

కొన్నియెడలఁ జేతవిభక్త్యర్థక వర్ణకంబులకును, వలన వర్ణకంబునకును దఱచుగఁ జేసి యనుప్రయుక్తంబగు. 4

ఉ: ఏకవిప్రసం, బోధనఁ జేసి. భార. ఆది1ఆ–124. అభీష్టవరంబు లిచ్చుటం జేసి. భార. అర. 2ఆ. అసహ్యావిషోగ్ర ధూమకే, తన హతిఁ జేసి. భార. ఆ... 1ఆ–123. బహువేద ఘోషములఁ జేసి. భార. అర. 1ఆ–11. సంప్రయో...బునఁ జేసి, దీననుజేసి. భార. సభా 1ఆ–54. ఇందఱును నిన్నిభంగుల నిడుమకుడవ, వలసె ధర్మతనూభవువలనఁ జేసి. భార. విరా, 2ఆ–225. తఱచుగ ననుటచే నొకానొకచో నేకవచనంబున నుకారంబు మీఁది ద్వితీయయుఁదృతీయా విభక్త్యర్థక మయ్యెడునని తెలియవలయు. ఈయర్థమునకు "ఇతరత్రచ ద్వితీయా" అనుస్థాన నియమశూన్య విధియు నవకాశమిచ్చుచున్నది. ఉ: ఎ.గీ. తండ్రి, పనుపుఁజేసి ముదిమిగొని జవ్వనం బిచ్చెఁ, బూరుఁడను సుతుండు భూరియశుఁడు. భార. ఆది. 3ఆ–95 వెలిఁబెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి, దాశకన్యాకేళి తప్పుఁజేసి. స్వా. 2ఆ.73. మొ॥ ఇట్లనుటచే "ఇవ్విధమునాననముల్ గలవార" (నిర్వ 4ఆ.87)లను నిట్టి ప్రయోగములును నిర్దుష్టము లగుచున్నవి.

వ్యా. కొన్నిచోట్ల, చేతవిక్త్యర్థమున విధింపఁబడిన ప్రత్యయములకును, వలన ప్రత్యయమునకును, దఱచుగా, "చేసి" అనునది, యనుప్రయుక్తమగును.

(i) చేత విభక్త్యర్థకములకు:– ఏకవిప్ర సంబోధనఁజేసి. సంబోధనను+చేసి, ఇట సంబోధనను– అను ద్వితీయ, చేతవిభక్తియొక్క యర్థమున నయినది. సంబోధన+చేత. బా. కారక 22చే–చేత విభక్తికి ద్వితీయ కలుగఁగా, సంబోధనను–అను రూపమైనది. కనుక, దీనిపై, చేసి–అనుప్రయుక్తమయినది. అనుప్రయుక్తమనుటచే దీనికి వేఱుగా నర్థములేదు. సంబోధనఁజేసి=సంబోధనను (=సంబోధనచేత) అనియే యర్థము. ఇట్లే, ఇచ్చుటంజేసి, హతిఁజేసి, వేదఘోషములఁజేసి–అనునవి. ఇచ్చుట+చేత, హతి+చేత, వేదఘోషము+లచేత– అనుచోట్ల, బా. కారక 22చే–ద్వితీయ యగును. ఇచ్చుటను, హతిని, (హతి+ను– బా. తత్సమ 26చే–హతిని) వేదఘోషములను–అను రూపము లేర్పడునన్నమాట. ఈతృతీయార్థమునకైన ద్వితీయలపై, చేసి–అనుప్రయుక్తమయిన–ఇచ్చుటను+చేసి=ఇచ్చుటం జేసి; హతిని+చేసి=హతిఁజేసి, వేద ఘోషములను+చేసి= వేదఘోషములఁజేసి–అనురూపములు

సిద్ధించును. సంప్రయోగమునఁ జేసి:- సంప్రయోగము+చేత. బా. కారక 23చే-చేతకు, వర్ణకము: సంప్రయోగమున. బా. తత్సమ 8చే- సంప్రయోగమునను. ఇట వర్ణకము తృతీయార్థమున నైనది గనుక-సంప్రయోగమునను+చేసి= సంప్రయోగమునఁ జేసి-అగును. సంప్రయోగము చేత-అని యర్థము. దీననుజేసి:- దీనిచేత-అనునది, శబ్ద62చే-దీనను-అయినది. ఇట 'న' అనునది చేతవిభక్త్యర్థకము. కనుక దీనను+చేసి= దీననుజేసి-అయినది. వలన వర్ణకమునకు:- ధర్మ తనూభవువలనఁ జేసి. ఇట వలన వర్ణకమునకు, చేసి-అనుప్రయుక్తమైనది. ధర్మతనూభవువలనఁ జేసి=ధర్మతనూభవువలన. తెలుఁగు-అనుటచేఁ గొన్నిచోట్ల నేకవచనమున ఉకారము మీఁది ద్వితీయయుఁ దృతీయావిభక్త్యర్థక మగునని తెలుపఁబడెను. అనఁగా, బా. కారక 22చే- ఉదంతములగు జడవాచకముల తృతీయాసప్తములకు బహువచనముననే కాని యేకవచనమున ద్వితీయకాదు. కాని యిట 'తెలుఁగు' అనుటచేత-ఉదంతములగు జడవాచకముల తృతీయ కొకానొకచో నేకవచనమునను ద్వితీయ యగునన్నమాట. ఈయర్థమునకు "ఇతరత్రచ ద్వితీయా" అను స్థాన నియమ శూన్య విధియు నవకాశమిచ్చుచున్నది. అనఁగా నీచింతామణి సూత్రమున ఇతరత్రచ=ఇతరత్రకూడ, ద్వితీయ యగునని స్థాన నియమము లేకుండ ద్వితీయ విధింపఁబడియున్నది. ఇట ఉదంతములగు జడవాచకముల తృతీయకు బహువచనముననే ద్వితీయయగు నన్న నియమము చింతామణి సూత్రమున లేదు. కనుక నేకవచనమున ద్వితీయ యగుననుట కీచింతామణి సూత్రమును నవకాశమిచ్చుచున్నదని భావము. తండ్రి పనుపుఁజేసి. పనుపు+చేత=పనుపును. దీనిపై, చేసి, అనుప్రయుక్తమయి: పనుపును+చేసి= పనుపుఁజేసి-అగును. దాశకన్యాకేళి తప్పుఁజేసి. తప్పు+చేత=తప్పును. తప్పును+చేసి= తప్పుఁజేసి. ఇట్లనుటచేన్=ఇతరత్రచ ద్వితీయా-అను చింతామణి సూత్రము, స్థాననియమము లేనిదనుటచేత, ఇవ్విధమునాననముల్ గలవారలు-వంటి ప్రయోగములు నిర్దుష్టము లగుచున్నవి. అనఁగాఁ జింతామణి సూత్రమున, ఇతరత్రచ=ఇతరస్థలములందును, ద్వితీయా=ద్వితీయా విభక్తియగును-అని చెప్పఁబడెనే కాని, యేయేవిభక్తులకు ద్వితీయయగునో తెలుపఁబడలేదు. కానఁ దృతీయా సప్తములకే కాక యితర విభక్తులకును ద్వితీయ యగుననుట కీచింతామణి సూత్ర మనకాశమిచ్చుచున్నదన్నమాట. ఈకారణముచే-ఇవ్విధము+ఆననముల్-అనుచోఁ బ్రథమకు ద్వితీయవచ్చి-ఇవ్విధమును+ఆననముల్: ఇవ్విధము నాననముల్-అగుట నిర్దుష్టమని తెలుపఁబడెను.

విమర్శ:- (i) తప్పుఁజేసి-అను ప్రయోగము నందలి ద్వితీయ, తృతీయార్థమున నైనది కాదు. తప్పుఁజేసి=తప్పుగాఁజేసి-(=తప్పుగానెంచి) అన్నది ప్రకరణోచితమైన యర్థము. కాన నిది సరియగు నుదాహరణము కాదు. (చూ. ము.. కౌ. క్రియా 31) చేతవిభక్త్యర్థక-అనుటచే, చేత విభక్తిపైఁజేసి యనునదియనుప్రయుక్తము కాదు. సంబోధనచేత-దీనిపైఁ జేసిరాదు. (iii) ఇవ్విధము నాననముల్-అనుచోఁ బ్రథమకు ద్వితీయ యయ్యెననుట సరికాదు. ఇవ్విధముయొక్క+ఆననముల్=ఇవ్విధమునాననముల్-అగును. షష్ఠిలో నుగాగమము కలిగినది. (బా. సంధి 34) (చూ. అనుబంధము. విషయసంఖ్య-88)

(ఏకవిప్రసం, బోధనఁజేసి-అపపాఠము. ఏకవిప్రసం, చోదనఁజేసి చేసెరిపుసూదన-సాధుపాఠము.)

అయ్యాది యొక్కచోఁ బెక్కుచోట్ల కొక్కటియ చాలెడి. 5

ఉ: సీ. వలరాజు సచివుల వడుపున బెడఁగగు, కర్కశ స్తనములఁ గరమువాఁడి, చూచ్కుల నతిరాగ సురుచిరాధరముల, మద విలాసాలస

మందగతుల, వక్రాలకంబుల వలుఁద పిఱుందుల, దర్పగద్గద భాషితములఁజేసి. భార. ఆది 8ఆ–74. (ఇటఁ జేత విభక్త్యర్థక లవర్ణకముపై నెల్లెడల నుండవలసిన "చేసి" యొక్క చోటనె యున్నది.)

వ్యా. అయ్యది=చేసి–అనునది (4 సూ.) పెక్కుచోట్లకు, నొక్కటియే సరిపడును. అనఁగాఁ బలుచోట్ల రావలసియుండఁగా నొక్కచోటనే వచ్చినను జాలుననుట. పైప్రయోగమున, స్తనములను, చూడ్కులను, అధరములను, గతులను, అలకంబులను, పిఱుందులను, భాషితములను–అనునవి తృతీయార్థక ద్వితీయలు. కావున 4చే–చేత విభక్త్యర్థకమగు లవర్ణకము పై(=లడాగమము) నెల్లచోట్ల చేసి–అనుప్రయుక్తము కావలెను. అనఁగా, స్తనములఁజేసి, చూడ్కులఁజేసి–ఇత్యాదిగా నెల్లచోట్ల చేసి, చేరవలెను. కాని యట్లుకాక "భాషితములను"–అనునొక్క చోటమాత్రమే చేసి–అనుప్రయుక్త మయినది.

విమర్శ:– పై ప్రయోగములలో నెల్లయెడల, చేసి–అనుప్రయుక్తము కావలసిన నిర్బంధము కానరాదు. ఏలయన, చేసి–అనుప్రయుక్త మయినను గాకున్నను దృతీయార్థము లభించును.

## ఒకానొకచోఁ దోడకుఁ బ్రత్యేక ప్రయోగంబునుం జూపట్టెడి. 6

ఉ: తే. స్తంభగత రత్నపుత్రిక తనదు బోఁటి, యని విలోకించి తోడ మాటాడకునికి, నలుగడలు చూచి తెలిసి యచ్చెలువ బెదరి, వెడల నుంకింపఁ జేదమ్మి యొడిసి పట్టె. (తోడన్=తనతోడ) రామా 4ఆ–158.

వ్యా. తోడ–అను తృతీయావిభక్తి ప్రత్యయమున కొకానొకచోఁ బ్రత్యేక ప్రయోగమును గనఁబడునని యర్థము. తోడమాటాడకునికి–అనుచో, తనతోడ–అని ప్రకృతికిఁజేర్చి వాడవలసిన తోడ ప్రత్యయము స్వతంత్రముగా వాడఁబడెనని వ్యాకర్త యభిప్రాయము.

విమర్శ:– ప్రత్యేక ప్రయోగముగలదానిని ప్రత్యయమనుట సరికాదు. అందు, లోపల, లోన్ (తోను) అను వానివలెనే, తోడ–అనునది విభక్త్యర్థాభిధాయక శబ్దమనుట యుక్తము. (చూ. అనుబంధము. విషయసంఖ్య–89) ఇది తోడుశబ్దనుజ్యంతము. (బా. క్రియా 40)

## కొన్నియెడల నుశబ్దప్రయోగమునం దోడకు లోపంబును వ్యవహితత్వంబును బహూత్వంబునం గానంబడియెడి. 7

ఉ: ఎ.గీ. అతనికిఁ బరలోక, విధుల శాస్త్రదృష్టి వెలయఁజేసె, నాపగా తనూజుఁ డఖిలబాంధవులయు, బ్రాహ్మణులయుఁ దోడ భానునిభుఁడు. భార. ఆది. 4ఆ–215. క. నెమ్మిని ధర్మజునలువురు, దమ్ములుఁ దమవస్త్రములయుఁ దమశస్త్రవరూ, థమ్ముల తోడను సకల హి, తమ్ముగఁ బాయంగవలయు దాస్యము వలనన్. భార. సభా. 2ఆ–291 మొ॥

వ్యా. కొన్నిచోట్ల సముచ్చయాద్యర్థకమగు నుశబ్దముయొక్క ప్రయోగమున, తోడ ప్రత్యయమునకు లోపమును, నుశబ్దముచేత వ్యవధానము కలుగుటయు బహూత్వమునఁ గనఁబడును. తోడ లోపించుటకు:– ఉదా॥ బాంధవులయును. ఇటబాంధవులతోడను–అనుచో శబ్ద 116చే– బాంధవులతోడను+ను. ఈ సూత్రముచే–తోడనులోపించిన

బాంధవు+ల+ను. శబ్ద 116చే- అనుదంతమగు కళపై నుశబ్దమునకు ముందు యువర్ణమగును. బాంధవు+ల+యును=బాంధవులయును-అగును. ఇట్లే వస్త్రముల తోడను+ను=వస్త్రము+ల+ను=వస్త్రములయును. నుశబ్దముచే వ్యవధానము కలుగుటకు:- బ్రాహ్మణులయుఁ దోడ. ఇట, బ్రాహ్మణు+ల+తోడ-అని యుండఁగా లడాగమమునకు, తోడప్రత్యయమునకు మధ్య నుశబ్దముచేరి-బ్రాహ్మణు+ల+ను+తోడ అగును. నుశబ్ద మునకుముందు యువర్ణముచేరి-బ్రాహ్మణు+ల+యును+తోడ-బ్రాహ్మణులయును+తోడ. ద్రుతకార్యము. బ్రాహ్మణులయుఁ దోడ. ఇట లడాగమమునకు, తోడకు, నుశబ్దముచే వ్యవధానమేర్పడెను. కొన్నియెడల-అనుటచే, శస్త్రవరూథమ్ములతోడను+ను-అనుచో తోడకు లోపము రాలేదు. అనఁగా, శస్త్రవరూథమ్ములయు-అని, కాలేదు. వ్యవధానమును గలుగలేదు. అనఁగా, శస్త్రవరూథమ్ములయుఁదోడ- అనియుఁ గాలేదు. శస్త్రవరూ థమ్ములతోడనును-అనియే యయ్యెను. వరూథమ్ములతోడనును+సకల. బా. సంధి. 18చే-వరూథమ్ములతోడను సకల.

విమర్శ:- నుశబ్దప్రయోగము లేనప్పుడును తోడకు లోప మరుదుగాఁ గావచ్చును. (చూ. ము. కా. కారక (3))

## ఒకానొకచోఁ దోడకుఁ దోడుత నని రూపాంతరంబును గలదు. అయినను దానికివలె దీని కితరకార్యంబు గలుగదు. 8

ఉ: పగతుర చేతిలోఁ బడక ప్రాణముతోడుత నున్నవాఁడవే? భాగ. 10స్కం. పూ. 1756. మొ॥

వ్యా. తోడప్రత్యయమున కరుదుగా, తోడుత-అను రూపాంతరము కనఁబడును. ప్రాణముతోడుతను=ప్రాణముతోడను. 6చే-తోడప్రత్యయమునకగు ప్రత్యేకప్రయోగమును, 7చే నను లోప వ్యవహితత్వములును, తోడుతను-అనుదానికిఁ గావని తెలుపఁబడెను. (చూ. మూలములు)

## చతుర్థికిం బొంటె వర్ణకంబునగు. 9

ఉ: అనఘుల శాస్త్రవిధిజ్ఞుల, ననురక్తులఁ బితృ పితామహక్రమమున వచ్చిన విప్రుల మంత్రులఁగా, నొనరించితె కార్యసంప్రయోగము పొంటెన్. భార. సభా. 1ఆ-26. పక్షమునఁ గార్యసంప్రయోగము కొఱకు. మొ॥

వ్యా. చతుర్థీవిభక్తికి "పొంటె" ప్రత్యయము సహితమగును. సంప్రయోగము పొంటెన్. పక్షమున- సంప్రయోగము కొఱకు-మొ॥

## ఉండిపదంబు పరంబగుచో వలన కందువర్ణకమట్లు నవర్ణకంబునగు. 10

ఉ: క....సనత్కుమారుఁడు మహికిం, జనుదెంచె బ్రహ్మలోకం,బున నుండి. భార ఆది. 3ఆ-91 మొ॥

వ్యా. ఉండిపదము పరమగునపుడు వలనకు, అందువర్ణకము వలె నవర్ణకము నగును. బాలవ్యాకరణమున "ఉండి శబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయా సప్తములు ప్రాయికంబుగ నగు" అని సూత్రింపఁబడెను. (బా. కారక 11) సప్తమివిధించినను,

వనమందుండివచ్చె–అని, అందువర్ణకమగుటకు మాత్రమే లక్ష్యము చూపఁబడెను. కావున, అందువర్ణకమువలెనే నవర్ణకమును నగునని యిట వివరింపఁబడెను. బ్రహ్మలోకంబునుండి:– బా. కారక9చే–బ్రహ్మలోకంబువలన. 10చే–బ్రహ్మలోకంబువలన+ఉండి. ఈ ప్రౌఢ10చే– అందువర్ణకమట్లు నవర్ణకము. బ్రహ్మలోకంబు+న+ఉండి. బా. తత్సమ8చే–బ్రహ్మలోకంబునను+ఉండి= బ్రహ్మలోకంబునన్+ఉండి: బ్రహ్మలోకంబుననుండి. నవర్ణకంబును–అను సముచ్చయముచే అందువర్ణక మెట్లును నగును. బ్రహ్మలోకంబునందుండి. ఇత్యాది.

## వలనకాదేశంబగు ద్వితీయాసప్తములమీఁది యుండికి లోపంబు బహుళంబుగా నగు. 11

ఉ: ద్వితీయమీఁది యుండికి– క. విచ్చేయుమదితిగర్భముఁ, జెచ్చెర వెలువడు మహాత్మ. భాగ. 8స్కం. 504 మొ॥ సప్తమిమీఁది యుండికి–ఆ. రక్తంబు, వదనగహ్వరమున వఱదవాఱ. భాగ. 10స్కం. పూ. 1363. సీ. ఉడుపథంబున జాఱు నుడుప ప్రతతిభాతి, మెడహారముల పెన పుడమిఁ దాఁక. పాండు. 5ఆ–267. నూతిలో, వెలువడఁ గోమలిం దిగిచె. భార. ఆది.3ఆ–144. క. నలుఁదొల్లి యాక్రమించిన, కలి కర్కోటక విషంబు గ్రక్కుచు నొడలన్, వెలువడి. భార. అర.2ఆ–178. ఉ. హెచ్చిన సంభ్రమంబున ననేకులు బ్రద్దలవార లెక్కడన్, వచ్చియె మోఁదిరాకొలువువారి. కళా, 2ఆ–70 మొ॥ (గర్భమున్=గర్భమునుండి, ఎక్కడన్=ఎక్కడనుండి ఇట్లంతట నూహ్యంబులు.) బహుళగ్రహణముచే నందుమీఁది యుండికి లోపంబు కలుగదని యెఱుంగునది. ఈసూత్రమునిట్లు చెప్పుటకు నంద్వితర సప్తమ్యర్థక వర్ణకంబులమీఁది యుండికి లోపంబు వచ్చుట ప్రయోజనంబు.

వ్యా. "ఉండిశబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు" (బా. కారక 11) అను బాలవ్యాకరణ సూత్రముచే, ఉండి శబ్దము పరమగునపుడు వలన ప్రత్యయమునకు ద్వితీయాసప్తము లగును. ఆ ద్వితీయాసప్తముల మీఁది, ఉండి పదమునకు లోపము బహుళముగా నగునని సూత్రార్థము. ద్వితీయ మీఁది యుండి లోపమునకు:– బా. కారక 9చే–గర్భమువలన+వెలువడు. 10చే–గర్భమువలన+ ఉండి+వెలువడు. 11చే– వలనకుద్వితీయ: గర్భమును+ఉండి+వెలువడు. ఈ ప్రౌఢ 11చే–వలనకాదేశమయిన ద్వితీయమీఁది ఉండిలోపించిన: గర్భమును+వెలువడు–అని యగును. పక్షమున–గర్భమునుండి వెలువడు మొ॥ సప్తమి మీఁది యుండి లోపమునకు: రక్తంబు, వదన గహ్వరమున వఱదవాఱ. బా. కారక 9చే–గహ్వరమువలన. 10చే–గహ్వరమువలన+ఉండి. ప్రౌఢ. కారక 10చే–గహ్వరమున+ఉండి. బా. తత్సమ 8 చే–గహ్వరమునను+ఉండి. ఈ 11చే–ఉండిలోపించిన: గహ్వరమునను+వఱదవాఱ. బా. సంధి 18చే–గహ్వరమున వఱదవాఱ. పక్షమున–గహ్వరమున నుండి మొ॥ ఇట్లే, ఉడుపథంబువలన+ఉండి+జాఱు = ఉడుపథంబునను+జాఱు: ఉడుపథంబునజాఱు. పక్షమున–ఉడుపథంబుననుండి. మొ॥ నూతిలో వెలువడ:– నూతిలోనను+ఉండి+వెలువడ. లోనను–అనుదానిలో 'న' వర్ణలోపము వ్యాఖ్యాన సాధ్యము. నూతిలోను+ఉండి+వెలువడ. ఉండి లోపించిన: నూతిలోను+వెలువడ.

బా. సంధి 18చే–నూతిలో వెలువడ. పక్షమున–నూతిలోనుండి. ఒడలన్ వెలువడి; ఎక్కడన్ వచ్చియె: – బా. కారక 9చే–ఒడలు+వలన; ఎక్కడ+వలన. ఆచ్ఛిక 30చే–ఒడలి+వలన; ఎక్కడి+వలన. కారక 10చే–ఒడలివలన+ఉండి; ఎక్కడివలన+ఉండి. కారక 11చే–ఒడలి+అందు+ఉండి; ఎక్కడి+అందు+ఉండి. ఆచ్ఛిక 38చే–ఒడలి+అ+ఉండి; ఎక్కడి+అ+ఉండి. తత్సమ 8చే–ఒడలి+అ+ను+ఉండి; ఎక్కడి+అ+ను+ఉండి. బా. సంధి 11చే–ఒడలను+ఉండి; ఎక్కడను+ఉండి. ఈ ప్రౌఢ 11చే–ఉండి లోపము: ఒడలను, ఎక్కడను. ఒడలను+వెలువడి. బా. సంధి 18చే–ఒడలన్ వెలువడి. ఇట్లే, ఎక్కడను+వచ్చియె=ఎక్కడన్ వచ్చియె. పక్షమున–ఒడలనుండి, ఎక్కడనుండి–ఇత్యాది. బహుళగ్రహణముచే– అందుమీఁది యుండికి లోపము రాదనియు, అందుకాక తక్కిన సప్తమ్యర్థక ప్రత్యయములపై "ఉండి" లోపించుననియు వివరింపఁబడెను. అందుమీఁదియుండి లోపింపకపోవుట బహుళప్రయోజనములలో నప్రవృత్తి యగును.

విమర్శ:– (i) ద్వితీయ మీఁది ఉండి శబ్దమునకు లోపమనుట త్యాజ్యము. గర్భము వలనను+వెలువడు. బా. కారక 21చే–గర్భమును వెలువడు–అనియగును. (ii) అందుమీఁది యుండికి లోపములేదనుట ప్రయోగవిరుద్ధము. (చూ. ము. కౌ. కారక. 8 (iii)లోను శబ్దమును గూర్చి–చూ. అనుబంధము–విషయసంఖ్య–49)

## కొన్నియెడల హేతువునం దన్నంత క్రియలమీఁదను బట్టి వర్ణకంబు విభాషనగు. 12

ఉ: తే. బ్రహ్మ పుట్టించు మనుచు నారాయణుండు, హరుఁడు హరియించు భువనంబు లవసరమున, నెట్టు సమకూరు వీరికి నీప్రభావ, మీవు కలుగంగఁబట్టిగా కిందువదన. కాశీ, 3ఆ. 44. పక్షంబునఁ గలుగుటం బట్టి. మొ॥

వ్యా. కొన్నిచోట్ల హేత్వర్థమున, 'అన్' అంతమందుఁ గల క్రియలమీఁద సహితము పట్టి ప్రత్యయము విభాషనగును. అన్నంతక్రియ–అన్–అంతమందుఁగల క్రియ (అన్+అంత) బా. క్రియా 40చే–ధాతువునకు నుజి–అగును. బా. క్రియా 20చే–ధాతువుయొక్క ఉత్వమునకు అత్వమగును. ఉదా॥ కలుగు+నుజి=కలుగ్ ఉ+నుజి. ఉత్వమునకత్వము: కలుగ్ అ+ను. ద్రుతస్వరలోపము: కలుగ్ అ+న్=కలుగన్. ఇట్లు, ఉత్వమునకయిన అత్వమును, నకారపుఁ బొల్లుతోఁ గలిపిన 'అన్' అనియేర్పడును. కాన, కలుగన్–అనునది, అన్నంతక్రియ యనఁబడును. అన్నంత క్రియయనఁగా నుజ్యంతమని భావము. హేత్వర్థమున నుజ్యంతముమీఁదను 'పట్టి' వర్ణకము కావచ్చును. కలుగంగఁబట్టి=కలిగిన హేతువున–అని యర్థము. (కలుగను+కను=కలుగంగను– బా. క్రియా 115, 116) హేతువు=ఫలసాధనయోగ్యమగు పదార్థము. (బా. కారక 4) బాలవ్యాకరణమున "పట్టివర్ణకంబు హేతువులగు గుణక్రియలకగు" (కారక 14) అని చెప్పఁబడెను. ఇట నుజ్యంతముపై, "పట్టి"విభాషనగునని పూరింపఁబడెను పక్షమున–కలుగుటంబట్టి–అని యుండును.

విమర్శ:– అన్నంత క్రియయను వ్యవహారము సరికాదు. నుజ్యంతక్రియ యనుట యుక్తము. చూ. క్రియా 22.

## షష్ఠీ స్థానికంబగు కువర్ణకం బొక్కొకచో ద్వితీయాది విభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి. 13

ఉ: ద్వితీయకు:– వేటకుఁ బోయిరి, పొలమున కేగెను. పక్షం

బున–వేఁటఁబోయిరి. భార. అర. 6అ–158. అవ్విభుండు పొలమేగెను. వి.పు. 7అ–261. మొ॥ ఇట నొకానొకచోఁ గొఱకు కయి వర్ణకంబులు నయ్యేడి. ఉ: చ. అతఁడొకనాఁడు వేఁట కొఱకై తనునేలినవారు వేడ్క తోఁ, బోతముఁగఁ బైనమౌటఁ గని, భల్లా. 3అ. అడవికి వేఁటకై యరిగి. పాండు. 5అ–14. చ. చిరముగ బ్రహ్మకుం దపముచేసి, భార. ఆది. 2అ. 138. పక్షంబున బ్రహ్మను గూర్చి తపముచేసి, మొ॥ తృతీయకు:– క. లోకోత్తర చరితుండగు, నా కావ్యతనూజ నీకు నారాధ్యను. భార ఆది. 3అ–135. అసురులకును బూజనీయులు. హరి. పూ. 2అ–60. మొ॥ పక్షమున–నీచే నారాధ్యను. మొ॥ చ. అరిమదభేది నీకు విషమాజి ముఖంబుల మార్కొనంగ నో, పరు పరులెవ్వరున్ హరి కిభంబులు మార్కొనునయ్య. భార. అర. 4అ–88. అంగపతికెదిరించెన్. కళా. 8అ–65. మొ॥ పక్షమున– నీతోమార్కొన నోపరు, హరితో మార్కొనునయ్య, అంగపతితో నెదిరించెన్. (ఇట అర్థభేదము విశేషము.) పంచమికి– క. విలువిద్య నీకు నొరుల, గ్గలముగ లేకుండ. భార. ఆది. 5అ–245. పక్షమున–నీకంటె నగ్గలముగ. (అగ్గలము– ఇది అన్యార్థాది గణగణ్యంబని యెఱుంగవలయు) సప్తమికి:– కోమలి నీకనురక్త. భార. అర. 2అ–216 పక్షమున– నీయందనురక్త. శా. ఈ పాండిత్యము నీకుఁ దక్క మఱియెందేఁ గంటిమే? స్వా. 2అ–64 పక్షమున–నీయందుఁదక్క. ఆ. అహి విషంబుచేత ననయంబు దగ్ధుండ, నైతి నింక నాకు ననఘ! సైపు. భార. అర. 2–179. మొ॥ పక్షమున–నావిషయమున సైపు. చతుర్థికి నుదాహరణంబులు పూర్వ వ్యాకరణంబులం జూచునది.

వ్యా. షష్ఠీ విభక్తి స్థానమున నగు, కుప్రత్యయము, ఒక్కొక్కచో ద్వితీయాది విభక్తులకు మాఱుగా, తత్తదర్థంబులన్=ఆయా యర్థములయందు, అనఁగా ద్వితీయాది విభక్తులయర్థమునందుఁ గనఁబడును. ద్వితీయకు:– కారక 2చే–వేఁటను బోయిరి–అని యుద్దేశార్థమున ద్వితీయయగును. ఈ ద్వితీయకు మాఱుగా, కుషష్ఠీ. వేఁటకుఁ బోయిరి=వేఁటనుబోయిరి. ఇట్లే, పొలమునేగెను=పొలమునకేగెను. పొలమునేగెను–అను ద్వితీయకు, బా. కారక 24చే–ప్రథమ: పొలమేగెను. ఇటఁ గొన్నియెడల కొఱకు, కయి ప్రత్యయములునునగును. వేఁటకొఱకై, వేఁటకై. చిరముగ బ్రహ్మకుందపముచేసి, అనుచో బ్రహ్మను–అను ద్వితీయకు, కుషష్ఠీ: బ్రహ్మకును, పక్షమున–బ్రహ్మనుగూర్చి. తృతీయకు:– నీచే నారాధ్యను=నీకు నారాధ్యను. అసురులచేఁ బూజనీయులు=అసురులకును బూజనీయులు. నీతో మార్కొన నోపరు=నీకు మార్కొన నోపరు. హరితో నిభంబులు మార్కొనునయ్య=హరి కిభంబులు మార్కొనునయ్య. అంగపతితో నెదిరించెన్=అంగపతికెదిరించెన్. "ఇట అర్థభేదము విశేషము." అనఁగా, బా. కారక. 5చే–తుల్యార్థయోగమున, తోడ, కువర్ణకము లగును. ఇట మార్కొను, ఎదిరించు–అనునవి తుల్యార్థకములు కావు. ఇది యర్థభేదము. పంచమికి:– నీకంటెనగ్గలముగ=నీకు నగ్గలముగ. అగ్గలము–అనునది, బా. కారక 12 సూత్రమునందలి అన్యార్థాది గణమున గణింపఁదగినదని యిట వివరింపఁబడెను.

అన్యాదు లాక్ష్యతిగణమగుటచే, అగ్లలము–అనుదాని నన్యాదులలోఁ జేర్ప నగునని భావము. అన్యాదులలోఁ జేర్చుటచే–కంఠెవర్ణకమగును. కంఠెవర్ణకమునకు మాఱుగా, కువర్ణకమగును. సప్తమికి:– నీయందనురక్త=నీకనురక్త. నీయందుఁదక్క=నీకుఁదక్క. నాయందు (నావిషయమున) సైపు=నాకుసైపు. చతుర్థికి మాఱుగా షష్ఠియగుట కుదాహరణములు పూర్వ వ్యాకరణములలోఁ జూడవలెను. చూ. బా. కారక 8 సూ.

## వీప్సయందును గాలపరిమితియందును నామంబులకుఁ గువర్ణకంబగు. 14

ఉ: వీప్సయందు:– బ్రమానిబ్రమానికి నరిగియరిగి, యడుగు, భార. అర. 2అ–94. ఇండ్లిండ్లకు, కళా. 7అ–59, మొ॥ కాలపరిమితి యందు:– క. కొండొకసేపునకుఁ దెలిసి. హరి. ఉ. 1అ–132. క. నెట్టన వర్షావధికిం, బెట్టంగల యుప్పనములు పెట్టియు, వి. పు. 7అ–104. ఎ. గీ. అలిగి పార్థుని శిర మాఱునెలల కుర్విఁ, ద్రెళ్ల శపియించి దేవి యదృశ్యయయ్యె. జై. 4అ–74 మొ॥

వ్యా. వీప్సయందును, గాలపరిమితియందును నామములకు, కువర్ణకమగును. వీప్స=కర్త, తానుచేయు పనినప్పటి కచ్చట సిద్ధముగానున్న ప్రతి వస్తువునకు వేఱువేఱుగా సంబంధింపఁజేయఁగోరుట. వీప్సయందు:– బ్రమానికిని+బ్రమానికిని=బ్రమానిబ్రమానికిన్; ఇండ్లకును+ఇండ్లకును=ఇండ్లిండ్లకు. (బా. సంధి 41,20) కాలపరిమితి యందు:– కొండొకసేపునకు, వర్షావధికి, ఆఱునెలలకును. ఇట, కొండొకసేపు, వర్షావధి, ఆఱునెలలు–అనునవి కాలపరిమాణమును దెలుపును గాన కుషష్ఠియయినది.

## ధాతుజ విశేషణ భావార్థక పూర్వ వ్యవహితావ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠియగు. 15

ఉ: (౧ లో ౧) ధాతుజ విశేషణ పూర్వవ్యవహిత కర్తృపద ప్రథమకు:– వ. బాహుకు రథంబు గడపునేర్పున కచ్చెరువడి. భార. అర. 2అ–170. తన మును పడ్డ బన్నములు. ఉద్యో. 3అ–102 చ. కని తనమున్నుగన్నటులు గామికి విస్మయ వారి రాశిలో, మునుఁగుచు. హరి. ఉ.9అ–112. నా యొనర్పం బూనిన కళాపూర్ణోదయంబు. కళా 1అ–105. (౧ లో ౨) ధాతుజ విశేషణ పూర్వావ్యవహితకర్తృపద ప్రథమకు:– అన్నలభూపాలకు పోయినవలను. భార. అర. 2అ–189. వ. వానిపన్నిన వృషభ గోమయ భక్షణంబు చేసి. భార. ఆది. 1అ–93. తే. ఎఱుకగలఁడేని మఱిశక్తుఁడేని నన్య, లన్యులకు హింసగావించునపుడు దానిఁ, బూనివారింపకున్న నప్పూరుషుఁడేగు, హింసచేసిన వారల యేగు గతికె. భార. ఆది. 7అ–145. వ. అపార పారావార పర్యంత మహీతలంబునందు, నా చూడనిరాజు లెవ్వరును లేరు. భార. అర. 2అ–19. తే. ఆ జరత్కారుఁగని చెప్పమయ్య వాని, నెఱుఁగు దేని

మాపడియెడు నీయవస్థ. భార. ఆది. 2ఆ-144. వ. నీచేయువేదన నన్నుందాఁక నోపదు. భార. ఆది. 2ఆ-108. సీ. హంసచేఁదన వినినంత కంటెను రూప, విభవాతిశయముల వెలుఁగుదాని. భార. అర. 2ఆ-39. (౨ లో ౧) భావార్థక పూర్వ వ్యవహిత కర్తృపద ప్రథమకు:- వ. మన పుట్టి బుద్ధియెఱుఁగుట మొదలు. హరి. పూ. 5ఆ. (౨ లో ౨) భావార్థక పూర్వావ్యవహిత కర్తృపద ప్రథమకు:- క. పరీక్షిజ్జనపాలు చనుటఁ గృశుఁడను, మునివలన నెఱింగి. భార. ఆది. 2ఆ-169. మొ॥ తలఁచుగ ననుటచే "బాహుకుండు రథంబు గడపు నేర్పునకు" ఇత్యాదు లెఱుంగునది. మేము పఠింపని శాస్త్రములె మా పఠింపని శ్రుతులే. ఆము. 6ఆ-32. మొ॥

వ్యా. ధాతుజ విశేషణ=ధాతుజ విశేషణమునకు (చూ. బా. క్రియా 44-47), భావార్థక = భావార్థకమునకు (చూ. బా. క్రియా 38) పూర్వ = ముందు, (i) వ్యవహిత = వ్యవధానము(ఎడము)గలదియు, (ii) అవ్యవహిత = వ్యవధానము లేనిదియు, నగు, కర్తృపద = కర్తృవాచక పదముయొక్క, ప్రథమకున్ = ప్రథమావిభక్తికి, తలఁచుగ యొక్క యను షష్ఠీ విభక్తిప్రత్యయమగును. అనఁగా, (1) ధాతుజవిశేషణమునకు ముందు (i) వ్యవహితముగ నుండు కర్తృపదప్రథమకు (ii) అవ్యవహితముగ నుండు కర్తృపద ప్రథమకు, (2) భావార్థకమునకు ముందు (i) వ్యవహితముగ నుండు కర్తృపద ప్రథమకు, (ii) అవ్యవహితముగ నుండు కర్తృపద ప్రథమకుఁ దలఁచుగ యొక్క షష్ఠి యగును. (1లో i) ధాతుజవిశేషణమునకు ముందు వ్యవహితముగ నున్నప్పటి కర్తృపద ప్రథమకు యొక్క షష్ఠియగుటకు:- బాహుకుండు రథంబు గడపు నేర్పునకు- అనుచో, కడపు-ధాతుజ విశేషణము. బాహుకుండు-కర్తృపదము. ధాతుజవిశేషణమునకుఁ గర్తృపదమునకు మధ్య, రథంబు-అనునది చేరుటచే రెంటికిని వ్యవధానము కలుగుచున్నది. కావున, బాహుకుండు అనుకర్తృపదము ధాతుజ విశేషణమునకు ముందు వ్యవహితముగ నున్నది. (=ఎడముగానున్నది) ఈ బాహుకుండు-అను కర్తృపదప్రథమకు యొక్కషష్ఠి కాఁగా, బాహుకుండు=బాహుకుయొక్క- అగును. బాహుకు యొక్క రథంబుగడపు నేర్పునకు-అని యేర్పడును. 16చే-నిత్యముగ యొక్క లోపము: బాహుకు రథంబు గడపు నేర్పునకు. ఇట్లే, తాను-మును-పడ్డ బన్నములు=తనయొక్క-మునుపడ్డ-బన్నములు=తన మును పడ్డ బన్నములు. (పడ్డ-ధాతుజ విశేషణము. మును-వ్యవధానము కలిగించుపదము. తాను-వ్యవహిత కర్తృపదము. దీని ప్రథమకు యొక్క షష్ఠి. తాను=తనయొక్క: తన. (యొక్క లోపము)తాను-మున్ను-గన్నటులు= తనయొక్క మున్నుగన్నటులు. (కన్న-ధాతుజవిశేషణము. మున్ను-వ్యవధానము కలిగించు పదము. తాను- వ్యవహితకర్తృపదము. దీని ప్రథమకు-యొక్క షష్ఠి: తాను=తనయొక్క: తన. నేను-ఒనర్పం-బూనిన కళా పూర్ణోదయంబు=నాయొక్క యొనర్పంబూనిన కళాపూర్ణోదయంబు: నాయొనర్పంబూనిన కళాపూర్ణోదయంబు (పూనిన-ధాతుజవిశేషణము. ఒనర్పను-వ్యవధానము కలిగించు పదము. నేను-వ్యవహితకర్తృపదము. దీనిప్రథమకు- యొక్కషష్ఠి: నేను=నాయొక్క: నా. (1లో ii) ధాతుజ విశేషణమునకు ముందవ్యవహితముగ నున్నప్పటి కర్తృపద ప్రథమకు యొక్క షష్ఠి యగుట:- అన్నలభూపాలకుఁడు పోయిన వలను. పోయిన-ధాతుజవిశేషణము. నలభూపాలకుఁడు-కర్తృపదము. ఇది,పోయిన-అను ధాతుజవిశేషణమున కవ్యవహితముగనున్నది. రెంటికి మధ్య వేఱుపదమేదియుఁ జేరలేదు. రెండును గలిసి

ప్రక్క ప్రక్కలనే యున్నవి. కావున-నలభూపాలకుఁడు-అవ్యవహితముగ నున్న కర్తృపదము. దీని ప్రథమకు యొక్క షష్ఠి: నలభూపాలకుఁడు=నలభూపాలకుయొక్క+పోయినవలను. 16చే-యొక్క లోపము: నలభూపాలకు పోయినవలను. ఇట్లే, వాఁడు పన్నిన=వానియొక్క పన్నిన: వాని పన్నిన. (పన్నిన- ధాతుజవిశేషణము. వాఁడు-అవ్యవహితకర్తృపదము. దీని ప్రథమకు-యొక్క షష్ఠి:- వాఁడు=వానియొక్క: వాని.) హింసచేసినవారలు- ఏగుగతికి = హింసచేసినవారలయొక్క యేగుగతికి: హింసచేసినవారల యేగుగతికి. (ఏగు ధాతుజ విశేషణము. హింసచేసినవారలు- అవ్యవహితకర్తృపదము. దీనిప్రథమకు-యొక్క షష్ఠి: హింసచేసినవారలు=హింసచేసినవారలయొక్క: వారల.) నేనుచూడని=నాయొక్కచూడని: నాచూడని. (చూడని-ధాతుజవిశేషణము. నేను-అవ్యవహిత కర్తృపదము. దీని ప్రథమకు- యొక్కషష్ఠి: నేను=నాయొక్క: నా.) మేము పడియెడు నీయవస్థ=మాయొక్క పడియెడు నీయవస్థ: మాపడియెడు నీయవస్థ. (పడియెడు-ధాతుజవిశేషణము. మేము-అవ్యవహితకర్తృ పదము. దీని ప్రథమకు, యొక్కషష్ఠి: మేము= మాయొక్క: మా.) నీవుచేయువేదన-నీయొక్క చేయువేదన=నీచేయువేదన. (చేయు-ధాతుజవిశేషణము. నీవు-అవ్యవహిత కర్తృపదము. దీని ప్రథమకు యొక్క షష్ఠి: నీవు=నీయొక్క: నీ.) తాను వినినంత కంటెను=తనయొక్క వినినంత కంటెను: తన వినినంత కంటెను. (వినిన-ధాతుజవిశేషణము. తాను-అవ్యవహిత కర్తృపదము. దీనిప్రథమకు యొక్కషష్ఠి: తాను=తనయొక్క: తన)

(2-1) భావార్థకమునకు ముందు వ్యవహితముగ నున్నప్పటి కర్తృపద ప్రథమకు, యొక్క షష్ఠి యగుటకు:- మనము-పుట్టిబుద్ధి-యెఱుఁగుట మొదలు. ఇట, ఎఱుఁగుట-భావార్థకము. మనము-కర్తృపదము. పుట్టిబుద్ధి-అనునది మధ్యచేరుటచే భావార్థకమునకుఁ గర్తృపదమునకు వ్యవధానము కలిగినది. కనుక, మనము-వ్యవహిత కర్తృపదము. దీనిప్రథమకు, యొక్క షష్ఠి: మనము=మనయొక్క. మనయొక్క-పుట్టిబుద్ధి-యెఱుఁగుటమొదలు. 16చే-యొక్క లోపము: మనపుట్టిబుద్ధియెఱుఁగుట మొదలు.

(2 లో ii) భావార్థకమునకు ముందవ్యవహితముగ నున్నప్పటి కర్తృపదప్రథమకు, యొక్క షష్ఠి యగుటకు:- పరీక్షిజ్జనపాలుఁడు చనుట. చనుట-భావార్థకము. పరీక్షిజ్జనపాలుఁడు-అవ్యవహితకర్తృపదము. దీనిప్రథమకు, యొక్కషష్ఠి: పరీక్షిజ్జనపాలుఁడు=పరీక్షిజ్జనపాలుయొక్క: పరీక్షిజ్జనపాలుయొక్క+చనుట. 16చే-యొక్క లోపము: పరీక్షిజ్జనపాలు చనుట.

"తలఁచుఁగ" అనుటచే-బాహుకుండు రథంబు గడపు నేర్పునకు-ఇత్యాదిగాఁ బ్రథమాంతములు కొన్నిచోట్ల నుండును. మేము పఠింపని శాస్త్రములె-అనుచో, పఠింపని-ధాతుజవిశేషణము. మేము- అవ్యవహితకర్తృపదము. దీనికి యొక్కషష్ఠిరాలేదు. తలఁచుఁగ-అనుటచేఁ బ్రథమ గ్రాహ్యము. మేము పఠింపని శ్రుతులే=మాయొక్క పఠింపని శ్రుతులే: మాపఠింపని శ్రుతులే-అనుచో, యొక్కషష్ఠి యయినది. ప్రథమకు యొక్కషష్ఠి యగుననుటచే నిట షష్ఠి ప్రథమార్థకమన్నమాట. (చూ. మూలములు)

## యొక్కకు లోపంబు బహుళంబు. 16

ఉ: ఉ. ఇమ్మిగ సర్వలోక జను లెవ్వని యేని ముఖామృతాంశు బిం, బమ్మున నుద్భవంబయిన భారత వాగమృతంబు కర్ణరం, ధ్రమ్మను నంజలిం దవిలి త్రావుదురు. భార. ఆది 1ఆ-77. ధర్మజు నలువురు దమ్ములు. భార. సభా. 2ఆ-261. తే. ఇరులు గెలిచిన యంతఃపురేందు ముఖుల, కురులు మరుఁడను వేఁటకాఁడురులు వేసి, మరులుగొలుపంగ లేఁడయ్యె మనుజవిభుని, సరులు లేని దృక్షంజన శాబకముల. నై. 3ఆ-90. సీ

వారివ ధమ్మిల్ల భారావకలిత ది, వ్యామోద వనపుష్ప దామములయు. భార. ఆది. 3ఆ-159. (వారివ=వారివేయైన. ఇక్కడ నిది షష్ఠ్యంతమునకు విశేషణము గనుక ప్రథమ) ఎ.గీ. అపుడు సమ్మెటకోలల యంకుశముల, చేఱుకోలల వ్రేటుల. (సమ్మెటకోలల యొక్కయు, అంకుశముల యొక్కయు, చేఱుకోలల యొక్కయు వ్రేటులచేత నని యర్థము. ఇట అంకుశముల వ్రేటుల ననఁగా లక్షణచేఁ బోటులని యెఱుంగునది) ద్రోణ. 3ఆ-48 నరగో మృగ సింహంబుల, కరుణములగు రోగవేగ కలితాక్రోశ, స్వరములు పెక్కయ్యె. హరి. పూ. 6ఆ-49. క. తాతలతండ్రుల తరమున, నేతెంచిన వృత్తిదక్క. విజ్ఞా. వ్య. 50. బహుళగ్రహణముచే ధాతుజ విశేషణ భావార్థకముల ముందటి కర్తృపదంబుల యొక్కకు నిత్యంబుగ లోపంబని యెఱుంగ వలయును.

వ్యా. యొక్క ప్రత్యయమునకు లోపము బహుళముగా నగును. లక్ష్యములలో- ఎవ్వనియొక్క, ధర్మజుయొక్క, అంతఃపురేందుముఖులయొక్క, సమ్మెట కోలలయొక్క, అంకుశములయొక్క, చేఱుకోలలయొక్క, నర గో మృగ సింహంబులయొక్క, తాతలయొక్క, తండ్రులయొక్క-అనుచోట్ల, యొక్క ప్రత్యయము లోపించుట కననగును. బహుళగ్రహణ మునకుఁ బ్రయోజన మేమనఁగా, 15చే-ధాతుజ విశేషణములకు, భావార్థములకు ముందు వచ్చు, యొక్కషష్ఠికి లోపము నిత్యమని తెలుపఁబడెను. ఇది బహుళప్రయోజనములలోఁ బ్రవృత్తి యన్నమాట. (చూ. మూలములు)

విమర్శ:- యొక్కకు లోపము పూర్వకావ్యములలో నిత్యముగానే యగును. ప్రతిప దార్థములందును, విగ్రహవాక్యములందును, యొక్క షష్ఠివాడఁ బడును. (చూ-ము.కౌ. కారక 14) వారివ-అనుచో షష్ఠికిఁ బ్రథమ యనుట సరికాదు. (అనుబంధము. విషయసంఖ్య-90)

## ఒక్కచో నుదంతంబగు నజడంబు తృతీయకును నవర్ణకంబు గానంబడియెడి. 17

ఉ: ఉ. ఏపునఁ గిట్టి యేనుఁగున నేనుఁగువైచుచు వాజి వాజిచే, రూపడఁగంగ మోఁదుచును. రా.యు.కాం.977 (దీనికిఁ బ్రయోగాంతరంబు మృగ్యంబు.)

వ్యా. బాలవ్యాకరణమున-"ఉదంత జడంబు తృతీయకు నవర్ణకంబగు" (కారక 23) అని సూత్రింపఁబడెను. ఇట, ఉదంతమగు అజడము తృతీయకును నవర్ణక మరుదుగా నగునని పూరింపఁబడెను. ఏనుఁగున నేనుఁగు వైచుచు-అనుచో, ఏనుఁగు-ఉదంతము, అజడము. ఏనుఁగుచేత=ఏనుఁగున. బా. తత్సమ 8చే-ఏనుఁగున+ను= ఏనుఁగునను-అగును. దీనికి, ప్రయోగాంతరము, మృగ్యంబు=వెదకఁదగినది. కనఁబడ లేదనుట. (చూ. అనుబంధము. విషయసంఖ్య-50)

## కొన్నియెడల నజడంబు తృతీయా సప్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి. 18

ఉ: తృతీయకు:– ఎ.గీ. అతని దోర్మధ్య సరసి నోలాడుచున్న, ఘనతర స్తనచక్రవాకముల నలరు, నంబ నసురేంద్రు కూఁతురింపారఁ గనియె. హరి ఉ. 7ఆ–70. సప్తమికి:– బలిమిఁ గొనిన ధనము పదివేలయొంటెలఁ బెటిగి రాఁగ వైరి భీకరుండు, వచ్చె నకులుఁడు. భార. సభా. 1ఆ–261. మనుజులవిప్రుండు (చూ. శబ్ద 62 సూ.ఉ.) భార. శాంతి 1ఆ–71. మొ॥

వ్యా. బాలవ్యాకరణమున–"జడంబు తృతీయా సప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు" (బా. కారక 22) అని సూత్రింపఁబడెను. అజడము తృతీయా సప్తములకు సహితము బహుత్వమునఁ గొన్నిచోట్ల ద్వితీయ కనఁబడునని యిటఁ బూరింపఁ బడెను. తృతీయకు ద్వితీయ:– స్తనచక్రవాకములనలరు నంబను. చక్రవాక శబ్ద మజడము. బహుత్వమున– స్తనచక్రవాకములచేత– అని చక్రవాక శబ్దముపైఁ దృతీయ నిల్చును. ఈ తృతీయకుద్వితీయ కలిగి, స్తనచక్రవాకములను–అనియగును. సప్తమికి ద్వితీయ–ఒంటెలఁబెటి గిరాఁగ. ఒంటె–అజడము. బహుత్వమున, ఒంటెలయందు–అని ఒంటె శబ్దముపై సప్తమి నిల్చును. ఈ సప్తమికి ద్వితీయకలిగిన ఒంటెలను–అగును. మనుజుల విప్రుండు. మనుజ శబ్ద మజడము. బహుత్వమున– మనుజుల యందు–అని 'మనుజ' శబ్దముపై సప్తమి. ఈ సప్తమికి ద్వితీయ కలిగిన: మనుజులను–అగును. పూర్తిపద్యమునకు–శబ్ద 62 సూత్రమునందలి యుదాహరణములలోఁ జూడవలెనని సూచింపఁబడెను. (సూ=సూత్రము. ఉ=ఉదాహరణము)

విమర్శ: పదివేల యొంటెలు, పెటికిరాఁగ అని శబ్దరత్నాకరమునఁ జూపిన పాఠమును గ్రహింపవచ్చును. (పెఱుకు=మోయు– శ.ర.) లొట్టియల్–అను పాఠాంతరమును గలదు. కాన, ఒంటెలఁబెటిగి రాఁగ–అనునది త్యాజ్యమననగును. (చూ. అనుబంధము--విషయసంఖ్య–51)

## కొన్నియెడల నజడంబు ద్వితీయకును బ్రథమ కానంబడియెడి. 19

ఉ: చ. అనిల జవంబునం బఱచు నమ్మదనాగ మెదిర్చి క్రమ్మఱిం,చిన పరికాఁడు వోలెఁ గురుసింహ వరూథము నిట్లు క్రమ్మఱిం,చునె? భార. ఆది. 4ఆ–205. తన వారణేంద్రము, క్కుద్రు కుల వీరుమీఁద నెసకొల్పిన. భార. ఆర. 6ఆ–228. తత్క్రతుహయోత్తమ మొక్కెడఁ గట్టఁ బంపుచున్. జై. 5ఆ. 173 మొ॥

వ్యా. బాలవ్యాకరణమున–"జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు" అని సూత్రింపఁబడెను. (బా. కారక 24) ఇట నజడము ద్వితీయకును గొన్నియెడలఁ బ్రథమ కనఁబడునని పూరింపఁబడెను. మదనాగమును+ఎదిర్చి. మదనాగము–అజడము. దీని ద్వితీయకుఁ బ్రథమ: మదనాగము+ఎదిర్చి=మదనాగమెదిర్చి. ఇట్లే వారణేంద్రమును=వారణేంద్రము. హయోత్తమమును = హయోత్తమము–అని ద్వితీయలకుఁ బ్రథమలు. (చూ. అనుబంధము. విషయసంఖ్య–52)

విమర్శ:– ఈ ప్రయోగములుపేక్ష్యములనఁదగును.

## ఒక్కొకచో జడంబు సప్తమికిం బ్రథమయు నగు. 20

ఉ: వాహికమునాఁగఁ బరఁగు తీర్థమాడి మేధాసమన్వితు లగుదురు. భార. అర. 2ఆ–278. చ. వ్రతములు లేనివారు నుపవాస పరాఙ్ముఖులైనవారు దుష్కృతులు విహీన శౌచులుఁగ్రమంబునఁ దీర్థములాడనోపరు. భార. అర. 2ఆ–283. ఉర్వింగల్గు తీర్థంబు లెల్లను నేనాడుచు. హరి. పూ, 5ఆ–82. ఆ. ఎఱుకు నన్ను నుఱక యేసిన శరములు, నెఱఁకులాడి. భార. అర. 1ఆ.314. పొరిఁబొరి మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ నూర్ధ్వబాహుఁడై. భార. శల్య. 1ఆ–6. ఆవమిడినఁ బగిలిపోవుటయు. భార. స్త్రీ. 1ఆ–34. ఎ.గీ. ముట్టికందముల్ వడిఁ గత్తిపెట్టి పెట్టి. హరి. పూ. 6 ఆ–165. శా. భావంబుల్ భయ ముజ్జగించి చొరుఁడీ భవ్యాద్రి చాటందఱున్. హరి. పూ. 8ఆ–165. మ. కనుఁగొంటిం బరిమేష్ఠిఁ దొట్టి సురసంఘం బేకతంబుండఁగన్. హరి. పూ. 5ఆ–82. ఎ.గీ. లీలఁ బేరోలగంబున్న నీలవర్ణు. ఉ.హరి. 4ఆ–141. శార్ఙ్గగుణ గాఢరవంబు నభంబు నిండఁగాన్. నిర్వ. 3ఆ–2. అదియున్ మేనుచ్చి. రా. అర. కాం. 2ఆ–59. జనయిత్రి చిచ్చుఱికిన. జై. 8ఆ–36. తే. పంకము గొరిజ దిగఁబడఁ బఱవలేవు, మన్ను లివ్వేళ రేగటిమన్నులందు. స్వా. 4ఆ–20 మొ॥ పక్షాంతరమునఁ దీర్థమందాడి, మొ॥ ఇట్టి ప్రయోగములచేత "అన్యస్యాః క్వచిద్భవేచ్చాన్యా" అనుశబ్దశాసనుల సూత్రము సార్థక మగుచున్నది.

వ్యా. బాలవ్యాకరణమున–"జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు" (కారక 24) అని సూత్రింపఁబడెను. ఇట, జడంబు సప్తమికి సహిత మొకచోఁ బ్రథమ యగునని పూరింపఁబడెను. తీర్థమందాడి. తీర్థము–జడము. కాన దీని సప్తమికిఁ బ్రథమ: తీర్థము+ఆడి=తీర్థమాడి. ఇట్లే, తీర్థములందు=తీర్థములు. తీర్థంబులందు=తీర్థములు. నెఱఁకులందు=నెఱఁకులు; (నెఱను+లు=నెఱఁకులు– బా. ఆచ్ఛిక 18) మోమునందు= మోము; ఆవమందు=ఆవము; కందములందు=కందముల్; భావంబులందు=భావంబుల్; ఏకతంబందు=ఏకతంబు; పేరోలగంబందు=పేరోలగంబు; నభంబునందు=నభంబు; మేని యందు=మేను; చిచ్చునందు=చిచ్చు; పంకమునందు= పంకము. ప్రథమయు–అనుటచే సప్తమియు నగును. తీర్థమందాడి–ఇత్యాది. ఇట్టి ప్రయోగములచే, అన్యస్యాః– అను చింతామణి సూత్రము సార్థక మగుచున్నది. అన్యస్యాః=ఒక విభక్తిచోట, అన్యా=మఱియొక విభక్తి, క్వచిత్= ఒకానొకచో, భవేత్, చ=అగుటయుఁ గలదు–అని యర్థము. ఇట సప్తమికిఁ బ్రథమ యగుటచే నీచింతామణిసూత్రము సార్థకమగుచున్నదని తెలుపఁబడెను. ఈ చింతామణి సూత్రము బాలవ్యాకరణమునఁ దెనిఁగింపఁబడెను. (బా. కారక 21) కాని జడముసప్తమికి ద్వితీయయగుట కుదాహరింపఁబడలేదు. కాన నిట్లు పూరింపఁబడెను.

## ఒక్కచో సమాసాంతర్గత విశేష్యంబుల కగు విశేషణంబుల షష్ఠికిని బ్రథమ చూపట్టెడి. 21

ఉ: పార్థివ, ప్రాగ్రసరుండు ధర్మసుతు పన్నిది నీకు నలంఘ్యము. భార.

ఆము. 5ఆ-416. లసదగణ్య గుణౌఘ విచిత్రుఁడమ్మహాత్ము చరితంబులు. హరి. ఉ. 5ఆ-49. ఉత్ఫుల్లలోచనుఁడావిష్ణుని మూర్తితో. హరి. ఉ. 5ఆ-176. విస్ఫురన్మహో, విక్రముఁడైన దేవుఁడు త్రివిక్రము సొమ్ములు. హరి ఉ. 6ఆ-125 మొ॥

వ్యా. బాలవ్యాకరణమున "ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాషనగు" (కారక 27) అని సూత్రింపఁబడెను. సుగుణాభిరాముఁడు రామునకు జోహారు సొనర్చెద-అని యుదాహరింపఁబడెను. ఇట, నొకానొకచో, సమాసాంతర్గత విశేష్యముతో నన్వయించు విశేషణముల షష్ఠికిని బ్రథమ,కనఁబడునని పూరింపఁబడెను. సమాసాంత ర్గత=సమాసముయొక్క లోపలిభాగమును బొందిన, అనఁగా సమాసము నందున్న-అని యర్థము. పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతుపన్పు. ఇట ధర్మసుతు పన్పు-షష్ఠీ సమాసము. (ధర్మసుతుయొక్క+పన్పు=ధర్మసుతుపన్పు.) కనుక, ధర్మసుతు యొక్క-అను విశేష్యము సమాసగతమై యున్నది. విధాన సామర్థ్యమున, నీ 21చే- సమాసగత విశేష్యమున కగు విశేషణమునకును షష్ఠియగును. అనఁగా, పార్థివప్రాగ్రసరుయొక్క ధర్మసుతుపన్పు-అని నిల్చును. పార్థివప్రాగ్రసరుయొక్క-అను సమాసగత విశేష్యమున కగు విశేషణపు షష్ఠికి, ఈ ప్రౌఢ 21చే-ప్రథమకాఁగా-పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతుపన్పు-అని యేర్పడును. లసదగణ్య గుణౌఘ విచిత్రుఁ డమ్మహాత్ము చరితంబులు. మహాత్ముచరితంబులు-షష్ఠీ సమాసము. కాన మహాత్ముయొక్క-అను విశేష్యము సమాసగతమైయున్నది. విధాన సామర్థ్యముచే-ఈ సమాసగత విశేష్యమున కగు విశేషణమునకు షష్ఠియగును. లసదగణ్య గుణౌఘ విచిత్రుయొక్క+అమ్మహాత్ముచరితంబులు-అని నిల్చును. ఈ21చే-షష్ఠికిఁ బ్రథమకలిగి, లసదగణ్యగుణౌఘ విచిత్రుఁడమ్మహాత్ముచరితంబులు-అని సిద్ధించును. ఉత్ఫుల్లలోచనుఁ డావిష్ణుని మూర్తితో. విష్ణునిమూర్తితో-షష్ఠీసమాసము. కాన, విష్ణునియొక్క-అను విశేష్యము సమాసగతమై యున్నది. ఈ సమాసగత విశేష్యమునకగు విశేషణమునకు, విధాన సామర్థ్యముచే-షష్ఠియగును. ఉత్ఫుల్లలోచనుయొక్క+ఆ విష్ణునిమూర్తితో. ఈ21చే- షష్ఠికిఁ బ్రథమకలిగి-ఉత్ఫుల్లలోచనుఁ డావిష్ణుని మూర్తితో-అని సిద్ధించును. విస్ఫురన్మహోవిక్రముఁడైన దేవుఁడు త్రివిక్రము సొమ్ములు. త్రివిక్రముసొమ్ములు-షష్ఠీసమాసము. కాన, త్రివిక్రముయొక్క అను విశేష్యము సమాసగతమై యున్నది. ఈసమాసగత విశేష్యమున కగు విశేషణమునకు, విధాన సామర్థ్యముచే-షష్ఠియగును. విస్ఫురన్మహోవిక్రముఁడైన దేవు(ని)యొక్క త్రివిక్రము సొమ్ములు-అని నిల్చును. ఈ21చే-షష్ఠికిఁ బ్రథమ: విస్ఫురన్మహో విక్రముఁడైన దేవుఁడు త్రివిక్రముసొమ్ములు-అని సిద్ధించును.

ఈయుదాహరణములలో విశేషణములు సమాసగతములగు విశేష్యములతో నన్వయించు చున్నవి. కావున వీని నేకదేశాన్వయములందురు. ఏకదేశము=భాగము. సమాసమునందలి యేకదేశముతో, వేఱు గానున్న పద మన్వయించుట యేకదేశాన్వయము.

విమర్శ:- ఈ ప్రయోగములు ప్రామాదికములు. (చూ. అనుబంధము. విషయసంఖ్య-24) కాన, ననుసరణీయములు కావు.

## కొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకుఁ బ్రథమ చూపట్టెడి. 22

ఉ: అహీన బాహుబలసార ఘనుల్ మధుకైటభాది దైత్యపతుల నెల్లఁ ద్రుళ్లడఁచె. నిర్వ. 5ఆ-12. క. తండ్రీ! ఘటోత్కచుఁడు మీ, తండ్రిగలుగఁగాదె తల్లి ద్రౌపదితోడన్, దండ్రుల హరిదీశ్వరులెన, మండ్రు

వొంగడఁ దెచ్చె గంధమాదనమునకున్. జై. 1ఆ-97. మొ॥ "షష్ఠీవిశేష ణానామ్" అను బహువచన సారస్య మిట్టి ప్రయోగముల కుత్పాదకముగా నున్నయది. మఱియు నేతద్విశేషంబు లనేకవిధంబులు గలవుగాని ప్రామాణిక ప్రయోగములు దొరకమిం జేసి యవి యనాదృతంబులయ్యె.

వ్యా. బాలవ్యాకరణమున "ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాషనగు" (బా. కారక 27) అని చెప్పఁబడెను. ఇట, విశేషణము ద్వితీయాదులకుఁ బ్రథమ కొన్నిచోట్లఁ గనఁబడునని పూరింపఁబడెను. ద్వితీయకుఁ బ్రథమ:- అహీన బాహుబల సారఘనుల్ మధుకైటభాదిదైత్యపతులను. బా. కారక 19చే-అహీనబాహుబలసారఘనులను, మధుకైటభాదిదైత్యపతులను-అని నిల్చును. ఈ 22చే-అహీనబాహుబల సార ఘనులను-అను విశేషణముయొక్క ద్వితీయకుఁ బ్రథమ కలిగిన- అహీనబాహుబల సార ఘనులు-అగును. (ఘనులు+మధు=ఘనుల్ మధు-బా. ప్రకీర్ణక 16) తృతీయకుఁ బ్రథమ:- తల్లి ద్రౌపదితోడన్. బా. కారక 19చే-తల్లితోడ ద్రౌపదితోడన్-అగును. ఈ 22చే-విశేషణము తృతీయకుఁ బ్రథమకలిగిన: తల్లి ద్రౌపదితోడన్-అని యగును. "షష్ఠీవిశేషణానాం ప్రథమాస్యాత్" అని యాంధ్రశబ్దచింతామణి. షష్ఠీ విశేషణానామ్=షష్ఠ్యంతములగు విశేష్యములకు విశేషణములైన వానికి, ప్రథమా=ప్రథమావిభక్తి, స్యాత్=అగును-అని యర్థము. ఇట షష్ఠీవిశేషణానామ్-అని బహువచనము వాడఁబడినది. (విశేషణస్య-ఏ కవచనము) విశేషణములకు-అను బహువచన స్వారస్యముచే షష్ఠీ విశేషణములకేకాక ద్వితీయాది విశేషణములకును నరుదుగాఁ బ్రథమ కావచ్చునను నర్థము సిద్ధించుచున్నది. కావునఁ బైప్రయోగములు లక్షణసమ్మతములే యని వివరింపఁబడెను. ఇంకను మఱికొన్ని ప్రయోగ విశేషములున్నవి గాని, వానికిఁ బ్రామాణికప్రయోగములు లభింపకపోవుటచే వాని ననాదరించినట్లు తెలుపఁబడెను. (చూ. మూలములు)

## క్రియాన్వయంబున రెండుపదంబులకు స్వస్వామి సంబంధము గలచో సంబంధిపదంబు షష్ఠికి ద్వితీయ యగు. 23

ఉ: క. కొన్నివెడమాటలాడుచు, నన్ను నతఁడు చెట్టవట్టినన్. భార. విరా. 2ఆ-274. ఉ. కట్టియవైచె నెన్నుదురుగాఁడ భవత్తనయుండు మాద్రి లేఁ, బట్టిని. భార. శల్య. 1ఆ-377. రాము తమ్ముఁన్ లవుం, డిరుమూఁడమ్ములఁ జాపముందునుమ. జై. 6ఆ-218. నరసూనునపుడు కర్ణజుఁ, డిరుమూఁడు శిలీముఖంబు లెదసించిన. జై. 7ఆ-19. మొ॥

వ్యా. రెండుపదములకు స్వస్వామి సంబంధమున్నప్పుడు, సంబంధిపదము షష్ఠికిఁ గ్రియాన్వయమున, ద్వితీయావిభక్తి యగును. స్వస్వామిసంబంధము=సొత్తునకు దానియధిపతికిఁ గల సంబంధము. స్వశబ్దమునకు సొత్తు-అని యర్థము. (స్వోస్త్రియాం జ్ఞాతిధనయోః. త్రి.ని.) ఇది యితర సంబంధముల కుపలక్షణము. ఎట్లన-(i) అవయవావయవి సంబంధమున షష్ఠికి ద్వితీయయగుటకు:- నన్ను-చెట్టవట్టినన్. ఇట, నాయొక్క చెట్టవట్టినన్-అని మొదటనిల్చును. చెట్ట (=చెయ్యి)-అవయవము. నాయొక్క-అను నస్మదర్థముచే బోధింపఁబడువ్యక్తి యవయవి. (=అవయవముగల వాఁడు) కనుక, నిటయవయవావయవి సంబంధముగలదు. (చేయి-అవ యవము. ఆచేయి గలవ్యక్తి-అవయవి, యనుట.) నాయొక్క-అను సంబంధిపదము చెట్టశబ్దముతో నన్వయించుచున్నది. ఇట్లుకాక,

సంబంధిపదమును క్రియతో నన్వయింపఁ దలఁచినప్పుడు, సంబంధిపదము షష్ఠికి ద్వితీయ యగును. నాయొక్క చెట్టవట్టినన్=నన్నుఁ జెట్టవట్టినన్-అగును. నాయొక్క-అను షష్ఠికి, నన్నున్-అని ద్వితీయయయ్యెనన్నమాట. నన్నున్-అను ద్వితీయ, పట్టినన్-అను క్రియతో నన్వయించుచున్నది. కట్టియవైచె నెన్నుదురుగాఁడ భవత్తనయుండు మాద్రి లేఁబట్టిని. ఇట, మొదటి వాక్యము-భవత్తనయుండు మాద్రిలేఁబట్టియొక్క నెన్నుదురు గాఁడఁ గట్టి యవైచె-అనునది. నెన్నుదురు-అవయవము. మాద్రిలేఁబట్టి-అవయవి. (=అవయవముగల వాఁడు. నెన్నుదురు, అనునవయవము గలవాఁడనుట.) కాననిచట నవయవావయవి సంబంధముగలదు. మాద్రిలేఁబట్టియొక్క-అను సంబంధిపదము, నెన్నుదురు శబ్దముతో నన్వయించుచున్నది. ఇట్లుకాక సంబంధిపదమును క్రియతో నన్వయింపఁదలఁచినప్పుడు, సంబంధిపదము షష్ఠికి ద్వితీయ యగును. మాద్రిలేఁబట్టియొక్క నెన్నుదురు=మాద్రిలేఁబట్టిని నెన్నుదురు-అగునన్నమాట. మాద్రిలేఁబట్టిని- అను ద్వితీయ, వైచెన్-అను క్రియతో నన్వయించుచున్నది. (భవత్తనయుండు నెన్నుదురుగాఁడ మాద్రిలేఁబట్టిని గట్టియవైచెనని యన్వయము.) నరసూను నపుడు కర్ణజుఁ, డిరుమూఁడు శిలీముఖంబు లెదసించిన. ఇట, మొదటివాక్యము-కర్ణజుఁడపుడు ఇరుమూఁడు శిలీముఖంబులు, నరసూనుయొక్క యెదసించిన. ఎద-అవయవము. నరసూనుఁడు-అవయవి. కాన నిట నవయవావయవి సంబంధము గలదు. నరసూను యొక్క-అను సంబంధిపదము, ఎద శబ్దముతో నన్వయించుచున్నది. ఇట్లుకాక సంబంధిపదమును క్రియతో నన్వయింపఁదలఁచినచో, సంబంధిపదముషష్ఠికి ద్వితీయ యగును. నరసూనుయొక్క యెదసించిన=నరసూనుని, ఎదసించిన-అగు నన్నమాట. నరసూనుని, చించినన్-అని ద్వితీయకుఁ గ్రియాన్వయముగలదు. (ii) స్వస్వామి సంబంధమున షష్ఠికి ద్వితీయ యగుటకు:- రాముతమ్మున్ లవుం, డిరుమూఁడమ్ములఁ జాపముందునుమ. ఇట మొదటివాక్యము-లవుం డిరుమూఁడమ్ములన్, రాముతమ్ముని యొక్క చాపముందునుమ. చాపము-స్వము (=సొత్తు) రాముతమ్ముఁడు-స్వామి. (చాపమున కధిపతి) కాన నిట, స్వస్వామిసంబంధము గలదు. రాముతమ్ముని యొక్క-అను సంబంధిపదము చాపముతో నన్వయించుచున్నది. ఇట్లుకాక సంబంధి పదమును గ్రియతో నన్వయింపఁదలఁచినచో సంబంధి పదము షష్ఠికి ద్వితీయ యగును. రాముతమ్మునియొక్క=రాముతమ్ముని(న్)-అని యగును. రాముతమ్ముని-అను ద్వితీయ, తునుమన్-అను క్రియతో నన్వయించుచున్నది.

విమర్శ:- ఈసూత్రమున కిచ్చిన నాలుగుదాహరణములలో మూఁడు సరియగు లక్ష్యములుకావు. (i) కొన్ని వెడమాటలాడుచు నన్నున్, అనుచో నన్నున్=నన్నుగుఱించి, నన్నుద్దేశించి, కొన్ని వెడమాటలాడుచు-అని యన్వయింపఁదగును. (ii) మాద్రిలేఁబట్టిని= మాద్రిలేఁబట్టినుద్దేశించి- అననగును. (iii) రాముతమ్మున్-అనునది పద్యములో, కన్గొని- అనుదానితో నన్వయించుచున్నది. (రాముతమ్మున్-కన్గొని మరుత్సూనుండు కట్టల్కతోన్) వ్యాకర్తతప్పుగా నన్వయించుకొని యుదాహరించెను. (చూ. అనుబంధము. విషయ సంఖ్య-91) (iv) శిలీముఖముల నెదసించిన-సాధుపాఠమనఁదగును. శిలీముఖంబులు-అను ప్రథమ సరికాదు.

## ఒక్కచో ద్వితీయాంత విధేయ విశేషణంబునకుం ప్రథమయు నగు. 24

ఉ: ఉ. ఎవ్వనిం, బ్రాకట ధర్మతత్త్వవిదుబ్రాహ్మణముఖ్యుఁ బురోహి తుండుఁగాఁ, జేకొనువారము. భా. ఆది. 7ఆ-155. క. రయమున మ్రింగుడు గాలము, క్రియ నెవ్వఁడు కంఠబిలము క్రిందికిఁ జన కగ్నియుఁ

బోళె క్రో దహించును, భయరహితా వాని నెఱుఁగు బ్రాహ్మణకులుగాన్. భార. ఆది 2ఆ–60 మొ॥

వ్యా. ద్వితీయాంత విధేయ విశేషణమునకు, ఒకచో, ప్రథమా విభక్తియునగును. అనఁగా విధేయవిశేషణము ద్వితీయకుఁ బ్రథమయు నగుననిభావము. విధేయ విశేషణము=మీఁదఁ దెలియఁ దగిన విశేషణము. ఇది వక్తకు మాత్రమే తెలియును. (వాక్య 6) బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగా. ఇట, బ్రాహ్మణముఖ్యున్– అను విశేష్యము ద్వితీయాంతమై యున్నది. కాన దీని విశేషణమగు పురోహిత శబ్దమునూ ద్వితీయాంతము కావలెను. (బా. కారక 19) అనఁగా, బ్రాహ్మణ ముఖ్యుని, పురోహితునిగా అని యుడవలెను. ఈ ప్రౌఢ 24చే–పురోహిత శబ్దము ద్వితీయకుఁ బ్రథమ కలిగిన–బ్రాహ్మణముఖ్యుని పురోహితుండుగా= బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగా–అని యయ్యెను. బ్రాహ్మణముఖ్యుని బురోహితునిగా అనియుఁ గావచ్చును. వానినెఱుఁగు బ్రాహ్మణకులుఁగాన్. ఇట వానిని–అను విశేష్యము ద్వితీయాంతము. బ్రాహ్మణకులుని–అను విధేయవిశేషణమును ద్వితీయాంతముగానే యున్నది. బ్రాహ్మణకులుఁడుగా–అనియు నుండవచ్చును.

## కొన్నియెడల విధేయ విశేషణ మొండ బహువచ నాంతంబయి విశేష్యంబులు పెక్కిటి కన్వయ యోగ్యంబగు. 25

ఉ: క. ఇది దక్షిణాపథంబున, కిదియు విదర్భాపురమున కిది కోసల కిం, దిది యుజ్జయినికిఁ దెరువులు, మది నిన్నిటిలోన నరుగ మనకెద్దియగున్. భార. అర. 2ఆ–69. బహువచనాంతము కాక యేకవచనాంతమైనచోఁ దెరువు లైదుండవలెను.

వ్యా. కొన్నిచోట్ల, విధేయవిశేషణము–(24 సూ.) ఒండ=ఒక్కటే, బహువచనాంతమై, పెక్కు విశేష్యముల కన్వయింపఁ దగియుండును. ఇది దక్షిణా పథంబునకు, అనుపద్యమున, తెరువులు–అను విధేయ విశేషణ మొక్కటే బహువచనాంతమై, నాలుగు "ఇది" శబ్దములకు, ఒక "ఎద్ది" శబ్దమునకు నన్వయింపఁదగి యున్నది. ఏకవచనాంతమయినచో, తెరువు శబ్దములైదుండవలెను. ఎట్లనఁగా–ఇది దక్షిణాపథంబునకుఁ దెరువు. ఇదియు విదర్భాపురమునకుఁ దెరువు. ఇది కోసలకు దెరువు. ఇది యుజ్జయినికిఁ దెరువు. మదినిన్నిటిలోన నరుగ మనకే తెరువగున్–అని యైదుసార్లు వాడవలసియుండు నన్నమాట.

## కొన్నియెడల విభక్తి పరిణామంబు గ్రాహ్యంబు. 26

ఉ: ఈతనితో సాటియనంగ మేలన. (మేలన=ఈతనికంటె మేలన. ఇక్కడఁ దృతీయకుఁ బంచమిగా మార్పుగలిగెనని తెలియవలయు. నిర్వ 3ఆ–61. మొ॥

వ్యా. కొన్నిచోట్ల, విభక్తిపరిణామంబు=ఒకవిభక్తి వేఱొక విభక్తిగా మాఱుట, గ్రాహ్యంబు=గ్రహింపఁదగినది. ఈతనితో సాటియనంగ మేలన. ఇట, ఈతనితో–అను తృతీయ, సాటి శబ్దముతో నన్వయించి (బా. కారక 5) పిమ్మటఁ బంచమీవిభక్తిగా మాఱి, మేలుశబ్దముతో నన్వయించుచున్నది. ఈతనితో, సాటియనంగ; ఈతనితో=ఈతనికంటె, మేలు, అన, అని యన్వయము. (చూ. అనుబంధము. విషయసంఖ్య–53)

తచ్ఛబ్దాంతములగు ధాతుజ విశేషణంబుల మీఁద
నరు చూపట్టదు. 27

ఉ: శా. ఏయేదేశములం జరించితిరి మీరేయే గిరుల్ చూచినా, రేయే తీర్థములందుఁ గ్రుంకిడితి రేయే ద్వీపముల్ మెట్టినారు. స్వా. 1ఆ–68. మొ॥

## ఇది కారక పరిచ్ఛేదము

వ్యా. తచ్ఛబ్ద మంతమందుఁగల ధాతుజవిశేషణములమీఁద, అరు–కనఁబడదు. చూచిన–ధాతుజవిశేషణము. (బా. క్రియా 44–47) బా. సమాస 9చే–చూచిన+వారు. ఇది తచ్ఛబ్దాంతమగు ధాతుజవిశేషణము. బా. క్రియా 117చే–చూచిన+వారు=చూచిన+ఆరు: చూచినారు. ఇట్లే–మెట్టినవారు=మెట్టినారు. వీనిపై 'అరు, చూపట్టదు. చూచినారు+అరు=చూచినారరు; మెట్టినారు+అరు=మెట్టినారరు–అను రూపములు కావని యర్థము. బా. కారక33చే–రువర్ణమాగమమగును. ముందటి ఉత్వమునకు అత్వము, బా. కారక34చే నగును. ఈ అత్వమును రువర్ణమును గలిపి, అరు–అని ప్రౌఢవ్యాకర్త వ్యవహరించెను. కావున, అరు– చూపట్టదనఁగా, రువర్ణమును, ముందటి ఉత్వమున కత్వమును గలుగవని భావము.

విమర్శ:- తచ్ఛబ్దాంతములగు ధాతుజవిశేషణములపై అరు చూపట్ట దనుట ప్రయోగవిరుద్ధమగుటచే నీసూత్రము త్యాజ్యము. (చూ. అనుబంధము. విషయసంఖ్య–92)

## ఇది ఘంటాపథము

* * *

# సమాస పరిచ్ఛేదము

## సమాసమనఁగా సంయోగదశయందుఁ గలిగెడు విభక్తి లోపాత్మక పదస్వరూప సంగ్రహము. (ఇది లుక్సమాస విషయము)

వ్యా. సమాసమనఁగా, సంయోగదశయందున్=సమర్థములగుపదములు సంయోగించు (కూడుకొను) నవస్థయందు, కలిగెడు, విభక్తిలోపాత్మక మయిన, పదస్వరూపముయొక్క సంగ్రహము. సమర్థములగు పదములు సంయోగించుదశలో విభక్తి లోపము జరిగి యేర్పడు సంగ్రహమయిన పదస్వరూపము సమాసమని భావము. ఉదా॥ "రామునియొక్క"+"బాణ+ము." ఇది యలౌకికవిగ్రహము. "రాముని+యొక్క" అను పదము, "బాణ+ము" అను పదము, సంయోగించుచున్నవి. ఈ సంయోగ దశయందు విభక్తులు లోపించి రామునిబాణ–అను ప్రాతిపదికము సిద్ధించును. మువర్ణకముచేరి–రామునిబాణము–అను సంగ్రహమయిన పదస్వరూపమేర్పడును. ఇదే సమాసము, ఈ నిర్వచనము లుక్ సమాసవిషయము. లుక్=విభక్తి లోపమని యర్థము. (చూ. శబ్ద 106) విభక్తిలోపముచే నేర్పడు సమాసములు లుక్సమాసము లనఁబడును. విభక్తిలోపము జరుగక యేర్పడు సమాసముల నలుక్సమాసములందురు. ఉదా॥ చూ. బా. సంధి 43,44 సూ. "విభక్తిలోపాత్మక పదస్వరూప సంగ్రహము" అను నిర్వచన మీ యలుక్సమాసములకు వర్తింపదు. ఏలయన, నలుక్సమాసములలోఁ బూర్వపదవిభక్తి లోపింపదు. లుక్=ప్రత్యయలోపము. (చూ. అనుబంధము విషయసంఖ్య–128).

విమర్శ:- శాస్త్రీయమగు సమాసలక్షణముండఁగా (బా. సమాస 1) నీ య సమగ్ర నిర్వచనము చెప్పుట సరికాదు.

## షష్ఠీ తత్పురుషంబులందు నగాగమంబు విభాషనగు. 1

ఉ: ఎలజవ్వనంబున విలసనంబు. భార. ఆది. 3ఆ–27. యోగక్షేమంబున తెలుఁగు. భార. ఉద్యో. 1ఆ–274. అరదంబున యురవడికిన్. నిర్వ. 6ఆ–129 మొ॥

వ్యా. షష్ఠీసమాసములందు నగాగమము విభాషనగును. లక్ష్యములను బట్టి యీ నగాగమము, ఉదంతములగు నమహత్తులకే యగునని గ్రహింపవలెను. బా. సంధి 34 సూత్రముచే షష్ఠీసమాసమున ఉకారమునకు, అచ్చుపరమగునపుడు నుగాగమ మగును. ఈ ప్రౌఢవ్యాకరణ సూత్రముచే షష్ఠీ సమాసమున నమహత్తుల ఉకారమున కచ్చుగాని హల్లుగాని పరమైనపుడు నగాగమము విభాషనగును. ఇట్లిది బాలవ్యాకరణమునకుఁ బూరణమన నగును. ఎలజవ్వనంబు+విలసనంబు=ఎలజవ్వనంబున విలసనంబు. యోగక్షేమంబు+తెలుఁగు=యోగక్షేమంబున తెలుఁగు. అరదంబు+ ఉరవడికిన్+అరదంబునయురవడికిన్.

ప్రక్రియః- "ఎలజవ్వనంబు+యొక్క"+"విలసన+ము"-అలౌకిక విగ్రహము. బా. సమాస 25చే-ఎలజవ్వనంబు+ విలసన. ఈ 1చే-ఎలజవ్వనంబున+విలసన=ఎలజవ్వనంబున విలసన-ప్రాతిపదికమగును. బా. తత్సమ 39చే- ఎలజవ్వనంబున విలసనము. తత్సమ 42 చే-ఎలజవ్వనంబున విలసనంబు. "యోగక్షేమంబుయొక్క"+"తెఱఁగు+వు" బా. సమాస 25చే-యోగక్షేమంబు+తెఱఁగు. ఈ 1చే-యోగక్షేమంబున+తెఱఁగు=యోగక్షేమంబున తెఱఁగు-ప్రాతిపదికము. బా. తత్సమ 48చే-యోగక్షేమంబున తెఱఁగు+వు. తత్సమ 57చే-యోగక్షేమంబున తెఱఁగు. పక్షమున-ఎలజవ్వనంబువిలసనంబు, యోగక్షేమంబు తెఱఁగు. "అరదంబు యొక్క"+"ఉరవడి+కు". బా, సమాస 25చే-అరదంబు+ఉరవడి. ఈ 1చే-అరదంబున+ఉరవడి. బా. సంధి 3చే-అరదంబునయురవడి-ప్రాతిపదికమగును. తత్సమ 6చే-అరదంబునయురవడి+ కు. తత్సమ 8చే-అరదంబున యురవడి+కును. తత్సమ 26చే-అరదంబునయురవడికిని. పక్షమున-అరదంబు+ఉరవడి. బా. సంధి 34చే-అరదంబునురవడి+కు+ను=అరదంబునురవడికిని-అగును. చూ. అనుబంధము. (విషయసంఖ్య-54)

## కర్మధారయంబు బిరుదాద్యుత్తరపదంబయ్యేనేని ద్వ్యక్షరాదంత స్త్రీపుం సంజ్ఞావాచకంబగు పూర్వపదంబు నంత్యాక్షరంబున కంతటఁ దీర్ఘంబు బహుళంబుగా నగు. 2

అంతటఁ ననఁగా సాంస్కృతికాదులు మూఁటనని యర్థము. ఉః రామాశాస్త్రి, సుబ్బాశాస్త్రి, రామానాయఁడు, సుబ్బానాయఁడు, రామారెడ్డి, సుబ్బారెడ్డి, ఎల్లాసెట్టి, వీరాసెట్టి, కుప్పాసామి, వీరాసామి, రామారాయఁడు, సుబ్బారాయఁడు, రామారావు, సుబ్బరావు, ఎఱ్ఱాప్రెగ్గడ, చిన్నాదేవి మొ॥ బహుళంబుగా, ననుటచే-రామరాయఁడు సుబ్బారావు, ఎఱ్ఱప్రెగ్గడ యిత్యాదులందు దీర్ఘంబు వైకల్పికంబు. కృష్ణశాస్త్రీ త్యాదులందు దీర్ఘంబు కలుగదు.

వ్యా. కర్మధారయ సమాసమున, బిరుదవాచకాదు లుత్తరపదములైనపక్షమున, ద్వి+అక్షర=రెండక్షరములు గలది, అదంత=హ్రస్వమయిన అకారమంతమందుఁ గలది, స్త్రీపుం సంజ్ఞావాచకంబు=స్త్రీ పురుషుల పేరులను బోధించునది, అగు పూర్వపదముయొక్క తుది యచ్చునకు, అంతటన్=సాంస్కృతికాచ్ఛిక మిశ్రసమాసములు (చూ. బా. సమాస 2) మూఁడింటను, దీర్ఘము బహుళముగా నగును. రామ+ శాస్త్రి. ఇట, శాస్త్రి-బిరుదాదివాచక శబ్దము. రామ-అనునది రెండక్షరములు గలిగిన, అదంత పురుషసంజ్ఞ. కానఁ దుది, అత్తునకు దీర్ఘముః రామ+శాస్త్రి=రామాశాస్త్రి. బహుళమనుటచే రామరాయఁడు, సుబ్బరావు, ఎఱ్ఱప్రెగ్గడ-ఇత్యాదులలో దీర్ఘము వైకల్పికము. రామారాయఁడు, రామరాయఁడు-ఇత్యాది. కృష్ణ+శాస్త్రి-అనుచో దీర్ఘములేదు. ఇది బహుళప్రయోజనములలో నప్రవృత్తి యన్నమాట. (చూ. మూలములు)

ప్రక్రియః- "రామ+సు"+"శాస్త్రిన్+సు" అలౌకిక సిద్ధసమాస విగ్రహము. సంస్కృత వ్యాకరణముచే (సుపోధాతుప్రాతిపదికయోః-సి. కౌ.) సుప్రత్యయములు లోపించును. రామ+శాస్త్రిన్. ఈప్రౌఢ 2చే- దీర్ఘముః రామా+శాస్త్రిన్. బా. తత్సమ 67చే-రామాశాస్త్రీ-ప్రాతిపదిక మగును. తత్సమ 54చే- రామాశాస్త్రి. తత్సమ 22చే-రామాశాస్త్రి+డుఙ్. తత్సమ44చే-రామాశాస్త్రి. పక్షమున-రామశాస్త్రి=

రామశాస్త్రి. "సుబ్బ+డుజ్"+"శాస్త్రి+డుజ్"–అలౌకిక విగ్రహము. బా. సమాస 25చే–సుబ్బ+శాస్త్రి. ఈ 2వ సూత్రముచే–సుబ్బా+శాస్త్రి=సుబ్బాశాస్త్రి–ప్రాతిపదికమగును. బా. తత్సమ 22చే–సుబ్బాశాస్త్రి+డుజ్. తత్సమ 44చే–సుబ్బాశాస్త్రి. "రామ+డుజ్+నాయ+డుజ్". బా. సమాస 25చే–రామ+నాయ. ఈ2చే–రామానాయ–ప్రాతిపదికమగును. బా. తత్సమ 22చే– రామానాయ+డుజ్. ఆచ్ఛిక 4చే– ఉత్వము నిషిద్ధము. తత్సమ 19చే– రామానాయఁడు. ఇట్లే సుబ్బానాఁడు, రామారాయఁడు. రామారెడ్డి:– "రామ+డుజ్"+"రెడ్డి+సు" బా. సమాస 25చే– రామ+రెడ్డి. ఈ2చే–రామారెడ్డి– ప్రాతిపదికము. అనుక్తన్యాయమున 'సు' ప్రత్యయము: రామారెడ్డి+సు. బా. తత్సమ 57చే–రామారెడ్డి. ఇట్లే, సుబ్బారెడ్డి, ఎల్లాసెట్టి, వీరాసెట్టి, కుప్పాసామి, వీరాసామి. రామారావు:– "రామ+డుజ్"+"రావు+సు". బా. సమాస 25చే–రామ+రావు. ఈ 2చే–రామారావు– ప్రాతిపదికము. రామారావు+సు. బా. తత్సమ 57చే–రామారావు. ఇట్లే సుబ్బారావు, ఎఱ్ఱాప్రెగ్గడ. చిన్నాదేవి: "చిన్న+ము+దేవి+సు" బా. సమాస 25చే–చిన్న+దేవి. ఈ 2 చే – చిన్నాదేవి–ప్రాతిపదికము. చిన్నాదేవి+సు. బా. తత్సమ 44చే–చిన్నాదేవి.

విమర్శ:- రామాశాస్త్రి–అనురూపము సాధించుట సరికాదు.

## ఇటఁ బూర్వపదంబు నత్వంబున కిత్వంబు బహుళంబుగ నగు. 3

ఉ: సుబ్బినాయఁడు, ఎల్లిసెట్టి, మొ॥ రామిసెట్టి, సుబ్బిసెట్టి, యిత్యాదులం దిత్వంబు నిత్యంబు.

వ్యా. ఇటన్=బిరుదాద్యుత్తరపదక కర్మధారయమున, పూర్వపదమునందలి అత్వమునకు ఇత్వము బహుళముగా నగును. సుబ్బ+నాయఁడు=సుబ్బినాయఁడు. ఎల్ల+సెట్టి=ఎల్లిసెట్టి. పక్షమున 2చే– సుబ్బానాయఁడు, ఎల్లాసెట్టి. బహుళమనుటచే రామ+సెట్టి=రామిసెట్టి, సుబ్బ+సెట్టి=సుబ్బిసెట్టి ఇత్యాదులలో ఇత్వము నిత్యము. అనఁగా నిటఁ బ్రవృత్తి యన్నమాట.

ప్రక్రియ:- "సుబ్బ+డుజ్"+"నాయ+డుజ్"; "ఎల్ల+డుజ్"+"సెట్టి+సు"; "రామ+డుజ్"+"సెట్టి+సు"; "సుబ్బ+డుజ్"+"సెట్టి+సు"; బా. సమాస 25చే–సుబ్బ+నాయ; ఎల్ల+సెట్టి; రామ+సెట్టి; సుబ్బ+సెట్టి. ఈ 3చే–అత్వమునకు ఇత్వము: సుబ్బి+నాయ; ఎల్లి+సెట్టి; రామి+సెట్టి; సుబ్బి+సెట్టి; సుబ్బినాయ:– బా. తత్సమ 22చే–సుబ్బినాయ+డుజ్ తత్సమ 19చే–సుబ్బినాయఁడు. ఎల్లిసెట్టి+సు. బా. తత్సమ 57చే–ఎల్లిసెట్టి; ఇట్లే, రామిసెట్టి, సుబ్బిసెట్టి.

## కొన్నియెడల నిచ్ఛే ననాపామాయాగమంబులగు. 4

ఉ: తిక్కన సోమయాజి, నన్నపార్యుఁడు, కృష్ణమనాయఁడు, నన్నయభట్టు. మొ॥

వ్యా. ఇచ్ఛేన్–ఇచ్ఛట, అనఁగా బిరుదాద్యుత్తరపదక కర్మధారయ సమాసమునఁ గొన్నియెడలఁ బూర్వపదమునకుఁ జివర, అన, అప, అమ, అయ అనునవి యాగమము లగును. (అన+అప+అమ+అయ+ఆగమ=అనాపామాయాగమంబులు) తిక్క+సోమయాజి=తిక్క+అన+సోమయాజి: తిక్కన సోమయాజి. ఇత్యాది.

ప్రక్రియలు:- "తిక్క+డుజ్"+"సోమయాజి+డుజ్", "నన్న+డుజ్+""ఆర్య+డుజ్", "కృష్ణ+డుజ్+"+ "నాయ+డుజ్"; "నన్న+డుజ్"+"భట్ట+డుజ్" బా. సమాస

25చే-తిక్క+సోమయాజి; నన్న+ఆర్య; కృష్ణ+ నాయ; నన్న+భట్ట-అని నిల్చును. ఈ4చే-తిక్క+సోమయాజి=తిక్క+అన+సోమయాజి. బా. సంధి 11చే. తిక్కనసోమయాజి-ప్రాతిపదికమగును. బా. తత్సమ 22చే- తిక్కనసోమయాజి+డుజ్. తత్సమ 44చే- తిక్కనసోమయాజి; నన్న+అప+ఆర్య=నన్నప+ఆర్య. నన్నప-సంస్కృతశబ్దముగ, ననుకృతమగుటచే సవర్ణదీర్ఘ సంధి జరిగి, నన్నపార్య-ప్రాతిపదికమగును. బా. తత్సమ 22చే-నన్నపార్యు. తత్సమ 22చే-నన్నపార్యు+డుజ్. తత్సమ 19చే- నన్నపార్యుఁడు; కృష్ణ+అమ+నాయ=కృష్ణమనాయ. బా. తత్సమ 22చే- కృష్ణమనాయ+డుజ్. ఆచ్ఛిక 4చే-ఉత్వము నిషిద్ధము. తత్సమ 19చే-కృష్ణమనాయఁడు; నన్న+అయ+భట్ట=నన్నయభట్ట. బా. తత్సమ 21చే-నన్నయ భట్టు. తత్సమ 22చే-నన్నయభట్టు+డుజ్. నిర్దేశానుసారము, డుజ్జులోపించి, నన్నయభట్టు-అని యేర్పడును. ఈడుజ్ లోపము వేఱుగా సూత్రింపవలెను. చూ. ము. కౌ. తత్సమ 23.

విమర్శ:- అనాపామాయాగమ విధానము సరికాదు. తిక్కనాదిశబ్దములు సోమయాజి లోనగు శబ్దములతో సమసించెనని గ్రహింపవలెను. (చూ. అనుబంధము. విషయసంఖ్య-25) కాఁగా, సూత్రము త్యాజ్యము.

## పై యాగమంబులు కొన్నియెడల ద్విత్వయుక్తంబులగు. 5

ఉ: రామన్నసెట్టి, తిమ్మప్పనాయఁడు, కృష్ణమ్మపంతులు, మల్లయ్యశాస్త్రి మొ॥ కృష్ణమ్మ యనుచో "అమ్మ" ప్రేమ సూచకంబని యెఱుంగునది. ఉ. ఆ నరసింగభూపతి ప్రియంబెసఁగం బినకొండమాంబయం, దానమితాఖిలాహిత సమాజుఁ దనూజునిఁ గాంచె బంధు సం,తాన సురావనీజు సముదంచిత భోగబిడౌజు సూరిమై, శ్రీనవభోజు భానునిభ తేజుని గృష్ణమరాజు నున్నతిన్. కళా. 1ఆ 74. మొ॥

వ్యా. పైయాగమంబులు=అన, అప, అమ, అయ (4సూ) అను నాగమములు కొన్నిచోట్ల ద్విత్వముతోఁ గూడినవి యగును. రామ+సెట్టి. 4చే-రామ+అన+సెట్టి. ఈ5చే-రామ+అన్న+సెట్టి=రామన్నసెట్టి. ఇట్లే, కృష్ణ+అమ+ పంతులు=కృష్ణ+అమ్మ+ పంతులు: కృష్ణమ్మపంతులు, మల్ల+అయ+శాస్త్రి=మల్ల+అయ్య+శాస్త్రి: మల్లయ్యశాస్త్రి. కృష్ణమ్మపంతులు-అనుచో, అమ్మ-ప్రేమసూచకము. ఇది స్త్రీత్వబోధకము కాదన్నమాట. ఇట్లే కృష్ణమరాజు-పురుషుని పేరగుటచే నిందలి అమ-స్త్రీత్వబోధకము కాదు. ప్రేమ సూచకమే.

ప్రక్రియ:- 'రామ+డుజ్'+"సెట్టి+సు"; "తిమ్మ+డుజ్"+"నాయ+డుజ్"; "కృష్ణ+ డుజ్"+పంతులు+సు; బా. సమాస 25చే-రామ+సెట్టి; తిమ్మ+నాయ; కృష్ణ+పంతులు-అని నిల్చును. 4చే-రామ+అన+సెట్టి; తిమ్మ+అప+ నాయ; కృష్ణ+అమ+పంతులు. ఈ5చే-రామ+అన్న+సెట్టి; తిమ్మ+అప్ప+నాయ; కృష్ణ+అమ్మ+పంతులు. బా. సంధి. 11చే-రామన్న సెట్టి, తిమ్మప్పనాయ, కృష్ణమ్మ పంతులు. అనుక్తన్యాయమున రామన్నసెట్టి+సు; కృష్ణమ్మపంతులు+సు. బా. తత్సమ 57చే- రామన్నసెట్టి, కృష్ణమ్మపంతులు. తిమ్మప్పనాయ-అనుచో, బా. తత్సమ22చే-తిమ్మప్పనాయ+డుజ్. ఆచ్ఛిక 4చే- ఉత్వము నిషిద్ధము. తత్సమ 19చే-తిమ్మప్పనాయఁడు. "మల్ల+సు"; "శాస్త్రిన్+సు" అనునది యలౌకికసిద్ధసమాస విగ్రహము. సంస్కృత వ్యాకరణముచే-(చూ.2సూ.) విభక్తిలోపము: మల్ల+శాస్త్రిన్. 4చే- మల్ల+అయ+శాస్త్రిన్. ఈ5చే-మల్ల+అయ్య+శాస్త్రిన్=మల్లయ్యశాస్త్రిన్. బా.

తత్సమ 67చే-మల్లయ్యశాస్త్రి- ప్రాతిపదికమగును. తత్సమ54చే-మల్లయ్యశాస్త్రి. తత్సమ22చే-మల్లయ్యశాస్త్రి+డుజ్. తత్సమ 44చే-మల్లయ్యశాస్త్రి.

విమర్శః:- అన్న, అప్ప, అమ్మ, అయ్య - అనుపదముల నాగమములుగాఁ జెప్పుట సరికాదు. రామన్న మున్నగునవి బిరుదవాచకములతో సమసించెనని గ్రహింపవలెను. కాఁగా, సూత్రము త్యాజ్యము.

## కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాసంబట్ల యగు. 6

ఇట్లనుటచేఁ బూర్వపదంబు లుప్తవిభక్తికంబయి యవికృతాంతంబగునని యెఱుంగవలయు. ఉః కృష్ణరాయఁడు, రామరావు మొ॥

వ్యా. మిశ్రంబు=మిశ్రమైన, అనఁగా సంస్కృతసమము నాచ్ఛికము నమవానితోఁ గూర్పఁబడిన, కర్మధారయంబియ్యది=ఈకర్మధారయసమాసము-అనఁగా బిరుదాద్యుత్తర పదక కర్మధారయ సమాసము, సిద్ధసమాసంబట్ల=సిద్ధసమాసమువలెనే, అనఁగా "కేవల సంస్కృతశబ్దంబుల సమాసంబు" (బా. సమాస2) వలెనే యగుమ. సిద్ధసమాసమువలెనగు ననుటచేఁ బూర్వపదము, లుప్తవిభక్తికంబయి=లోపించిన విభక్తికలదై (విభక్తిలోపించినదై యనుట) అవికృతాంతంబు=వికృతమైన, అనఁగా మాఱిన యంతము లేనిది (అంతమున మార్పునందనిది) యగును. (వికృత+అంత=వికృతాంత; నఞ్+వికృతాంత=అవికృతాంతము) కాఁగా-మిశ్రమగు, బిరుదాద్యుత్తరపదక కర్మధారయమునఁ బూర్వపదము తుదియత్త్వ కుత్వము కాదని తాత్పర్యము. రామశాస్త్రి మున్నగు సిద్ధసమాసములలో నెట్లు పూర్వపదములు లుప్త విభక్తికములయి యవికృతాంతములగునో యీ మిశ్రసమాసములట్లే యగునని భావము. కృష్ణరాయఁడు, రామరావు.

ప్రక్రియ:- "కృష్ణ+డుజ్"+"రాయ+డుజ్", "రామ+డుజ్"+"రావు+సు". బా. సమాస25చే-కృష్ణ+ రాయ; రామ+రావు. ఇట కృష్ణ, రామ-అను పూర్వపదముల మీఁది విభక్తికి లోపము కలిగినది. బా. తత్సమ 21చే-వీని అత్వమునకు ఉత్వము ప్రాప్తించు చుండఁగా, నివి, యవికృతాంతములగునని చెప్పఁబడెను. కాన, అత్వమున కుత్వమురాదు. కృష్ణరాయ, రామరావు-ప్రాతిపదికము లగును. బా. తత్సమ22చే-కృష్ణరాయ+డుజ్. ఆచ్ఛిక4చే-ఉత్వము నిషిద్ధము. తత్సమ19చే-కృష్ణరాయఁడు. రామరావు+సు. తత్సమ 57చే-రామరావు.

## క్రొత్తాదులు లుప్తశేషంబులు దేశ్యంబులతోడంబలెఁ దత్సమంబుల తోడం గొన్నియెడలఁ గర్మధారయంబగు. 7

ఉః క్రొంబులకలు. క్రొంబులకల్ జనించె సభకున్. ఉ. రా. 6ఆ-136. క్రొన్నారాచములు. క. క్రొన్నారాచములు మూఁడు గొని నుదురేయన్. రా. అర. కాం. 1ఆ-230. నెమ్మనము. చ. అనుపమ యోగ లీల నమృతాంబుధియం దుశయించు దేవు నె, మ్మనమున నావహించి. లక్ష్మీ 3ఆ-134, పెన్నగము. ఏడు పె, న్నగములు సంచలించె. రా. అర. కాం. 2ఆ-336. ముంగోపము. ఆ. మొగముఁబొడువ లేని ముంగోప మిఁక నెప్పుడు. ఉ. రా. 3ఆ-7. వింజామరము. ఎ.గీ. రమణ శ్రీదేవి

వింజామరంబు వీవ, శేష 5 ఆ. సగరాజ్యము. వా సగరాజ్యము. రా. కిష్కిం. కాం. 550 మొ॥

వ్యా. లుప్తశేషములయిన క్రొత్త మున్నగు శబ్దములు దేశ్యములతో సమసించునట్లు సంస్కృతసమములతో సమసించును. లుప్తశేషంబులు–అనుటచే సంస్కృత సమములు పరములగునపుడును, వర్ణలోపాదులగునని గ్రహింపవలెను. క్రొత్త+పులకలు = క్రొంబులకలు; క్రొత్త+నారాచములు = క్రొన్నారాచములు; నెఱ+మనము = నెమ్మనము; పెను+నగము = పెన్నగము; ముందు+కోపము = ముంగోపము; వెల్ల+చామరము = వింజామరము; సగము+రాజ్యము = సగరాజ్యము.

ప్రక్రియ:- క్రొంబులకల్: "క్రొత్త+లు"+"పులక+లు"; "క్రొత్త+లు"+"నారాచ+లు"; "నెఱ+ము"+"మన+ము"; "పెనుపు+వు"+"నగ+లు""ముందు+వు"+"కోప+ము"; "వెల్ల+ము"+'చామర+ము'; 'సగ+ము'+"రాజ్య+ము"–అనునవి యలౌకిక విగ్రహములు. బా. సమాస 25చే–క్రొత్త+పులక; క్రొత్త+నారాచ; నెఱ+మన; పెనుపు+నగ; ముందు+కోప; వెల్ల+చామర; సగ+రాజ్య–అని నిల్చును. ఈ7వ సూత్రమున "లుప్తశేషంబులు" అనుటచేఁ దొలియచ్చు మీఁది వర్ణములకు లోపము సంస్కృతసమములు పరమగునపుడును గావచ్చును గావున బా. సంధి36చే–క్రొ+పులక; క్రొ+నారాచ; ము+కోప; అనినిల్చును. బా. సంధి38చే–క్రొ+ను+పులక. ద్రుతకార్యము. క్రొంబులక. తత్సమ12 చే–క్రొంబులక+లు, తత్సమ 40చే–క్రొంబులక+ము+లు. తత్సమ58చే–క్రొంబులకలు. క్రొంబులకలు+జనించె. ప్రకీర్ణక 16చే–క్రొంబులకల్ జనించె. క్రొ+నారాచ. బా. సంధి38చే–క్రొన్నారాచ. తత్సమ 12చే–క్రొన్నారాచ+లు. తత్సమ 40చే–క్రొన్నారాచ+ము+లు=క్రొన్నారాచములు. ము+కోప– తత్సమ 37చే ము+ను+కోప. ద్రుతకార్యము. ముంగోప. బా. తత్సమ39చే–ముంగోపము. వెల్ల+చామర– బా. సంధి 39చే– వె+ను+చామర. సంధియందు వర్ణవికారము (సంధి12) అనువాక్యముచే–వి+ను+చామర. ద్రుతకార్యము: వింజామర. బా. తత్సమ 39చే– వింజామరము. నెఱ+మన. బా. సంధి 39చే–నెమ్మన. తత్సమ 39చే–నెమ్మనము. పెనుపు+నగ. ఈ7సూత్రముచే– సంస్కృతసమములు పరమగునపుడును వర్ణలోపాదులిటరావచ్చును గాన సమాస36చే–పెను+నగ. పువర్ణములోపించుటచే మిగిలిన. పెను–అన్నది లుప్తశేషమన్నమాట. ఇది నగ శబ్దముతో సమసించుచున్నది, బా. ప్రకీర్ణక 16చే–పెన్+నగ=పెన్నగ. బా. తత్సమ 12చే–పెన్నగ+లు. తత్సమ40చే–పెన్నగ+ము+లు= పెన్నగములు. పక్షమున–పెను నగములు. సగ+రాజ్య=సగరాజ్య–ప్రాతిపదికము. ఇట సగము లోని మువర్ణకమునకు. బా. సంధి32చే–పుంపులు కావలసియున్నను నీ 7వసూత్రమునందలి లుప్తశేషంబులు–అనుదాని స్వారస్యమున మువర్ణకము లోపించి పోవును. సగరాజ్య–బా. తత్సమ39చే–సగరాజ్యము. మువర్ణకము లోపింపఁగా మిగిలిన సగ–శబ్దము లుప్తశేషమగునని వ్యాకర్త యాశయము. ఈసూత్రము బాలవ్యాకరణమునకుఁ జాలవఱకు వివరణము.

## ధాతుజ విశేషణంబులు తథార్థకావ్యయంబుతోడం గర్మధారయం బగు. 8

ఉ: భూసురోత్తముల్ వేదముల్ సదువునట్లు. భార. ఆది. 5ఆ 185 కడుం బెద్దదవ్వు పోయినయట్లు. భార. ఆది. 1ఆ–116. మొ॥

వ్యా. ధాతుజవిశేషణములు, తథా+అర్థక=తథాశబ్దముయొక్క యర్థము గలిగిన, అవ్యయముతో–అనఁగా అట్లు శబ్దముతోఁ గర్మధారయమగును. ఉదా. చదువునట్లు,

పోయినయట్లు. ఇట, చదువు, ( బా. క్రియా 45) పోయిన (బా. క్రియా. 46) అను ధాతుజ విశేషణములకు అట్లు శబ్దముతో సమాసము.

ప్రక్రియ:- "చదువు+సు"+"అట్లు+సు"; "పోయిన+సు"+"అట్లు+సు" బా. సమాస 25చే-చదువు+ అట్లు; పోయిన+అట్లు. బా. సంధి 33చే-చదువు+అట్లు=చదువునట్లు. బా. సంధి 4చే-పోయిన+అట్లు= పోయినయట్లు. పక్షమున-పోయినట్లు.

## అట్టి యిట్టి యెట్టివిశేషణంబుల మీఁది తచ్ఛబ్ద వకారంబునకు లోపంబు విభాషనగు. 9

ఉ: విమల తపోవిభవంబునఁ, గమలజునట్టిండు. భార. ఆది. 2ఆ-219 ఆ. ఇట్లుగాన నెఱుఁగ మేమేవ్వరము నతం, డిట్టిఁడగుట. భార. శాంతి 1ఆ-10. ఎట్టిఁడు నానిజేశుఁడు (ఎట్టిఁడు నాహృదీశుఁ డనుట యుక్తము.) రా.సుం, కాం. 285 మొ॥ పక్షమున, అట్టివాఁడు. మొ॥ తెనుఁగున సాధారణంబుగ విశేషణంబు లవిభక్తికంబులు.

వ్యా. అట్టి, ఇట్టి, ఎట్టి-అను విశేషణములమీఁది తచ్ఛబ్దవకారమునకు లోపము విభాషనగును. తచ్ఛబ్దవకారమన్నను లక్ష్యములనుబట్టి "వా" లోపించుననుకొనవలెను. అట్టివాఁడు=అట్టిఁడు, అట్టిండు, ఇట్టివాఁడు=ఇట్టిఁడు, ఇట్టిందు; ఎట్టివాఁడు=ఎట్టిఁడు, ఎట్టిండు. పక్షమున-అట్టివాఁడు-మొ॥ తెనుఁగున సాధారణముగా విశేషణములు, అవిభక్తికం బులు=విభక్తిగలవికావు. కాన విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్ద మనుప్రయుక్తమగు నన్నమాట. (ఎట్టిఁడు నా నిజేశుఁడు-అనుచో నిజ=నాయొక్క-అనియర్థము కానఁ బునరుక్తి. దీని నివారించుటకు, హృదీశుఁడు-కవిపాఠము కావచ్చునని సూచితము).

## ముయ్యేడ్వాదులందు హ్రస్వద్విత్వంబులు నిత్యంబులు. 10

ఉ: రాముఁడలుకన్ ముయ్యేడు మాఱుల్ రణ, ప్రీతిన్ వైరి ధరాతలేశ్వరులఁ జంపెన్ బల్వురన్. భార. ఆది 1 ఆ. 78. ముయ్యాఱు మార్గణముల. రా. యు. 1075. దీని ముమ్మడుఁగగు గణము. భార.ఆది. 1ఆ-80 మొ॥ ఆంధ్రశబ్దచింతామణియందుఁ గల "ఇదమద" సిత్యాది సూత్రమందలియదః ప్రభృతులు వ్యర్థములగుచు స్వేతరంబులకును నిక్కార్యంబని తెలుపుచున్నవి.

వ్యా. ముయ్యేడు-మున్నగు వానియందు హ్రస్వమును ద్విత్వమును నిత్యముగా నగును. మూఁడు+ఏడు-అనుచో, "సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడుశబ్దము డుజ్వర్ణంబునకు లోపంబును, మీదిహల్లునకు ద్విత్వంబునగు" (బా. సమాస 17) అను సూత్రము వర్తింపదు. ఏలయన. నీ సూత్రమున, లోపద్విత్వము లేక యోగ(సూత్ర) నిర్దిష్టములు. (ఏక యోగనిర్దిష్టానాం సహవాప్రవృత్తిః సహవానివృత్తిః-పరిభా) కానఁగలిసియే మానవలెను. మూఁడు-ఏడు డుజ్ లోపము కలిగిన-మూ+ఏడు. అని నిల్చును. ఇట హల్లు పరముకాకుండుటచే ద్విత్వమునకుఁ బ్రాప్తిలేదు. కావున, లోపద్విత్వములు రెండును వర్తింపవు. ఇట్టిస్థితిలో ముయ్యేడుమున్నగు వానియందు హ్రస్వద్విత్వములు నిత్యముగ నిట విధింపఁబడెను. ఈవిధాన సామర్థ్యముచే డుజ్వర్ణము

లోపించిన పిదప ద్విత్వప్రాప్తికనుకూలముగా, బా. సంధి 3చే–యడాగమము వచ్చి ద్విత్వము ప్రవర్తించును. మూ+యేడు=మూ+య్యేడు. బా. సమాస 13చే–హ్రస్వము: ముయ్యేడు. ఇట్లే, ముయ్యాఱు. మూఁడు+మడుఁగు. బా. సమాస 17చే–మూ+మ్మడుఁగు. బా. సమాస 13 చే–ముమ్మడుఁగు. ఆంధ్రశబ్దచింతామణిలో, త్రికకార్యమును విధించు సందర్భమున, ఇదమ్, అదస్, ఏతద్–అను మూఁడు శబ్దములు "ఈ" శబ్దమును దెలుపుటకు వాడఁబడి యున్నవి. ఇదమ్–అన్నదొక్కటే సరిపోవుచుండుటచే అదస్, ఏతద్–అనునవి వ్యర్థములగును. ఇట్లు వ్యర్థములైన, అదః ప్రభృతులు=అదస్, ఏతద్–అను శబ్దములు, స్వ=తమకంటె, ఇతరంబులకున్=భిన్నములైన వానికిని (స్వ+ఇతర) అనఁగాఁ ద్రికేతరములకును, ఇక్కార్యంబు=మీఁది హల్లునకు ద్విత్వమగుట యనుకార్యము, అగునని తెలుపుచున్నవి. కాన మూఁడు శబ్దమున కీకార్యమును జెప్పుట చింతామణి సమ్మతమని తాత్పర్యము.

**ప్రక్రియ:–** ముయ్యేడు: "మూఁడు+లు"+"ఏడు+లు"–అలౌకిక విగ్రహము. బా. సమాస 25చే–మూఁడు+ఏడు. ఈ 10చే–హ్రస్వ ద్విత్వములు నిత్యముగ రావలసియుండుటచే, బా. సమాస 17చే– మూ+ఏడు–అని నిల్చి, బా. సంధి. 3చే–యడాగమము కలిసి, ద్విత్వము ప్రవర్తించును: మూ+య్యేడు. బా. సమాస 13చే–ముయ్యేడు. బా. సమాస 18చే–ఏకవచనము కలుగును. కాన, తత్సమ 48చే– ముయ్యేడు+వు. తత్సమ 57చే–ముయ్యేడు. ఇట్లే ముయ్యాఱు. ముమ్మడుఁగు:– "మూఁడు+లు"+"మడుఁగు+లు" బా. సమాస 25చే– మూఁడు+మడుఁగు. బా. సమాస 17చే–మూ+మ్మడుఁగు. బా. సమాస 13చే–ముమ్మడుఁగు. తత్సమ 48చే–ముమ్మడుఁగు+వు. తత్సమ 57చే–ముమ్మడుఁగు.

### సమాసఘటితం బీశబ్దం బొక్కచో సూచనార్థకం బగు. 11

**ఉ:** ఈయున్న పౌష్యపాలికిఁ, బోయి (ఈయున్న=ఇదిగో నున్న యని యర్థము.) భార. ఆది. 1ఆ–116. మొ॥

**వ్యా.** సమాసమునఁ గూర్పఁబడిన ఈశబ్దము, ఒకచో సూచనార్థక మగును. ఈయున్న పౌష్యపాలికి. ఈయున్న=ఇదిగోనున్న–అని యర్థము. ఇట, ఈ–శబ్దము సమీప వ్యక్తిసూచకముగ నున్నది.

### ధ్వన్యనుకరణ శబ్దంబులు కొన్నింటి కిందు నిగాగమంబగు. 12

(ఇందున్=కర్మధారయమునందని యర్థము.) **ఉ:** గనగనని నిప్పులు. స్వా 4ఆ60. క. తళతళని తరణి మెఱుఁగుల. స్వా. 5ఆ–100. నిగనిగని కుందనపుఁ దగడు. స్వా. 4ఆ–117. మొ॥

**వ్యా.** కొన్ని ధ్వన్యనుకరణశబ్దములకుఁ గర్మధారయమున నిగాగమ మగును. గనగన+నిప్పులు= గనగనని నిప్పులు. తళతళ+తరణి మెఱుఁగుల=తళతళని తరణి మెఱుఁగుల. నిగనిగ+కుందనపుఁదగడు=నిగనిగని కుందనపుఁ దగడు. బాలవ్యాకరణమున గణవచనములగు నల్లాదులకుఁ గర్మధారయమున నిగాగమము విధింపఁబడెను. (బా. సమాస 12) ఇట కొన్ని ధ్వన్యనుకరణశబ్దములకు నిగాగమ మగునని పూరింపఁ బడెను.

**ప్రక్రియ:–** "గనగన+లు"+"నిప్పు+లు". బా. సమాస 25చే–గనగన+నిప్పు. ఈ 12చే–గనగనని నిప్పు– ప్రాతిపదికమగును. లువర్ణకముచేరి–గనగనని నిప్పులు–అగును. "తళతళ+చేత"+"తరణిమెఱుఁగు+చేత". బా. సమాస 25చే–తళతళ+తరణిమెఱుఁగు.

ఈ 12చే-తళతళనితరణి మెఱుఁగు-ప్రాతిపదికమగును. బా. తత్సమ 3చే-తళతళని తరణిమెఱుఁగు+చేత. తత్సమ 31చే-తళతళని తరణి మెఱుఁగులచేత. బా. కారక 22చే-తళతళని తరణి మెఱుఁగులను. కుందనము యొక్క+తగడు=కుందనపుఁదగడు. "నిగనిగ+ము"+"కుందనపుఁదగఁడు+వు". బా. సమాస 25చే- నిగనిగ+కుందనపుఁదగడు. ఈ 12చే-నిగనిగని కుందనపుఁదగడు. బా. తత్సమ 48చే- నిగనిగని కుందనపుందగడు+వు. తత్సమ 57చే-నిగనిగని కుందనపుఁదగడు.

## గుణవాచకంబులు కొన్నింటి నిగాగమంబునకుఁ బరుషంబులు పరంబులగునపుడు బిందు వగు. 13

ఉ: కమ్మఁ దేనె, కమ్మందేనె. మొ॥ మరువాలారు శరంబులం దొరఁగు కమ్మందేనె. నై. 2ఆ-99.

వ్యా. కొన్ని గుణవాచకముల నిగాగమమునకుఁ బరుషములు పరమగునపుడు బిందువగును. కమ్మని+తేనె=కమ్మఁ+తేనె; కమ్మం+తేనె. 36చే-తకారమునకు దకారము: కమ్మఁదేనె, కమ్మందేనె.

ప్రక్రియ:- "కమ్మ+ము"+"తేనియ+ము." బా. సమాస 25చే-కమ్మ+తేనియ. బా. సమాస 12చే- కమ్మని+తేనియ. ఈ 13చే-కమ్మఁ+తేనియ; కమ్మం+తేనియ. 36చే-కమ్మఁదేనియ, కమ్మందేనియ-ప్రాతిపదికములు. బా. తత్సమ 39చే-కమ్మఁ దేనియ+ము; కమ్మందేనియ+ము. ఆచ్చిక 23చే-కమ్మఁదేనె+ము; కమ్మందేనె+ము. తత్సమ 57చే-కమ్మఁదేనె, కమ్మందేనె. నిగాగమమునకు ద్రుతత్వములేదు గావున నిట్లు ప్రక్రియగ్రాహ్యము. (ము. కౌ. సంజ్ఞా 7)

## గుణవాచకంబు క్రియావిశేషణంబగుచో నొక్కొడ నవర్ణకంబునకు బిందువు గానంబడియెడి. 14

ఉ: ససిచక్కంగఁ బ్రియుండు వర్ధిలుటకై. కాశీ. 2ఆ-73.

వ్యా. గుణవాచకము, క్రియావిశేషణమగు నప్పుడు, నవర్ణకమున కొకచో బిందువు కనఁబడును. చక్క శబ్దమునకు, బా. తద్ధిత 6చే-నవర్ణకమగును: చక్కన. దీనిని క్రియావిశేషణముగ వివక్షించునప్పుడు, బా. క్రియా 115చే, "కాను" అనునది యనుప్రయుక్త మగును. చక్కన+కాను. బా. క్రియా 116చే-హ్రస్వము: చక్కన+కను. "ఇటసరళంబు నిత్యంబు" అను వృత్తి వాక్యమువనుసరించి. బా. సంధి 13చే- చక్కన+గను-అని నిల్చును. ఈ 14చే-నవర్ణకమునకు బిందువు: చక్కఁగను, చక్కంగను, నవర్ణకమునకు ద్రుతత్వము దుర్లభమగుటచే నిట్లు ప్రక్రియను గ్రహింపఁదగును. (ము. కౌ. సంజ్ఞా 7)

## ఒకానొకచో గుణవాచక ధాతుజ విశేషణంబు లవయవ విశేష్య పూర్వకంబులై యవయవితో సమసించెడి. 15

ఉ: ఒడలు తెల్లని తురగోత్తము వాలంబు (ఒడలు తెల్లని=తెల్లనియొడలుగల యని యర్థము) భార. ఆది. 2ఆ-34. తనువు మీన్పొలవల్చు జాలరిదాన. (తనువు మీన్పొలవల్చు=మీన్పొల వల్చు తనువుగల యని యర్థము.) భార. ఆది. 3 ఆ-40.

వ్యా. గుణ వాచకములు, ధాతుజవిశేషణములు నరుదుగా, అవయవ విశేష్య పూర్వకంబులై=అవయవవాచకముగు విశేష్యము ముందుగలవై, అవయవితోన్=అవయవి వాచకముతో, సమసించును. ఒడలు తెల్లని తురుగోత్తము వాలంబు. ఇట, తెల్ల-గుణవాచకము. ఒడలు-అవయవము. తురగోత్తముఁడు-అవయవి(=అవయవము గలది. ఒడలు గలది) తెల్ల-అనుగుణ వాచకము, ఒడలు-అను నవయవవాచకము ముందు గలదై, తురగోత్తముఁడను నవయవి వాచకముతో సమసించుచున్నదని తాత్పర్యము. ఒడలు తెల్లని= తెల్లనియొడలుగల-అని యర్థము చెప్పఁబడెను. తనువు మీన్ప్రోలవల్చు జాలరిదాన. ఇట, వల్చు- ధాతుజవిశేషణము. తనువు-అవయవము. జాలరిది-అవయవి. వల్చు-అను ధాతుజవిశేషణము, తనువు-అను నవయవవాచకము ముందుగలదై, జాలరిది-అను నవయవి వాచకముతో సమసించుచున్నదన్నమాట. తనువుమీన్ప్రోలవల్చు= మీన్ప్రోలవల్చుతనువుగల-అని యర్థము చెప్పఁబడెను.

విమర్శ:- (i) ఒడలు తెల్లని-అపపాఠము. ఉల్లతెల్లని-సాధుపాఠము. కాన నిది సరియగు లక్ష్యము కాదు. (ii) తనువు=శరీరము, మీన్ప్రోలన్=మీన్ప్రోలను, వల్చు=వర్చెడు, జాలరిదానన్-అని సరళముగా నన్వయింపఁదగి యుండుటచే నిదియు సూత్రమునకు లక్ష్యము కాదు. కాఁగా, సూత్రము త్యాజ్యము.

## తమ్ముఁగుల్లలు, చిలుకమొకరి-యిత్యాదులు విశేష్య పూర్వపద కర్మధారయంబులు. 16

ఉ: తమ్ముఁగుల్లలు నీవుఁ దగ విపినంబున కరిగితిరి. భార. అర. 7ఆ-413. క. ప్రభావతి, మోదము వెలిఁజిలుకఁజిలుక మొకరింబలికెన్, శుక. 2ఆ-89 మొ॥

వ్యా. తమ్ముఁగుల్లలు, చిలుక మొకరి-మున్నగునవి విశేష్యము పూర్వపదము గాఁగల కర్మధారయసమాసములు. తమ్ముఁగుల్లలు=కుల్లలగు తమ్ములు. చిలుక మొకరి = మొకరియగు చిలుక. ఇట, తమ్ములు, చిలుక-అనుపూర్వపదములు విశేష్యములు. ఇది, బా. సమాస 3 సూత్రమునకు వివరణమన నగును.

ప్రక్రియ:- "తమ్మ+లు"+"కుల్ల+లు"; "చిలుక+ము"+"మొకరి+సు" బా. సమాస 25చే- తమ్మ+కుల్ల; చిలుక+మొకరి. తమ్మ+కుల్ల-అనుచో; 36చే-నుగాగమము తమ్మ+ను+కుల్ల. ద్రుతకార్యము: తమ్ముఁగుల్ల. లువర్ణకము చేరి, తమ్ముఁగుల్లలు-అగును. చిలుకమొకరి+సు. బా. తత్సమ 57చే-చిలుక మొకరి. (చూ. అనుబంధము. విషయసంఖ్య-26).

## ఆయిూత్యాదిఘటితంబులు విశేషణోభయపద కర్మధారయంబులు. 17

ఉ: అయిూనేరములు. ఈ యాదేశంబననేల? స్వా. 1ఆ-68. ఎత్తిన పెంచినవారి. విక్ర. 6ఆ-110. కలిగినయొప్పని దోషములు. విజ్ఞా. ఆచా 107. కొట్టినదిట్టిన యాతఁడు. భోజ. 6ఆ-15. చలితెలిమంచుతుంపరలు. భాను. 3ఆ. వడిచల్లనిచల్లనిగాడ్పు. రామా 1ఆ-151. తియ్యబెల్లిమాటలు. క్షేత్రయ. తొంగలితఅచు టెప్పల. భార విరా 2ఆ-37. తొలిప్రాంత కుప్పసంబు. జై 6 ఆ-42. నిడువాలి కన్నులు. (వాలిక=వాఁడి) భోజ.

5. ఆ. 31 పెనునిట్ట తాడు. జై. 2 ఆ–41. మొక్కపోయిన వెలిగొమ్ము ద్రోయి, హరి. ఉ. 7ఆ–92. విన్నకన్నయర్థము. కళా 8 ఆ.200 క్రొమ్మించులేఁ జెక్కుటద్దంబు. నై. 2ఆ–113. తెలినునుసోగ వెన్నెలల. రామా 2 ఆ–99 మొ॥

వ్యా. "ఆయా" ఇత్యాదులతోఁ గూర్పఁబడినవి (ఆ+ఈ=ఆయా+ఇత్యాది) విశేషణోభయపద కర్మధారయములు. సంస్కృతమున రెండు విశేషణములకగు సమాసమును విశేషణోభయపద కర్మధారయ మని యందురు. రెండవవిశేషణమును విశేష్యముగా వివక్షించి సమాసము గూర్తురు. ఇటఁ బ్రౌఢవ్యాకర్త "ఆయా" మున్నగు వానితోఁ గూర్పఁబడినవి, విశేషణోభయపద కర్మధారయములుగాఁ బేర్కొనెను. అనఁగా, ఆయా–మున్నగు విశేషణోభయపద కర్మధారయములు విశేష్యములతోఁ గూర్పఁబడియే తెనుఁగునఁ గనఁబడునని తాత్పర్యము. ఆయాత్యాదులు:–ఆయా, ఈయా, ఎత్తిన పెంచిన, కలిగిన యొప్పని, కొట్టినతిట్టిన, చలితెలి, వడిచల్లని చల్లని, తియ్యబెల్లి, తొంగలితఱచు, తొలిప్రాఁత, నిడు'ద' వాలిక, పెను(పు)నిట్ట, మొక్కపోయినవెలి, విన్నకన్న. క్రొమ్మించులే(ఁత), తెలినును(పు)సోగ–అను విశేషణోభయపద కర్మధారయము లాయా విశేష్యములతో సమసించెను.

విమర్శ:- ఎత్తిన పెంచినవారు–అనువది 32వ, సూత్రమునకు లక్ష్యమనఁ దగును. (చూ. అనుబంధము. విషయసంఖ్య–27)

## కొన్నియెడల విశేషణోభయపదంబులు త్రికక్రియాజన్య విశేషణ ఘటితంబులు సందర్భ యోగ్య పద వ్యవహితంబులగు. 18

త్రిక క్రియాజన్య విశేషణ ఘటితంబులు– త్రికక్రియాజన్య విశేషణోభయఘటితంబులు, కేవల క్రియాజన్యవిశేషణ ఘటితంబులునని ద్వివిధంబులు. ఉ: క. ఈ కన్నులు తెఱవనిశిశు, వేకీడొనరించె నీకు. భోజ. 6ఆ–356. గీ. నెఱులుగల మరునీలంపు టురుల సిరుల, నరులు గొనఁజాలి నరులను మరులుగొలుపు, నిరులు గెలిచిన తుమ్మెద గఱులఁ దెగడు, కురుల నులిదీర్చి విరులిడి కొప్పవెట్టి. భాగ. 10 స్కం. ఉ. 242. ఎ. గీ. గగనమను రుద్రభూమి నేకతమ తిరుగు, నదరు లుమిసెడు కొఱవిదయ్యంబు వీఁడె. నై. 2ఆ–122. చ. నే, బలిమిఁ గుబేరునిం గెలిచి బాగుగఁ గొన్న రవిప్రకాశమై, యలరుచునున్న పుష్పకమునందు రమింపుము కోర్కులారఁగన్. రా. అర. కాం. 2ఆ–198. ఎత్తెదునట్టియెల్లగాఁ, గాఁగిన మద్దుచందము. ప్రభా 5ఆ–60. సీ. అనకదుందుభి వనరాని వినరాని, దుర్వాక్యసూచులఁ దూలపుచ్చె. వి.పు. 7ఆ–312. క. చిక్కని చక్కని నున్నని, స్రుక్కని తోలూడ్వఁ బడని ఛుర్లి సెగలచే, నొక్కఁబడని దండంబులు, తక్కక యుపనయన వేళఁ దాల్పఁగ వలయున్. విజ్ఞా. ఆచా 22. మొ॥ ఇట్టి ప్రయోగములు కవిత్రయమువారి గ్రంథములయందు దొరకినవి కావు.

వ్యా. కొన్నిచోట్లఁ ద్రిక క్రియాజన్యవిశేషణములతోఁ గూర్పఁబడు విశేషణోభయపద కర్మధారయములు సందర్భయోగ్య=సందర్భమునకుఁ దగిన, పద=పదములచేత, వ్యవహితంబులు=వ్యవధానము (ఎడము) గలవి, యగును. ఈ త్రికక్రియాజన్య ఘటితములగు విశేషణోభయపద కర్మధారయములు రెండు విధములు. (i) త్రికక్రియాజన్యోభయఘటితంబులు. అనఁగాఁ ద్రికము క్రియాజన్యవిశేషణము, నను రెంటిచేతను గూర్పఁబడినవి. క్రియాజన్యవిశేషణము=ధాతుజవిశేషణము. (క్రియాధాతుః-ఆం-చిం.) ఉదా॥ ఈ-కన్నులు-తెలవనిశిశువు. ఈ-త్రికము. తెలవని-ధాతుజవిశేషణము. కన్నులు-సందర్భయోగ్యమగు పదము. కన్నులు-అన్నది మధ్యలోఁజేరుటచేఁ ద్రికమునకుఁ గ్రియాజన్యవిశేషణమునకు వ్యవధానము కలిగెను. (ii) కేవల క్రియాజన్యవిశేషణములతో (బా. క్రియా 44-47) గూర్పఁబడినవి. ఉదా॥ మరులుగొలుపు-ఇరులు-గెలిచిన-తుమ్మెదగఱులఁ-దెగడుకురుల. ఇట, మరులుగొలుపు, గెలిచిన, తెగడు-అను క్రియాజన్యవిశేషణములకు మధ్య ఇరులు, తుమ్మెద గఱుల-అను సందర్భయోగ్య పదములు చేరుటచే వీనిమధ్య వ్యవధాన మేర్పడినది. తిరుగు-అదరులు-ఉమిసెడు కొఱవిదయ్యంబు. ఇట, తిరుగు, ఉమిసెడు-క్రియాజన్య విశేషణములు. అదరులు-అను సందర్భయోగ్యపదము మధ్యలోఁ జేరుటచే వీనికి వ్యవధానము కలిగినది. కొన్న-రవిప్రకాశమై యలరుచున్-ఉన్న పుష్పకమునందు. ఇట, కొన్న, ఉన్న-అను క్రియాజన్యవిశేషణములకు, రవిప్రకాశమై యలరుచున్-అను సందర్భయోగ్యపదముచే వ్యవధానము కలుగుచున్నది. ఎత్తెడునట్టి-ఎట్టుగా-కాఁగిన మడ్డుచందము. ఎత్తెడునట్టి, కాఁగిన- అను క్రియాజన్య విశేషణములకు, ఎట్టుగా-అను సందర్భయోగ్యపదముచే వ్యవధానము గలిగినది. (ఎత్తెడునట్టి-బా. సమాస 10) అనరాని-విన-రాని దుర్వాక్యసూచుల. రాని, రాని-అను క్రియాజన్య విశేషణములకు మధ్య, వినన్-అను సందర్భయోగ్యపదముచే వ్యవధానము గలిగినది. స్రుక్కని-తోలు-ఊడ్వఁబడని-ఛుర్లిసెగలచే-నొక్కఁబడని, దండంబులు. స్రుక్కని, ఊడ్వఁబడని, నొక్కఁబడని-అను క్రియాజన్య విశేషణములకు తోలు, ఛుర్లిసెగలచే-అను సందర్భయోగ్య పదములచే వ్యవధాన మేర్పడినది. ఇట్టి ప్రయోగములు కవిత్రయమువారి గ్రంథములలో దొరకలేదని తెలుపఁబడెను.

## అలరుఁబోఁడీత్యాదు లుపమాన పూర్వపద కర్మధారయంబులు. 19

ఇటఁ బోఁడిపరంబగుచో నెల్లెడల నుమ్మగు. ఆది పదంబుచే-తియ్యఁబోఁడి, ననఁబోఁడి, విరిఁబోఁడి, ఇగురుఁబోఁడి, చిగురుఁబోఁడి, తలిరుతఁబోఁడి, పువ్వుఁబోఁడి, పూవుఁబోఁడి, పూఁబోఁడి-యిత్యాదులు గ్రాహ్యంబులు, (అలరు+పోఁడి) దీనికిఁ బువ్వువలె మనోజ్ఞురాలైనదని యర్థము. ఇట్లంతట నెఱుఁగవలయు.

ఉ: మ. చిగురుంబోఁడి యెఱుంగుదే యదుపతి స్త్రీ లెవ్వరే నిందులే, రుగదా. కళా. 3ఆ-131. శా. ద్రోవదిన్, దీయంబోఁడి వరింపఁగా వసుధకేతేఁజూచు నాదిత్యులో. పాంచా. 3ఆ27, వేల్పుంబువుంబోండ్లు. య. 1ఆ. 78. క. యౌవనము కలిగినప్పుడ, పూవుంబోఁడులకుఁబతుల భోగంబులుగాక. కళా. 4ఆ-71 మొ॥

వ్యా. అలరుఁబోఁడి-ఇత్యాదులు, ఉపమానపూర్వపద కర్మధారయములు. ఉపమా

నము సామాన్యధర్మ వాచకముతో సమసించినచో నుపమాన పూర్వపద కర్మధారయ మనఁబడును. (ఉపమానాని సామాన్యవచనైః-సి.కౌ. 734సూ) అలరుఁ బోడి అనుచో, అలరు-ఉపమానము. పోఁడి-సామాన్యధర్మవాచకము. కావున నిది యుపమానపూర్వపద కర్మధారయము. ఇటన్= ఉపమాన పూర్వపదకర్మధారయమున, పోఁడిపరమగునపుడు, ఎల్లెడలన్=ఎల్లచోట్ల-అనఁగా ఉదంత భిన్నస్థలముల యందును, నుమ్ము=నుమాగమము, అగును. "నుమ్"లోని మకారము ప్రాకృత వ్యాకరణ ప్రసిద్ధమగు ఇద్వర్ణము. (అనుబంధము. విషయసంఖ్య-129) ఉద్దిష్టమునకుఁ జివరఁజేరునని యిందలి మకారము సూచించును. అనఁగా, నుగాగమమన్నను నుమాగమమన్నను నర్థమొకటే యన్నమాట. బా. సంధి 25చే-ఉదంత స్త్రీసమములకు నుగాగమ మగును. ఎల్లయెడల-అనుటచే, ఉదంతముల కేకాక ఉదంతేతరములగు హ్రస్వదీర్ఘములకును నుమాగమము వర్తించు నన్నమాట. ఆదిపదముచే, తియ్యఁబోఁడి మున్నగునవి గ్రాహ్యములు. అనఁగా, తియ్యఁబోఁడిమున్నగునవి కూడ నుపమానపూర్వపద కర్మధారయములేయని భావము. అలరుఁబోఁడి=అలరు(=పువ్వు)వలె మనోజ్ఞురాలయినది. ఇట్లే తక్కినచోట్లఁ దెలియవలెను.

**బాలవ్యాకరణమతము:-** బాలవ్యాకరణమున-"బహువ్రీహిని స్త్రీవాచ్యంబగుచో నుప మానంబుమీఁది మేనునకు బోఁడి యగు" (బా. సమాస 23) అని సూత్రింపఁబడెను. ఈ మతమున, అలరుబోఁడి-లోనగునవి బహువ్రీహి సమాసములు. ఉపమానముమీఁది మేనునకు బోఁడినాదేశముచేసి యీపక్షమున రూపసాధన చేయవలెను. అలరు+ మేను=అలరుబోఁడి. (అలరువంటి మేను దేనికిఁగలదోయది) అలరు+బోఁడి, అనుచో, బా. సంధి25చే-అలరును+బోఁడి. బా. సంధి 19చే-అలరుంబోఁడి-ఇత్యాది. లతాంగీ సుమాంగీ, వంటి సిద్ధసమాసములకు సరిపెట్టవలెనను నభిప్రాయముతో, బాలవ్యాకరణము మేనునకు బోఁడి నాదేశముచేసి ప్రక్రియనడపెను. వర్ణనాత్మక వ్యాకరణములలో స్థానికిని దాని యాదేశమునకును సామ్యముండవలెనను నియమము లేకుండుటచే నిట్లు రూపసాధనచేయుట నిర్బాధమని బాలవ్యాకరణమతము.

**ప్రౌఢవ్యాకరణమతము:-** ప్రౌఢవ్యాకరణ మతమున, అలరుఁబోడి-లోనగునవి యుప మాన పూర్వపద కర్మధారయములు. ఈపక్షమున నుపమానముమీఁద "పోఁడి" శబ్దమును నిల్పి ప్రక్రియ చెప్పవలెను.

**ప్రక్రియ:-** "అలరు+వు"+"పోఁడి+సు"-అలౌకిక విగ్రహము. బా. సమాస 25చే- అలరు+పోఁడి. బా. సంధి 25చే-అలరును+పోఁడి. బా. సంధి16చే-అలరును+బోఁడి. బా. సంధి17చే- అలరుఁబోఁడి-ప్రాతిపదికమగును. అనుక్తన్యాయమున-అలరుఁబోఁడి+సు. బా. తత్సమ 57చే-అలరుఁబోఁడి. ఇట్లే యిగురుఁబోఁడి- మొ॥ ఎల్లయెడలనుమ్మగు- అనుటచే, తీయ(తియ్య)+పోఁడి, నన+పోఁడి, విరి+పోఁడి, పూ+పోఁడి (చూ. సంధి 11) అనుచోట్ల, నుమాగమ మగును. ద్రుత కార్యముచే- తీయఁబోఁడి-లోనగునవి సిద్ధించును. బాలవ్యాకరణ పక్షమున, తీయ+మేను=తీయ+ బోఁడి: తీయబోఁడి-ఇత్యాదిగా రూపము లేర్పడును. తీయంబోఁడి-వంటివి సిద్ధింపవు. ఏలయన, బా. సంధి 25చే-ఉదంత స్త్రీసమములకే నుగాగమమగును.

**బాలవ్యాకరణమత పరామర్శము:-** (i) బాలవ్యాకరణ పక్షమున, చిగురుబోఁడి, మెఱుఁగుబోఁడి, మున్నగు సమాసములలో మేనునకు బోఁడియయ్యె ననుట సరిపడదు. ఏలయన పల్లవాంగి, విద్యుదంగి, మధురాంగి-(లేదా, ఇక్ష్వంగి) వంటి సిద్ధ సమాసములు కనఁబడవు. కాన మేనునకు బోడియగు ననుట యెల్లచోట్ల సరిపడదు. (ii)

తీయంబోడి. వంటి బిందుఘటితరూపము బోడి యాదేశపక్షమున సిద్ధింపదు. (iii) ఇట్లే అలరుబోణి వంటి ణకారఘటిత రూపములును బాలవ్యాకరణపక్షమున సిద్ధింపవు. (iv) ప్రయోగానుకూలముగ సుప్రసిద్ధమగు పోడి శబ్దముతోఁబ్రక్రియ చెప్పుట కవకాశమున్నప్పు డనితర గతి యనఁదగిన మేనునకు బోడి నాదేశము చేయు పద్ధతి యుక్తిసహము కాదు. కాఁగా బాలవ్యాకరణ మార్గ మసమగ్రము కవిప్రయోగవిరుద్ధము నగుటచే నగ్రాహ్యమనుట యుక్తము.

ప్రౌఢ వ్యాకరణమతపరామర్శము:- (i) అలరు+పోఁడి–ఇత్యాదిగా పోఁడి శబ్దమును నిల్పి ప్రౌఢవ్యాకర్త ప్రక్రియ చెప్పుట సమంజసమే కాని యందు రెండు లోపములు గలవు–(i) ఇవి యుపమాన పూర్వపద కర్మధారయములనుట స్వరసము కాదు. అలరుఁబోడి=అలరువలెఁ బోడి (మనోజ్ఞురాలు)–అనఁదగదు–అలరువంటి పోఁడి దేనికిఁ గలదోయది– అని బహువ్రీహిచెప్పుట స్వరసము (ii) ఎల్లయెడల నుమ్మగుననుట సరికాదు. ఉదంత స్త్రీసమములకే, నుగాగమమగును. (బా. సంధి 25) ఉదంతేతర స్త్రీసమములకు నుగాగమము కాదు. ఉదా॥ విరి+తేనియ=విరితేనియ. నన+తేనియ=ననతేనియ. కావ. విరి+పోఁడి, నన+పోఁడి, తీయ+పోఁడి–అనుచోట్ల నుమ్ము గ్రాహ్యము కాదు.

కాఁగా–(i) మేనునకు బోఁడి నాదేశముగా విధించి, బాలవ్యాకరణము ప్రక్రియ చెప్పుట, గ్రాహ్యము కాదు. (ii) ఇవి యుపమాన పూర్వపదకర్మధారయ ములనియు నెల్లయెడల నుమ్మగుననియుఁ బ్రౌఢ వ్యాకరణము ప్రక్రియ చెప్పుట సరికాదు.

అలరుఁబోఁడి=అలరువంటి పోఁడి దేనికిఁగలదోయది– బహువ్రీహి. అలరు+పోఁడి. బా. సంధి 25చే–నుగాగమము. అలరు+ను+పోఁడి= అలరుఁబోఁడి, అలరుంబోఁడి. విరిఁబోఁడి=విరినిబోలు పోఁడిదేనికిఁ గలదోయది. విరిని+పోలు+పోఁడి. బా. సమాస 20చే–విరిని+పోఁడి=విరింబోఁడి. తీయుగఁబోఁడి=తీయని పోఁడి దేనికిఁ గలదోయది–మధురాకృతి. తీయని+పోఁడి=తీయఁబోఁడి–13 సూ. అనుబంధము. విషయసంఖ్య–7.

## ఒక్కచో ద్విగువు మిశ్రం బేకవచనాంతంబు నగు. 20

**ఉ:** క. తక్కిన సైన్యము లనిలోఁ, జిక్కి పరాఙ్ముఖతఁ దొలఁగె శివుఁడును భీతిన్, బొక్కుచు నలసతమెయి న, ల్దిక్కు దిరిగి నిలిచి యావులించుచు నుండెన్. ఉ. హరి. 6ఆ–168. ఉ. అ, స్తోక నిజప్రభావములు సూపెడు గద్దియమీఁదనెక్కి ము, ల్లోకము దాన యేలుగతి లోల విలోచన యేమిచెప్పుదున్. పారి. 1ఆ–79. ముమ్మొహార్తమునకు. జై. 7ఆ–23 మొ॥

వ్యా. 'ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు, మిశ్రంబునకుఁగాదు. (బా. సమాస 18) అని బాలవ్యాకరణమున మిశ్రద్విగువున కేకవచనము నిషేధింపఁ బడెను. ఇట మిశ్రద్విగువున కొకచో నేకవచనము సహిత మగునని బాలవ్యాకరణాశయము సవరింపఁబడెను. ఉదా: నల్దిక్కు, ముల్లోకము, ముమ్మొహార్తమునకు.

ప్రక్రియ:- నల్దిక్కు: 'నాలుగు+లు'+'దిక్కు+లు'–అలౌకిక విగ్రహము. బా. సమాస 25చే–నాలుగు+దిక్కు. నిర్దేశానుసారము–నాలుగునకు 'నల్' ఆదేశమగును. నల్+దిక్కు=నల్దిక్కు–ప్రాతిపదికమగును. ఈ 20చే– మిశ్రద్విగు వేకవచనాంత మయిన పక్షమున, బా. తత్సమ 48చే–నల్దిక్కు+వు. తత్సమ 44చే–నల్దిక్కు. పక్షమున–

నల్దిక్కు+లు=నల్దిక్కులు. ముల్లోకము:- 'మూఁడు+లు'+'లోక+లు. బా. సమాస 25 చే-మూఁడు+లోక. బా. సమాస 17చే-మూ+ల్లోక. బా. సమాస 13చే-ముల్లోక-ప్రాతిపదికము. ఈ20చే-ఏకవచనమయినచో బా. తత్సమ 39చే-ముల్లోకము. పక్షమున-ముల్లోక+లు. బా. తత్సమ 40 చే-ముల్లోక+ము+లు=ముల్లోకములు. ముమ్ముహూర్తమునకు:- 'మూఁడు+కు'+ 'ముహూర్త+కు. బా. సమాస 25చే-మూఁడు+ముహూర్త. బా. సమాస 17చే-మూ+మ్ముహూర్త. బా. సమాస 13చే-ముమ్ముహూర్త. బా. తత్సమ 6చే-ముమ్ముహూర్త+కు. తత్సమ 40చే- ముమ్ముహూర్తము+కు. ఏకవచనమగుచో-తత్సమ 28చే-ముమ్ముహూర్తము+న+కు=ముమ్ముహూర్తమునకు. పక్షమున-తత్సమ 31చే-ముమ్ముహూర్తము+లకు=ముమ్ముహూర్తములకు.

## వారార్థక శబ్దంబు లద్విరుక్తంబులు తఱచుగ సంఖ్యా పూర్వకంబు లగు. 21

ఉ: ఒకతడవ, ఒకతూరి, ఒకతేప, ఒకమాటు, ఒకసారి. రెండు తడవలు. ఒక తడవకు, రెండుతడవలకు మొ॥ అద్విరుక్తం బనుటచే తేప తేపకు, తఱచుగ ననుటచే-తడవకు ఇత్యాదు లెఱుంగునది.

వ్యా. అద్విరుక్తములగు. వారార్థక=వారమ్-అను సంస్కృతశబ్దముయొక్క యర్థము గలిగిన, శబ్దములు, తఱచుగా సంఖ్యావాచకము ముందుగలవి యగును. వారార్థకములు=తడవు, తూరి, తేప, మాటు, సారి. ఒకతడవ-ఇత్యాదులు. అద్విరుక్తము అనుటచే, ద్విరుక్తములయినపుడు సంఖ్యావాచకములు వీనిముందు చేరవు. తేపతేపకు (తేపకును+తేపకును-తేపతేపకును. (బా. సంధి 41) తఱచుగ-అనుటచే నరుదుగా నివి సంఖ్యాపూర్వకములు కాకపోవచ్చును. ఉదా॥ తడవకు, ఇటు, ఒక - అనునది ముందు చేరలేదు.

## ఒకండ్వాదులు పరంబులగుచోఁ దఱచుగ నున్ బది కగు. 22

ఉ: పదునొకండు, పదునొకండ్రు; పదుమూఁడు, పదుమూగురు; పదునాలుగు, పదునలుగురు; పదునేను, పదునేగురు; పదునెనిమిది, పదునెనమండ్రు, తఱచుగ ననుటంజేసి, పదియాఱు, పదాఱిత్యాది రూపంబులును గ్రాహ్యంబులు. క. పోరులఁ గర్ణుండు పదాఱవ, కళకు సమానుండు గాఁడు కవ్వడితోడన్. భార. అర. 2ఆ-293 మొ॥

వ్యా. ఒకండు-మున్నగుశబ్దములు పరములగునపుడు, తఱచుగాఁ బదికి "ఉను" అనునది యగును. (తఱచుగన్+ఉను+పదికిన్) పది+ఒకఁడు = పది+ఉను+ఒకఁడు: పదునొకఁడు-ఇత్యాది.

ప్రక్రియ:- "పది+సు"+"ఒక+డుఙ్." "పది+సు"+"మూఁడు+వు;" "పది+సు"+"ఎనిమిది+సు." బా. సమాస 25చే-పది+ఒక; పది+మూఁడు; పది+ఎనిమిది. ఈ 22చే-పది+ఉను+ఒక; పది+ఉను+మూఁడు; పది+ఉను+ఎనిమిది. బా. సంధి 11చే-పదును+ఒక=పదున్+ఒక: పదునొక; విధానసామర్థ్యముచే, బా. సంధి 24చే-ద్రుతలోపము లేదనుకొనవలెను. బా. తత్సమ 22చే-పదునొక+డుఙ్. తత్సమ 19చే-పదునొకండు. ఇది యమహత్తుగాన, బా. తత్సమ 21చే- ఉత్వప్రాప్తియే లేదు కాన నిషేధము

ప్రసక్తము కాదు. పది+ఉను+మూఁడు=పదును+మూఁడు. బా. సంధి18చే-పదుమూఁడు, పది+ఉను+ఎనిమిది=పదును+ఎనిమిది. ఉత్వలోపము: పదున్+ఎనిమిది=పదునెనిమిది+సు. బా. తత్సమ 57చే-పదునెనిమిది. పదునాలుగు లోనగువాని ప్రక్రియ, పదుమూఁడు శబ్దప్రక్రియ వలె గ్రాహ్యము. మహత్వమున-పదునొక+లు=పదునొకండ్రు (శబ్ద 86, 93) పదుమూఁడు+లు=పదుమూగురు (శబ్ద 92) పదునాలుగు+లు=పదునలుగురు (శబ్ద 92) పదునేను+లు=పదునేగురు (శబ్ద 91) పదునాఱు+లు=పదునాఱుగురు (శబ్ద 91) పదునెనిమిది+లు= పదునెనమండ్రు (శబ్ద 92) తెలుచుగ-అనుటచేఁ గొన్నిచోట్ల "ఉను" రాకపోవచ్చును. పది+ఆఱు=పదియాఱు, పదాఱు. (బా. సంధి 5)

### పదికి రెండిరుదొమ్ములు పరంబు లగునపుడు బిందు పూర్వక డకారంబును, ద్విరుక్త నివర్ణంబును, బిందువును గ్రమంబున దివర్ణంబున కగు. 23

ఉ: పండ్రెండు, పన్నిరుగురు, పన్నిద్దఱు; పందొమ్మిది, పందొమ్మండ్రు.

వ్యా. పదిశబ్దమునకు (i) రెండు, (ii) ఇరు, (iii) తొమ్మిది శబ్దములు పరములగునపుడు, దివర్ణమునకు వరుసగా (i) బిందుపూర్వక డకారము (ii) ఇదంతమగు ద్విరుక్తనకారము (న్ న్+ఇ=న్ని) (ii) బిందువు, నగును. అనఁగా (i) పది శబ్దమునకు రెండు శబ్దము పరమగుచో, దివర్ణమునకు బిందుపూర్వక డకారమగును; (ii) ఇరుశబ్దము పరమగుచో దివర్ణమునకు "న్ని" వర్ణమగును. (iii) తొమ్మిది శబ్దముపరమగుచో, దివర్ణమునకు బిందువగును. (i) బిందుపూర్వక డకారమగుటకు:- "పది+సు"+"రెండు+వు" బా. సమాస 25చే- పది+రెండు. ఈ23చే-పండ్+రెండు=పండ్రెండు. బా తత్సమ48చే-పండ్రెండు+వు. బా. తత్సమ57చే-పండెండ్రు. (ii) న్నివర్ణమగుటకు:- పది+రెండు+లు=పది+ఇరు+గు+రు. దివర్ణమునకు 'న్ని'. పన్ని+ఇరు+గు+రు=పన్నిరుగురు. (శబ్ద 91) పన్నిరుగురు=పన్నిద్దఱు. (శబ్ద 98) (iii) బిందువగుటకు:- "పది+సు"+"తొమ్మిది+సు." బా. సమాస 25చే-పది+తొమ్మిది. ప్రౌఢ. సమాస 36చే- పది+దొమ్మిది. ఈ 23చే-పం+దొమ్మిది=పందొమ్మిది+సు. బా. తత్సమ57చే-పందొమ్మిది. పందొమ్మిది+లు= పందొమ్మండ్రు. (శబ్ద 92)

విమర్శ:- పందొమ్మిది-బాలవ్యాకరణముననే సాధింపఁబడియుండుటచే (బా. సంధి 39)నిట మరలసాధించుట యనావశ్యక మనఁదగును.

### పది యుత్తర పదంబగుచో నేనుదొమ్ముల నుమ్ములకు బిందువును, ఏనికెనును ఏడునకు వర్ణవ్యత్యయంబును, ఆపరుషంబునకు సరళంబును గ్రమంబుగ నగు. 24

ఉ: ఏఁబది, ఏఁబండ్రు; తొంబది, తొంబండ్రు; ఎనుబది, ఎనుబండ్రు; డెబ్బది, డెబ్బండ్రు మొ॥

వ్యా. పది, ఉత్తరపద మగునపుడు, ఏనుదొమ్ముల (ఏను+తొమ్మి+లయొక్క) ఏను, తొమ్మి శబ్దములయొక్క, నుమ్ములకున్ (ను+మ్మి+లకున్)=ను, మ్మి వర్ణములకు-అనఁగా, ఏనుశబ్దపు నువర్ణమునకు, తొమ్మిదిశబ్దమున దివర్ణము లోపింపఁగా మిగిలిన తొమ్మిశబ్దపు "మ్మి" వర్ణమునకు, బిందువగును. ఎనిశబ్దమునకు, అనఁగా, ఎనిమిది శబ్దమున "మిది" లోపింపఁగా మిగిలిన ఎనిశబ్దమునకు, ఎనుశబ్దమగును. ఏడు శబ్దమునకు వర్ణవ్యత్యయ మగును. ఆపరుషమునకు, అనఁగా, ఉత్తరపదమగు పదిశబ్దము నందలి పరుషమునకు

పరళమగును. (పకారము బకారమగు ననుట.) ఏనునకు:- "ఏను+వు"+"పది+సు". బా. సమాస 25చే-ఏను+పది. ఈ 24చే-ఏఁ+ బది=ఏఁబది-ప్రాతిపదికమగును. ఇట ఏ-దీర్ఘము గనుకఁ బూర్ణబిందువు నిల్వరాదు. ఏఁబది+సు. బా. తత్సమ 57చే-ఏఁబది. మహత్త్వమున-ఏఁబది+లు= ఏఁబండ్రు. ఇరువండ్రు-వలెఁ బ్రక్రియ. (శబ్ద 92) తొమ్మికి:- "తొమ్మిది+సు"+"పది+సు". బా. సమాస 25చే-తొమ్మిది+పది. శబ్ద 92చే-తొమ్మి+పది. ఈ 24చే-తొం+ బది=తొంబది-ప్రాతిపదికము. తొంబది+సు. బా. తత్సమ 57చే-తొంబది. మహత్త్వమున-తొంబది+లు. శబ్ద 86చే-తొంబది+రు. శబ్ద 92చే-తొంబ+రు. శబ్ద 93చే-తొంబ+ండ్+రు=తొంబండ్రు. ఎనికి, ఎను:- "ఎనిమిది+సు"+"పది+సు." బా. సమాస 25చే-ఎనిమిది+పది. ప్రౌఢ. సమాస 36చే-ఎని+పది. ఈ 24చే-ఎను+బది=ఎనుబది-ప్రాతిపదికము. ఎనుబది+సు. బా. తత్సమ 57చే-ఎనుబది. మహత్త్వమున-ఎనుబది+ లు=ఎనుబండ్రు. ఇది యిరువండ్రు-వలె గ్రాహ్యము. (శబ్ద 92) ఏడునకు వర్ణవ్యత్యయము:- "ఏడు+వు"+ "పది+సు." బా. సమాస 25చే-ఏడు+పది. ఈ 24చే-డుఏ+బది=డే+బది. 25చే-డె+బది. శబ్ద 100చే-డెబ్బది. (బహుళ గ్రహణముచే నిట ద్విత్వము నిత్యము.) డెబ్బది+సు. బా. తత్సమ 57చే-డెబ్బది. మహత్త్వమున-డెబ్బది+ లు=డెబ్బండ్రు. ఇరువండ్రువలెఁ బ్రక్రియ (శబ్ద 92.)

## పది యుత్తరపదంబగుచోఁ బూర్వపదంబు దీర్ఘంబునకు హ్రస్వంబగు. ఏను నేకు రాదు. 25

ఉ: ముప్పది, ముప్పండ్రు; నలువది, నలువండ్రు; అఱువది, అఱువండ్రు. మొ॥

వ్యా. పదిశబ్ద ముత్తరపద మగునపుడు, పూర్వపదము దీర్ఘమునకు హ్రస్వమగును. ఏనునేకున్ (ఏనుయొక్క+ ఏకు=ఏను+ఏకు: ఏనునేకు)=ఏనుశబ్దమునందలి "ఏ" వర్ణమునకు, హ్రస్వమురాదు. "మూఁడు+వు"+"పది+వు". బా. సమాస 25చే-మూఁడు+పది. బా. సమాస 17చే-మూ+ప్పది. ఈ 25చే-ముప్పది. ఇట దీర్ఘమునకు హ్రస్వము, బా. సమాస 13 చేతనే ప్రాప్తించును గాని నలువది, అఱువది-అనుచోట్ల దీర్ఘమునకు హ్రస్వముకలుగునని చెప్పసందర్భమున ముప్పది-అనునది యనువదింపఁ బడెనని గ్రహింపనగును. ముప్పది+లు= ముప్పండ్రు. (శబ్ద 92) "నాలుగు+వు"+"పది+సు". బా. సమాస 25చే-నాలుగు+పది. ప్రౌఢ. సమాస 36చే-నాలు+వది. ఈ 25చే-నలు+వది=నలువది-ప్రాతిపదికము. నలువది+సు బా. తత్సమ 57చే-నలువది. నలువది+లు=నలువండ్రు, ఇది యిరువండ్రు వలె గ్రాహ్యము. (శబ్ద 92) "ఆఱు+వు"+"పది+సు". బా. సమాస 25చే-ఆఱు+పది. ఈ 25చే-అఱు+పది. 36చే-అఱు+వది=అఱువది- ప్రాతిపదికము. అఱువది-సు. బా. తత్సమ 57చే-అఱువది. అఱువది+లు=అఱువండ్రు. ఇరువండ్రు వలె గ్రాహ్యము. (శబ్ద 92) ఏనుయొక్క ఏకు హ్రస్వము రాకపోవుటకు:- ఏను+పది=ఏఁబది. (24 సూ.)

## కొన్నియెడల నీసమాసపదంబులు యువర్ణ వ్యవహితంబులు నగు. 26

ఉ: అక్కర. వనమునఁ బదియు రెండేఁడు లజ్ఞాతవాస మొక్కేఁడు, జనపదంబున నుండి. భార. ఆది. 3ఆ 19. తే. ద్రోహులగువేలుపులలోన దొరసియున్న, పదియునొక్కండ్రు రుద్రులఁ బాఱవిడిచె. కాశీ. 7ఆ 86. మొ॥

వ్యా. కొన్నిచోట్ల సంఖ్యావాచకములతో నగు సమాసపదములు, యువర్ణ=సముచ్చయార్థకమగు యు(ను)వర్ణముతో (శబ్ద 116) వ్యవధానముగలవియు నగును. 'పది+ను'+రెండు+వు. 'పది+ను+ఒక్క+డుఙ్' బా. సమాస 25చే-పది+రెండు. పది+ఒక్క. ఈ 26చే-పది+యును+రెండు. బా. సంధి 24చే- పదియు రెండు-ప్రాతిపదికము. బా. తత్సమ 48చే-పదియు రెండు+వు. తత్సమ 57చే-పదియురెండు. పది+ఒక్క=పది+యును+ఒక్క: స్వరలోపము: పదియున్+ఒక్క=పదియునొక్క. మహత్త్వమున-పదియు నొక్క+లు. శబ్ద 86చే-పదియు నొక్క+రు. శబ్ద 93చే-పదియు నొక్క+ండ్+రు=పదియునొక్కండ్రు. పక్షమున, పం డ్రెండు, పదునొక్కండ్రు. (శబ్ద 5)

## కఱకంఠుఁడు బహువ్రీహి. 27

(సూ. సంజ్ఞా 9 సూ. ఉ.) దీని నహోబలపండితుఁడు మిశ్రబహువ్రీహియనెఁ గాని యదియట్లగుట దుర్ఘటము.

వ్యా. కఱకంఠుఁడు-అనునది బహువ్రీహిసమాసము. అహోబలపండితుఁడు తన కవిశిరోభూషణములో (అహోబలపండితీయము) కఱకంఠుఁడు, మిశ్రబహువ్రీహి యనెను. అనగా, కఱ-అను నాచ్ఛికపదము కంఠము-అను సంస్కృతసమముతో సమసించెనని యతని యభిప్రాయము. బాలవ్యాకరణ మతమునందును నిది మిశ్రబహువ్రీహియే యగును. (చూ. బా. సంజ్ఞా 23) ఇది మిశ్రబహువ్రీహియగుట దుర్ఘటమని యిటఁ జెప్పఁబడెను. తనయభిప్రాయమునకు, సంజ్ఞాపరిచ్ఛేదము 9వ సూత్రమును, నుదాహరణములను, జూడవలెనని సూచితము. ప్రౌఢవ్యాకర్తమతమున కఱకంఠుఁడు-గరకంఠశబ్దభవము. అనాచ్ఛిక వర్ణమగు ఠకారముండుటచే నిది గ్రామ్యమగును. అయినను మహాకవిప్రయుక్తమగుటచే ననింద్య గ్రామ్యమగును.

విమర్శ:- కఱకంఠుఁడు, గరకంఠశబ్దభవమను ప్రౌఢవ్యాకర్త యాశయము సరికాదు. కారణములివి - (i) కఱకంఠ శబ్దమున ననాచ్ఛిక వర్ణమగు ఠకారము కనఁబడుచుండగా దీనిని దద్భవమనుట సరికాదు. ఠకారముండుటచే, నీ తద్భవ పక్షమునందును గ్రామ్యత దుర్వారమే యగుచున్నది. (ii) నన్నయ తద్భవములలో నలఘు రేఫము వాఁడఁడన్న సిద్ధాంతమును బట్టి కఱకంఠుఁడు-లోని కఱశబ్దము గరశబ్ద భవమనుట కవకాశము లేదు కావున నిది మిశ్రబహువ్రీహియను నహోబలపండితుని యభిప్రాయమే యుక్తము. (చూ. అనుబంధము. విషయసంఖ్య-8) కఱకంఠుఁడు-నిపాతన్యాయమున గ్రాహ్యము. తక్కిన మిశ్రబహువ్రీహు లగ్రాహ్యములు.

## కొన్నియెడల మహద్ద్వంద్వంబునం బూర్వ పదాంత్యస్వరంబునకు దీర్ఘంబునుం జూపట్టెడు. 28

ఉ: అన్నాదమ్ములు. ఉ. హరి 4ఆ. 15. అప్పాచెల్లెండ్రు. నిర్వ 3ఆ-96. తల్లీదండ్రులు. భల్లా. 4ఆ.

వ్యా. కొన్నిచోట్ల మహద్ద్వంద్వంబునన్=మహద్వాచకములకగు ద్వంద్వ సమాసమునఁ బూర్వపదముయొక్క చివరి యచ్చునకు దీర్ఘము సహితము కనఁబడును. మహచ్ఛబ్దముచే, మహతీవాచకములనుగూడ గ్రహింపవలెను. ఒకటి మహద్వాచకము వేఱొకటి మహతీవాచకమును గావచ్చును. అన్నదమ్ములు-అనుచో రెండుపదములు మహత్తులు. అప్పాచెల్లెండ్రు-అనుచో, రెండుపదములు మహతీ వాచకములు. తల్లీదండ్రులు-అనుచో తల్లి-మహతి; తండ్రి-మహత్తు. అన్నదమ్ములు=అన్నయును దమ్ముఁడును-ఇత్యాది.

ప్రక్రియ:- "అన్న+సు"+"తమ్మ+డుఙ్"; "అప్ప+సు+" "చెల్లెలు+వు"; "తల్లి+సు" "తండ్రి+సు"- అలౌకిక విగ్రహములు. బా. సమాస 25చే-అన్న+తమ్మ, అప్ప+ చెల్లెలు; తల్లి+తండ్రి. అన్న+తమ్మ-అనుచో, బా. సంధి 15చే- అన్న+దమ్మ. ఈ 28చే-అన్నా+దమ్మ=అన్నాదమ్మ-ప్రాతిపదికమగును. బా. తత్సమ-21చే-అన్నాదమ్ము. బహువచనము: అన్నాదమ్ము+లు=అన్నాదమ్ములు. అప్ప+చెల్లెలు-అనుచో, బా. సంధి 15చేఁ బ్రాప్తించు గసడదవాదేశమును, ప్రౌఢ. సంధి 6 సూత్రము నిషేధించును. ఈ 28చే-అప్పా+చెల్లెలు- అప్పాచెల్లెలు-ప్రాతిపదికమగును. అప్పాచెల్లెలు+లు. బా. ఆచ్ఛిక 11చే అప్పాచెల్లె+oడ్+ర్+ఉ= అప్పాచెల్లెండ్రు. తల్లి+సు+తండ్రి+సు. బా. సమాస 25చే-తల్లి+తండ్రి. బా. సంధి 15చే-తల్లి+దండ్రి. ఈ 28చే- తల్లీదండ్రి-ప్రాతిపదికమగును. తల్లీదండ్రి+లు. బా. తత్సమ 45చే-తల్లీదండ్రులు. సముచ్చయముచే- అన్నదమ్ములు. ఇత్యాదు లెట్లును నుండును.

విమర్శ:- (i) చూ. సంధి 6 (ii) సూత్రము త్యాజ్యము. తల్లీదండ్రులు-అగ్రాహ్యము.

## ఒకానొకచో ద్వంద్వంబునం బూర్వపదంబు క్లీబసమంబగు. అగుచో నా మువర్ణకంబునకు లోపంబగు. 29

ఉ: అందచందములు. అని 5ఆ-63. వెచ్చసచ్చములు. వేం. పంచ. 1ఆ-763.

వ్యా. ద్వంద్వసమాసమునఁ బూర్వపద మరుదుగాఁ గ్లీబసమమగును. అగుచో, నాపూర్వపదమునందలి మువర్ణకమునకు లోపమగును. అందము+చందము=అందచందములు, వెచ్చము+సచ్చము=వెచ్చసచ్చములు. బాలవ్యాకరణమున, 'ఆచ్ఛికశబ్దంబు తోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వంబగు' అని సూత్రింపఁబడెను. (బా. సమాస 7) 'మగఁడును బిడ్డలును, పల్లమును గల్లెమును-ఇత్యాదులు సమసింపవని యీ నియమంబున నెఱుంగునది' అని వివరింపఁబడెను. ఇట ద్వంద్వమునఁ బూర్వపద మరుదుగాఁ గ్లీబసమము కావచ్చునని సవరణ ప్రతిపాదింపఁబడెను.

ప్రక్రియ:- 'అంద+ము'+'చంద+ము'; 'వెచ్చ+ము'+'సచ్చ+ము' బా. సమాస 25చే-అంద+చంద; వెచ్చ+సచ్చ. 'పూర్వపదంబు క్లీబసమంబగు' అనుటచేఁ బూర్వపదము నందలి మువర్ణకము లోపింపదనుట కవకాశము లేకుండ (33 సూ.) 'ఆ మువర్ణకంబునకు లోపంబగు' అని స్పష్టపఱుపఁబడెను. అంద+చంద-అనుచో, బా. సంధి 15చేఁ బ్రాప్తించు గసడదవాదేశమును, ప్రౌఢ. సంధి 6 సూత్రము నిషేధించును. అందచంద+లు; వెచ్చసచ్చ+లు. బా. తత్సమ 40చే-అందచందములు, వెచ్చసచ్చములు.

## ద్వంద్వం బప్రాణివాచక కృదంత శబ్ద ఘటితం బేకవచనాంతంబు నగు. 30

ఉ: కూడుగుడ్డ. కూరగాయ. జై. 4ఆ-96. దరిదావు. భోజ. 2ఆ-6. రేవగలు. రామా 2ఆ-12. తాఁకుదగులు. హరి. ఉ. 5ఆ-90. నుశబ్దంబుచేఁ గూరగాయ లిత్యాదులు బహువచనాంతంబులు నగునని యెఱుంగ వలయు.

వ్యా. అప్రాణివాచక కృదంత శబ్దఘటితంబు=ప్రాణివాచకములుకాని శబ్దములతోను, గృదంతశబ్దములతోను గూర్పఁబడిన, ద్వంద్వసమాసము, ఏకవచనాంతంబున్=ఏకవచనాం

తము సహితము, అగును. అప్రాణివాచకములకు:- కూదుగుడ్డ, కూరగాయ, దరిదావు. కృదంతములకు:- తాఁకుదగులు. ఏకవచనాంతంబును-అను సముచ్చయాద్యర్థకమగు నుశబ్దముచే, బహువచనములు సహిత ముండును. కూడుగుడ్డలు, కూరగాయలు; దరిదాపులు; రేవగళులు, రేవగలులు, రేవగళ్లు; తాఁకు దగుళులు, తాకు దగులులు, తాఁకు దగుళ్లు. కూడుగుడ్డ:- కూడును గుడ్డయును=కూడుగుడ్డలు. కూడుగుడ్డలనువాని సమాహారము కూడుగుడ్డ.

ప్రక్రియ:- (i) అప్రాణివాచకములకు:- 'కూడు+వు'+'గుడ్డ+ము'; 'కూర+ము'+'కాయ+ము'; 'దరి+సు+దాపు+వు' 'రేయి+సు'+'పగలు+వు'; 'తాఁకు+వు'+'తగులు+వు' బా. సమాస 25చే- కూడు+గుడ్డ; కూర+కాయ; దరి+దావు; రేయి+పగలు; తాఁకు+తగులు-అని నిల్చును. ఈ 30చే-నివి యేకవచనాంతములు కావచ్చునుగాన, కూడుగుడ్డ, అనుచో, బా. తత్సమ 39చే- కూడుగుడ్డ+ము. తత్సమ 57చే-కూడుగుడ్డ-అగును. కూర+కాయ. బా. సంధి 15చే-కూరగాయ. ఏకవచనాంతపక్షమున, బా. తత్సమ 39చే-కూరగాయ+ము. తత్సమ 57చే-కూరగాయ, దరిదాపు. బా. తత్సమ 48చే-దరిదాపు+వు తత్సమ 57చే-దరిదాపు. రేయి+పగలు. బా. అచ్చిక 21 వివరణముచే- రే+పగలు. బా. సంధి 15చే-రేవగలు. ఏకవచనాంతపక్షమున, బా. తత్సమ 48చే-రేవగలు+వు. తత్సమ 57చే-రేవగలు. (ii) కృదంతములకు:- తాఁకు+తగులు. బా. సంధి 15చే-తాఁకు+దగులు. బా. తత్సమ 48చే-తాఁకుదగులు+వు. తత్సమ 57చే-తాఁకుదగులు. తాఁకు+ఉ=తాకు, తగులు+ఉ=తగులు. ఇట్టివికృదంతము లగును. బా. కృదంత 21 (చూ. అనుబంధము. విషయసంఖ్యలు-55, 93)

భావద్వంద్వంబునం దొలిపదంబు టవర్ణకంబునకు లోపంబగు. 31

టవర్ణకంబిటఁ గృత్ప్రత్యయంబున కుపలక్షణంబు.

ఉ: ఔగాములు (అవుట+కామి) పర. 3 ఆ. చెల్లు చెల్లములు. (చెల్లుట+చెల్లమి) వేం. పంచ. 1ఆ-763, వచ్చురాములు (వచ్చుట+రామి) పాండు. 4ఆ. 66. వినివినములు (వినికి+వినమి.) సా. 2ఆ-77. మొ॥ (వినికి=వినుట)

వ్యా. భావార్థకములతోఁ గూర్పఁబడు ద్వంద్వసమాసమునఁ దొలిపదము, టవర్ణకమునకు లోపమగును. భావార్థకము=బా. క్రియా35. ఇట, టవర్ణకము, కృత్ప్రత్యయమున కుపలక్షణము- అనఁగా టవర్ణకము కృత్ప్రత్యయమునకు సూచకము. టవర్ణకలోపము కృత్ప్రత్యయముల తుది యక్షర లోపమునకు సూచకము. ఉదా॥ వినికి+వినమి=వినివినమి+లు: వినివినములు. అవుట=ఔట. (బా. క్రియా 103) ఔట+కామి = ఔగామి+లు: ఔగాములు. చెల్లుట+చెల్లమి = చెల్లుచెల్లమి+లు = చెల్లుచెల్లములు. వచ్చుట+రామి = వచ్చురామి+లు = వచ్చురాములు. వినికి-బా. కృదంత 16. వినమి-బా. క్రియా 37.

ప్రక్రియ:- ఔట+ము+కామి+సు; "చెల్లుట+ము"+"చెల్లమి+సు"; వచ్చుట+ము+"రామి+సు"; "వినికి+సు"+"వినమి+సు" బా. సమాస 25చే-ఔట+కామి; చెల్లుట+చెల్లమి; వచ్చుట+రామి. వినికి+వినమి. ఈ 31చే-ఔ+కామి; చెల్లు+చెల్లమి; వచ్చు+రామి; విని+వినమి; ఔ+కామి. బా. సంధి15చే-ఔగామి; చెల్లు+చెల్లమి-అనుచో. బా. సంధి15చే-ప్రాప్తించు గసడదవాదేశమును, ప్రౌఢ-సంధి 6 సూత్రము నిషేధించును. ఔగామి+లు; చెల్లుచెల్లమి+లు; వచ్చురామి+లు; వినివినమి+లు. బా. తత్సమ 45చే-ఔగాములు,

చెల్లచెల్లములు. పచ్చురాములు, వినివినములు. (చూ. అనుబంధము విషయసంఖ్య—94; మూలములు)

## ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు లోపం బొండె నగు. 32

ఉ: పుట్టుగ్రుంకుగట్లు. య 5ఆ—30. తొవదమ్మివిందు. రామా 3ఆ—45, విన్నకన్నది. వి.పు. 2ఆ. పుట్టుగ్రుంకుగట్లనఁగా, పుట్టుగట్టు, క్రుంకుగట్టు. ఇట్లంతట నెఱుంగునది.

వ్యా. ద్వంద్వ సమాసమునఁ బూర్వపదముయొక్క తుది యవయవమునకు లోపము, ఒండెన్= పక్షాంతరమున, అగును. పుట్టుగట్టు+క్రుంకుగట్టు = పుట్టుగ్రుంకుగట్లు; తొవవిందు+తమ్మివిందు = తొవదమ్మివిందు; విన్నది+కన్నది=విన్న కన్నది.

ప్రక్రియ:- "పుట్టుగట్టు+వు"+"క్రుంకుగట్టు+వు"; "తొవవిందు+సు"+"తమ్మివిందు+సు"; "విన్నది+సు"+"కన్నది+సు" బా. సమాస25చే-పుట్టుగట్టుక్రుంకుగట్టు; తొవవిందు+తమ్మివిందు; విన్నది+కన్నది. బా. సంధి15చే-పుట్టుగట్టు+గ్రుంకుగట్టు; తొవవిందు+దమ్మివిందు. ఈ32చే-పూర్వపదముల తుదియవయవములకు లోపము: పుట్టు+గ్రుంకుగట్టు; తొవ+దమ్మివిందు. విన్న+కన్నది. పుట్టుగ్రుంకుగట్టు+లు. బా. ఆచ్ఛిక 12చే-పుట్టుగ్రుంకుగట్లు, తొవదమ్మివిందు, అనుచో-30చే నేకవచనాంతపక్షమున, తొవదమ్మివిందు+సు. తత్సమ57చే-తొవదమ్మివిందు. విన్నకన్నది+సు. తత్సమ57చే-విన్నకన్నది. (17వ, సూత్రమునందలి, ఎత్తిన పెంచినవారి-అనునది యీసూత్రమునకు లక్ష్యమనుట యుక్తము. చూ. అనుబంధము. విషయసంఖ్య—95)

## ఒకానొకచో ద్వంద్వంబు మిశ్రంబుగను; అందలి పూర్వపదంబు క్లీబసమంబుగను గానంబడియెడి. 33

ఉ: అవసరమక్కఱలు. క. అవసరమక్కఱలం గైదువుకర్జములందు వేఁటదోఁటలయందున్, దవులైన ప్రాఁతలెంకల, మవుటన్ మముఁజూడు మోపినపుడెపుడైనన్, రామా. 2—9.

వ్యా. ద్వంద్వసమాస మరుదుగా మిశ్రమముగను, నందలి పూర్వపదము క్లీబసమముగను గనఁబడును. క్లీబసమము=ముపర్ణకాంత మనియిట సరిపెట్టుకొన వలసియుండును. పూర్వపదము ముపర్ణకాంతముగనుండు మిశ్రద్వంద్వ మరుదుగాఁ గనఁబడునని భావము. ఉదా॥ అవసరమక్కఱలు. బా. సమాస 7చే-ఆచ్ఛికద్వంద్వము మాత్రమే సిద్ధించును. ఇట ముపర్ణకాంతమగు సంస్కృత సమ మాచ్ఛికపదముతో మిశ్రద్వంద్వమగునని పూరింపఁబడెను. అవసరము - సంస్కృత సమము. అక్కఱ-ఆచ్ఛికము.

ప్రక్రియ:- "అవసర+ము"+"అక్కఱ+లు". బా. సమాస25చే-ముపర్ణకము సైతము లోపింపవలసియున్నను నిటఁ "గ్లీబసమంబుగను" అను దాని స్వారస్యమున ముపర్ణకము లోపింపదు. అవసరము+అక్కఱ=అవసరమక్కఱ-ప్రాతిపదికమగును. అవసరమక్కఱ+లు= అవసరమక్కఱలు.

విమర్శ:- (i) క్లీబ సమమమనుట సరికాదు. (బా. ఆచ్ఛిక 2) ముపర్ణకాంత

సంస్కృత సమమనవలెను. (ii) మిశ్రద్వంద్వములు ప్రయోగ యోగ్యములు కావు. కాన విదియనుసరణీయము కాదు.

## ఒక్కొకచో సమాసగత పూర్వపదంబు వ్యవహితోత్తర పదంబొంటితోడను, వాని పెక్కింటితోడను నన్వయించెడి. 34

ఉ: రాహు కంఠము దెగి దేహము ధరణిఁబడియె. భార. ఆది. 2ఆ-19. క. ఒక్కొకకన్నును జెవియును, జెక్కును జను బొద్దు మూఁపుఁ జెలువగుచేయున్, బ్రక్కయుఁబిఱుఁదును గాలును, నక్కజముగ మనుజశకల మపుడుదయించెన్. సభా. 1ఆ-144. క. పరుల ధనమునకు విద్యా, పరిణతికిం దేజమునకు బలమునకు మనం, బెరియఁగ నసహ్యపడు న,న్నరుఁడు దెవులులేని వేదనం బడునధిపా! భార. ఉద్యో 2ఆ-53. క. నాయింటం బదికడవల, నేయిఁ బెరుఁగుఁ బాలుఁ ద్రావె నీప్రియతనయుం,డు. హరి. పూ. 5ఆ-215.

వ్యా. ఒకొక్కచోట, సమాసమునందలి పూర్వపదము, వ్యవహితోత్తరపదం బొంటి తోడను=వ్యవధానముగలిగిన, యొక పరపదముతోడను, దాని పెక్కింటి తోడను=వ్యవధానము గలిగిన పెక్కు పరపదములతోడను, అన్వయించును. (ఉత్తరపదము=పరపదము. ఇది పారిభాషికపదము కాదు) అనఁగా సమాసమునందలి పూర్వపదము, తనతో వ్యవధానముగల (ఎడముగల) యొక పరపదము తోడను, బెక్కు పరపదములతోడను నన్వయించును. ఒక పరపదముతో నన్వయించుటకు:- రాహు-కంఠము, దెగి-దేహము ధరణిఁబడియె. రాహుకంఠము-అను సమాసము నందలి పూర్వపదము "రాహుయొక్క" అనునది. కంఠము, తెగి-అనునవి మధ్యలోఁ జేరుటచే దీనికిని, బరపదమగు "దేహము" అనుదానికిని వ్యవధాన మేర్పడుచున్నది. రాహుయొక్క- అను సమాసగత పూర్వపదము, వ్యవహితముగనున్న దేహము- అను పరపదముతో నన్వయించుచున్నది. ఒక పరపదముతో, నన్వయించుట, కిది యుదాహరణము. పెక్కు పరపదములతో నన్వయించుటకు:- "ఒక్కొక-కన్నును జెవియును-జెక్కును..." ఇట ఒక్కొక-సమాసగత పూర్వపదము. కన్నును-వ్యవధానము కలిగించు పదము. వ్యవహితముగ నున్న, చెవియును, చెక్కును లోనగు పెక్కుపదములతో ఒక్కొక-అనునది యన్వయించుచున్నది. ఒక్కొక చెవియును, ఒక్కొక చెక్కును-ఇత్యాది. పరుల-ధనమునకు- విద్యాపరిణతికిని దేజమునకు-అను పద్యమున. పరులయొక్క-అనునది సమాసగత పూర్వపదము. ధనమునకును- వ్యవధానము గలిగించు పదము. పరులయొక్క- అనునది వ్యవహితముగ నున్న విద్యా పరిణతికిని, తేజమునకు మున్నగు పెక్కు పరపదములతో నన్వయించుచున్నది. పరులయొక్క విద్యాపరిణతికిని, పరులయొక్క తేజమునకు- ఇత్యాది. నాయింటం బదికడవల, నేయిఁ బెరుఁగుఁ-బాలు ద్రావె- అను పద్యమున, పదికడవల-సమాసగత పూర్వపదము. పదికడవల-నేయిఁ బెరుఁగుఁ బాలుఅనుచో, నేయి-అనునది వ్యవధానముగలిగించు పదము. పదికడవల-అనునది, పెరుఁగు, పాలులోనగు, పెక్కు పరపదములతో నన్వయించుచున్నది. పదికడవల పెరుఁగు, పదికడవలపాలు-ఇత్యాది.

విమర్శ:- ఒక్కొక కన్నును జెవియును-అను ప్రయోగము సమాస మూలలక్షణమునకు విరుద్ధమగుటచే ననుసరణీయము కాదు. తక్కిన ప్రయోగములు, వాక్య 12వ, సూత్రమునకు లక్ష్యములగును.

కొన్నియెడల సిద్ధసమాస మధ్యగత పదంబులతోఁ
దద్భిన్నపదంబుల కన్వయంబు చూపట్టెడి. 35

ఉ: బహువేద ఘోషములఁజేసి నిరస్త సమస్త కిల్బిషోత్కరు లగుచున్న ధన్యులు. భార. అర. 1 ఆ–11. వారి యస్మదీ, యోరు చమూసమూహములు. హరి. ఉ. 2ఆ–105. అఖండితరూపవిలాస సంపదన్, వంచిత పంచబాణుఁడగు వాని. నై. 3ఆ–40. అందొకటిచే జనితాధరపీడయై. కళా. 5ఆ–27. మొ॥

వ్యా. కొన్నిచోట్ల సిద్ధసమాస మధ్యగత పదంబులతోన్=సిద్ధసమాసాంతర్గత పదములతో, తద్భిన్న పదంబులకున్= ఆసిద్ధసమాసాంతర్గతములు కాని పదములకు, అన్వయము కనఁబడును. ఇట్లు విడిగానున్న పదములు సమాసమందలి యేకదేశముతో నన్వయించుట యేకదేశాన్వయ మనఁబడును. బహువేదఘోషములఁజేసి నిరస్త సమస్త కిల్బిషోత్కరులగుచున్న ధన్యులు. ఇట, నిరస్త సమస్త. కిల్బిషోత్కరులు–అనునది సిద్ధసమాసము. కావ, నిరస్త–అనునది సిద్ధసమాసగతమైయున్నది. దీనితో, సిద్ధసమాసగతము కాక వేఱుగానున్న, బహువేదఘోషములఁజేసి–అనునది యన్వయించుచున్నది. బహువేదఘోషములఁ జేసి=బహువేదఘోషములచేత, నిరస్త=పోగొట్టఁబడిన–అని యర్థము. వారి యస్మదీయోరు చమూసమూహములు. ఇట, అస్మదీయోరు చమూసమూహములు–అనునది సిద్ధసమాసము. వారి–అనునది సిద్ధసమాసగతము కాక, వేఱుగానున్నది. ఇది, సమాసగతమగు, ఉరు చమూసమూహములు–అనుదానితో నన్వయించుచున్నది. వారి=వారియొక్క, అస్మదీయ= మాయొక్క, ఉరుచమూహములు–అని యర్థము. అఖండిత రూపవిలాససంపదన్, వంచిత పంచబాణుఁడగువాని. ఇట, వంచితపంచబాణుఁడు–సిద్ధసమాసము. వంచిత–అనునది సిద్ధసమాసగతమై యున్నది. దీనితో నా సిద్ధసమాసగతము కాని, అఖండిత రూపవిలాస సంపదన్–అనునది యన్వయించుచున్నది. అఖండిత రూప విలాస సంపదచేత, వంచిత=వంచింపఁబడిన–అని యర్థము. అందొకటిచే జనితాధర పీడయై. జనితాధరపీడ– సిద్ధసమాసము. సిద్ధసమాస గతమగు జనిత–శబ్దముతో, నాసిద్ధసమాసగతముకాని, అందొకటిచే–అనునది యన్వయించుచున్నది. అందొకటిచే, జనిత=కలిగింపఁబడిన–యని యర్థము.

విమర్శ:- (i) వారి యస్మదీయోరుచమూసమూహములు – అనుచో, వారి–అపపాఠము; వాలి–సాధుపాఠము. వాలి=మార్కొ_ని–అని యర్థము. కావ నిది సరియగు లక్ష్యము కాదు. (ii) ఇందలి ప్రయోగములు శాస్త్రసమ్మతములగుటచే గ్రాహ్యములు. (చూ. అనుబంధము. విషయసంఖ్య–24)

ఆచ్ఛిక సమాసములం దఱచుగ వర్ణలోపాగమాదేశ వికారంబులు
నిత్యవైకల్పికములుగాఁ బెక్కు_లు గానంబడియెడి. 36

ఉ: అందాఁక(అంత+దాఁక) ఇట్లు, ఇందాఁక, ఎందాఁక. అచ్చతెల్పు (అచ్చము+తెల్పు) ఆఁదోఁక (ఆవు+తోఁక) ఆవల (ఆ+వలను). ఇట్లు, ఈవల, ఇబ్బంది (ఇరు+పంది) ఇరుసెవి (ఇరుగు+చెవి) ఉద్దరి (ఉద్ద+దరి) ఎడవంక (ఎడమ+వంక) ఇట్లు, వలవంక. ఎగుదల (ఎగువ+ తల) ఇట్లు,

దిగుడల. ఏటవాలు (ఏటము+వాలు) కప్పురవీడెము (కప్పురము+వీడెము) కప్పడె (కవ-వడె) కుఱుమాపు (కుఱుచ+మాపు) గందవొడి (గందము+పొడి) గుండ్రకడుపు (గుండ్రము+కడుపు) గొబ్బండు (గొప్ప+పండు) చిత్తరుబొమ్మ (చిత్తరువు-బొమ్మ) చిమ్మనగ్రోవి (చిమ్మనము+గ్రోవి). చిఱుచప్పుడు (చిఱుత+ చప్పుడు), చెంద్రకావి (చెంద్రము+కావి) ఇట్లు, చందురకావి. చనుమఱు (చను+మఱుక) చప్పరమంచము (చప్పరము+మంచము), చొక్కసగతులు (చొక్కము+సగతులు) తెగుదారి (తెగువ+దారి). దట్టకెంపు (దట్టము- కెంపు). దొంతర (దొంతి+తరఁగ), నడురేయి (నడుము+రేయి), నాన్నాళ్లు (నాలుగు+నాళ్లు), నాటకసాల (నాటకము+సాల), నిక్కల (నిక్కము+కల), నిడుమోము (నిడుద+మోము), నెత్తపలక (నెత్తము-పలక), పసిపట్టు (పసిమి+పట్టు), పెందుఱుము (పెనుపు+తుఱుము), పెత్తనము (పెద్ద+తనము), పొంగట్టు (పొన్ను+గట్టు), బాపురె (బాపు+పురె) బెబ్బులి (పెద్ద+పులి), బెల్లమండెఁగ (బెల్లము+ మండెఁగ), బొందళము (బొంత+దళము). బోనపుట్టిక (బోనము+పుట్టిక), మిండతపసి (మిండఁడు+తపసి) ముంగల (ముందు+కలను) ఇట్లు వెనుకల. ముయ్యేడు (మూఁడు+ఏడు) ఇట్లు, ముయ్యాఱు. మొ॥ మోసల (మొగ+సాల) వలిపవెన్నెల (వలిపము+వెన్నెల), వలచెవి (వలను+చెవి), వాతెఱ (వా+తెఱపి) వాలురమ్మ (వాలు+అమ్మ). వేగురుఁజుక్క (వేగు+చుక్క) సగపాలు (సగము-పాలు), సాఁబాలు (సాము+పాలు), సుంకసరకు (సుంకము+సరకు) ఇత్యాదు లూహ్యంబులు. ఇందు, ఆఁదోఁకేత్యాదులు కొన్నిటియందు వర్ణలోపాగమాదేశ వికారంబులు నిత్యములనియు, అందాఁకేత్యాదులయందు వైకల్పికములనియు నెఱుంగవలయు. వీని కొక్కొక్కటికిఁ బ్రయోగంబులు పెక్కులు గలవు కాని గ్రంథవిస్తరభీతిచే నవి యుదాహరింపఁబడవయ్యెను.

వ్యా. ఆచ్ఛిక సమాసములలోఁ దఱచుగా వర్ణలోపము, వర్ణాగమము, వర్ణాదేశము ననెడు మార్పులు కొన్నిచోట్ల నిత్యముగను, గొన్నిచోట్ల వైకల్పికముగను, బెక్కులు గనఁబడును. ఈ సూత్రము బా. సమాస 20 సూత్రమునకు వివరణము. వీనిలో, ఆఁదోఁక-మున్నగువానియందు వర్ణలోపాగమాదేశములు నిత్యములు. ఆఁదోఁక-అనుచో, ఆవుతోఁక-అనురూపము లేదన్నమాట. "ఆఁదోఁక=ఆవుతోఁకవలె మొదట లావును అవలక్రమక్రమముగా సన్నమునైనయాకృతి." శ.ర. ఈయర్థములో, ఆఁదోఁక-అనియే యుండును. ఆవుతోఁక యని యీయర్థములోఁ గాదని సూత్రకర్తయాంతర్యము. (చూ. అనుబంధము. విషయసంఖ్య-56) అందాఁక, అంతదాఁక-ఇత్యాదిగాఁ గొన్నిచోట్ల వర్ణలోపాదులు వైకల్పికముగా నగును. అచ్చతెల్పు మున్నగువానిలో మువర్ణకలోపము గుర్తింపవలసిన విశేషము. ఈసూత్రము తద్ధితవృత్తికుపలక్షణమని "సమాసంబులన్" అను బహువచన స్వారస్యముచేతను, గొప్పతనము-అను నుదాహరణ స్వారస్యముచేతను గ్రహింపనగును. (చూ. తద్ధిత 3, 12, 13) మిండతపసి-అనుచో, మిండఁడు-అను

పుంలింగతుల్యము, బా. సమాస (5) సూత్రమునకు విలక్షణముగాఁ గర్మధారయమునఁ బూర్వపదమయ్యెను. వ్యాకర్త సూచనననుసరించి యలౌకికవిగ్రహవాక్యములను గల్పించి వర్ణలోపాదుల మూలమున నాయారూపముల ప్రక్రియ యూహ్యము.

విమర్శ:- (i) నాటకసాల-నాటకశాలాశబ్దభవము. (ii) వాలురమ్ము-అపపాఠము. వాలుటమ్ము-సాధువు. పక్షమున-వాలమ్ము. రాఘవ (1-22)

## అలుక్సమాసము

### కొన్నియెడల సప్తమీతత్పురుషమునందు నవర్ణకంబునగు. 37

ఉ: కువలయంబునవారు. భార ఆది. 2ఆ-224. వారణావతమునవారెల్ల. భార. ఆది 6ఆ-148. క. ధరణీ, తలనాథ! పురుషునకు ని,మ్ముల భార్యయపాచుఁ జిత్తమునదుఃఖంబుల్. భార. ఆర. 2ఆ-74 నిజకులంబునవారికెల్ల. హరి. పూ. 1ఆ.క. అనఘయణుహుఁ దేవంశంబునవాఁడు? హరి. పూ. 2ఆ-159 మొ॥ నుశబ్దంబుచేఁ గువలయంబునందలి వారు. మొ॥

వ్యా. కొన్నిచోట్ల సప్తమీ తత్పురుషమునందు నవర్ణకము సహితమగును. కువలయంబునను+వారు = కువలయంబునవారు. వారణావతమునను+వారు = వారణావతమునవారు. చిత్తమునను+దుఃఖంబుల్ = చిత్తమునదుఃఖంబుల్. కులంబునను+వారికి = కులంబున వారికి. వంశంబునను+వాఁడు = వంశంబునవాఁడు. నవర్ణకంబును-అను సముచ్చయార్థక నువర్ణముచే, బా. సంధి44చే, కువలయంబునందలివారు మున్నగు నలుక్సమాసములును నుండును. "అంద్వాదులకలిగాగమంబు సమాసంబునందగు." (బా. సంధి44) అను బాలవ్యాకరణసూత్రముచే-అందువర్ణకముతో సప్తమ్యలుక్సమాసములు సిద్ధించును. ఇట నవర్ణకముతో సహితము సప్తమ్యలుక్సమాసముండునని పూరింపఁబడెనన్నమాట. అలుక్సమాసము = పూర్వపద విభక్తిలోపము రాని సమాసము.

ప్రక్రియ:- "కువలయంబు+నను"+"వా+లు"; "వారణావతము+నను"+"వా+లు"; "వంశంబు+నను"+"వా+డుఙ్"; "కులంబు+నను"+"వా+కు"; "చిత్తము+నను"+"దుఃఖ+లు"-అలౌకిక విగ్రహములు. బా. సమాస25చే-ఉత్తరపదవిభక్తులు లోపించును. పూర్వపదములందలి సప్తమికి ఈ37చే- లోపమురాదు. కావున, "కువలయంబు+నను"+వా; "వారణావతము+నను"+వా; "వంశంబు+నను"+వా; "కులంబు+నను"+వా; "చిత్తంబు+నను"+దుఃఖ-అని నిల్చును. బా. సంధి24చే-ద్రుతలోపము: కువలయంబున+వా; కులంబున+వా; చిత్తంబున+దుఃఖ. బహువచనముచేరి-కువలయంబునవా+లు; వారణావతమునవా+లు-అని నిలుచును. శబ్ద86చే-కువలయంబునవారు; వారణావతమునవారు-అని యేర్పడును. వంశంబునవా-అను ప్రాతిపదికమునకు బా. తత్సమ22చే డుఙ్. వంశంబున వా+డుఙ్. తత్సమ19చే-వంశంబునవాఁడు. కులంబునవా-అనుచో, బా. తత్సమ 6చే-కులంబునవా+కు. తత్సమ8చే-కులంబునవా+కు+ను. తత్సమ31చే-కులంబున వా-ల+కును. ప్రౌఢ. శబ్ద86చే-కులంబునవా-ర+కు+ను. శబ్ద90చే-కులంబునవా+రి+కు+ను. బా. తత్సమ26చే-కులంబున వారికిని. చిత్తమునదుఃఖ-అను ప్రాతిపదికమునకు-లువర్ణకముచేరి-చిత్తమున దుఃఖ+లు. బా. తత్సమ40చే-చిత్తమున దుఃఖ+ము+లు. తత్సమ42చే-చిత్తమున దుఃఖంబులు. ప్రకీర్ణక16చే-చిత్తమున దుఃఖంబుల్. బాలవ్యాకరణముచే- కువలయంబునందలివారు,

వారణావతమునందలివారు, వంశంబునందలివాఁడు. కులంబునందలివారికిని, చిత్తమునందలి దుఃఖంబుల్ - అమరూపములు సిద్ధించును. (చూ. అనుబంధము. విషయసంఖ్య-96)

## లుగలుక్సమాసములు

అట్లు పోలె బలె వలె శబ్దంబు లివార్థకంబులు. ఉపమేయము ప్రథమాంతమగునపు డట్లు పరంబగుచో నుపమానంబులగు నామ తదస్మద్యుష్మదాత్మార్థములకు షష్ఠియు, పోలె బలెలు పరంబులగుచో నామతచ్ఛబ్దార్థములకుఁ బ్రథమయు, నస్మదర్థప్రభృతులకు ద్వితీయయు వలె పరంబగుచో నామతచ్ఛబ్దార్థములకు షష్ఠియు, నస్మదర్థాదులకు షష్ఠీద్వితీయలయుండెదియే నొక్కటియుఁ గ్రమంబుగ నగు. ఉపమేయము ద్వితీయాద్యంతమగునపుడు పోలె ప్రభృతులు పరంబులగుచో నుపమానంబుల కుపమేయ విభక్తులయగు. పోలినయెడఁ దచ్ఛబ్దమే తదాదులకు నుపలక్షణముగా గ్రహించునది. అట్లు కరణ్యాదులకు గ్రాహకము. 38.

ఉ: క్రమముగఁ జూచునది. ఉపమేయము ప్రథమాంతమగునపుడు- నారాయణునట్లు. ఉ. పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నా,రాయణునట్లు. భార. ఆది 1ఆ-24. (ఉదాహరణంబులు కొన్ని కొంతకొంత వ్రాయంబడును గాన వానిని సందేహము దీఱ నాయాగ్రంథములం దక్కడక్కడఁ దుదముట్టఁ జూచు కొనునది.) బకునియట్లు. తే. మనుజ, భక్షణంబు చేసితిరేని బకునియట్లు, చత్తురు. భార. ఆది. 6ఆ-304 ఇట్లు-నలునట్లు. మొ॥ జలధర సమితి యట్లు. భార. అర 2ఆ-110. గజమునట్లు. ఆ.పుత్ర దార బంధు మిత్ర సక్తుఁడు రొంపిఁబడిన గజమునట్ల యెడరునొందు. భార. శాంతి 6ఆ-318 ఇట్లు, వానియట్లు, నాయట్లు, నీయట్లు, తనయట్లు. చంద్రికయుఁ జంద్రుఁడు వోలె (కళా4ఆ-36.) పేదవోలె, అమృతమువోలె. క. అనిపలికెడు చెలి పలుకులు, తన కమృతమువోలె హృదయతాపమునడఁపన్. కళా. 6ఆ-274. పరికాఁడువోలె. భార. ఆది. 4ఆ-206. పాములవాఁడు వోలె. కాశీ 2ఆ-87. నన్నుఁబోలె, నిన్నుఁబోలె. శా. కానీరా యిటువంటి నీతము లనేకంబుల్ నినుంబోలె వి,న్నానేనున్. శశాం. 3ఆ-69. ఇట్లు, తన్నుఁబోలె. మొ॥ రాముఁడు బలె, వేల్పుబలె. కళా 8ఆ-183. తామరపాకు నీరుబలె. ఉ. హరి. 3ఆ-35. గోరుబలె. కళా. 7ఆ-260. ఇట్లు, వాఁడుబలె, నన్నుబలె, నిన్నుబలె. తన్నుబలె. మొ॥ రామునివలె; వానివలె; నావలె; నన్నువలె; నీవలె; నిన్నువలె; తనవలె, తన్నువలె. బహుత్వంబున-బకులయట్లు, చంద్రులువోలె, రాములుబలె, రాములవలె మొ॥ క. పూరు పురూరవులట్లు భ,గీరథ

రఘుపతులయట్లు. భార. అర. 2ఆ—285. ఎ.గీ. పరిభవంబులఁ, బడితి నిట్టినన్నుఁ బాండవుల్ సూచుచు,నుండి రొరులు వోలె నుక్కు దక్కి. భార అర. 1ఆ—136. క. మాయట్లిడుములఁ, బడిన నరులు గలరె యొరులు పరమ మునీంద్రా! భార. అర. 2ఆ—3. వ. మమ్ముంబోలె నొడ్ల నాదరాధిక్యంబున భరంపడి సవిశేషంబుగా నధ్యయనంబు సేయింపకుండుట మాకు వరంబు. భార. శాంతి. 6ఆ—297. ఇత్యాదు లెఱుఁగునది. ఇప్పటికిఁ దగినవి దొరకమింజేసి యిందుఁ గొన్నింటికిం బ్రయోగంబులు వ్రాయఁబడవయ్యె. ద్వితీయాద్యంతమగునపుడు:- ఉ. భీరులఁబోలె నేల వెఱపించెదు మాటల మమ్ము? భార. అర. 6ఆ—182. క. జ్ఞానులచే మౌనులచే, దాసులచే యోగ సంవిధానులచేతన్, బూనిన బద్ధుండగునే, శ్రీనాథుఁడు భక్తియుతులచేతం బోలెన్. భాగ. 10 స్కం. పూ. 390 సీ. ఏ మహాత్ములచేత నీజగత్త్రియము నా,ప్యాయితంబయెనయ్యమృత కరుని, చేఁబోలె. భోజ. 1ఆ—10. చ. వెనుకఁ గ్రమక్రమంబున నవీనముగా నుదయంబునొందెఁ బెం,పొనర నృపాల! యీతనికి నుత్తమమధ్యమ వృద్ధ ధర్మ ద,ర్శనమున ద్రవ్యకర్మగుణజాతి విశేషవివేచనంబు బా,లునకును బోలె మానసములో నిఖిల వ్యవహారహేతువై. కళా. 8ఆ—180 నీవుననుంబలె నౌర వీరలన్, వేడుకఁ జూతువో. కళా 6—131. దేవరకుంబలె నవ్వధూటికిన్, దొత్తగుచుం బనుల్ సలుపుదున్. కళా. 4ఆ—118. ఇట్లితరంబు లూహ్యంబులు.

వ్యా. లుగలుక్సమాసము=పూర్వపద విభక్తులు కొన్నియెడల లోపించుటయుఁ గొన్ని యెడల లోపింపకయు నేర్పడు సమాసములు లుగలుక్ సమాసములు. లుక్=విభక్తి లోపము, అలుక్=విభక్తి లోపింపకుండుట. ఈరెండును గల సమాసములు లుగలుక్ సమాసము లన్నమాట. ఇవార్థకాదులతోడి సమాసములు లుగలుక్ సమాసములు. ఉదా. నారాయణునట్లు. ఇట విభక్తి లోపించినది. (నారాయణు యొక్క+అట్లు) పరికాఁడువోలె. ఇట విభక్తి (డుబ్బు) లోపింప లేదు. కావున ఇవార్థకాదులతోడి సమాసములు లుగలుక్ సమాసము లనఁబడును. అట్లు, పోలె, బలె, వలె—అనునవి యివార్థకములు. ఇవ—అను సంస్కృతశబ్దముయొక్క యర్థముగలవి గాన నివార్థకములు.

విమర్శ:- లుగలుక్సమాస వ్యవహారము సరికాదు. ఇట్టి సమాస భేదముండనేరదు. సంస్కృతమునందు వవీలెనిని గెవల సమాసములనవలెను. తత్పురుషాది సంజ్ఞలువీనికి వర్తిల్లవు. (చూ. అనుబంధము. విషయసంఖ్య—97)

1. (i) ఉపమేయము ప్రథమాంతమగునపుడు, అట్లు—పరమగుచో, నుపమాన ములగు, నామతదస్మద్యుష్మదాత్మార్థములకు=(నామ+తద్+అస్మద్+యుష్మద్+ఆత్మార్థ)= నామార్థము, తదర్థము (ఆ) అస్మదర్థము (నా) యుష్మదర్థము (నీ) ఆత్మార్థము (తా) ననువానికి, షష్ఠియగును. (i) ఉపమేయము ప్రథమాంతమగునపుడు, అట్లు—పరమగుచో నుపమానమగు నామార్థమునకు షష్ఠియగుటకు:- నారాయణునట్లు...నారాయణభట్టు... తోడయినిర్వహింపఁగన్. ఇట, ఉపమేయమగు నారాయణభట్టు—ప్రథమాంతమై యున్నది.

అట్లు-పరమైయుండఁగా, నుపమానము, నామార్థమునగు నారాయణశబ్దమునకు షష్ఠియయినది. నారాయణునియొక్క+అట్లు= నారాయణునట్లు. రక్కసులు...బకునియట్లు చత్తురు. ఇట, రక్కసులు-అను నుపమేయము ప్రథమాంతమైయున్నది. అట్లు-పరమైయుండుగా, నుపమానము, నామార్థమునగు, బక శబ్దమునకు, షష్ఠి: బకునియొక్క+అట్లు=బకునియట్లు. నలునట్లునిర్దయులై యరిగిన వారొరులెవ్వరులేరు. (ఆరణ్య 2-207.) ఒరులు-అను నుపమేయము ప్రథమాంతమైయున్నది. అట్లు-పరమైయుండఁగా, నుపమానము, నామార్థమునగు, నల శబ్దమునకు, షష్ఠి: నలుయొక్క+అట్లు=నలునట్లు. ఏతెంచె గజయూథములు... జలధరసమితియట్లు. గజయూథములు-అను నుపమేయము ప్రథమాంతమైయున్నది. అట్లు-పరమైయుండఁగా, నుపమానము, నామార్థమునగు జలధరసమితి శబ్దమునకు, షష్ఠి: జలధరసమితియొక్క+అట్లు=జలధరసమితి యట్లు. పుత్రదారబంధుమిత్ర సక్తుఁడు రొంపిఁబడిన గజమునట్ల యెదరునందు. ఇట, పుత్రదారబంధుమిత్రసక్తుఁడు-అను నుపమేయము ప్రథమాంతమై యున్నది. అట్లు-పరమై యుండఁగా, నుపమానము, నామార్థము నగు, గజశబ్దమునకు, షష్ఠి: గజముయొక్క+అట్లు= గజమునట్లు. (ii) ఉపమేయము ప్రథమాంతమగునపుడు, అట్లు పరమగుచో నుపమానమగు తదర్థమునకు షష్ఠి యగుటకు:- వానియొక్క+అట్లు=వానియట్లు. (iii) అస్మదర్థమునకు:- నాయొక్క+ అట్లు= నాయట్లు. (iv) యుష్మదర్థమునకు:- నీయొక్క+అట్లు=నీయట్లు (v) ఆత్మార్థమునకు:- తనయొక్క+అట్లు=తనయట్లు.

(2) (i) పోలె బలెలు పరములగునపుడు, నామతచ్ఛబ్దార్థములకున్=ఉపమానమగు నామార్థమునకుఁ దచ్ఛబ్దార్థమునకుఁ బ్రథమ యగును. ఉపమేయము ప్రథమాంతమై యుండుటయు నిట ననువర్తించును. ఎట్లనగా-ఉపమేయము ప్రథమాంతమగునపుడు పోలెబలెలు పరమగుచో నుపమానమగు నామార్థమునకుఁ బ్రథమయగుటకు:- లక్ష్మియును దాను... చంద్రికయుఁ జంద్రుండువోలె. ఇట, లక్ష్మి, తాను-అను నుపమేయములు ప్రథమాంతములై యున్నవి. పోలె-పరమగుచో నుపమానములగు చంద్రిక, చంద్రుండు-అను నామార్థములకుఁ బ్రథమమైనది. ఇటఁ దుది యుపమానముమీఁదనే, పోలె-చేరినది. చూ. 40 సూ. పేదవోలె-అనుచో, నుపమానము, నామార్థమునగు పేదశబ్దమునకుఁ బ్రథమ యైనది. చెలిపలుకులు తన కమృతము వోలె. పలుకులు-అను నుపమేయము ప్రథమాంతమై యున్నది. పోలె-పరమై యుండఁగా నుపమానము, నామార్థమునగు, అమృతశబ్దమునకుఁ బ్రథమ యైనది. అమృతము+పోలె=అమృతమువోలె. క్రమ్మఱించిన పరికాఁడువోలెఁ గురుసింహ వరూథము నిట్లు గ్రమ్మఱించునె యితఁడంచునుం దగిలి. ఇట, నుపమేయమగు, ఇతఁడు- ప్రథమాంతమై యున్నది. పోలె-పరమగుచో, ఉపమానము, నామార్థమునగు "పరికా" శబ్దము పరికాఁడు-అని ప్రథమాంతమై యున్నది. పరికాఁడు+పోలె=పరికాఁడువోలె. రాముఁడుబలె. ఇట, బలె-పరమగుచో నుపమానము నామార్థమునగు, రామశబ్దమునకుఁ బ్రథమ యయినది. (రాముఁడు-ప్రథమ) మణిహారమును వేల్పుబలె భక్తిఁ బూజించి, ఇట, మణిహారము-అను నుపమేయము ప్రథమాంతమై యున్నది. బలె-పరమగుచో నుపమానమగు వేల్పు శబ్దమునకుఁ బ్రథమయైనది. (వేల్పు+బలె=వేల్పుబలె) తామరపాకు నీరుబలెఁ దల్లడమందిరి పౌరులందఱున్. పౌరులు-అను నుపమేయము ప్రథమాంతమై యున్నది. బలె-పరమగుచో, నుపమానము నామార్థమునగు నీరుశబ్దమునకుఁ బ్రథమయైనది. (నీరు+బలె=నీరుబలె) గోరఁబోవుపనికి గొడ్డలియును దాన, సలుపుపనికి. గోరుబలె. గొడ్డలి-అను నుపమేయము ప్రథమాంతముగ నున్నది. బలె-పరమగుచో నుపమానము, నామార్థము, నగు గోరుశబ్దమునకుఁ బ్రథమయయినది. (గోరు+బలె) ఉపమేయము ప్రథమాంతమగునపుడు, పోలె బలెలు పరమగుచో, తచ్ఛబ్దార్థమునకుఁ బ్రథమయగుటకు:-

పాములవాఁడు వోలె, వాఁడుబలె. పోలె, బలెలు పరమగుచో, వాఁడు—అని తచ్ఛబ్దార్థము ప్రథమాంతమైనది.

(ii) అస్మదర్థప్రభృతులకు ద్వితీయ యగును. అనఁగా, ఉపమేయము ప్రథమాంత మగునపుడు, పోలె బలెలు పరమగుచో నుపమానములగు, అస్మదర్థప్రభృతులకున్=అస్మద ర్థము మొదలగువానికి, అనఁగా, అస్మద్యుష్మదాత్మార్థములకు (నా,నీ, తా శబ్దములకు) ద్వితీయా విభక్తియగును. అస్మదర్థమునకు ద్వితీయ యగుటకు:— నన్నుఁబోలె, నన్నుబలె. యుష్మదర్థమునకు ద్వితీయగుటకు:— నిన్నుఁబోలె; నినుంబోలె విన్నానేమన్. ఇట. ఏను—అను నుపమేయము ప్రథమాంతమై యున్నది. పోలె, పరమగుచో, "నీ" శబ్దమునకు ద్వితీయయయినది. నిన్నుబలె. ఇట, బలెపరమగుచో ద్వితీయ యయినది. ఆత్మార్థకమునకు ద్వితీయ:— తన్నుఁబోలె, తన్నుబలె. ఇట తా— అను, నాత్మార్థకమునకు పోలె బలెలు పరమగుచో ద్వితీయయయినది.

3 (i) వలె పరంబగుచో నామతచ్ఛబ్దార్థములకు షష్ఠియగును. అనఁగా, ఉపమే యము ప్రథమాంతమగునపుడు, వలె—పరమగుచో, నుపమానములగు నామార్థములకు, తదర్థములకు, షష్ఠియగును. నామార్థములకు, వలె—పరమగుచో, షష్ఠియగుటకు:— రామునియొక్క+వలె=రామునివలె. తచ్ఛబ్దమునకు, వలె—పరమగుచో, షష్ఠియగుటకు:— వానియొక్క+వలె=వానివలె.

(ii) అస్మదర్థాదులకు షష్ఠీద్వితీయలయం దేదియే నొక్కటి యగును. అనఁగా, ఉపమేయము, ప్రథమాంతమగునపుడు, వలె—పరమగుచో, నుపమానములగు, అస్మద ర్థాదులకున్=అస్మద్యుష్మదాత్మార్థములకు, (=నా—నీ—తా శబ్దములకు) షష్ఠీద్వితీయలలో నొకటి యగును. అస్మదర్థమునకు, వలె—పరమగుచో ద్వితీయా షష్ఠులగుటకు:— నన్నును+వలె=నన్నువలె; నాయొక్క+వలె=నావలె. యుష్మదర్థమునకు, వలె—పరమగుచో ద్వితీయా షష్ఠులగుటకు:— నిన్నును వలె=నిన్నువలె; నీయొక్క+వలె=నీవలె. ఆత్మా ర్థమునకు, వలె—పరమగుచో ద్వితీయా షష్ఠులగుటకు:— తన్నును+వలె=తన్నువలె; తనయొక్క+వలె=తనవలె.

పై నియమములు బహుత్వమునందు సహితమిట్లే యగును. (i) అట్లు పరమగు నపుడు బహుత్వమున, నామార్థమునకు, షష్ఠియగుటకు:— బకులయొక్క+అట్లు=బకులయట్లు. పూరు పురూరవులట్లు భ, గీరథరఘుపతులయట్లు ... ధారుణి రక్షింపుము...ధర్మత నూజా. ధర్మతనూజా—అను నుపమేయము సంబోధన ప్రథమాంతము. అట్లు పరమగుచుండఁగా, నుపమానములగు, నామార్థములకు షష్ఠి: పూరు పురూరవులయొక్క+ అట్లు=పూరు పురూరవులట్లు; భగీరథ రఘుపతులయొక్క+అట్లు=భగీరథరఘుపతుల యట్లు. అట్లు—పరమగుచుండఁగా, నుపమానమగు, నస్మదర్థమునకు, బహుత్వమున, షష్ఠియగుటకు:— మాయట్లీడుమలఁ బడిన నరులు గలరె యొరులు. ఒరులు—అనునుపమేయము, ప్రథమాంతమై యున్నది. అట్లు పరమగుచో; ఉపమానమగు నస్మదర్థకమునకు షష్ఠి: మాయొక్క+అట్లు= మాయట్లు. (2)—(i) పోలె—పరమగునపుడు బహుత్వమున నుపమానమగు నామార్థమునకుఁ బ్రథమయగుటకు:— పాండవుల్ సూచుచు, నుండి రొరులు వోలె. పాండవుల్—అను నుపమేయము ప్రథమాంతమైయున్నది. ఒరులు+పోలె, అనుచో; పోలె—పరమగు చుండఁగా బహుత్వమున నుపమానమగు నామార్థమునకుఁ బ్రథమయయినది. (ii) అస్మదర్థమునకు: పోలె పరమగుచో బహుత్వమున ద్వితీయ యగుటకు:— సుమంతు ప్రభృతులు నలువురు...మమ్ముంబోలె. ఇట, నుపమేయమగు, సుమంతు ప్రభృతులు—ప్రథమాంతము. మమ్మును+పోలె=మమ్ముం బోలె—అనుచో, పోలెపరమగునపుడు బహుత్వమున నస్మదర్థకమునకు ద్వితీయ యైనది.

తక్కిన రూపములకుఁ దగిన ప్రయోగములు లభింపలేదని వ్యాకర్త తెలిపెను. ఏకత్వమున గ్రాహ్యములగు లక్షణములు బహుత్వమునందును గ్రాహ్యములగుననుట నిర్బాధము.

(4) ఉపమేయము, ద్వితీయాద్యంతమగునపుడు=ద్వితీయాది విభక్త్యంతమందు గలది యైనప్పుడు, పోలెప్రభృతులు= పోలె, బలె, వలె, శబ్దములు, పరమగునపుడు, ఉపమానముల కుపమేయ విభక్తులే యగును. పోలె బలె వలె శబ్దములు పరమగునపుడుపమేయమున కగు ద్వితీయాదివిభక్తులే యుపమానముల కగునని భావము. (i) పోలెకు: భీరులఁబోలె నేలవెలిపించెదు మాటల మమ్ము? ఇట, మమ్మున్–అను నుపమేయము ద్వితీయాంత మగుటచే, పోలెపరమగుచో నుపమానమునకు భీరులను–అని ద్వితీయయే కలిగెను. భీరు లను+పోలె= భీరులఁబోలె. జ్ఞానులచే మౌనులచే...బద్ధుండగునే – భక్తి యుతులంచేతం బోలెన్. ఇట జ్ఞానులచే– మున్నగు నుపమేయములు తృతీయాంతములై యున్నవి. కాన, నుపమానమునకు, పోలె–పరమగుచో, భక్తియుతులచేతను–అని తృతీయయే కలిగెను. భక్తియుతులచేతను+పోలెన్=భక్తియుతులచేతంబోలెన్. ఏమహాత్ములచేత నీజగత్త్రియము నాప్యాయితంబయ్యె నయ్యమృతకరుని–చేఁబోలె–అనుచో, మహాత్ములచేత–అని యుపమే యము తృతీయాంతమై యున్నది. కాన, అమృతకరునిచేఁ బోలె–అనిపోలెపరమగుచో నుపమానమునకుఁ దృతీయయే యయినది. ఉదయంబునొందె ... ఈతనికి – వివేచనంబు బాలునకును బోలె. ఇట, ఈతనికి అను నుపమేయము షష్ఠ్యంతమై యున్నది. కాన, పోలె–పరమగుచో, బాలునకును–అని యుపమానమునకు షష్ఠియయినది. బాలునకును+పోలె=బాలునకునుబోలె. (ii) బలెకు:– ననుంబలె–వీరలన్ వేడుకఁ జూతువో. వీరలన్–అను నుపమేయము ద్వితీయాంతము. కాన నస్మదర్థమునకు బలె పరమగుచో ద్వితీయయే యయినది. నను+బలె=ననుంబలె. దేవరకుంబలె నవ్వధూటికిన్ ... పనుల్ సలుపుదున్. ఉపమేయము, వధూటికిన్–అని షష్ఠ్యంతమైయున్నది. కాన నుపమానమునకు, బలె పరమగుచో దేవరకును–అని షష్ఠియే యయినది. దేవరకును+బలె=దేవరకుంబలె. ఇట్లే తక్కినవి యూహింపఁ దగునని తెలుపఁబడెను.

(5) పోలినయెడన్=పోలిక యున్నచోట, తచ్ఛబ్దము=ఆశబ్దము, ఏతదాదులకును=ఏత దర్థము(ఈ–శబ్దము) లోనగువానికి, ఉపలక్షణముగా=సూచకముగాగ్రహింపవలెను. అనఁగా, తచ్ఛబ్దమునకు ఇవార్థకములు పరమగుచో నగు కార్యములే ఏతచ్ఛబ్దము లోనగువాని కగునని భావము. (i) అట్లు పరమగుచో తచ్ఛబ్దమునకువలె ఏతచ్ఛబ్దమునకు షష్ఠి: వీనియొక్క+అట్లు=వీనియట్లు (ii) పోలె బలెలు పరమగుచో, తచ్ఛబ్దార్థమునకు వలె, ఏతచ్ఛబ్దమునకును ప్రథమ: వీఁడువోలె, వీఁడుబలె. (iii) వలె, పరమగుచో, తచ్ఛబ్దమునకువలె, ఏతచ్ఛబ్దమునకును షష్ఠియగును: వీనియొక్క+వలె=వీనివలె.

(6) అట్లు కరణ్యాదులకు గ్రాహకము. అనగా, అట్లు–అనునది, పరమగునప్పటి కార్యములే కరణిమున్నగునవి పరమగునపుడగునని భావము. నారాయణుకరణి ఇత్యాది.

## ప్రథమాంతముల మీఁది పోలె బలె పోని శబ్దంబులు ద్రుతపూర్వ కంబులు విభాషనగు. 39

ఉ: సమిద్ధ హవ్యవహుఁడుం బోలెన్. హరి. ఉ. 10ఆ. తిండికాడునుఁబోలె. భార. స్త్రీ. 1ఆ–19. నిధిఁగన్న పేదయుఁ బోలె. భార. ఆది. 4ఆ–167. అగ్నియుఁబోలె. భార. ఆది. 2ఆ–60. తగరునుబోలె. నిర్వ 4ఆ–55. బూడిదపండును బోలె. పాండు 5ఆ–14. అమృతధారాపాతంబును బోలె.

భార. అర. 2ఆ-15. తే. అనిన వినియేమి చెప్పఁగ నచటనున్న, వారలెల్లఁ జిత్తరువున వ్రాసినట్టి, ప్రతిమలును బోలె నతినిశ్చలత నొకింత, తడవు గనుపట్టి రత్యద్భుతంబు నొంది. కళా 5ఆ-5. పవడంబుఁ జుట్టలుఁగుఁ జిందమునుం బలె. య. 5ఆ-30. ఉ. మత్తత విప్రయోగిజన మర్దనుఁడైన ప్రసూనధన్వికేం, గత్తులొసంగినట్టి జనఘాతుక! మాధవ నామధేయము,త్యుత్తమ మేగతిం గలిగె నో కద! నీకు సుధాఖ్య గారకున్, హత్తినలీల రక్కసుల కంచిత పుణ్యజనాఖ్యయుం బలెన్. శశాం. 4ఆ-91. భూషణవిశేషములుం బలె. కళా. 3ఆ-8. ఇత్యాదు లెఱుంగునది.

వ్యా. ప్రథమావిభక్త్యంతముల మీఁది, పోలె, బలె, పోని శబ్దములు, ద్రుతపూర్వకంబులు = ద్రుతముముందుగాఁ గలవి, విభాష నగును. లక్ష్యములనుబట్టి యిట సముచ్చయాద్యర్థకమగు "ను" అను నవ్యయాత్మకద్రుతమగునని గ్రహింపవలెను. (శబ్ద116) హవ్యవహుఁడు+పోలె. హవ్యవహుఁడు-ప్రథమాంతము. పోలె-పరమగు చుండుటచే, నుశబ్దము: హవ్యవహుఁడును+పోలెన్=హవ్యవహుఁడుంబోలెన్. ఇట్లే తిండికాఁడునుబోలె, తగరునుబోలె, బూడిదపండునుబోలె, అమృతధారాపాతం బునుబోలె, ప్రతిమలునుబోలె, భూషణవిశేషములుం బలె-అనునవి. అలుఁగుఁజిందమునుంబలె-అనుచో, చిందము+ను, అనియుండఁగా, బా. సంధి21చే-చిందము+ను+ను. చిందమునును+బలె = చిందమునుంబలె-అగును. పేర+పోలె=పేర+ను+పోలె. అనుదంతములగు కళలపై, నుశబ్దము యువర్ణపూర్వమగును గాన, పేర+యును+పోలె=పేరయుఁబోలె-అగును. ఇట్లే అగ్నియుఁబోలె, పుణ్యజనాఖ్యయుంబలెన్, అనునవి. పోనికి:- చూ. 43సూ. ఈసూత్రమునందలి విభాషను వ్యవస్థిత విభాష యననగును. డువర్ణకమునకు, పోనిపరమగుచో ద్రుతమునిత్యమన్నవ్యవస్థ 43 సూత్రమునఁ జేయఁబడినది.

కొన్నియెడల నుపమానంబులు పెక్కులగుచో నివి కడదాని కొక్కటిగ చూపట్టెడి. 40

ఉ: ఎ.గీ. కమలషండంబు నాగలోకంబు దలిరుఁ, బాన్పు కల్పాంతమున జముబానసంబు, నింటిలోపలవోలె, నిర్వ. 4ఆ-61 వీంద్రును వాంద్రునుబలె. ప్రభా. 1ఆ-7. మొ॥

వ్యా. కొన్నిచోట్ల, నుపమానము లనేకమున్నప్పుడు, ఇవి=ఇవార్థకములు, చివరి యుపమానమున కొక్కదానికే కనఁబడును. కమలషండంబు, నాగలోకంబు, తలిరుఁ బాన్పు, కల్పాంతమున జముబానసంబు నింటిలోపలవోలె-అనుచో, నాల్గుపమానముల చివరఁజేర్పవలసిన, పోలె శబ్దము, చివరి యుపమానమున కొక్కదానికే చేర్పఁబడినది. (i) కమలషండంబువోలె, (ii) నాగలోకంబువోలె, (iii) తలిరుఁబాన్పువోలె (iv) కల్పాంతమున జముబానసంబు నింటిలోపలవోలె-అని నాలుగుచోట్ల, పోలెశబ్దముండవలెను. కాని యొక్క తుదియుపమానమునకే పోలెశబ్దము చేర్పఁబడి యున్నది. వాంద్రునువీంద్రునుబలె. ఇట, వాంద్రునుబలె, వీంద్రునుబలె - అని యుపమానములు రెండింటికిఁ జివరఁ జేర్పవలసిన, బలె శబ్ద మొక్క చివరియుపమానమునకే చేర్పఁ బడియున్నది. (అనుబంధము. విషయసంఖ్య-98)

**పోలె ప్రభృతులు తఱచుగఁ బ్రథమాది విభక్త్యంతనామం బులకంటెను, తాదర్థ్యార్థక క్రియలకంటెను పరంబు లయి యుత్ప్రేక్షా ద్యోతకంబులగు. 41**

ఉ: ఎ.గీ. గచ్చుచమరిన దారు చక్రంపుబిళ్ల, వోలె. స్వా 5ఆ–40 (ప్రకారాంతము–బిళ్లయో యన. ఇట్లంతట నెఱుంగునది.) వ. శోకత ప్తంబయిన తన హృదయంబు దడుపుచున్నదియుం బోలె. భార. అర. 2ఆ–208. ధవుఁగూర్మిఁ గొసరుచున్నవి వోలె. స్వా. 5ఆ–40 క. దినదినమునకుఁ గృశించెను, గనుకనియును ద్రపయు నిరవకాశతఁ బోలెన్. కళా. 7ఆ–158. సీ తనుఁబాసి శశిదవ్వుచనిన నెవ్వగఁబోలెఁ, దొలిదిక్కు జవరాలు వెలుకఁబాఱె. స్వా. 5ఆ–40 గారయిచ్చుటకును బోలె. స్వా. 6ఆ–107. తే. కలయ జగమునఁ గలయట్టి నలుపులెల్లఁ, దెలుపులుగఁజేసి నీడలు తెలుపు సేయఁ,గా వశముగామిఁ బొడముదుఃఖమునఁ బోలె, సాంద్రచంద్రిక తుహినబాష్పములు గురిసె. స్వా. 3ఆ–27. పయఁటకొంగది మాన్పఁగఁ బోలెఁ గాళ్లపైఁ, బ్రబ్బికొనన్. కళా. 8ఆ–140. సాహసపుటగ్గలికం బలె. చంద్ర. ఇట్టితరంబు లెఱుంగునది.

వ్యా. పోలె–మున్నగునవి, తఱచుగా, ప్రథమాది విభక్త్యంత నామంబుల కంటెను=ప్రథమ, మున్నగు, విభక్తులంతమునఁ గలిగిన, సుబంతములకంటెను, తాదర్థ్య+అర్థక=తదర్థమను నర్థముగలిగిన, అనగా–దానికొఱకు, అనునర్థము గలిగిన క్రియలకంటెను, పరములై, ఉత్ప్రేక్షార్థమును ద్యోతకము చేయును. (i) ప్రథమాది విభక్త్యంతముల మీఁది పోలె శబ్దముత్ప్రేక్షాద్యోతకమగుటకు:– (1) ప్రథమకు:– బిళ్లవోలె=బిళ్లయోయన. బిళ్ల–ప్రథమాంతము. ఇట్లే తడుపుచున్నదియుం బోలె=తడుపుచున్నదియో యన. కొసరుచున్నవివోలె=కొసరుచున్నవో యన. (ii) తృతీయార్థక ద్వితీయకు:– నిరవకాశతఁబోలెన్=నిరవకాశతనో యన(=నిరవకాశతచేతనోయన) నెవ్వగఁబోలె=నెవ్వగనోయన–(=నెవ్వగచేతనో యన) చతుర్థ్యర్థక షష్ఠికి:– గారయిచ్చుటకును బోలె=గారయిచ్చుటకో యన (=గారయిచ్చుట కొఱకో యన) తృతీయార్థక సప్తమికి:– దుఃఖమునఁ బోలె=దుఃఖముననో యన. (=దుఃఖముచేతనో యన) తృతీయార్థక ద్వితీయమీఁది బలెశబ్దమునకు:– అగ్గలికంబలె=అగ్గలికనో యన(=అగ్గలిక చేతనో యన) తాదర్థ్యార్థక క్రియకు:– మాన్పఁగఁబోలె=మాన్పఁగనో యన(మాన్పుటకొఱకో యనుట) ఇట్లే తక్కిన యివార్థముల విషయమునను గ్రహింపవలెనని సూచితము. (చూ. అనుబంధము – విషయసంఖ్య – 130)

విమర్శ:– తడుపుచున్నది, కొసరుచున్నవి–క్రియాపదములు.

**మఱి యవి కొన్నియెడల నామంబుల ప్రథమాది విభక్తులు కొన్నింటికిఁ బరంబులై తథార్థంబు లయ్యెడి. 42**

ఉ: ఇపుడువోలె, కళా. 7 ఆ–21. మున్నువోలె. కళా. 2ఆ. ఎప్పుడుబలె. కళా. 7ఆ–205. ఆ. మథనసమయ ఘూర్ణమానాబ్ధిఁ

బోలెఁ బెన్, గ్రోఁత లడర. కళా. 6ఆ–4. వ. శరధితరఁగల మీఁదనుం బోలె. స్వా. 3ఆ. 28. ఇత్యాదు లూహ్యంబులు.

వ్యా. మఱి, అవి=ఇవార్థకములు, (పోలె మున్నగునవి) కొన్నిచోట్ల, నామముల ప్రథమాది విభక్తులకుఁ గొన్నింటికిఁ బరములై, తథార్థంబులు=తథా శబ్దము యొక్క యర్థముగలవి యగును. తథా=అట్లు. ఇది ప్రకారార్థక మన్నమాట. ఇపుడువోలె=ఇప్పటి యట్లు. మున్నువోలె=మునుపటియట్లు. ఎప్పుడుబలె=ఎప్పటియట్లు. అబ్ధిఁబోలె=అబ్ధియట్లు. శరధి తరఁగలమీఁదనుం బోలె=శరధితరఁగలమీఁద నెట్లో యట్లు. (=శరధితరఁగల మీఁద గిఱికొనునట్లు) తక్కిన యివార్థకముల విషయము నిట్లే యూహింపఁ దగునని సూచితము.

అట్టి పోని బోఁటి వంటి శబ్దంబులు వదర్థకంబులు. బోఁటి తనంతఁ బ్రత్యయార్థంబునగు. అట్టి ప్రభృతులు పరంబులగుచో నట్లు ప్రభృతి పరక నామాదులకుం బలెఁ బూర్వపదంబులకు విభక్తులు త్రివిధంబులం బరఁగు. అందు బోఁటి వంటులు సమానంబులు. అవి పరంబులగుచో నాత్మార్థమునకు నామతచ్ఛబ్దంబులకుంబోలెఁ గార్యంబు. పోనిపరంబగుచో డువర్ణకంబు మీఁద ద్రుతంబు నిత్యంబు. 43

ఉ: రామునియట్టి, వానియట్టి, నాయట్టి, నీయట్టి, తనయట్టి, నీయట్టి పుణ్యాత్ముకుల్, గలరే? భాగ. 10 స్కం.పూ. 1736. వ. రెండవ మన్మథుండునుం బోని వాని. భార. అర. 2ఆ 33. సురకన్యవోని సురకన్యయుఁ బోని. అవనినాథుఁడు, గనియెను సురకన్యవోని కన్నియ. భార. ఆది. 4ఆ. 169. దేవివోని దేవియుఁబోని. ఎ.గీ. వరుణేంద్రు దేవియుఁ, బోనిదాని దేవయానిఁ గనియె. భార. ఆది. 3ఆ–140. 'నికుంజంబువోని, నికుంజంబును బోని. కనకశైల నికుంజం, బునుబోని. భార. ఆది. 6ఆ–300. పిడుగులువోని, పిడుగులుంబోని. ఘోరపుం, బిడుగులువోని తూపులు. కళా 8 ఆ 59. నన్నుంబోని, నిన్నుఁబోని, తన్నుఁబోని' మొ॥ 'రామునిబోఁటి, వానిబోఁటి, తనబోఁటి, నాబోఁటి, నన్నుబోఁటి, నీబోఁటి, నిన్నుబోఁటి'. మొ॥ క. వీఁడెల్లబోఁటి బాలుఁడు, గాఁడు. హరి. పూ. 5ఆ 149. ఇట్టి నా, బోఁటి భీతుని నీకుఁ దోడనఁ బోలునే? రా. అర. కాం. 2ఆ–8. నినుబోంట్లను నమ్మిక యే, నునుప్రతికెద. భార. శాంతి 3ఆ–241. ఇట్లు, మాబోంట్లు, మముబోంట్లు; మీబోంట్లు, మిముబోంట్లు. మొ॥ ఉ: బోటుఁదనాలుచన్నె మిముబోంట్లకుఁ దక్కిన వారికిన్ బలెన్. కళా. 7ఆ–221 రామునివంటి, వానివంటి, తనవంటి, నావంటి, ననువంటి, నీవంటి, నినువంటి. మొ॥ దేవా! దేవరవంటి నీదు కరుణాదృష్టిన్. వి.పు. 7 ఆ–382. కార్చిచ్చువంటి శాపంబు. భార. ఆది. 2ఆ–180 పెనునిట్ట తాటివంటి, గుదియ. జై.

2ఆ–41. నీవంటి ఘనుఁడు. వి. పు. 2ఆ–305. నినువంటి నీతిపరులున్. శశాం. 3ఆ–69. నిన్నువంటి పుణ్యనిరతుండు. వి. పు 4ఆ–337 ఇట్లు, మావంటి, మమువంటి; మీవంటి, మిమువంటి–యిత్యాదులు గ్రాహ్యంబులు. క. నావుడు మునియిట్లను వ,త్సా విను మావంటి తైర్థికావళికెల్లన్. మీవంటి గృహస్థుల సుఖ, జీవనమునఁగాదె తీర్థసేవయుఁ దలఁపన్. స్కా. 1ఆ–65. ఎ.గీ. నాకు మిమ్ముువంటి లోకోత్తరుల కియ్యఁ, గలిగె నింతకంటె ఘనతగలదె? వి.పు. 7ఆ–386. ఇతరంబులు ప్రయోగంబుల నెఱుంగునది.

ఇది సమాసపరిచ్ఛేదము

వ్యా. అట్టి, పోని, బోఁటి, వంటి–అను శబ్దములు వదర్థకములు. వత్–అను సంస్కృతశబ్దముయొక్క యర్థముగలవి గాన నివి వదర్థకములనఁబడును. (వత్+అర్థక) బోఁటి–అనునది, తనంతన్=స్వయముగా, ప్రత్యయార్హంబున్=ప్రత్యయములు చేరఁదగినదియు, నగును. అనఁగా, బోఁటిశబ్దము మీఁద విభక్తిప్రత్యయములును జేరనగు నన్నమాట. ఉదా॥ మాబోంట్లు, మమ్ముబోంట్లు, మీబోంట్లు, మిముబోంట్లు, మిముబోంట్లకు, నినుబోంట్లను, ఇత్యాది.

ఈవదర్థకములు చేరునప్పటి విశేషములను గ్రిందిరీతిని గ్రహింపనగును.

(1) అట్టి ప్రభృతులు పరములగునపుడు అట్లు ప్రభృతి పరక నామాదులకుం బలె=అట్లు మున్నగునవి అనఁగా, అట్లు పోలె బలె వలె శబ్దములు పరముగాఁ గలిగిన నామార్థము, తదర్థము, అస్మదర్థము, యుష్మదర్థము, ఆత్మార్థము ననువానికి వలె (చూ38) పూర్వపదములకు విభక్తులు మూఁడువిధములుగా నగును.

(i) అట్లుపరమగునప్పటివలె, అట్టి ప్రభృతులు పరమగునపుడును నామాదులకు షష్ఠియగును. నామార్థమునకు షష్ఠి:– రామునియొక్క+అట్టి=రామునియట్టి. తదర్థమునకు షష్ఠి:– వానియొక్క+అట్టి= వానియట్టి. అస్మదర్థమునకు షష్ఠి: నాయొక్క+అట్టి=నా యట్టి. యుష్మదర్థమునకు షష్ఠి: నీయొక్క+అట్టి=నీయట్టి. ఆత్మార్థమునకు షష్ఠి: తనయొక్క+అట్టి=తనయట్టి.

(ii) పోలె బలెలు పరమగునప్పటి వలె, అట్టి ప్రభృతులు (=అట్టి,పోని,బోఁటి, వంటి) పరమగుచో నామ తచ్ఛబ్దార్థములకుఁ బ్రథమ యగును. అస్మద్యుష్మదాత్మా ర్థములకు ద్వితీయయగును. నామార్థమునకుఁ బ్రథమ:– రెండవ మన్మథుండునుం బోనివాని; సురకన్యవోని, సురకన్యయుఁ బోని; దేవివోని, దేవియుఁబోని; నికుంజంబువోని, నికుంజంబునుబోని; పిడుగులువోని, పిడుగులుంబోని. ఇట, మన్మథుండు, సురకన్య, దేవి, నికుంజంబు, పిడుగులు–అను నామార్థములు ప్రథమాంతములై యున్నవి. అస్మదాదులకు ద్వితీయయగుటకు:– నన్నుఁ బోని (అస్మదర్థకము) నిన్నుఁబోని (యుష్మదర్థకము) తన్నుఁబోని (ఆత్మార్థకము)

(iii) వలె–పరమగునప్పటివలె అట్టి ప్రభృతులుపరమగుచో నామ తచ్ఛబ్దార్థములకు షష్ఠియగును. అస్మదర్థాదులకు షష్ఠీ ద్వితీయలలో నొకటి యగును. నామార్థమున కుషష్ఠి: రామునియొక్క+బోఁటి= రామునిబోఁటి; రామునియొక్క+వంటి=రామునివంటి, దేవరయొక్క+వంటి=దేవరవంటి. కార్చిచ్చుయొక్క+ వంటి=కార్చిచ్చువంటి. తాటి యొక్క+వంటి=తాటివంటి. తచ్ఛబ్దమునకుషష్ఠి: వానియొక్క+బోఁటి= వానిబోఁటి;

వానియొక్క+వంటి=వానివంటి. అస్మదర్థమునకు షష్ఠీద్వితీయలు:– నాయొక్క+బోఁటి= నాబోఁటి; నన్నును+బోఁటి=నన్నుబోఁటి; నాయొక్క+వంటి=నావంటి; నను+వంటి=న నువంటి; మాయొక్క+వంటి=మావంటి, మమును+వంటి=మమువంటి. యుష్మదర్థమునకు షష్ఠీద్వితీయలు:– నీయొక్క+బోఁటి= నీబోఁటి, నిన్నును+బోఁటి=నిన్నుబోఁటి. నీయొక్క+ వంటి=నీవంటి, నిను(న్ను) ను+వంటి=నిను(న్ను)వంటి. మీయొక్క+వంటి=మీవంటి. మిమ్ము ను+వంటి=మిమ్ము వంటి.

అందున్=అట్టి, పోని; బోఁటి, వంటి–అనువానియందు, బోఁటి, వంటి–అనునవి సమాసములు. అవి=బోఁటివంటులు, పరములగునపుడు, ఆత్మార్థమునకున్=తాశబ్దమునకు, నామ తచ్ఛబ్దంబులకుంబోలెఁ గార్యంబు=నామతచ్ఛబ్దములకువలె వ్యాకరణ కార్యమగును. అనఁగా నామతచ్ఛబ్దములకు, వలె–పరమగునపుడు షష్ఠి యెట్లగునో (38సూ)యట్లే, బోఁటి వంటులు పరమగునపుడు, నామ తచ్ఛబ్దములకు షష్ఠి యగునని భావము. తనయొక్క+ బోఁటి=తనబోఁటి, తనయొక్క+వంటి=తనవంటి.

పోని–పరమగునపుడు డువర్ణకము మీఁద ద్రుతము నిత్యము. అనఁగా, 39–చే పోలె బలె పోని శబ్దములు పరమగునపుడు, ద్రుతపూర్వకత్వము, విభాషనగును. డువర్ణకమునకు 'పోని' పరమగునపుడు ద్రుతము నిత్యమని యిట వ్యవస్థ చేయఁబడెను. ద్రుతమనఁగా సముచ్చయాద్యర్థక "ను" శబ్దమని ఫలితార్థము. ఉదా. రెండవమన్మథుండునుం బోనివాని. మన్మథుండు+పోని=మన్మథుండు+ను+పోని. బా. సంధి 21చే–మన్మథుండును+పోని = మన్మథుండునుంబోని.

ఇది ఘంటాపథము

* * *

# తద్ధిత పరిచ్ఛేదము

## తద్ధితములనఁగా విశేష్య విశేషణములగు శబ్దములమీఁద భావాద్య ర్థములయందు రాఁదగిన ప్రత్యయ విశేషములని యర్థము.

వ్యా. విశేష్యములు విశేషణములు వగు శబ్దములమీఁద భావార్థము మున్నగు వానియందు రాఁదగిన ప్రత్యయ విశేషములు తద్ధిత ప్రత్యయములనఁబడును. (సుబంతములకంటె భావాద్యర్థములందుఁ జేరునవి తద్ధితములని భావము.)

## తద్ధిత ప్రత్యయములు పరంబులగునపుడు పదంబుల డువర్ణకాదులకు లోపంబగు. 1

వ్యా. తద్ధితప్రత్యయములు పరమగునప్పుడు పదముల, డుప్రత్యయాదులకు లోపమగును. బా. సమాస 25 సూత్రమునందలి "సమాసవిభక్తికి లోపంబగు" అనుచోటి సమాస శబ్దము వృత్తిసామాన్యమున కుపలక్షణమనుకొని విభక్తిలోపము చేయవలసియున్నది. ఈయర్థము నిటవ్యాకర్త వేఱుగా సూత్రించెను. కావున నిది బాలవ్యాకరణ సూత్రమునకు వివరణము. చూ.బా. తద్ధిత 1-ఘంటా.

## తనవర్ణకంబు పరంబగునపుడు తచ్ఛబ్దార్థకమునకు లోపంబు విభాషనగు. 2

ఉ: ఆఁకొన్నతనము, ఓర్వలేనితనము. మొ॥ పక్షమున-ఆఁకొన్నవాని తనము. ఆఁకొన్నదానితనము; ఓర్వలేనివానితనము, ఓర్వలేనిదానితనము, పెల్లాఁకొన్నతనాన. భీమ. 2ఆ-120.

వ్యా. తవర్ణకము పరమగునపుడు, తచ్ఛబ్దార్థమునకు లోపము విభాషనగును. తద్ధిత ప్రత్యయములు పరమగునప్పుడు తచ్ఛబ్దలోపము, బా. సమాస 20చే-ప్రాప్తించుచుండఁగా నిటఁ బ్రత్యేకించి తచ్ఛబ్దలోపము సూత్రింపఁబడెను. కావ నిది బా. సమాస20 సూత్రమునకు వివరణము. ఆఁకొన్నవాని (దాని)యొక్క+తన. 1చే. ఆఁకొన్నవాని(దాని)+ తన. ఈ2చే-ఆఁకొన్నతన-ప్రాతిపదిక మగును. బా. తత్సమ 39చే-ఆఁకొన్నతనము. ఇట్లే, ఓర్వలేనివాని (దాని)యొక్క+తన=ఓర్వలేనితనము. విభాషననుటచే-ఆకొన్నవాని (దాని)తనము, ఓర్వలేనివాని (దాని) తనము. ఆఁకొన్నతనమున=ఆఁకొన్నతనాన. (బా. తత్సమ 43)

## మతుబర్థంబునం దరి వర్ణకంబు పరంబగునపుడు పూజ సొన్న ములకడయచ్చునకు వైకల్పికముగాను నిత్యముగాను దీర్ఘంబగు. 3.

ఉ: పూజారి, పూజరి; సొన్నారి.

వ్యా. మతుబర్థమునందు, అరి ప్రత్యయము పరమగుచో, పూజ శబ్దము తుది యచ్చునకు వైకల్పికముగాను, సొన్నశబ్దము తుదియచ్చునకు నిత్యముగాను, దీర్ఘమగును. మతుబర్థము=మతుప్ ప్రత్యయముయొక్క యర్థముగలది. బా. తద్ధిత 17చే-“పూజ+ము”+ అరి. ప్రౌఢ. తద్ధిత 1చే-పూజ+అరి. ఈ 3చే- అరివర్ణకముపరమగుచోఁ బూజశబ్దము తుదియచ్చునకు, దీర్ఘము: పూజా+అరి. సమాస 36చే-అత్వలోపము: పూజా+రి=పూజారి-ప్రాతిపదికమగును. దీర్ఘముకాని పక్షమున, పూజ+అరి. బా. సంధి11చే-పూజరి-ప్రాతిపదికమగును. అనుక్తన్యాయమున-పూజారి+సు; పూజరి+సు. బా. తత్సమ57చే-పూజారి, పూజరి “సొన్న+ము”+అరి=సొన్న+అరి. ఇట దీర్ఘము నిత్యము: సొన్నా+అరి. సమాస 36చే-అత్వలోపము: సొన్నారి- ప్రాతిపదికము. సొన్నారి+సు. బా. తత్సమ57చే-సొన్నారి. (అనుక్తన్యాయము=చూ. బా. తత్సమ44-ఘంటా)

విశే:- దీర్ఘవిధానము వ్యర్థమగును గాన, పూజా+అరి; సొన్నా+అరి-అనుచోట్ల సంధికాదు.

## మతుబర్థంబునం జెంచునకుఁ దవర్ణకంబు పరంబగుచో నిత్వంబగు. 4

ఉ: చెంచిత. క. చెంచితలం బింఛపత్ర చేలాంచితలన్ భాగ. 10 స్కం. పూ. 793. (గ్రామ్యజనుల పాటలయందును జెంచీత యని యికార దీర్ఘంబ వినంబడియెడి.)

వ్యా. “తవర్ణకంబు పరంబగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడు.” (బా. తద్ధిత20) అను బాలవ్యాకరణ సూత్రముచే, చెంచు+త, అనుచో ఎత్వము ప్రాప్తిం చుచుండఁగా, నిట ఇత్వము సహితమగునని పూరింపఁబడెను. బా. తద్ధిత 19చే-చెంచుయొక్క+త. ప్రౌఢ. తద్ధిత1చే-చెంచు+త. ఈ4చే-చెంచిత- ప్రాతిపదికమగును. బా. తత్సమ39చే-చెంచిత+ము. తత్సమ57చే-చెంచిత. చెంచెత-అను రూపమెట్లును నుండును. చెంచిత-అనురూపముగలదనుటకుఁ బ్రమాణములు-(i) చెంచితలం బింఛపత్ర చేలాంచితలన్. ఈప్రయోగము శబ్దాలంకారఘటితమై యుండుటచే నిది చెంచిత-అను రూపమునకు సాధకము. (ii) గ్రామ్యజనుల పాటలలో, చెంచీత-అని యికారదీర్ఘము వినఁబడుచుండుట, చెంచిత-అను రూపముగలదనుటకు, వేఱొక, యాధారము. అనఁగా, చెంచిత అను గ్రాంథిక రూపమే చెంచీతగా, గ్రామ్యజనుల పాటలలో మాఱినదని భావము.

విమర్శ:- (i) భాగవత ప్రయోగమనుసరణీయము కాదు. (ii) చెంచీత-అను గ్రామ్యరూపము, చెంచిత-అనుగ్రాంథిక రూపము కలదనుటకు సాధకమను నూహబలమైన దికాదు. చెంచెత-అను ఎత్వఘటితముగూడ, చెంచీతగా మాఱవచ్చును. తుమ్మెద-అను, ఎత్వఘటితరూపము గ్రామ్యజనుల పాటలలో, తుమ్మీదగా మాఱుట యిందులకు, నిదర్శనము.

## చెదుగు దుడుకు నిడుపులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బకారంబగు. 5

ఉ: చెదుగఁడు, దుడుకఁడు, నిడుపఁడు.

వ్యా. చెదుగు, దుడుకు, నిడుపు శబ్దములకుఁ బుంస్త్వమున మతుబర్థమగు, అకారమగును. "చెదుగు+వు"+అ; "దుడుకు+వు"+అ; "నిడుపు+వు"+అ. 1చే-చెదుగు+అ; దుడుకు+అ; నిడుపు+అ. బా. సంధి11చే-చెదుగ, దుడుక, నిడుప-ప్రాతిపదికములగును. ఇవి బా. అచ్ఛిక2చేఁ బుంలింగతుల్యములు. కాన తత్సమ 22చే-చెదుగ+డుజ్; దుడుక+డుజ్; నిడుప+డుజ్. బా. అచ్ఛిక4చే-ఉత్వము గలుగదు. తత్సమ19చే-చెదుగఁడు, దుడుకఁడు, నిడుపఁడు. అప్రత్యయము బాలవ్యాకరణమున (తద్ధిత28) అడప-అను నుదాహరణమునఁ జూపఁబడెను. ఇటుఁ బుంలింగ తుల్యములు చూపఁబడెను. కాననిది వివరణమననగును.

## వేఱున కడ వర్ణకంబు స్వార్థంబునం దగు. 6

ఉ: వేఱడము.

వ్యా. వేఱుశబ్దమునకు, అడ ప్రత్యయము, స్వార్థమున నగును. వేఱు+అడ. బా. సంధి11చే-వేఱడ- ప్రాతిపదిక మగును. బా. తత్సమ39చే-వేఱడము. స్వార్థము=ప్రకృత్యర్థము. (బా. తద్ధిత9-ఘంటా.) వేఱడము=వేఱు. స్వార్థమున నగు ప్రత్యయములు ప్రాతిపదికముల మీఁదనే చేరుట సంప్రదాయము. (చూ. అనుబంధము. విషయసంఖ్య 99)

## వెల్ల కడి వర్ణకంబు స్వార్థంబునం దగు. 7

ఉ: వెల్లడి.

వ్యా. వెల్ల శబ్దమునకు స్వార్థమున, అడి ప్రత్యయమగును. వెల్ల+అడి. బా. సంధి11చే-వెల్లడి- ప్రాతిపదికమగును. వెల్లడి+సు. బా. తత్సమ57చే-వెల్లడి.

విశే:- "వెల్ల=తెల్లనిది, ధవళము; వెల్లడి=(1)బయలు (2) ప్రసిద్ధి" శ.ర. కాఁగా, వెల్లకు వెల్లడి శబ్దమునకుఁ గించిదర్థభేదము గలదు. కాననిదియత్యంత స్వార్థికము కాదు.

## తెలివి విరివి వినికి లేమి రాపులకు స్వార్థంబునం దిడి వర్ణకంబగు. 8

ఉ: తెలివిడి, విరివిడి, వినికిడి, రాపిడి.

వ్యా. తెలివి, విరివి, వినికి, లేమి, రాపు-శబ్దములకు స్వార్థమున ఇడి ప్రత్యయమగును. తెలివి+ఇడి. బా. సంధి11చే-తెలివిడి-ప్రాతిపదిక మగును. తెలివిడి+సు. బా. తత్సమ57చే-తెలివిడి=తెలివి. ఇట్లే, విరివి+ఇడి=విరివిడి. వినికి+ఇడి=వినికిడి. లేమి+ఇడి=లేమిడి. రాపు+ఇడి=రాపిడి.

విశే:- తెలివి, తెలివిడి శబ్దములకుఁ గొంత యర్థభేదము గలదు. కాన, నిది యత్యంత స్వార్థికము కాదు.

## ఇత వర్ణకం బింపు బిగి పోరులకు స్వార్థంబునం దగు. 9

ఉ: ఇంపితము, బిగితము, పోరితము.

వ్యా. ఇంపు, బిగి, పోరు శబ్దములకు స్వార్థమున ఇత ప్రత్యయ మగును. ఇంపు+ఇత;

బిగి+ఇత; పోరు+ఇత. బా. సంధి11చే–ఇంపిత, బిగిత, పోరిత–ప్రాతిపదికము లగును. బా. తత్సమ 39చే–ఇంపితము, బిగితము, పోరితము. ఇంపితము=ఇంపు–ఇత్యాది.

ఇద వర్ణకం బొప్పు తప్పు పెల్లులకు స్వార్థంబునందును, క్రొవ్వు బెట్టులకు మతుబర్థంబునందును నగు. 10

ఉ: ఒప్పిదము, తప్పిదము, పెల్లిదము; క్రొవ్విదము, బెట్టిదము.

వ్యా. ఒప్పు, తప్పు, పెల్లు శబ్దములకు, స్వార్థమున, ఇద ప్రత్యయమగును; క్రొవ్వు, బెట్టు శబ్దములకు మతుబర్థమున, ఇద ప్రత్యయమగుమ. ఒప్పు+ఇద; తప్పు+ఇద; పెల్లు+ఇద. బా. సంధి11చే– ఒప్పిద, తప్పిద, పెల్లిద–ప్రాతిపదికము లగును. బా. తత్సమ39చే–ఒప్పిదము, తప్పిదము, పెల్లిదము. "క్రొవ్వు+వు"+ఇద; "బెట్టు+వు"+ఇద. 1చే–క్రొవ్వు+ఇద; బెట్టు+ఇద. బా. సంధి11చే–క్రొవ్విద, బెట్టిద–ప్రాతిపదికములగును. బా. తత్సమ39చే–క్రొవ్విదము, బెట్టిదము. ఇదవర్ణకము స్వార్థమున నగునపుడు ప్రాతిపదికముపై నిల్చును.

స్వార్థంబునం దిరి వర్ణకంబు వాఁపున కగు. 11

ఉ: వాఁపిరి.

వ్యా. వాఁపు శబ్దమునకు స్వార్థమున 'ఇరి' వర్ణక మగును. వాఁపు+ఇరి, బా. సంధి11చే–వాఁపిరి–ప్రాతిపదికము. వాఁపిరి+సు. బా. తత్సమ57చే–వాఁపిరి.

కరవర్ణకంబు నాయఁక శబ్దమునకు భావంబునందగు. 12

ఉ: నాయఁకరము.

వ్యా. నాయఁకశబ్దమునకు భావార్థమున, కరప్రత్యయమగును. భావార్థము=చూ. బా. తద్ధిత1– ఘంటా. "నాయఁక+యొక్క"+కర – అలౌకికవిగ్రహము. 1చే–నాయఁక+కర. సమాస 36చే–'క'లోపము: నాయఁ+కర=నాయఁకర–ప్రాతిపదికమగును. బా. తత్సమ39చే– నాయఁకరము. (చూ. అనుబంధము. విషయసంఖ్య–28).

కారవర్ణకంబు చెలి నయములకు భావంబునందును, నుడి కొలతలకు స్వార్థంబునందునగు. ఈ కకారమునకుఁ గొన్నియెడల గకారంబగు. 13

ఉ: చెలికారము, నయగారము; నుడికారము, కొలగారము.

వ్యా. కార ప్రత్యయము, చెలి,నయము–అనువానికి భావార్థమున నగును; నుడి, కొలత–అనువానికి కారప్రత్యయము స్వార్థమునం దగును. కొన్నిచోట్ల, కార ప్రత్యయ కకారమునకు గకారమగును. "చెలియొక్క"+కార; 1చే–చెలి+కార=చెలికార–ప్రాతిపదికమగును. బా. తత్సమ39చే–చెలికారము. "నయ+యొక్క"+కార. 1చే–నయ+కార. "ఈ కకారమునకుఁ గొన్నియెడల గకారంబగు." అనుటచే–నయగార–ప్రాతిపదికమగును. బా. తత్సమ39చే–నయగారము. నుడి+కార=నుడికార. బా. తత్సమ 39చే–నుడికారము. కొలత+కార. సమాస36చే–కొల+కార, కకారమునకు గకారము: కొలగార. బా. తత్సమ39చే–కొలగారము. "నుడి=మాట. నుడికారము = మాటచమత్కారము. కొలత=ధాన్యములోనగువానిని కొలుచుట. కొలగారము=ధాన్యముకొలతకిచ్చెడు కూలి" (శ.ర.) ఇట్లు కించిదర్థభేదముండుటచే, నివియత్యంత స్వార్థికములు కావు.

విమర్శ:- చెలికారము, బాలవ్యాకరణమునసే సాధింపఁబడెను. (బా. తద్ధిత్యం 8) కాననిటఁ ద్వ్యాజ్యము.

## చలికి మిరివర్ణకంబు స్వార్థంబునం దగు. 14

ఉ: చలిమిరి.

వ్యా. చలిశబ్దమునకు, మిరిప్రత్యయము స్వార్థమున నగును. చలి+మిరి=చలిమిరి–ప్రాతిపదికము. చలిమిరి+సు. బా. తత్సమ57చే–చలిమిరి.

## టివర్ణకంబొండు నంత్యవర్ణంబునకు భావంబునం దగు. 15

ఉ: ఒంటి.

వ్యా. ఒండు శబ్దముయొక్క తుదివర్ణమునకు భావార్థమున "టి" ప్రత్యయమగును. ఒండు=ఒంటి. ఇట డువర్ణమునకు 'టి' ప్రత్యయాదేశము. ఒంటి+సు. బా. తత్సమ 57చే–ఒంటి. ఇట అంత్యవర్ణమనఁగా డువర్ణమని గ్రహింపవలెను.

విమర్శ:- తద్ధితప్రత్యయములు (స్వార్థికప్రత్యయములు తప్ప తక్కినవి) సుబంతముల కంటె నిల్చుట శాస్త్ర సంప్రదాయము కావున, ఒండులోని డువర్ణమునకు టివర్ణకము నాదేశముగ విధించుట పొరపాటు. కానవేఱుగా సూత్రింపవలెను. (ము. కా. తద్ధిత. 31.)

## పరిమాణార్థంబునం బ్రథమైకవచనంబునంద యేఁడు వర్ణకంబగు. 16

విశేష్యంబు భిన్నవచన విభక్తికంబయ్యు, మానార్థకముల మీఁదఁ బరిమాణార్థంబునం బ్రథమైకవచనంబునందే యేఁడువర్ణకంబు వచ్చునని యర్థము. ఉ: మూరెఁడుతోఁక, తూమెఁడు బియ్యము, పుట్టెఁడుతవిదలు, పుట్టెఁడుతవిదలకు రెండుపుట్లగింజలు. ము॥

వ్యా. బాలవ్యాకరణమున, "మానార్థంబున కేకత్వంబునం దెఁడువర్ణకంబగు" (బా. తద్ధిత 25) అని సూత్రింపఁబడెను. "ఏకత్వంబునందు" అనుటచేఁ బ్రథమేతరములగు నేకవచనములమీఁదను "ఎఁడు" వర్ణకము కలుగుననుట కవకాశముండఁగాఁ బరిమాణార్థమునఁ బ్రథమైకవచనమునందే యెఁడువర్ణక మగునని యిట వివరింపఁబడెను. విశేష్యము భిన్నవచన విభక్తులుగలదైనను మానార్థకములమీఁదఁ బరిమాణార్థమునఁ బ్రథమైకవచనమునందే యేఁడువర్ణక మగు నన్నమాట. ఉదా. మూరెఁడు తోఁక, తూమెఁడు బియ్యము. ఈ యుదాహరణములో, విశేష్యములగు తోఁక, బియ్యము–అనునవి ప్రథమైకవచనాంతములై యున్నవి. విశేషణములగు, మూర, తూము– అను ప్రథమైకవచనాంతముల మీఁదనే యేఁడు వర్ణకము చేరినది. పుట్టెఁడుతవిదలు. అనుచో తవిదలు–అను విశేష్యము బహువచనాంతముగా నున్నది. అయినను పుట్టి–అను ప్రథమైకవచనాంతము మీఁదనే యేఁడువర్ణకమయినది. రెండుపుట్ల గింజలు. ఇట, పుట్లు–బహువచనాంతమగుటచే, ఎఁడు చేరలేదు. పుట్టెఁడు తవిదలకు అనుచో తవిదలకు–అను విశేష్యము షష్ఠీ బహువచనాంతమైయున్నది. అయినను పుట్టి+ఎఁడు–అని ఎఁడువర్ణకము, పుట్టి–అను ప్రథమైకవచనాంతము మీఁదనే యయినది. పుట్టికి–అను షష్ఠ్యేకవచనాంతముపై ఎఁడు వర్ణకము చేరి, పుట్టెఁడు–అను రూప మేర్పడలేదు. అనఁగా పుట్టెఁడుతవిదలకు, ఇత్యాదిస్థలములో పుట్టి+కు+ఎఁడు 1చే–పుట్టి+ఎఁడు=పుట్టెఁడు–ఇత్యాదిగాఁ బ్రక్రియలు

చెప్పరాదని భావము. ఈ విశేషము తెలుపుటకే ప్రథమైకవచనంబునందు - అని యిట స్పష్టపఱుపఁబడెను. బాలవ్యాకరణ సూత్రమునందలి, "ఏకత్వంబునందు" అను దానికిఁ బ్రథమైకవచనంబునంద- అనునది వివరణ మనఁదగును. (చూ. అనుబంధము విషయసంఖ్య-100)

దర్ఘ్యార్థంబునం దత్సమ పదంబులమీఁదను బంటి గానంబడియెడి. 17

ఉ: కటిబంటి నెత్తురు కాలువల్. రామా. 8ఆ-233.

వ్యా. దర్ఘ్యార్థమునందు సంస్కృతసమములమీఁదను బంటి వర్ణకము. కనఁబడును. బా. తద్ధిత 27 సూత్రమున, బంటి వర్ణకము విధింపఁబడినది. ఇట బంటివర్ణకము సంస్కృతసమములమీఁదను జేరునని పూరింపఁబడినది. కటిబంటి. ఇట, కటి-అను సంస్కృత సమముపై, బంటి చేరినది. కటి+సు+బంటి. 1చే-కటిబంటి-ప్రాతిపదికమగును. కటిబంటి+సు. విధాన సామర్థ్యముచే, "సు" లోపము.

విమర్శ:- ఈ ప్రయోగమనుసరణీయము కాదు.

ప్రాచుర్యార్థంబునం దెనుఁగుపదంబులమీఁదను
మయట్ప్రత్యయము చూపట్టెడు. 18

ఉ: తనమయము. వ. విచ్చలవిడిని దనమయంబుగా గగనంబున నిగుడు నచ్చక్రంబుం గనుంగొని. ఉ. హరి. 3ఆ-144 తమమయము. ఎ.గీ. సమదవృత్తిఁ గేలి సలిపెఁ జకోర చ, యంబుచదలు దమమయంబుగాఁగ. నిర్వ. 6ఆ-48. మెదడు ప్రోవులమయము-తే. ప్రథనభూమి, మెదడుప్రోవుల మయమయ్యె మిక్కుటముగ. హరి. ఉ. 10ఆ-58 మొ॥

వ్యా. ప్రాచుర్యార్థమునందు సంస్కృత "మయట్" ప్రత్యయ మచ్చతెనుఁగు పదముల మీఁదను గనఁబడును. తనయొక్క+మయ; తమయొక్క+మయ; మెదడుప్రోవులయొక్క+మయ. 1చే-తనమయ, తమమయ, మెదడు ప్రోవులమయ-అనునవి ప్రాతిపదికములగును. బా. తత్సమ 39చే- తనమయము, తమమయము. మెదడుప్రోవుల మయము. (చూ. అనుబంధము. విషయసంఖ్య-131)

విమర్శ:- ఈ ప్రయోగములనుసరణీయములు కావు.

ఒకానొకచో మతుబర్థంబున నవర్ణకంబు చూపట్టెడి. 19

ఉ: క. అనిలజ! నీ కిట్లని పల్కను జనునే? తలఁప లేడి కడుపునఁ బులిపుట్టునె యిట్టి దివ్యతేజంబున వాఁడథ మాన్వయమునఁబుట్టునె చెపమా! (దివ్య తేజంబున వాఁడు=దివ్యతేజము గలవాఁడు) భార. ఆది. 6ఆ-58. ఇతరంబులు ప్రయోగ దృష్టంబులు గ్రాహ్యంబులు.

ఇది తద్ధిత పరిచ్ఛేదము.

వ్యా. మతుబర్థమున నొకానొకచోట నవర్ణకము కనఁబడును. దివ్యతేజంబున వాఁడు= దివ్యతేజముగలవాఁడు.

ప్రక్రియ:- "దివ్యతేజ+ము"+న. 1చే-మువర్ణకలోపము రావలసియున్నను నుదాహరణ స్వారస్యముచే మువర్ణకము లోపింపదు. బా. తత్సమ42చే-దివ్యతేజంబున = దివ్యతేజముగలిగిన-అని యర్థము. బా. సమాస8చే- "దివ్యతేజంబున+ము"+"వా+డుజ్" బా. సమాస25చే-దివ్యతేజంబునవా-ప్రాతిపదిక మగును. బా. తత్సమ22చే-దివ్యతేజంబునవా+డుజ్. తత్సమ19చే-దివ్యతేజంబునవాఁడు=దివ్యతేజముగలవాఁడు.

విమర్శ:- దివ్యతేజంబునవాఁడు-లోని నవర్ణము తద్ధితప్రత్యయమనుట సరికాదు. షష్ఠీసమాసమున, సమాస1చే-నగాగమముకలుగఁగా, నీరూపమేర్పడును. ఇట్టివాని నాభాస బహువ్రీహులని యందురు. కాన నీ సూత్రము ప్రత్యాఖ్యేయము. (చూ. అనుబంధము. విషయసంఖ్య-101)

ఇది ఘంటాపథము

★ ★ ★

# క్రియా పరిచ్ఛేదము

**తద్ధర్మార్థ విశేషణం బసహాయతం త్రికాల వాచి యగు. 1**

ఉ: వారి యనువయించు, సితకృష్ణ తంతు రాజిత తంత్రమది. భార. ఆది. 1ఆ-108. (అనువయించు=అనువయించుచున్న) వ. నానేర్చు విధంబున, (నేర్చు=నేర్చిన)భార ఆది. 1ఆ-20. నాపడు ప్రయాసము లూరక పోకయుండ (పడు=పడిన) కళా 4ఆ-9. ద్రుపదు వీటిలోన దొమ్మికయ్యము రేఁచెఁ, బసులఁబట్టె విరటు పట్టణమున, మఱియు నెన్నిలేవు మార్తాండతనయుండు, తొడరి మనకుఁజేయు దుండగములు. (చేయు=చేసిన) జై 1ఆ-92. ఆ జనమేజయుచేయు సర్పయాగమున. (చేయు=చేయఁగల) భార ఆది 1ఆ-127. మొ॥

వ్యా. తద్ధర్మార్థ విశేషణము, అసహాయతను=కాలమును సూచించు శబ్దముల సాహాయ్యము లేకుండ, త్రికాలవాచి=మూఁడు కాలములను, అనఁగా భూత భవిష్యద్వర్తమానకాలములను బోధించునది, యగును. తద్ధర్మార్థ విశేషణము=చూ బా. క్రియా 44 ఘంటా. వర్తమానమునకు:- అనువయించు=అనువయించుచున్న. భూతమునకు:- నేర్చు=నేర్చిన,పడు=పడిన, చేయు=చేసిన. భవిష్యత్కాలమునకు:- జనమేజయుచేయు. చేయు=చేయఁగల-అని యర్థములు.

**ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబులగు నుండు, చను, చేరుకొనులు ప్రశ్నార్థ కైకార పరకంబులగు నపుడు వాని కడయచ్చు లకు లోపంబు విభాషనగు, అగుచో నుండు డకారంబు నకు నకారంబగు. 2**

చేరుకొను-అనగా ననుప్రయుక్తమగుకొనుధాతువనియర్థము.

ఉ: క. అ, మ్మరియాద దప్ప మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని పుట్టుకయున్నే. భార విరా 1ఆ-122. మునీంద్ర నీకుఁ జ, న్నేనలినాక్షులందు మది నిల్పఁగ? భార. ఆది 8ఆ-179. అహితమున్ భయమున్ దొరకొన్నె నాకు నా, పుత్రులకున్. భార. సభా, 2ఆ-133. పక్షమున, ఉండునే. మొ॥

వ్యా. తద్ధర్మార్థకములగు, ఉండు, చను, చేరు=చేరెడు, అనఁగా నను ప్రయుక్తమగు, కొను, అనువానికిఁ బ్రశ్నార్థకమగు ఏకారము పరమగునపుడు వాని తుదియచ్చులకు లోపము విభాషనగును.

అట్లు తుది యచ్చు లోపించునపుడు, ఉండు-లోని, డకారమునకు నకారమగును. ఉదా॥ ఉండును+ఏ. అచ్చుపరమగునపుడు ద్రుతస్వరము లోపించుట పరిపాటి. (చూ. బాల. సంధి 22 ఘంటా) కాన, ఉండున్+ఏ-అని నిలుచును. ఈ 2చే-తుదియచ్చునకు లోపము (=ఉండ్న్+ఏ) డకారమునకు నకారము, కాఁగా-ఉన్న్+ఏ-అగును. స్థిరము పరమగుటచే బిందులోపము=ఉన్న్+ఏ=ఉన్నే. పక్షమున-ఉండున్+ఏ=ఉండునే. చనును+ఏ=చనున్+ఏ. ఈ 2చే చన్న్+ఏ=చన్నే. పక్షమున-చనున్+ఏ=చనునే. అనుప్రయుక్తమగు కొనునకు:- దొరకొనున్+ఏ. తుది యచ్చునకులోపము. దొరకొన్న్+ఏ-దొరకొన్నే. పక్షమున-దొరకొనున్+ఏ=దొరకొనునే, దొరకు+కొను=దొరకొను. (చూ. మూలములు.)

## తద్ధర్మ భూతక్రియ లార్యాద్యర్థ పరకంబులయి ప్రశ్నార్థకంబులగు. 3

ఉ: మీ వంశమున నర దేవోత్తములదైన, సద్ధర్మమార్గంబు సలుపుదయ్య. భార. సభా 1-26 సన్మా, నితులయి వర్తింతురయ్య నీదైవజ్ఞుల్? భార. సభా 1-33. పంచితయ్య. భార. సభా 1ఆ-47.

వ్యా. తద్ధర్మక్రియలు భూతక్రియలు ఆర్యార్థ పరకంబులయి=ఆర్య మున్నగు నర్థములు గల శబ్దములు - అనఁగా, అయ్య-లోనగుశబ్దములు పరమందుఁ గలవై ప్రశ్నార్థకములగును. తద్ధర్మక్రియ ప్రశ్నార్థక మగుటకు:- చలుపుదువు=చలుపుదు. (బా. క్రియా 24) చలుపుదు+అయ్య = చలుపుదయ్య. అనఁగా, చలుపుదువా? అని ప్రశ్నార్థకము. వర్తింతురు+అయ్య=వర్తింతురయ్య. అనఁగా, వర్తింతురా? యని ప్రశ్నార్థకము. భూతక్రియప్రశ్నార్థకమగుటకు:- పంచితివి=పంచితి (బా. క్రియా24) పంచితి+అయ్య. బా. సంధి 7చే-పంచితయ్య. అనఁగా, పంచితివా? యని ప్రశ్నార్థకము.

## ఒక్కొకచోఁ దద్ధర్మక్రియ యార్యాద్యర్థ పరకంబయి వ్యతిరేక వ్యంజక ప్రశ్నార్థకం బగు. 4

ఉ: చ. తనయుఁడు తండ్రి యగ్రజుఁడు తమ్ముఁడనంజనునయ్య రాజ్యముం, గొనునెడ? నిర్వ. 3ఆ-95. సురాంగనలెల్ల నిట్టి నీ, చేఁతకు మెత్తురమ్మ? స్వా. 3ఆ-33. మొ॥

వ్యా. తద్ధర్మక్రియ యొక్కొక్కచోట, అయ్య-మున్నగు శబ్దములు పరమందుఁ గలదై వ్యతిరేక వ్యంజక=వ్యతిరేకార్థ స్ఫూర్తిగల ప్రశ్నార్థకమగును. చనును+అయ్య. అచ్చు పరమగుటచే ద్రుతస్వరలోపము: (చూ. బా. సంధి20-ఘంటా) చనున్+అయ్య=చనునయ్య? అనఁగా, చనదనియర్థము. చనున్-అను దానికి వ్యతిరేకము, చనదు. మెత్తురు+అమ్మ=మెత్తురమ్మ? అనఁగా, మెచ్చరని యర్థము. మెత్తురు- అనుదానికి వ్యతిరేకము మెచ్చరు.

## ఆర్యాద్యర్థక మొక్కచో నటు శబ్ద పూర్వకంబు నగు. 5

ఉ: చెల్లునటయ్య, చెల్లునటమ్మ, ఉ. దయసేయక తిన్నని మేను వెన్నెలన్, వేతురటమ్మ యింత కనువేఁదురు సెల్లునటమ్మ యింతికిన్. స్వా. 3ఆ-33. మొ॥

వ్యా. ఆర్యాద్యర్థక శబ్దము=ఆర్యాదులయర్థముగల శబ్దము, (ఆర్య=అయ్య) ఒకచో, అటుశబ్దము ముందుగలదియు నగును. చెల్లును+అయ్య, ఈ 5చే-చెల్లును+అటు+అయ్య.

ద్రుతస్వర లోపము: చెల్లున్+అటు+ అయ్య=చెల్లునటయ్య. చెల్లును+అటు+అమ్మ=చెల్లున్+అటు+అమ్మ: చెల్లునటమ్మ. (చెల్లదు) పక్షమున 4చే–చెల్లునయ్య, చెల్లునమ్మ. (చూ. మూలములు)

## మహద్బహుకర్తృక క్రియకు నేకవచనంబు విభాషనగు. 6

ఉ: క. తనయెఱిఁగిన యర్థం బొరుఁ, డనఘా యిది యెట్లు చెప్ప్వమని యడిగినఁ జెప్పనివాఁడును సత్యము చెప్పనివాఁడును ఘోరనరకపంకమునఁ బడున్. భార. ఆది 1ఆ–137. పక్షమున–క. బలవంతుఁడు పయినెత్తిన, బలహీనుఁడు ధనముకోలుపడిన యతఁడు ముచ్చిల ద్రేఁగునతఁడుఁ గామాకులచిత్తుఁడు నిద్రలేక కుందుదు రధిపా. భార. ఉద్యో. 2ఆ–21. మొ॥

వ్యా. మహద్బహుకర్తృక క్రియకున్=మహద్వాచకములయిన, పెక్కు కర్తలుగల క్రియకు; ఏకవచనము విభాషనగును. అనఁగాఁ బెక్కుమహద్వాచకములు కర్తలుగానున్న క్రియకు నేకవచనము విభాషనగును. తన యెఱిఁగిన యర్థంబు–అను పద్యమున, రెండు మహద్వాచకములు కర్తలుగానున్నవి (i) ఇది యెట్లు చెప్ప్వమని యడిగినఁ జెప్పనివాఁడు (ii) సత్యము చెప్పనివాఁడు. క్రియ–పడున్–అని యేకవచనాంతమై యున్నది. కనుక నిది మహద్బహుకర్తృకక్రియ కేకవచనమగుట కుదాహరణమని వ్యాకర్త యభిప్రాయము. పక్షమున–పడుదురు, అని బహువచనాంతమగును. బహువచనాంతమునకు:– బలవంతుఁడు పైనెత్తిన–అను పద్యమున నాలుగు మహద్వాచకములు కర్తలుగాఁ గలవు. (i) బలవంతుఁడు పై నెత్తిన బలహీనుఁడు. (ii) సొమ్ముకోలుపడిన యతఁడు (iii) ముచ్చిల ద్రేఁగునతఁడు (iv) కామాకుల చిత్తుఁడు. ఇట, క్రియ–కుందుదురు, అని బహువచనాంతమై యున్నది. కుందును–అని, పక్షమున నేకవచనాంతమును గావచ్చును.

విమర్శ:– మహద్బహుకర్తృక క్రియ కేకవచనము విభాషనగు ననుట పొరపాటు. ఈ పక్షమున–రామలక్ష్మణులు వచ్చెను–వంటి రూపము లేర్పడవలసి వచ్చును. అడిగినఁ జెప్పనివాఁడు, ఘోరనరకపంకమునఁ బడున్, సత్యము చెప్పనివాఁడును ఘోర నరక పంకమునఁ బడున్–అని భిన్నవాక్యకల్పన చేయవలెను. (ము.కా. క్రియా 39; చూ. అనుబంధము. విషయసంఖ్య–102)

## కొన్నియెడలఁ ద్వరితార్థసూచకంబయి భావిని భూతంబు చూపట్టెడి. 7

ఉ: తావచ్చె సుదర్శనాయుధుఁడు. భాగ. 10 స్కం. పూ. 1734. మొ॥

వ్యా. కొన్నిచోట్ల, త్వరితార్థమును సూచించునదై, భావిని=భవిష్యదర్థమున, భూతంబు=భూతకాలము, కనఁబడును. తావచ్చె సుదర్శనాయుధుఁడు. ఇట,వచ్చెను–అనునది భూతకాలిక క్రియ. ఇది త్వరగా రాఁగలఁడను భవిష్యదర్థమును సూచించుచున్నది.

## వ్యతిరేకక్రియ యర్థత్రయ బోధకంబగు. 8

అర్థత్రయము=వర్తమాన భూత భవిష్యదర్థములు. ఉ: వర్తమానమునకు: పాఱఁడు లేచి దిక్కులకు. (పాఱఁడు=పాఱుచున్న వాఁడు కాఁడు)

భాగ. 7 స్కం.194. పలుకదు సఖులతో లలితాంగి. (పలుకదు=ప లుకుచున్నదికాదు) భార. అర. 2ఆ–26. భూతమునకు: నలుఁగాన మివ్వనంబున. (కానము=కనినవారముకాము) భార. అర. 2ఆ–106. తెక్కలురావు పిల్లలకు (రావు=వచ్చినవి కావు) భాగ. 7స్కం.63. భవి ష్యత్తునకు: వాసుదేవుఁడున్, రాఁడను (రాఁడు=రాఁగలవాఁడుకాఁడు)భాగ. 10స్కం.పూ. 1727. ఆ. నలునకాని నళినదళనేత్ర వరియింపదట్టె. (వరియింపదు=వరియించునదికాదు) భార. అర. 2ఆ–52. ఇత్యాదు లెఱుంగునది.

వ్యా. వ్యతిరేకార్థమును బోధించుక్రియ, అర్థత్రయము ననఁగా, వర్తమాన భూత భవిష్యదర్థములను బోధించునది యగును. సందర్భమునుబట్టి మూఁడుకాలములలో దేనిని బోధించునో తెలిసికొనవలెను. వరుసగా వర్తమాన భూత భవిష్యదర్థముల కుదాహరణములు చూపి వివరింపఁబడెను.

విమర్శ:- వరియింపదు=వరియించునది కాదు, అనునర్థము సరికాదు. వరియింపఁ గలదికాదు– అని భవిష్యదర్థ బోధకముగ నర్థము చెప్పుట యుక్తము.

### ప్రార్థనంబునం దన్ప్రత్యయాంత క్రియలమీఁదఁ గదకదవు పూర్వకంబు లన్నాదు లనుప్రయుక్తంబు లగు. 9

ఉ: ప్రోవఁగదన్న, ప్రోవఁగదవన్న; ప్రోవఁగదయ్య, ప్రోవఁగదవయ్య; ప్రోవఁగదమ్మ, ప్రోవఁగదవమ్మ. ప్రోవఁగదె, ప్రోవఁగదవె, ప్రోవఁగదవే. సుకీర్తిమనఁగదన్న. భాగ 10 స్కం.పూ. 150 చెప్పఁగదయ్య? భాస్క రశతకము. తుదియెప్పుడు మద్విరహాంబురాశికిన్, జెప్పగదమ్మ. భాగ. 10 స్కం. పూ 1130. శా. తండ్రీ! నాకు ననుగ్రహింపఁగదె వైద్యంబంచుఁ బ్రార్థించినన్. స్వా 5 ఆ–17. క. నీపాదకమల సేవయు, నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం, తాపార భూత దయయును, దాపసమందార! నాకు దయసేయఁగదే. భాగ. 10 స్కం. పూ. 1269. వురంబుఁజేరనిం, కెవ్విధిఁ గాంతుఁ జెప్పఁగదవే తెరువేది? స్వా. 2ఆ–39 మొ॥

వ్యా. ప్రార్థనార్థమున, అన్ ప్రత్యయాంత క్రియలమీఁద, కద, కదవు–అనునవి ముందు గలిగిన, అన్న–లోనగు శబ్దము లనుప్రయుక్తము లగును. అన్ప్రత్యయాంతక్రియ=అ న్నంతక్రియ.చూ. కారక12. ప్రోవను+కద+అన్న=ప్రోవఁగదన్న, ప్రోవను+కదవు+అన్న=ప్రోవఁ గదవన్న. ప్రోవను+కద+అయ్య=ప్రోవఁగదయ్య. ప్రోవను+కదవు+అయ్య=ప్రోవఁగదవయ్య. ప్రోవను+కద+అమ్మ=ప్రోవఁగదమ్మ. ప్రోవను+కదవు+అమ్మ=ప్రోవఁగదవమ్మ. ప్రోవను+ కద+ఎ=ప్రోవఁగదె. ప్రోవను+కదవు+ఎ=ప్రోవఁగదవె. ప్రోవను+కదవు+ఏ=ప్రోవఁగదవే. మనను+కద+అన్న=మనఁగదన్న. చెప్పను+కద+అయ్య=చెప్పఁగదయ్య. చెప్పను+కద+ అమ్మ=చెప్పఁగదమ్మ. అనుగ్రహింపను+కద+ ఎ=అనుగ్రహింపఁగదె. దయసేయను+ కద+ఏ=దయసేయఁగదే. తెల్పను+కదవు+ఏ=తెల్పఁగదవే. (చూ. అనుబంధము. విషయసంఖ్య–103)

## ప్రార్థనాదులం దన్వ్రిత్యయాంత క్రియలమీఁది యిమ్మునకీ విభాషనగు. 10

ఉ: సీ. ఓర్పుమై నుప్పిండి యుపవాసముండనీ, మగనాలి సరిపోల్పఁ దగదు విధవ. (ఉప్పిండి= ఉప్పిండిగ) కాశీ 2ఆ–83. మ. మునిధర్మంబుల కెల్ల దవ్వని జనంబుల్ నవ్వినన్ నవ్వనీ. కళా. 3ఆ–28. స్రగ్ధర. కననీ గొడ్రాలు బిడ్డన్ గగనకుసుమముం గల్గనీ ఆయి మాటల్, విననీ ముక్తుండు వెండిన్ నిపులఁ బొడమనీ. పాండు. 3ఆ–128 మొ॥

వ్యా. ప్రార్థనాద్యర్థములందు, అన్వ్రిత్యయాంత క్రియలమీఁద (=కారక12) "ఇమ్ము" అనుదానికి "ఈ" అనునది యాదేశమగుననియర్థము. లక్ష్యములనుబట్టి ఇమ్మునకు "ఈ" సర్వాదేశమగునని గ్రహింపవలెను. ఉండన్+ఇమ్ము=ఉండన్+ఈ=ఉండనీ. నవ్వన్+ఇమ్ము=నవ్వన్+ఈ: నవ్వనీ. కనన్+ఇమ్ము=కనన్+ఈ=కననీ. కల్గన్+ఇమ్ము=కల్గన్+ఈ: కల్గనీ. పొడమన్+ఇమ్ము=పొడమన్+ఈ: పొడమనీ. పక్షమున–ఉండనిమ్ము–ఇత్యాది. (చూ. అనుబంధము. విషయసంఖ్య–104)

విమర్శ:- అన్వ్రిత్యయాంత–అనుట సరికాదు. నుఙ్యంతక్రియ యనుట యుక్తము. చూ. 22

## ఒకానొకచో రండుపొండులకు రాపొండని రూపంబు గానంబడియెడి. 11

ఉ: క. నిండుదలంపునఁ దగ రా, పొండను గారవము లేని పొరపొచ్చెమునం, గొండంత పసిఁడి యిచ్చిన, నుండంగాఁ జనునె? వారియొద్దను దండ్రీ! య. 3ఆ–90.

వ్యా. రండుపొండు–అనువాని కొకానొకచో, రాపొండు–అను రూపము సహితము కనఁబడును. పక్షమున రండుపొండు.

విమర్శ:- రాపొండను రూపముపేక్ష్యము. ప్రయోగయోగ్యము కాదు.

## కొన్నియెడల భావార్థకరూపము నుశబ్ద పరకంబయి యానంతర్యార్థకం బయ్యెడి. 12

ఉ: అనుటయు లుబ్ధకుండిట్లనియె. భార. అర. 5ఆ–32 మొ॥

వ్యా. కొన్నిచోట్ల భావార్థక రూపము, సముచ్చయార్థక నుశబ్దము పరమందుఁ గలదై యానంతర్యార్థకమగును. అనఁగా భావార్థకముమీఁది నుశబ్ద మానంతర్యార్థమును దెలుపునని భావము. అనుట–భావార్థకము. (బా. క్రియా. 35) అనుట+ను=అనుట+యును=అనుటయును (శబ్ద 116) అన్నయనంతరమని యర్థము. బాలవ్యాకరణమున ద్రుతాంతమగు దువర్ణక మానంతర్యార్థకముగ విధింపఁబడెను. (బా. క్రియా 42) ఇది దానికిఁ బూరణము.

## భావంబునం దనుప్రయుక్తంబగు కొనుటకుం గోలు విభాషనగు. 13

ఉ: ఇచ్చుకోలు, పుచ్చుకోలు మొ॥ పక్షమున–ఇచ్చుకొనుట, పుచ్చుకొనుట. మొ॥

వ్యా. భావార్థమున నను౹ప్రయుక్తమగు "కొనుట" అనుదానికి "కోలు" అనునది విభాషనగును. ఇచ్చు+కొనుట=ఇచ్చు+కోలు: ఇచ్చుకోలు. పుచ్చు+కొనుట=పుచ్చుకోలు. పక్షమున–ఇచ్చుకొనుట, పుచ్చుకొనుట. "అను ౹ప్రయుక్తంబగు" అనుటచే నను౹ప్రయుక్తముకాని, కొనుటకు "కోలు" కాదు, అనఁగా, కొనుట=కోలు–అని కాదన్నమాట. (చూ. అనుబంధము. విషయసంఖ్య–105)

విమర్శ:- (i) ఈ విధియరుదుగా నగును గాన, సూత్రమునఁగొం డొకచో ననవలెను. (ii) ఇచ్చుకోలు, పుచ్చుకోలు–౹ప్రయోగములు కనఁబడవు. పొగడికొనుట=పొగడికోలు; ఇత్యాదులు గలవు. (సభా 2–49) విషయసంఖ్య–105.

## కొఱకు కంటె పొంటెలు పరంబులగునపుడు భావార్థక టువర్ణకంబునకు లోపంబు విభాషనగు. 14

ఉ: క. దానిఁజూపుకొఱకునె కాదే, యీాయయ్యెఁ బట్టి తెచ్చుట. కళా 3ఆ–160. తే.భూమిఁ బాలించుకొఱకునై పుట్టినాఁడ. వి.పు. 1ఆ. క. పతి కలుగుకంటె సౌఖ్యము, సతులకు నొండొకటి కలదె చర్చింపంగాఁ, బతిలేమి సర్వశూన్యము, పతి గలిగిన సతికి నిం౹ద్రపదవది యేలా?. వి౹క్ర 6ఆ–117. క. ఏపగిదిని ౹బతుకరాదె యిటు చెడుకంటెన్. హరి. పూ 7 ఆ. అనృతవి౹క్రమముం ౹బకటించుకంటె. నిర్వ 7ఆ–21. ఎ.గీ. అఖిల తృణలతాతరు నిచయంబుఁజీడ, పట్టెనిట్టలంబుగ జడిపట్టు పొంటె. హరి పూ. 7ఆ–160. మొ॥ పక్షమున–చూపుటకొఱకు, కలుగుటకంటె పట్టుటపొంటె మొ॥

వ్యా. కొఱకు, కంటె, పొంటె–అను ౹ప్రత్యయములు పరమగునపుడు భావార్థక ట౹ప్రత్యయమునకు లోపము విభాషనగును. ఉదా. చూపుట+కొఱకు=చూపుకొఱకు. పాలించుట+కొఱకు=పాలించుకొఱకు. కలుగుట+కంటె= కలుగుకంటె. చెడుట+కంటెన్= చెడు కంటెన్. ౹ప్రకటించుట+కంటె=౹ప్రకటించుకంటె. పట్టుట+పొంటె=పట్టుపొంటె. పక్షమున– చూపుటకొఱకు, ఇత్యాది.

విమర్శ:- భావార్థక, టువర్ణకలోప మనుసరణీయము కాదు. (చూ. అనుబంధము. విషయసంఖ్య–29)

## ఒక్కొకచో భూతార్థ కాసమాపక ౹క్రియ హేత్వర్థకంబు నగు. 15

ఉ: రాహుకం, రము దెగి దేహము ధరణిఁబడియె. భార. ఆది. 2ఆ–19. బిట్టడలు మనంబునం గదిరి హా! యనువారును. భార. విరా. 3–5. ఏ,డ్తెఅ౹వేసిన మోముదాఁకి తిరిగెగరుడి. నిర్వ 3ఆ–27. అదియున్ మేనుచ్చి హా! లక్ష్మణా, యంచుం గూలె. రా. అర. కాం 2ఆ–59. సీ. పొరలెత్తి ఘనసార తరువులఁ దనుదాన, తొరఁగిన పచ్చకప్పురపు రజము. స్వా. 2ఆ–55 మొ॥

వ్యా. భూతార్థ కాసమాపక క్రియ (చూ. సంధి2) యొక్కొకచో ననఁగా, బా. క్రియా 38 సూత్రమున విధించినట్లు సమానాశ్రయత్వము లేనిచోట హేత్వర్థము గలదియగును. హేతువు=చూ. బా. కారక 4. రాహు కంఠముదెగి దేహము ధరణిఁబడియె. తెగి=తెగుటచేత, తెగినహేతువున-అని యర్థము. దేహము ధరణిఁ బడుట యనుఫలము సాధించుటకు యోగ్యమగు పదార్థము, కంఠము తెగుట. అనఁగా, దేహము ధరణిఁబడుటకు హేతువుకంఠము తెగుట యన్నమాట. కనుక, తెగి-అను భూతకాలికాసమాపకక్రియ హేత్వర్థక మగుచున్నది. ఇట్లే కదిరి=కదురుటచేత, తాఁకి=తాఁకుటచేత, ఉచ్చి=ఉచ్చుటచేత; ఎత్తి=ఎత్తుటచేత-అని హేత్వర్థములు వరుసగా గ్రాహ్యములు. బాలవ్యాకరణమున "సమానా శ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకంబగు" (బా క్రియా 38) అని సూత్రింపఁబడెను. రాహుకంఠము దెగి దేహము, ధరణిఁబడియె-మున్నగు ప్రయోగములలో సమానాశ్రయత్వము లేదు. ఇట, తెగుటకుఁ గర్త కంఠము. పడుటకుఁ గర్త-దేహము. కావున ఇవర్ణకము ప్రాప్తింపదు. కాఁగా, హేత్వర్థమునందును బూర్వకాలికమగు క్రియనుదెలుపు ధాతువునకు, ఇవర్ణకమగునను నర్థమున నీ ప్రౌఢవ్యాకరణ సూత్రము పర్యవసించుచున్నది.

## కవిత్రయేతర ప్రయోగంబులం గొన్నియెడల నిప్రత్యయాదులు పరంబులగునపుడు పకారం బించుక్చకారంబునకేనిఁ గానఁబడదు. 16

ఉ: క. ఎవ్వారినిఁ బో,రించని క్షణమొక్కటయుఁ దరింపఁగ వశమే. కళా. 2ఆ-4. క. ఊ,హించ నొక నాల్గుగడియల, సంచారమువలయు. కళా. 3ఆ-59. అపి శబ్దార్థముచే-అంగన భీతులకెల్ల భీతిఁదీ, ర్చుము వెసఁబొమ్ము నమ్ముమనుచుం గదలెన్. కళా. 6ఆ-14. మొ॥

వ్యా. కొన్నిచోట్లఁ గవిత్రయేతర ప్రయోగములలో "ని" ప్రత్యయాదులు పర మయినపుడు; ఇంచుక్చకారమునకేని, పకారముకనఁబడదు. ఇంచుక్చకారమునకు, పకారము కనఁబడకుండుటకు: పోరించు+నిజీ, (బా. క్రియా 47) ఊహించు+నుజీ (బా. క్రియా 40) అనుచోట్ల బా. క్రియా 88చే-ఇంచుక్చకారమునకు పకారము కలుగవలసియుండఁగా,నీ 16 సూత్రముచే, పకారముకలుగదు. బా.క్రియా 20చే-పోరించని, ఊహించను, అనురూపము లేర్పడును. ఇవి ప్రాసగతములు. అపి శబ్దార్థముచే-అనగా, ఇంచుక్చకారంబునకేని-అనుచోటి ఏనిశబ్దముచే, (ఏని=అపిశబ్దముయొక్క యర్థముగల యాచ్ఛికపదము) ఇంచుక్చకారమునకే కాక చుగాగమ చకారమునకును, పకారము రాకపోవచ్చును. తీఱు+చు. (బా. క్రియా 73) తీఱుచు+ము-అనుచో, బా. క్రియా 88చే-చకారమునకు పకారము కావలసియుండఁగా, నీ 16చే పకారము కనఁబడదు. తీఱుచుము=తీర్చుము. అని యగును. ఇదియతి గతము. పోరింపని, ఊహింపను, తీర్పుము-అనునవి యెట్లును నుండును. ఇట్లు చకారమునకు, పకారముకనఁబడక పోవుట కవిత్రయ ప్రయోగములలోలేదు. ఇవి కవిత్రయేతర ప్రయోగములు. (అనుబంధము. విషయ సంఖ్య-106)

**ప్రక్రియ:-** పోరు, ఊహ్, ధాతువులు-బా. క్రియా 63 చే-పోరు+ఇంచు; ఊహ్+ఇంచు=ఊహించు. పోరు+ఇంచు, బా. సంధి 11చే-పోరించు. బా. క్రియా 47చే-పోరించు+నిజీ. బా. క్రియా 40చే-ఊహించు+నుజీ. బా. క్రియా 88చే-కలుగవలసిన పకార మీ 16 చేఁ గలుగనిచో, బా. క్రియా 20 చే-పోరించని, ఊహించను. తీఱు-ధాతువు. బా. క్రియా 73చే-తీఱు+చు=తీఱుచు. బా. క్రియా 6చే-తీఱుచు+లూట్టు. బా. క్రియా

8చే-తీఱుచు+వు. బా. క్రియా 29చే-తీఱుచు+ము. బా. క్రియా 88చే-రావలసిన పత్వ మీ 16చే- గలుగదు. బా. ప్రకీర్ణక 16చే-తీఱ్+చు+ము. ప్రౌఢ. ముక్తలక్షణ 2చే-తీర్+చు+ము=తీర్చుము.

విమర్శ:- ఈ ప్రయోగము లనుసరణీయములు కావు.

## పకారంబు కొన్నియెడల శత్రర్థపరక చువర్ణంబునకుం గానంబడెడి. 17

ఉ: మోవిమోవిఁజే, రుపుచును. కళా 7ఆ-162. గర్జింపుచు. జై. 2ఆ-46 మొ॥

వ్యా. కొన్నిచోట్ల, శత్రర్థపరక=శత్రర్థ చువర్ణకముపరము గాఁగల, చువర్ణమునకు,పకారము కనఁబడును. చువర్ణంబునకు అనఁగా, చువర్ణమునందలి చకారమునకు, పకారమగుననుకొనవలెను. బాలవ్యాకరణమున శత్రర్థచువర్ణకము పరమగునపుడాగమచకారమునకు, పకారము విధింపఁబడలేదు. (బా. క్రియా 87-90) కాన శత్రర్థ చువర్ణకము పరమగున డాగమచకారమునకుఁ గొన్నిచోట్ల పకారమగునని యీసూత్రము పూరించుచున్నది. చేరుచు+చును= చేరుపుచును. గర్జించు+చును=గర్జింపుచును.

ప్రక్రియ:- చేరు-ధాతువు బా. క్రియా 73 చే-చేరు+చు. బా. క్రియా 43చే-చేరుచు+చును. ఈ 17చే- చేరుపు+ఉ+చును-చేరుపుచును. గర్జ్-ధాతువు. బా. క్రియా 63చే-గర్జ్+ఇంచు=గర్జించు. బా. క్రియా 43చే- గర్జించు+చును. ఈ 17చే-గర్జింప్+ఉ+చును=గర్జింపుచును.

విమర్శ:- ఈ ప్రయోగము లనుసరణీయములు కావు.

## అన్నంతక్రియ చేయు యోగంబునం బ్రేరణార్థకం బగు. 18

ఉ: చొక్కుచుఁ జొక్కఁజేయుచు. కళా. 7ఆ-157. ఉ. కేశవుఁ డవ్విరాట్తనువుఁ గృష్ణసమాఖ్య వహింపఁజేసెనో. కళా 8ఆ-11 మొ॥ (చొక్కఁజేయు=చొక్కించు. ఇట్లంతట నెఱుంగునది)

వ్యా. చేయుధాతువుయొక్క కూడికచే, అన్నంత క్రియ ప్రేరణార్థకమగును. అన్నంతక్రియ=చూ. కారక 12. చొక్కను+చేయు=చొక్కఁజేయు(=చొక్కించు) వహింపను+చేయు=వహింపఁజేయు. (వహింపించు)

విమర్శ:- అన్నంత క్రియ యను వ్యవహారము సరికాదు. చూ. 22సూ.

## వ్యాపారోన్ముఖత్వంబున నన్నంతక్రియలకుఁ బాఱు ధాతు వనుప్రయుక్తంబగు. 19

ఉ: పయిఁ బరామరిక చొప్పడమిఁ బాకము తప్పి, పండఁబాఱిన పాల మెండఁబాఱె. స్వా. 3ఆ-129 మొ॥

వ్యా. ధాత్వర్థమగు వ్యాపారముయొక్క యున్ముఖత్వమున, అనఁగాధాత్వర్థమగు వ్యాపారము జరుగుట కున్ముఖముగానున్నట్లు తోఁచెనేని, అన్నంతక్రియకు (=చూ. కారక 12) పాఱు ధాతు వనుప్రయుక్తమగును. పండను+పాఱు=పండఁబాఱు (=పండుటకున్ముఖమగు) ఎండను+పాఱు= ఎండఁబాఱు. (=ఎండుటకున్ముఖమగు)

విమర్శ:- అన్నంతక్రియ యను వ్యవహారము సరికాదు. చూ. 22సూ. (చూ. మూలములు)

## తిగుచు ధాతువు నన్నంతరూపములు తివ్వఁ దివ ననియు. 20

ఉ: క. ఎవ్వరికిని మోపెట్టను, దివ్వను శక్యంబు గాని దృఢకార్ముకమున్. భార. ఆది. 7ఆ-25. కొప్పువట్టి తివంబోవ. కళా.3 ఆ-127.

వ్యా. తిగుచు ధాతువుయొక్క, అన్నంతక్రియారూపములు (=కారక 12) తివ్వను, తివను-అనియు నగును. తిగుచు-ధాతువు. బా. క్రియా 40చే-తిగుచు+నుజీ. బా. క్రియా 88చే. తిగువు+నుజీ. బా. క్రియా 20చే- తిగువను-అని యగును. తిగువను-అను దానికి తివ్వను, తివను-రూపాంతరము లగునని యుటఁ బూరింపఁబడెను.

విమర్శ:- (i) అన్నంత-అనుట సరికాదు. నుజ్యంత-అనవలెను. చూ. 22 (ii) ఇవి, తివ్వు ధాతునుజ్యంతములనఁ దగును. (చూ. అనుబంధము. విషయసంఖ్య-107; సూ.వి.)

## కంటె వర్ణకంబు పరంబగునపుడు విశేషణ నవర్ణకంబుమీఁది యమహత్తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాషనగు. 21

ఉ: క. లో, క్షత్రయరాజ్యము మును నిర, మిత్రముగాఁ గనిన కంటె. లక్ష్మీ. 3ఆ-138. విభుని పంచినకంటె హరి. ఉ. 4ఆ. తే. శరణుఁజొచ్చిన రక్షింపఁ జాలియుండి, మనుపకుండిన కంటెఁ గల్మషము గలదె. విక్ర. 3ఆ-93. క. కుడిచినకంటెను క్షేత్రము, పడసిన తెఱవధిక మంద్రు పాడికిఁ జనుచోన్. విజ్ఞా. వ్య. 48. పక్షమున-కనినదానికంటె. మొ॥

వ్యా. కంటెప్రత్యయము పరమగునపుడు, ధాతుజ విశేషణముయొక్క "న" ప్రత్యయముమీఁది, అమహ త్తచ్ఛబ్దార్థమునకున్=అమహద్వాచకమగు "ఆ" శబ్దమునకు (=అది, అవి శబ్దములకనుట.) లోపము విభాషనగును. కనిన+దాని+కంటె. కనిన ధాతుజ విశేషణము (బా. క్రియా 46) దీని నవర్ణకముమీఁది "దాని" అను ననుహత్తచ్ఛ బ్దార్థమునకు లోపము కలిగిన, కనినకంటె-అగును. పక్షమున-కనినదాని కంటె. ఇట్లే, పంచిన+దాని+కంటె=పంచినకంటె, పంచినదానికంటె. ఉండిన+దాని+కంటె=ఉండినకంటె, ఉండిన దానికంటె. కుడిచిన+దాని+కంటె=కుడిచినకంటె, కుడిచినదానికంటె.

విమర్శ:- తచ్ఛబ్దలోపము గ్రాహ్యము కాదు. (చూ. అనుబంధము. విషయసంఖ్య-29)

## క్రియా విధేయ విశేషణంబుల మీఁది యగు ధాతువున కన్నంతమునకు లోపంబు విభాషనగు. 22.

ఉ: క్రియావిశేషణములకు:- క. పెల్లుదొరఁగు నెత్తురునై. భార. భీష్మ 1ఆ-270. క. సౌందర్యవిలాసాదుల, యందునె తగులువడి యితర మరయని మగవా,రుందఱచు గలర. కళా 7ఆ-94. క. తెల్లము నాకెఱిఁగింపుము. వి. పు. 2ఆ. విధేయ విశేషణములకు:- క. లవణంబు

కప్పమడుగుము. ఉ. హరి. 4ఆ-134. తగువస్తువు లప్పన మంపువారు. కళా 8ఆ-45. వరుని[ప్రేమ నడువఁ దెరువాటు గొ్ట్టె. కళా. 7ఆ-239. చ. భవ,జ్జనకుఁ బరీక్షితున్ భుజగజాల్మఁ డసహ్య విషోగ్ర ధూమకేతన హతిఁజేసి చేసె నతిదాంతుఁ గృతాంత నికేతనాతిథిన్. భార. ఆది. 1ఆ-124 పక్షమున-పెల్లుగ దొరఁగు, కప్పముగ నడుగుము, కృతాంత నికేతనాతిథిగ. మొ॥ మంత్రులఁగా, నొనరించితె? భార. సభా 1-26. మొ॥

వ్యా. క్రియావిశేషణములు, విధేయవిశేషణములు ననువాని మీఁది, అన్నంతమునకున్= అన్నంతమైన, అగుధాతువునకున్=అగు ధాతువునకు-అనఁగా "కాను." శబ్దమునకు, దీనిరూపాంతరమగు "కను" శబ్దమునకు (బా. క్రియా 115, 116) లోపము విభాషనగును. క్రియా విశేషణముల మీఁది కాను (కను) శబ్దలోపమునకు:- పెల్లు+కాను(కను)+తొరఁగు. కాను(కను)లోపించిన-పెల్లు+తొరఁగు=పెల్లుదొరఁగు. కాను(కను)లోపింపనిచో- పెల్లు+కాను(కను)+తొరఁగు=పెల్లుగాఁ(గఁ)దొరఁగు. తలఁచు+కాను (కను)+కలర. కాను(కను)లోపించిన-తలఁచు+కలర=తలఁచుగలర. పక్షమున-తలఁచుగాఁ(గఁ) గలర. తెల్లము+కాను(కను)+నాకున్+ఎఱిఁగింపుము. కాను(కను)లోపించిన-తెల్లము నాకెఱిఁగింపుము. విధేయ విశేషణముల మీఁది కాను (కను) శబ్దలోపమునకు: విధేయ విశేషణము=(చూ. కారక 25) లవణంబు, కప్పము+కాను(కను)+అడుగుము. కాను(కను) లోపించిన: కప్పము+అడుగుము=కప్పమడుగుము. పక్షమున-కప్పముగా (గఁ) నడుగుము. తగు వస్తువులు, అప్పనము+కాను(కను)+అంపువారు. కాను(కను) లోపించిన-తగువస్తువులు, అప్పనమంపువారు. పక్షమున-అప్పనముగా (గ) నంపువారు. వరుని[ప్రేమ నడువఁ, తెరువాటు+కాను (కను)+కొట్టె. కాను(కను)లోపించిన-తెరువాటుగొట్టె. పక్షమున- తెరువాటుగాఁ( గఁ)గొట్టె. పరీక్షితున్...చేసె...కృతాంత నికేతనాతిథిని+కాను(కను). ఇట, కాను(కను) లోపించిన పరీక్షితున్...చేసె...కృతాంత నికేత నాతిథిని. ద్రుతస్వర లోపము: కృతాంతనికేతనాతిథిన్. పక్షమున- నికేతనాతిథిఁగాను (గను.) కాను(కను) లోపింపకపోవుటకు-(విప్రుల) మంత్రులఁగా, నొనరించితె. ఇట, "కాను" లోపింపలేదు. (మంత్రులను+కాను=మంత్రులఁగాను.) బాలవ్యాకరణమున "కాను" క్రియావిశేషణములకు నిత్యముగా విధింపఁబడినది. దానికిట లోపము విభాషగ విధింపఁబడినది.

విమర్శ:- "అగు ధాతువున కన్నంతమునకు" అనుట సరికాదు. అగు+అన్=కాన్-అని కాలేదు. నుజ్యంతంబగు నగు ధాతువని బాలవ్యాకరణానుసారముగ వ్యవహరించుట యుక్తము. అగు+నుజ్=కా+ను: కాను-అయినది. కావున, అన్నంతములను వ్యవహారము సరికాదు. నుజ్యంతములనుట యుక్తము.

### ఒకానొకచో నన్నంతమగు నగుధాతువు దీర్ఘంబునకు భావ్యర్థంబున నున్న పరంబగునపుడు హ్రస్వమును గానంబడియెడి. 23

ఉ: క. తరుణీ! యేరికిఁ జెల్లునె, యరయఁగ నేమింతవారమనుకొన నిదిగో, పిరువీఁకు గనున్నది తాఁ, గరమద్భుతమైన సవతి కయ్యముచేతన్. (కనున్నది=కానున్నది యనియర్థము పిరువీఁకు-కర్త) కళా 1ఆ-72. నీకు

నాథుఁడు గనున్న మహామహూ నానృపాలు నా, కెప్పుడు చూడఁగాఁ గలుగు? (నాథుఁడు, గనున్న=నాథుఁడు, కానున్న యని యర్థము.) కళా 5ఆ-72. మొ॥

వ్యా. ఒకానొకచో, అన్నంతమగు, అగుధాతువు యొక్క అనఁగా, కాను శబ్దముయొక్క దీర్ఘమునకు, ఉన్న శబ్దము పరమగునపుడు భావ్యర్థంబునన్=భవిష్యదర్థమున, హ్రస్వమును గనఁబడును. బాలవ్యాకరణమునఁ గ్రియావిశేషణముల కనుప్రయుక్తమగు, కామశబ్ద దీర్ఘమునకు హ్రస్వము విభాషగ విధింపఁబడెను. (బా. క్రియా 115, 116) ఇట, ననుప్రయుక్తముకాని "కాను" శబ్దముయొక్క దీర్ఘమునకు, ఉన్నపరమగునపుడు భవిష్యదర్థమున హ్రస్వము విభాషగ నగునని పూరింపఁబడెను. పిరువీఁకు, కాను+ఉన్నది=కను+ఉన్నది. ద్రుతస్వరలోపము: కన్+ఉన్నది=కనున్నది. పక్షమున-కానున్నది. నాథుఁడు, కాను+ఉన్న= కను+ఉన్న. ద్రుతస్వరలోపము: కన్+ఉన్న=కనున్న. పక్షమున పిరువీఁకు, కానున్నది. నాథుఁడు, కానున్న.

విమర్శ:- (i) అన్నంతమగు "అగు" ధాతువున కను వ్యవహారము సరికాదు. నుజ్యంతమగు నగు ధాతువున కనవలెను. చూ 22 సూ. (ii) ఉన్నపరము కాని స్థలములందును కాను దీర్ఘమునకు హ్రస్వము ప్రయోగములలోఁగలదు (చూ-ము.కౌ. క్రియా 30) (అనుబంధము. విషయసంఖ్య-108

## శబ్దపల్లవక్రియలు కొన్ని ద్విరుక్తంబులగుచో నుత్తరపదంబు పూర్వావయవంబునకు లోపంబు విభాషనగు. 24

ఉ: చటుల ఖురోద్భటాశ్వశ్రేణిఁ బొదివి ర,యంబునఁ దునిమి తూఁటాడి యాడి. భార. విరా 5ఆ-56. సీ. ఇందురా రావయ్య విందులు విందులం, చర్ఠిఁ బిల్వఁగ నడయాడి యాడి. హరి. పూ. 5ఆ-193 పోరాడి యాడి చెన్నొదవెనేని. హరి. పూ. 7ఆ. వ. పరస్పర జయార్థులగుచు వాదడిచి యడిచి. కాశీ 5ఆ-89. సీ. ఎడనెడను గవళ్లఁదడఁబడ కుండంగ, గుఱుతులు మదిఁబాదుకొలిపి కొలిపి. కళా. 4ఆ-41. తదీయరూపమున్, మదిఁ దలపోసి పోసి. పర. 2ఆ. మొ॥ పక్షమున-తూఁటాడి తూఁటాడి. మొ॥

వ్యా. కొన్ని శబ్దపల్లవక్రియలు, ద్విరుక్తంబులగుచోన్=రెండుసార్లు పలుకఁబడినవైనప్పుడు, ఉత్తరపదంబు=పరపదముయొక్క, అనఁగా రెండవసారి పలుకఁబడిన శబ్దపల్లవ పదముయొక్క, పూర్వావయవంబునకున్=ముందటి యవయవమునకు, లోపము విభాషనగును. (ఉత్తరపద మనునది యిటఁ బారిభాషికపదముగా నుద్దిష్టము కాదు.) తూఁటు+ఆడు=తూఁటాడు- శబ్దపల్లవక్రియ. శబ్దపల్లవము. చూ. బా. క్రియా 118. తూఁటాడి+తూఁటాడి- అనుచో శబ్దపల్లవక్రియద్విరుక్తమయినది. దీనిలో, రెండవసారి పలుకఁబడిన, తూఁటాడి- అనుదానిలోని (తూఁటు+ఆడు) పూర్వావయవమగు, తూఁటు-శబ్దమునకు, లోపము, విభాష నగును. తూఁటాడి+తూఁటాడి=తూఁటాడి+ఆడి=తూఁటాడి యాడి. పక్షమున-తూఁటాడి తూఁటాడి. ఇట్లే, నడ+ఆడు=నడయాడు. నడయాడి+నడయాడి=నడయాడి యాడి, నడయాడి నడయాడి. పోరు+ఆడు=పోరాడు. పోరాడి+పోరాడి=పోరాడి యాడి, పోరాడి పోరాడి. వాదు+అడుచు=వాదడుచు. వాదడిచి+వాదడిచి=వాదడిచి యడిచి, వాదడిచి

వారడిచి. పాదు+కొను= పాదుకొను+పు: పాదుకొలుపు. (బా. క్రియా 77) పాదుకొలిపి+పాదుకొలిపి=పాదుకొలిపి కొలిపి; పాదుకొలిపి పాదుకొలిపి. తలఁపు+పోయు=తలపోయు. తలపోసి+తలపోసి=తలపోసిపోసి, తలపోసి తలపోసి.

## శబ్దపల్లవక్రియలును ద్వ్యవయవ క్రియలును సమాప్తంబులయి పునర్గృహీతంబులగుచోఁ దత్పూర్వావయ వంబులకు లోపంబు విభాషనగు. 25

ఉ: ఆలతాంగిఁ దో,డ్కొని చనుదెమ్ము తే ననువుగూడని పక్షమునందు. భోజ. 3ఆ–229. ఇలకుం దివికిం జననిచ్చు నిచ్చియే, నని వెసనార్చు. రా. అర. కాం 2ఆ–126 మొ॥ పక్షమున–చనుదే, చననిచ్చు. మొ॥

వ్యా. శబ్దపల్లవక్రియలును, ద్వ్యవయవక్రియలును, సమాప్తంబులయి=వాక్యపరిపూర్తి నందినవై, పునర్గృహీతంబు లగుచోన్=మరల గ్రహింపఁబడునప్పుడు, వాని పూర్వావయవ ములకు లోపము విభాషనగును. శబ్దపల్లవక్రియ=చూ. బా. క్రియా 118. ద్వ్యవయవక్రియ (ద్వి+అవయవ+క్రియా)=రెండవయవములుగల క్రియ. అసమాపక క్రియారూపములకు, అగు, ఇచ్చు, పోవులోనగు ధాతువులు చేరి యేర్పడు జంట రూపములు ద్వ్యవయ వక్రియలనఁబడును. శబ్దపల్లవక్రియ సమాప్తమై పునర్గృహీతమగునపుడు పూర్వావయవ లోపమునకు: ఆ లలితాంగిఁదోడ్కొనిచనుదెమ్ము. తేననువు గూడని పక్షమునందు. ఇట, చనుదెమ్ము–అను శబ్దపల్లవక్రియ సమాప్త మయినది. మరల గ్రహింపవలసి వచ్చినప్పుడు పూర్వావయవమగు "చను" లోపించి చనుదెమ్ము=తేన్–అని యయినది. విభాష గనుక–చనుదెమ్ము. చనుదేన్ అనియు నుండును. ద్వ్యవయవక్రియ, సమాప్తమయిపునర్గృ హీతమగుచోఁబూర్వావయవలోపమునకు: ఇలకుం దివికిం జననిచ్చు నిచ్చి యేవని వెసవార్చు. ఇట, చననిచ్చు–ద్వ్యవయవక్రియ. చను+నుజీ=చనను–(బా. క్రియా40) నుజ్యంతమగు నసమాపకక్రియ. ఇచ్చుధాతువు చేరి–చనన్+ఇచ్చు=చననిచ్చు–అయినది. ఇలకుం దివికిం జననిచ్చు– (=చననిచ్చును.) అనుచో ద్వ్యవయవక్రియ సమాప్తమయినది. మరల గ్రహించుచో, చనన్–అను పూర్వావయము, లోపించి, చననిచ్చు నిచ్చి–అని యయినది. విభాష గనుక, చననిచ్చు–చననిచ్చి–అనియు నుండును.

విమర్శ:- (i) చనుదెమ్ము–అను రూపము బాలవ్యాకరణమున శబ్దపల్లవముగా సాధింపఁబడ లేదు. వేఱుగా సాధింపఁబడినది. (బా. క్రియా 111) ఇటఁ ప్రౌఢవ్యాకర్త దీనిని శబ్దపల్లవముగా భావించెను. (చూ. అనుబంధము. విషయసంఖ్య–109)

## ఒకానొకచో సహార్థంబున యుష్మదస్మదర్థంబు లభిహితంబు లగు నపుడు క్రియలు తత్కార్తృకంబులు విభాషనగు. 26

ఉ: ఉ. విప్రకులుండవెల్వడుమువేగమనీవును నీనిషాదియున్. భార. ఆది 2ఆ–63 క. మన కాప్తుఁడు సంజయుఁ డీ,తని యుపదేశంబు వట్టి ధర్మమున ముకుం,దుని నాశ్రయింపవయ్య! య,తనిఁ బొందిన బ్రదుకు దీవుఁ దమ్ములు సుతులున్. భార. ఉద్యో 2ఆ–321. నేను నా, సేనయు దాడిపెట్టెద విశృంఖలతన్. హరి. ఉ. 3ఆ–94. ఆ. ఎలుఁగురాలుపడఁగ. నిట్లను బదునాలు, గేండ్లు రాఘవుండు నీవు నన్న, రణ్యభూములందు

రక్షించి నేఁడు కా,అడవి నెట్టులొంటి విడిదెదనిన. జై 6ఆ–68 మొ॥ పక్షమున మోహాంధుండు భీష్ముండుఁ గే, శవ! నీవుం గడఁగుండు. భార సభా 2ఆ–63 మొ॥

వ్యా. ఒకానొకచోట, సహార్థమునన్="సహ" శబ్దముయొక్క యర్థమున, యుష్మదస్మదర్థంబులు=యుష్మదర్థము (నీ–శబ్దము) అస్మదర్థము (నాశబ్దము) అభిహితంబులు=క్రియా ప్రత్యయముచేఁ జెప్పఁబడునవి, అగునప్పుడు క్రియలు, తత్కర్తృకంబులు=అభిహితములైన, "నీ–నా" శబ్దములు కర్తలుగాఁ గలవి, విభాషనగును. "అన్యయుష్మ దస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు (బా. కారక 36)" అను బాలవ్యాకరణ సూత్రముచే నన్యకార్యముకంటె యుష్మత్కార్యము, యుష్మత్కార్యము కంటె నస్మత్కార్యము, బలీయము లగును. అయినను గర్తలనేకము లగును గావునఁ గ్రియ బహువచ నాంతమే యగును. అట్లుకాక, క్రియాప్రత్యయముచే, "నీ–నా" శబ్దము లభిహితములైనప్పుడు, క్రియ, యేకవచనాంతము విభాషనగునని యీ ప్రౌఢవ్యాకరణ పూరణమునకుఁ దాత్పర్యము. నీవును నీ విషాదియున్ వెల్వఁడుము. నీవు–యుష్మదర్థకము. నిషాది–అన్యము. బా. కారక 36చే–యుష్మదర్థమే బలీయమగుటచేఁ గ్రియ మధ్యమపురుషము కావలెను. నీవు, నిషాది–అను రెండును గర్తలగుటచే క్రియ, బహువచనాంతమును, గావలెను. అట్లుకాక, క్రియ, యేకవచనాంతము విభాషనగునని, యిటఁ బూరింపఁబడెను. బహుకర్తృకత్వమును దప్పించుటకు సహార్థము వివక్షించి క్రియాప్రత్యయముచే నభిహితమగు యుష్మదర్థము నొకదానినే కర్తగా భావించి క్రియ నేకవచనాంతముగఁ బ్రయోగించినట్లు గ్రహింపవలె నన్నమాట. నీవును, నీనిషాదియున్ = నీనిషాదితోఁగూడ, వెల్వఁడుము–అని యర్థము. విభాషనమటచేఁ బక్షమున–నీవును నీ నిషాదియున్, వెల్వఁడుఁడు–అని యుండవచ్చును. ఈవుఁదమ్ములు సుతులున్ బ్రదుకుదు (వు)ఇట, ఈవు–యుష్మదర్థకము. తమ్ములు, సుతులు– అన్యము. ఈవు–అను యుష్మదర్థ మొకటే కర్తగా భావించి, బ్రదుకుదు (వు) అని క్రియ యేకవచనాంతముగ వాడఁబడినది. ఈవున్, తమ్ములు సుతులున్=తమ్ములతో సుతులతోఁ గూడ, బ్రదుకుదు(వు) అని యర్థము. పక్షమున బ్రదుకుదురు–అని క్రియ బహువచనాంతము కావచ్చును. నేను నాసేనయు దాడివెట్టెద. నేను–అస్మదర్థకము. సేన–అన్యము. అస్మదర్థమొకటే కర్తగా భావించి దాడిపెట్టెదన్–అని క్రియ యేకవచనాంతమయినది. పక్షమున–నేను నాసేనయు దాడిపెట్టెదము–అగును. నేను, నాసేనయు=నాసేనతోఁ గూడ, దాడివెట్టెద నని యర్థము. రాఘవుండు నీవు...ఎట్టులొంటి విడిచెదు. నీవు–యుష్మదర్థకము. రాఘవుండు–అన్యము. నీవు–అను యుష్మదర్థ మొకటే కర్తగా భావించి, విడిచెదు, (=విడిచెదవు)–అని క్రియ యేకవచనాంతముగ వాడఁబడినది. పక్షమున–విడిచెదరు. అని బహువచనాంతమగును. నీవును, రాఘవుండును= రాఘవునితోఁ గూడ, ఎట్లు విడిచెదు. అని యర్థము. బహువచనాంత మగుటకు–భీష్ముండు నీవును గడఁగుండు ఇటఁ క్రియ, కడగుండు అని బహువచనాంత మయినది. (చూ. అనుబంధము విషయసంఖ్య–110)

## కర్తృభూత క్రియతోడం దత్కర్త కన్వయంబగు. 27

ఉ: నీవు రావచ్చును; బోవచ్చును మొ॥ ఇందు రాఁబో నను కర్తృభూత క్రియలతో వానికిఁ గర్తయగు నీవను దాని కన్వయంబని యెఱుంగవలయు.

వ్యా. కర్తృభూతక్రియతోడన్=వలయ్వాది క్రియలకుఁ గర్తయగు భావార్థక నుబ్యంత క్రియతో (చూ. బా. క్రియా 122) తత్కర్తకున్=దానియొక్క కర్తకు–అనఁగా, ఆకర్తృభూత క్రియయొక్క కర్తకు, అన్వయమగును. నీవు రావచ్చును. ఇట వచ్చును అను వలయ్వాది క్రియకుఁ గర్త· "రాను" అను భావార్థక నుబ్యంతము.

(రాను+వచ్చును=రావచ్చును) కావున రాను-కర్తృభూత క్రియ. ఈ కర్తృభూత క్రియకుఁ గర్త, నీవు-అను యుష్మచ్ఛబ్దము. నీవు-అనునది, రాను-అను కర్తృభూతక్రియతో నన్వయించుచున్నది. ఇట్లే, నీవుపోవచ్చును-అనుచో, పోను-అను కర్తృభూతక్రియతో దాని కర్తయగు నీవు-శబ్దమన్వయించుచున్నది. వలయ్యాదిక్రియతో నీవు-మున్నగువాని కన్వయముండదనియు, వీనికిఁ గర్తృభూత క్రియతోనే యన్వయమనియు నీ సూత్రము స్పష్టపఱుచుచున్నది. కాన నిది బాలవ్యాకరణమునకు వివరణము. (చూ. బా. క్రియా 122-ఘంటా)

ఒఓలకు సందేహార్థకంబులకు వలయుచోఁ గొన్నియెడలఁగదాకదే
లనుప్రయుక్తంబులగు. ఉద్దేశ్యంబు ద్వ్యవయవంబేని
విధానంబం దొక్కటి కడదాని కగు. 28

ఉ: ఎంతకృతార్థులమో కదా! వి.పు. 7ఆ-57. శాంతంబు కాదో కదే. భోజ. 3ఆ-232. అవునో కాదో కదా. రామా, 6ఆ-130. మొ॥

వ్యా. సందేహార్థకములగు, ఒఓలకుఁ, గావలసినచోఁ, గొన్నియెడల, కదా, కదే-అనునవి యనుప్రయుక్తము లగును. ఉద్దేశ్యంబు=దేనిని గూర్చి వ్యాకరణకార్యముద్దేశింపఁబడునో యది యుద్దేశ్యము. ఇట, ఒఓలు-ఉద్దేశ్యము. ద్వ్యవయవంబేని (ద్వి+అవయవ)=రెం డవయవములుగలది యైనచో, విధానంబందున్=ఉద్దేశ్యమునకగువని విధించిన వ్యాకరణ కార్యమునందు, (కదా, కదే-విధానము) ఒకటి, కడదానికిన్= చివరిదానికి, అనఁగా నుద్దేశ్యముయొక్క రెండవయవములలోఁ జివరిదానికి, (రెండవదానికనుట) అగును. ఉద్దే శ్యమునందు, రెండవయవములున్నప్పుడు, విధానములలో నొకటి, యాయుద్దేశ్యమునందలి రెండవ యవయవమున కగునని యర్థము. ఒఓలకు, కదా-కదే లనుప్రయుక్త మగుననుటచే, ఒఓలు-ఉద్దేశ్యము. కదా, కదే-విధానము, నగును. కావున-ఒఓలు రెండవయవములుగలవి యయినచో, వానిలో రెండవ యవయవమునకు, కదా, కదేలలో నొకటి చేరునని తాత్పర్యము. ఒఓలకుఁ గదాకదేలనుప్రయుక్తమగుటకు:- ఎంతకృతార్థులము+ఓ+కదా. ఇట, ఓ-అను సందేహార్థకమునకు, కదా- అనుప్రయుక్తమయినది. శాంతంబుకాదు+ఓ+కదే. ఇట, ఓ-అను సందేహార్థకమునకు, కదే, అనుప్రయుక్తమైనది. ఒఓలు రెండవయవములు గలవియైనప్పుడు, వానిలో రెండవ యవయవమునకుఁగదాకదేలలోనొకటి చేరుటకు:- అవునో కాదోకదా! ఇట, అవును+ఒ, కాదు+ఒ-అనుచో, ఒకారము రెండవయవములు గలిగియున్నది. కనుక రెండవ యవయవమునందలి ఒకారమునకు, కదా-అనుప్రయుక్తమైనది. ఇట్లే కదే-అనుప్రయుక్తమగును. (చూ. అనుబంధము. విషయసంఖ్య-111)

తఱచుగం గ్రియలమీఁది కదకదవుల కన్నాదులు పర్యాయంబున
ననుప్రయుక్తంబు లగు. 29

ఉ: ఆ-అలసితివి గదన్న యాఁకొంటివి గదన్న. భాగ. 10స్కం. పూ. 259. వీయపురాలవైతి గదవే యిపుడు. విజ. 3ఆ-125. మొ॥ తఱచుగ ననుటచే-ఉ. పూఁతపసిండి వంటి వలపుం బచరించు కులంబు నీతికిన్, లేఁతగదమ్మ యిత్తెఱఁగు లేమ. స్వా. 3ఆ-33. దయాంబురాశివి గదమ్మ. భాగ. 10 స్కం. పూ. 1742. ఇత్యాదు లూహ్యంబులు.

వ్యా. తలచుగాఁ గ్రియలమీఁది, కద, కదవు–అనువానికి, అన్న–మున్నగు శబ్దములు, పర్యాయమున, నమప్రయుక్తములగును. అలసితివి+కద+అన్న=అలసితివి గదన్న. ఆఁకొంటివి+కద+అన్న= ఆఁకొంటివి గదన్న. ఐతి+కదవు+ఏ=ఐతిగదవే. అలసితివి. ఆఁకొంటివి, ఐతి(వి)–అనునవి క్రియాపదములు. తలచుగ–అనుటచేఁ గొన్నిచోట్లఁ గ్రియేతరములమీఁదను. కద కదవులకు, అన్నాదులు, పర్యాయమునఁ జేరవచ్చును. లేఁత+కద+అమ్మ=లేఁతగదమ్మ. దయాంబురాశివి+కద+అమ్మ=దయాంబురాశివి గదమ్మ.

## అన్వ్రిత్యయాంతమగు నగు ధాతువు కొన్నియెడలఁ బెక్కు చోట్ల కొక్కటియు నగు. 30

ఉః తే. ధర్మజుఁడు తూర్పు భీముఁడు దక్షిణంబు, నర్జునుఁడు పడమర గవ లర్థి నుత్తరంబుగా వేఁటఁబోయిరి రాజముఖ్యు, లనఘు లింతకు వత్తురు వినుతబలులు. భార. ఆర. 6ఆ–158, పక్షమునఁదూర్పుగ, దక్షిణంబుగ, పడమరగ, ననియు, నుండవచ్చును.

వ్యా. కొన్నిచోట్ల, అన్వ్రిత్యయాంతమగు అగు ధాతువు="కాను" అమనది, పెక్కుచోట్ల కొక్కటియు నగును. తూర్పు, దక్షిణంబు, పడమర, ఉత్తరంబుగా వేఁటఁబోయిరి. ఇట 'కాను' అనునది, ఉత్తరంబుగా–అను, నొక్కచోటనే యయినది. పక్షమున–తూర్పుగా, దక్షిణంబుగా, పడమరగా, ఉత్తరంబుగా–అని యెల్లచోట్లఁ గావచ్చును.

విమర్శః– కాను–అనునది అన్వ్రిత్యయాంతమగు అగు ధాతువనుట సరికాదు. చూ. 22 సూ.

## కాదె కదార్థకంబగు. 31

ఉః ఎ.గీ. శౌరి కృపగాదె నాకు నక్షయ బలంబు. జై. 2ఆ–64.

వ్యా. కాదె–అనునది, కదా శబ్దముయొక్క యర్థము గలది యగును. కృపగాదె=కృపకదా–అని యర్థము. (చూ. అనుబంధము. విషయసంఖ్య–112)

## అయి కా నవ్యయంబులు స్వయమర్థకంబు లగు. 32

ఉః వాఁడయివచ్చెను. వాఁడుగావచ్చెను. వాఁడు తనంత వచ్చెననుట. ఉ. తలంపరునీకుఁ దెల్పు నీవై పరికింపవంచు దురహంకృతి నాయమఁ గన్న దంపతుల్. కళా 7ఆ–36. అక్షీణప్రభావుండు స,ర్వకళా సంజనకుండు నారదుఁడుగా రాఁజూచి. నిర్వ. 5ఆ–35. మొ॥

వ్యా. అయి, కాను, అను నవ్యయములు కొన్నిచోట్ల స్వయమర్థకములగును. వాఁడయి (వాఁడు+అయి) వచ్చెను, వాఁడుగావచ్చెను=వాఁడు తనంత వచ్చెనని యర్థము. (చూ. శబ్ద 107) నీవై పరికింపవంచు=నీవు స్వయముగాఁ బరికింపవంచు–అని యర్థము. (అదే ప్రకరణోచితము) నారదుఁడుగా రాఁజూచి= నారదుఁడు స్వయముగా రాఁజూచి అని యర్థము. (కాను=చూ. బా. క్రియా 115.)

విమర్శః– నారదుఁడుగా=నారదుఁడు స్వయముగా అను నర్థము తృప్తికరము కాదు. సం, ర్వకళాసంజనకుండు నారదుఁడురాఁగాఁ జూచి–అను, ముద్రిత పాఠమును గ్రహింప

నగును. లేదా, నారదుఁడుదా రాఁజూచి-సాధు పాఠ మననగును. 'గా' లిపికర ప్రమాదమయి యుండును.

## అకా నిత్యర్థకంబగు. 33

ఉ: అపజయమకా లక్షించి భార. ఆర. 2అ-64 మొ॥

వ్యా. అకాన్=అ-అను నవధారణార్థకము మీఁది, కాము-అను,నగు ధాతు నుజ్యంతము, ఇత్యర్థకంబు=ఇతి శబ్దముయొక్క యర్థము గలది, యగును. అపజయము+అ+కాను=అపజయమే, యగునని, లక్షించి-యన్నమాట.

## కరఁగు, తలఁగు, మెఱయ్యాద్యు లంతర్భావిత ప్రేరణంబులు. 34

వ్యా. కరఁగు, తలఁగు, మెఱయు, మున్నగునవి యంతర్భావిత ప్రేరణములు. అంతర్భావిత ప్రేరణము=అంతర్భవింపఁబడిన ప్రేరణార్థముగలది. అనఁగాఁ దనలోఁ బ్రేరణార్థమును గూడ నిముడ్చుకొన్న ధాతు వంతర్భావిత ప్రేరణ మనఁబడును. కరఁగు= కరఁగించు. తలఁగు=తలఁగించు. (=తొలగించు) మెఱయు=మెఱయించు. ఇట్లు వీనిలోఁ బ్రేరణార్థము గూడ నిమిడియున్నది. అప్రేరణార్థమెట్లును వీనికుండును. కరఁగు=ద్రవించు, తలఁగు=తొలఁగు. మెఱయు=ప్రకాశించు; బయలుపడు. (చూ. అనుబంధము. విషయసంఖ్య-113)

## అడుగ్వాదులు ద్వికర్మకంబులు. 35

## ఇది క్రియాపరిచ్ఛేదము

వ్యా. అడుగు-మున్నగు ధాతువులు, ద్వికర్మకంబులు=రెండు కర్మలుగలవి, యగును. వామనుఁడు బలిని మూఁడడుగుల భూమినడిగెను. ఇట, భూమి, బలి-అను రెండు కర్మలు గలిగియుండుటచే అడుగు- అనునది ద్వికర్మకము. (చూ. అనుబంధము. విషయసంఖ్య-114)

## ఇది ఘంటాపథము

★ ★ ★

# కృదంత పరిచ్ఛేదము

### డయ్యు దయ్యు నొచ్చు పుచ్చుల కివర్ణకంబగు. అగుచో వాని కడహల్లులు పకారంబులగు. 1

ఉ: డప్పి, దప్పి, నొప్పి, పుప్పి.

వ్యా. డయ్యు, దయ్యు, నొచ్చు, పుచ్చు–అను ధాతువులకు ఇవర్ణకమగును. అగుచో వాని తుదిహల్లులు పకారములగును. డయ్యు+ఇ=డయ్ప్+ఉ+ఇ. యకారపకార సంయోగము, విజాతీయ మగుటచే, యకారము పకారముగా మాఱును. డప్ప్ఉ+ఇ=డప్పి–ప్రాతిపదికమగును. డప్పి+సు. బా. తత్సమ57చే– డప్పి. ఇట్లే, దయ్యు+ఇ=దప్పు+ఇ: దప్పి. నొచ్చు+ఇ=నొచ్ష్ఉ+ఇ. చకారమునకు, పకారము: నొవ్పఉ+ఇ=నొప్పు+ఇ=నొప్పి. నొప్పి+సు. బా. తత్సమ57చే–నొప్పి. ఇట్లే, పుచ్చు+ఇ=పుప్పి. డయ్యునకు దయ్యు రూపాంతరమగుటచే (బా. ప్రకీర్ణ 14) దీనిని వేఱుగాఁ జెప్పుట స్పష్టార్థము.

### రాయున కిడీ వర్ణకంబు నగు. 2

ఉ: రాయిడి, రాపు

వ్యా. రాయు ధాతువునకు, ఇడి వర్ణకము సహితమగును. రాయు+ఇడి=రాయిడి–ప్రాతిపదికము. రాయిడి+సు. బా. తత్సమ57చే–రాయిడి. పక్షమున, బా. కృదంత 11చే–రాయు+పు. బా. కృదంత 2చే–రాపు– ప్రాతిపదికము. రాపు+వు. బా. తత్సమ 57చే–రాపు.

**విమర్శ:-** రాయునకడివర్ణకము నగును. (ము.కౌ. కృదంత 4)

### ఊర్చుబ్బుకందుదువ్వువడ్డించుల కైన వర్ణకంబగు; అగుచో ఊర్చుఉబ్బుల చకార బకారంబులు పకారంబులగు; వడ్డించు నించు లుప్తంబగు. 3

ఉ: ఊర్పెన, ఉప్పెన, కందెన, దువ్వెన, వడ్డెన.

వ్యా. ఊర్చు, ఉబ్బు, కందు, దువ్వు, వడ్డించు–అను ధాతువులకు, "ఎన" ప్రత్యయమగును. అగుచో, ఊర్చు ఉబ్బుల చకార బకారంబులు=ఊర్చు, చకారము, ఉబ్బు, బకారము–పకారములగును; వడ్డించు–ధాతువున, ఇంచు లోపించును. ఊర్చు+ఎన. చకారము నకు, పకారము; ఊర్ప్ఉ+ఎన=ఊర్పు+ఎన. బా. సంధి 11చే–ఊర్పెన–ప్రాతిపదికము. బా. తత్సమ 39చే–ఊర్పెన+ము. తత్సమ 57చే ఊర్పెన. ఉబ్బు+ఎన. బకారమునకు, పకారము: ఉప్బ్ ఉ+ఎన. పబల సంయోగము విజాతీయమగుటచే, బకారమునకు, పకారమగును. ఉప్ప్ఉ+ఎన=ఉప్పు+ఎన: ఉప్పెన–ప్రాతిపదికము. బా. తత్సమ 39చే–ఉప్పెన+ము. తత్సమ 57చే–ఉప్పెన. కందు+ఎన–కందెన: దువ్వు+ఎన–దువ్వెన–ప్రాతిపదికములు. బా. తత్సమ 39చే–కందెన+ము; దువ్వెన+ము. తత్సమ 57చే–కందెన, దువ్వెన. వడ్డించు+ఎన. ఇంచులోపము: వడ్డ్+ఎన=వడ్డెన+ము. తత్సమ 57చే–వడ్డెన.

విమర్శ:- వడ్డించు+ఎన-సరికాదు. వడ్డ+ఎన=వడ్డెన-అనవలెను. వడ్డన-ఆం. భా. బహూలా 4-31 (సూ. ని.) గ్రాహ్యము. (ము. కౌ. కృదంత 17).

### పురవర్ణకంబు కాఁచుదాఁచు దాయ్యాదుల కగు. 4

ఉ: కాఁపురము, దాఁపురము, దాపురము మొ॥

వ్యా. పుర ప్రత్యయము, కాఁచు, దాఁచు, దాయు, మున్నగు ధాతువుల కగును. కాఁచు+పుర, దాఁచు+పుర; దాయు+పుర. బా. కృదంత 2చే-కాఁపుర దాఁపుర-దాపుర-ప్రాతిపదికములగును. బా. తత్సమ39చే-కాఁపురము, దాఁపురము, దాపురము.

### ఎక్కుదిగులకుం బ్రేరణార్థంబున మతి వర్ణకంబగు. అగుచో నెగుఎక్కువ కాదేశంబగు. 5

ఉ: ఎగుమతి, దిగుమతి, ఇట్లు-ఎగువ.

వ్యా. ప్రేరణార్థమున, ఎక్కు దిగు ధాతువులకు, మతివర్ణకమగును. అగుచో ఎక్కుధాతువునకు, ఎగు-ఆదేశమగును. ఎక్కు+మతి=ఎగు+మతి: ఎగుమతి-ప్రాతిపదికము. ఎగుమతి+సు. బా. తత్సమ57చే- ఎగుమతి. దిగు+మతి=దిగుమతి+సు: దిగుమతి. ఇట్లు ఎగువ-అనుటచే, వప్రత్యయము పరమగునపుడు, ఎక్కునకు ఎగు ఆదేశమగును. ఎక్కు+వ=ఎగు+వ: ఎగువ-ప్రాతిపదికము. బా. తత్సమ 39చే-ఎగువ+ము. తత్సమ 57చే- ఎగువ. "ఎగుమతి=ఓడకు సరకులెక్కించుట, దిగుమతి=(ఓడనున్న సరకును రేవునందు) దించుట, ఎక్కు=ఆరోహించు. ఎగువ=మీఁదు" శ. ర.

### వువర్ణకం బులియ్యాదుల కగు. 6

ఉ: ఉలివు. మొ॥

వ్యా. ఉలియు, మున్నగు ధాతువులకు, వుప్రత్యయమగును. ఉలియు+వు. బా. కృదంత 2చే-ఉలివు- ప్రాతిపదికము. తత్సమ 48చే-ఉలివు+వు. తత్సమ 57చే-ఉలివు. వువర్ణకము మన్వాదులకు బా. కృదంత 17చే-విధింపఁబడినను "ఉలియు" ధాతువందుఁ జూపఁబడలేదు. కావున ఉలియు ధాతువందుఁ (=మన్వాదులందు) జేరుననుట, కీసూత్రము రచింపఁబడెను. కాననిది వివరణము. (చూ. అనుబంధము. విషయసంఖ్య-115)

### కాచువీచులకు వలి వర్ణకంబగు. 7

ఉ: కావలి, వీవలి.

## ఇది కృదంత పరిచ్ఛేదము

వ్యా. కాచు, వీచుధాతువులకు, వలి ప్రత్యయమగును. కాచు+వలి; వీచు+వలి. బా. కృదంత 2చే-కావలి, వీవలి-ప్రాతిపదికములగును. కావలి+సు; వీవలి+సు-బా. తత్సమ 57చే-కావలి, వీవలి. "ఇత్యాదులు, మహాజన వ్యవహారంబున నెఱుంగునది" అను బాలవ్యాకరణమున కివి పూరణములు.

ఇది ఘంటాపథము

★ ★ ★

# వాక్య పరిచ్ఛేదము

**వాక్యమునా యోగ్యతాకాంక్షా సహితంబగు నర్థము గల యాసత్తియుక్త పద సముదాయంబు. 1**

యోగ్యత యనఁగాఁ బదార్థములకుఁ బరస్పర సంబంధమునందు, బాధ కలుగకుండుట. ఆకాంక్ష యనఁగా, నిలుపుదల లేక పయిపయిం బోయెడి పదార్థముల మీఁది యాదరము. అది విను వారికిఁ దెలిసికొనవలయుననెడి యపేక్షారూప మయినది. ఆసత్తి యనఁగాఁ బదములచేరిక. యోగ్యతయు, ఆకాంక్షయు, ఆసత్తియు లేక, "నిప్పచేఁ దడుపుచున్నాఁడు" "గోవు, గుఱ్ఱము" అని యిట్లు చెప్పుట చేతను, బుద్ధిమఱపు లేక, నేఁడు "దేవదత్తు"ఁడని చెప్పి మఱియొకనాఁడు "పోవుచున్నాఁ"డని చెప్పుటచేతను, బదసముదాయము, వాక్యముగా నేర్పడినను నది, వాక్యమని చెప్పఁదగినది కాదని, తాత్పర్యము. వాక్యములందుఁ గొన్ని క్రియాన్వయము కలవి. కొన్ని తదితరాన్వయము కలవి. వాని కుదాహరణములు మీఁద స్పష్టములు గాఁగలవు. క్రియలనఁగా వర్తమానాద్యర్థకములయిన సమాపకక్రియలు. క్త్వా తద్వ్యతిరేక శతృ తుమున్ చేదా నంతర్యార్థకము లసమాపక క్రియలు. ఇందు మొదటివి మూఁడు క్రియాఽభిన్న కర్తృకంబులు. వెనుకటివి మూఁడు క్రియావిభిన్న కర్తృకంబులు.

వ్యా. వాక్యము, నాన్=అనఁగా, యోగ్యతా కాంక్షా సహితంబగు=యోగ్యతతో డను, ఆకాంక్షతోడను గూడుకొన్నదగు, అర్థముగల, అసత్తియుక్త=ఆసత్తితోఁ గూడుకొనిన, పద సముదాయము. యోగ్యత="పదార్థములకుఁ బరస్పర సంబంధమునందు బాధ కలుగకుండుట." అనఁగాఁ బదముల యర్థములకుఁ బరస్పరాన్వయమునందు విరోధము లేకపోవుట. (చూ. 4 సూ) ఉదా:- నిప్పచేఁ దడుపుచున్నాఁడు. ఇట, నిప్పచే-ఒక పదము, తడుపుచున్నాఁడు-వేఱొకపదము. తడుపుటయను క్రియకు, నిప్ప, హేతువుగా, వివక్షింపఁబడినది. కాని, తడుపుట యను ఫలమును సాధించుటకు, నిప్పయోగ్యమయిన వస్తువు కాదు. కాన, నిప్పచే-అను పదముయొక్క, యర్థమునకు, తడుపుచున్నాఁడు అను, పదముయొక్క యర్థమునకుఁ బరస్పరాన్వయము నందు, బాధ(=విరోధము) కలుగుచున్నది. కాన నీ వాక్యమున యోగ్యతలేదు. కనుక, నిదివాక్యమని, చెప్పఁదగినది కాదు. ఆకాంక్ష=నిలుపుదల లేక పయిపయిం బోయెడి పదార్థములమీఁది యాదరము. అది వినువారికిఁ దెలిసికొనవలయుననెడి యపేక్షారూపమయినది. అనఁగా, ఒక పదము నుచ్చరింపఁగానే, తెలిసికొనవలెనను నపేక్ష యంతతో ముగియక యింకను

దక్కిన పదార్థములను గూర్చి, తెలిసికొనవలెనని కోరుట, యాకాంక్ష. అన్వయమునకై యొకపదము మఱియొకపదమును గోరుట యాకాంక్షయని తాత్పర్యము. "గోవు, గుఱ్ఱము." ఇట గోవు–అనుపద మన్వయమునకు, గుఱ్ఱము–అనుపదమును గోరదు. కాన నిట, నాకాంక్ష లేకుండుటచే నిదివాక్యము కాదు. ఆసత్తి=పదములచేరిక. అనఁగా, ఎక్కువ వ్యవధానము లేకుండఁ బదములను దగ్గఱదగ్గఱగా నుచ్చరించుట, యాసత్తి. ఈ దినము దేవదత్తుఁ డనిచెప్పి, యావిషయమును, మఱచిపోక, జ్ఞప్తియుంచుకొని, మఱియొకదినము, పోవుచున్నాఁడు–అని చెప్పినచో, మొదట నుచ్చరించిన పదమునకుఁ దరువాత నుచ్చరించిన పదమునకు నధికవ్యవధానముండుటచే, నిట నాసత్తిలేదు. అనఁగా, నేఁడుచ్చరించిన, దేవదత్తుఁడను పదమునకు, మఱియొక నాఁడుచ్చరించిన, పోవుచున్నాఁడు–అను పదమునకు, నాసత్తి లేకపోవుటచే వాక్యముగా నేర్పడినను నిది వాక్యమని చెప్పఁదగినది కాదు. (వాక్యమున కుదాహరణము నిట్లు చూపనగును. నిప్పుచేఁ గాల్చుచున్నాఁడు. కాల్చుటకు నిప్పుయోగ్యమగు వస్తువగుటచే నిట యోగ్యతగలదు. నిప్పుచే–అనునది యన్వయమునకు, కాల్చుచున్నాఁడు– అను దానిని గోరుచుండుటచే–ఆకాంక్షగలదు. ఎక్కువ వ్యవధానము లేకుండఁ బలుకుటచే–ఆసత్తి కలదు. కాన నిదివాక్యమనిపించుకొనును.)

వాక్యములలోఁ గొన్ని క్రియాన్వయముగలిగియుండును. క్రియలనఁగా వర్తమానాద్యర్థక ములయిన సమాపక్రియలని యర్థము. కొన్ని తదితరాన్వయము=సమాపక క్రియేతరములతో, అనఁగా, నసమాపక క్రియలతో నన్వయము గలిగియుండును.

క్త్వార్థకము, తద్వ్యతిరేక=వ్యతిరేకక్త్వార్థకము, (క్త్వార్థకమునకు వ్యతిరేకము) శతృ=శత్రర్థకము, తుమున్= తుమున్నర్థకము (తుమర్థకము) చేత్=చేదర్థకము, ఆనంతర్యార్థకము, ననునవి యసమాపకక్రియలు. ఇందు మొదటివి మూఁడు, అనఁగా క్త్వార్థకము, వ్యతిరేకక్త్వార్థకము, శత్రర్థకము– అనుమూఁడు, క్రియాఽభిన్నకర్తృకంబులు. క్రియా=సమాపకక్రియల కర్తలకంటె, అభిన్న= వేఱుకాని, కర్తృకంబులు=కర్తలుగలవి. సమాపక క్రియల కర్తలనే, కర్తలుగాఁ గలిగినవని భావము. వెనుకటివి మూఁడు–అనఁగా, తుమున్నర్థకము, చేదర్థకము, ఆనంతర్యార్థకము, నను మూఁడు, క్రియావిభిన్న కర్తృకములు. క్రియా=సమాపకక్రియల కర్తలకంటె, విభిన్న=వేఱయిన, కర్తృకంబులు=కర్తలుగలవి. సమాపకక్రియల కర్తలుగాక వేఱుశబ్దములు కర్తలుగాఁ గలవి యని భావము. తుమున్నర్థకము=తుమర్థకము. సంస్కృతమున–తుమున్ ప్రత్యయము విధింపఁబడుటచే, తుమున్నర్థక మనఁబడెను. ధాతువులకుఁ జేరునది, "తుమ్" (గంతుమ్–ఇత్యాది) అనునదే కావున, బాలవ్యాకరణమున, తుమర్థమనఁ బడినది. చేదర్థము, క్రియావిభిన్న కర్తృకమగుటకు:– వానలు కుర్సినం బంటలు పండును. (బా. క్రియా 41) పండును–అను సమాపకక్రియకుఁ గర్త–పంటలు. కురిసినన్–అను చేదర్థమునకుఁ గర్త–వానలు. కాన, నిది, క్రియా విభిన్న కర్తృకము. తక్కిన యసమాపకక్రియల యుదాహరణములకు–చూ. 7సూ.

విమర్శ:– (i) తుమున్నర్థకమును గ్రియావిభిన్న కర్తృకమనుట సరిపడదు. చైత్రుండు వండను బోయెను. (బా. క్రియా40) ఇట, పోయెను–అను సమాపక క్రియకుఁగర్త–చైత్రుఁడు. వండను–అను తుమర్థకమునకును గర్త–చైత్రుఁడే. కనుక నిది క్రియాఽభిన్నకర్తృకమేయగును. (ii) భావలక్షణార్థమున వగు నుజీ, వృత్తమగు భావలక్షణమున నగు నవర్ణకము, ననువానిని గ్రియా విభిన్న కర్తృకములగు నసమాపక క్రియలని చెప్పవలెను. చూ. 7. (iii) క్త్వార్థక వ్యతిరేకక్త్వార్థకములను గ్రియాఽభిన్న కర్తృకములనుట సరికాదు. ఇవి యుభయములు నగును. (చూ. అనుబంధము. విషయసంఖ్య–117)

పదమనఁగాఁ బ్రయోగార్హంబు ననన్వితంబు నేకంబు
నర్థబోధకంబునైన వర్ణము లేక వర్ణ సముదాయము. 2

ఉ: ఖంబు, లేక ఘటంబు. మొ॥ ప్రయోగార్హము ఖ,ఘట. మొ॥ అన్వితము–ఖంబు ఘటంబునం దోఁచెడి–మొ॥ అనేకము– ఖంబును ఘటంబును. అనర్థబోధకము క, చ, ట, త, ప. మొ॥

వ్యా. ప్రయోగార్హము, అనన్వితము, ఏకము, అర్థబోధకము, నగు వర్ణము లేదా వర్ణసముదాయము పద మనఁబడును. వర్ణసముదాయము గల పదమునకు:– ఖంబు. ఖ– అనునది ప్రాతిపదికము. ము– విభక్తికిఁ బూర్ణబిందు పూర్వక బువర్ణము గలిగినది. ఇది యైదువర్ణముల పదము. ఘటంబు. ఘట– అనునది ప్రాతిపదికము. ము–విభక్తికి, "ంబు" ఆదేశమయినది. ఇది యేడు వర్ణములపదము. ప్రయోగార్హంబు=ప్రయోగించుటకుఁ దగినది, ప్రయోగయోగ్యము. ప్రయోగార్హమనుటచేఁ బ్రయోగార్హములు కాని ప్రాతిపదికాదులు పదములు కావు. ఖ, ఘట–అను ప్రాతిపదికములు, పదము లనిపించుకొనవు. అనన్వితము=అన్వితము కానిది, అనఁగా, నన్వయముతోఁ గూడుకొననిది. అనన్వితమనుటచే, నన్వితము, పదము కాదు. ఖంబుఘటంబునం దోఁచెడి. ఖంబు–అనునదియు, ఘటంబునన్–అనునదియు, తోఁచెడి–అను క్రియతో నన్వయముగలిగి యున్నవి. కాన, "ఖంబు ఘటంబునం దోఁచెడి" అను వాక్యము, పదము కాదు. ఏకంబు–అనుటచే, అనేకము(ఏకము కానిది) పదముకాదు. అనఁగా నాకాంక్షతోఁ గూడిన ననేకపదముల మొత్తము పదముకాదు. ఖంబును ఘటంబును–అనుచో, "ఖంబును ఘటంబును" అను మొత్తముకలిసి పదముకాదు. అర్థబోధకంబు– అనుటచే, అనర్థబోధకము=అర్థబోధకము కానిది, పదముకాదు. క, చ, ట, త, ప. ఇవి యర్థబోధకములు కాని వర్ణములగుటచే, నివి, పదములు కావు.

విమర్శ:– ఏకవర్ణపదమునకు–ఓ=సంబోధనార్థకము. అవ్యయము. ఓరాముఁడ. (చూ. మూలములు; విషయసంఖ్య–132)

పదములవి నామములు క్రియ లవ్యయంబులని త్రివిధంబులు. 3

ఉ: నామములు నా వస్తువాచక శబ్దములు. సందర్భవశంబున నవి కొన్ని కర్తలనియుఁ గర్మములనియుఁ జెప్పఁబడును. ధాత్వర్థ వ్యాపారాశ్రయము కర్త. ధాత్వర్థ ఫలాశ్రయము కర్మము. క్రియలనఁగా, వ్యాపారావబోధకము లయినవి. అవి, సకర్మకములు, అకర్మకము లని ద్వివిధములు. కర్మముగలది సకర్మకము, కర్మము లేనిది యకర్మకము. కర్తృకర్మక్రియలుగూడఁ బ్రయోగమనంబడు. అది కర్తరిప్రయోగము, కర్మణి ప్రయోగమునని ద్వివిధము. క్రియచేఁ గర్త చెప్పఁబడునేని యదికర్తరి ప్రయోగము; కర్మము చెప్పఁబడునేని కర్మణి ప్రయోగము. కర్తరి ప్రయోగము సకర్మక క్రియగలచో సకర్మక కర్తరి ప్రయోగమనియు, అకర్మక క్రియ గలచో నకర్మక కర్తరిప్రయోగము నియుఁజెప్పఁబడును. అవ్యయములనఁగా లింగ విభక్తి వచన శూన్యములు. అవి ప్రతిపదోక్తములు, లాక్షణికములని ద్వివిధములు. ప్రకృతిసిద్ధములు ప్రతిపదోక్తములు. లక్షణ సిద్ధములు లాక్షణికములు.

వ్యా. నామములు, క్రియలు, అవ్యయములు, నని పదములు మూఁడు విధములు–నామములు=వస్తు వాచకశబ్దములు. నామపదములు సందర్భమునుబట్టికొన్నికర్తలనియుఁ గొన్ని కర్మములనియుఁజెప్పఁబడును. కర్త=చూ. బా. కారక 3. కర్మము=చూ. బా. కారక 2. క్రియ=వ్యాపారావబోధకము. అనఁగాఁ బనిని దెలుపునది. క్రియలు రెండు విధములు. (i) సకర్మకము (ii) అకర్మకము: చూ. బా. క్రియా 48. కర్త, కర్మ, క్రియ–అనువాని కూడిక ప్రయోగమనఁబడును. ఇది రెండువిధములు– (1) కర్తరిప్రయోగము. ఇది, మరల రెండు విధములు–(i) సకర్మకకర్తరి ప్రయోగము=సకర్మక క్రియగలది. (ii) అకర్మక కర్తరి ప్రయోగము= అకర్మకక్రియగలది. (2) కర్మణి ప్రయోగము (చూ. బా. క్రియా 48, 49 సూ.) "క్రియచేఁ గర్తచెప్పఁబడునేని యది కర్తరిప్రయోగము, కర్మముచెప్పఁబడునేని కర్మణిప్రయోగము" అని వివరింపఁబడెను. క్రియాప్రత్యయము (ఆఖ్యాతము) కర్తను జెప్పినచోఁ గర్తరిప్రయోగ మనియుఁ, గ్రియాప్రత్యయము కర్మమునుజెప్పినచోఁ గర్మణి ప్రయోగమనియునుట యుక్తము. (చూ.బా. కారక 1) ఇట క్రియాప్రత్యయముచేననక క్రియచే–అనుట యౌపచారిక మనుకొనవలెను. లింగవిభక్తివచన శూన్యము అవ్యయము లనఁబడును. చూ. బా. సంధి 24–ఘంటా. అవ్యయములు రెండు విధములు–(i) ప్రతిపదోక్తములు=ప్రకృతిసిద్ధములు. ఆహో, ఓహో, అయ్యో, అక్కట, వలెన్, పోలెన్. మొ. (ii) లాక్షణికములు=లక్షణసిద్ధములు. లక్షణముచే(=వ్యాకరణముచే) సిద్ధించినవి: వండి, వండక, వండినన్–లోనగునవి. (చూ. అనుబంధము విషయసంఖ్యలు.133–134).

విమర్శ:- కర్తరి, కర్మణిప్రయోగములనరాదు. కర్త్రర్థక కర్మార్థకముల నవలెను.

## పదములకుఁ బరస్పరముగల సంబంధ మన్వయ మనంబడు 4

వ్యా. పదముల కొకదానితో నింకొక దానికిఁగల సంబంధమన్వయ మనఁబడును. దేవదత్తుఁడువండెను. ఇట, దేవదత్తుఁ డనుపదమునకు, వండెనను క్రియకుఁ గల కర్తృక్రియారూపమగు పరస్పర సంబంధ మన్వయ మనిపించుకొనును. (చూ. అనుబంధము విషయసంఖ్య–135)

## విషయబోధకము వాక్యము. 5

(విషయము=తెలియఁదగిన యంశము)

వ్యా. వాక్యము, తెలియఁదగిన యంశమును బోధించునని తాత్పర్యము.

విమర్శ:- (i) సూత్రమున విధేయమును ముందువాడుట,యవిమృష్ట విధేయాంశదోషము. (ii) ఇది వాక్యలక్షణమువలె, భాసిల్లుట. విపరీత ధీప్రదదోషము. కాన, వాక్యంబు విషయబోధకంబయియుండు–అనవలెను.

## ఉద్దేశ్య విధేయ భిన్నంబు విషయంబు. 6

విషయ ముద్దేశ్యవిధేయములతోఁ కూడినది. అనఁగా విషయమునం దుద్దేశ్యము విధేయము నని రెండు గలవని యర్థము. ఉద్దేశించి చెప్పఁదగినది. యుద్దేశ్యము; మీఁదఁ దెలియఁదగినది విధేయము. ఉద్దేశ్యము, వక్తృశ్రోతల కుభయులకుఁ దెలియును; విధేయము వక్తకు మాత్రము తెలియును. విశేష్యాదిక ముద్దేశ్యము. క్రియాదికము విధేయము. విశేష్యాదికము– విశేష్యము, విశేషణము, సర్వనామము. క్రియాదికము–క్రియ, విశేష్యము,

విశేషణము సర్వనామము. ఆది పదద్వయముచే, అన్నంతక్రియలును, నేలాద్యవ్యయములును గ్రాహ్యములు. విశేష్యాదు లుద్దేశ్యవిధేయములు రెండునగు. క్రియ లుద్దేశ్యములు కానేరవు.

ఉద్దేశ్యవిధేయములకుఁ గ్రమముగా నుదాహరణములు–ఈ హయంబులు పవనగతిం బఱచు. భార. అర. 2ఆ–167. ఇందు హయంబులు–విశేష్యము, ఉద్దేశ్యము; పఱచున్–క్రియ, విధేయము. వాగ్భూషణమే సుభూషణము. భర్తృ. విద్వత్పద్ధతి–15. ఇందు వాగ్భూషణము–విశేష్యము, ఉద్దేశ్యము. సుభూషణము–విశేష్యము, విధేయము. వీరభోజ్యము సుమ్మురాజ్యము. భార. అర. 2ఆ–222. ఇందు రాజ్యము విశేష్యము, ఉద్దేశ్యము; వీరభోజ్యము విశేషణము, విధేయము. బాహుకుండనువాఁడెవ్వండో. భార. అర. 2ఆ–185. ఇందు బాహుకుండు–విశేష్యము, ఉద్దేశ్యము. ఎవ్వండో–సర్వనామము, విధేయము. అవివేకి చెడున్. స్వా. 3ఆ–1 35. ఇందు, అవివేకి–విశేషణము, ఉద్దేశ్యము. చెడున్–క్రియ, విధేయము. వచ్చినవాఁడు ఫల్గునుఁడు. భార. ఉద్యో. 3ఆ–85. ఇందువచ్చినవాఁడు–విశేషణము, ఉద్దేశ్యము; ఫల్గునుఁడు–విశేష్యము, విధేయము, అక్రోధనుఁడు కరంబ ధికుఁడు, భార ఆది 3ఆ–145 ఇందు, అక్రోధనుఁడు–విశేషణము, ఉద్దేశ్యము. అధికుఁడు–విశేషణము, విధేయము. మూఁడవవాఁడెవ్వండు? భార. అర. 2ఆ–188 ఇందు, మూఁడవ వాఁడు–విశేషణము, ఉద్దేశ్యము. ఎవ్వండు–సర్వనామము, విధేయము. కొందఱు పిశాచంబని పఱచిరి. భార. అర 2ఆ–102. ఇందు, కొందఱు సర్వనామము. ఉద్దేశ్యము. పఱచిరి–క్రియ, విధేయము. ఇది నలురథఘోషము. భార. అర. 2ఆ–182. ఇందు, ఇది–సర్వనామము, ఉద్దేశ్యము. ఘోషము–విశేష్యము, విధేయము. ఇది మర్త్యుల కవిషయము. భార. అర. 2ఆ–106. ఇందు ఇది – సర్వనామము, ఉద్దేశ్యము. అవిషయము–విశేషణము, విధేయము. వీరెవ్వరయ్య. భార. ఆది. 6ఆ–89. ఇందు, వీరు–సర్వనామము. ఉద్దేశ్యము. ఎవ్వరు–సర్వనామము, విధేయము. మృగాకులోగ్రవనంబుల కరుగనేల? భార. అర. 2ఆ–71. ఏలావాలాయము సేయ. స్వా. 3ఆ–94 ఇందు, అరుగన్, చేయన్–ఇవి అన్నంతక్రియలు, ఉద్దేశ్యములు. ఏల; ఏలా–ఇవి యవ్యయములు, విధేయములు. మఱియు నీ వితరులఁ గొలువనేటికి? భార. ఉద్యో. 4ఆ–59. ఇత్యాదులూహ్యంబులు.

వ్యా. విషయంబు=తెలియఁదగినయంశము (5సూ.) ఉద్దేశ్య=ఉద్దేశ్యముతోను, విధేయ=విధేయముతోను, భిన్నంబు=కూడుకొనునది. అనఁగా, విషయమునందు ఉద్దేశ్యము, విధేయమునను నంశములు రెండుండునని యర్థము. ఉద్దేశ్యము=ఉద్దేశించి చెప్పఁదగినది. ఇది

వక్తకు శ్రోతకు నిద్దఱకుఁ దెలియును. (వక్త=చెప్పువాఁడు, శ్రోత=వినువాఁడు) విశేష్యాదిక ముద్దేశ్యము. విశేష్యాదిక మనఁగా, విశేష్యము, విశేషణము, సర్వనామము. విధేయము= మీఁదఁ దెలియఁదగినది. ఇది వక్తకు మాత్రము తెలియును. క్రియాదికము, విధేయము. క్రియాదికము=క్రియ, విశేష్యము విశేషణము, సర్వనామము. విశేష్యాదికము–అనియు, క్రియాదికము–అనియు, ఆదిపదము రెండుసార్లు వాడుటచే, అన్నంతక్రియలు, ఏల–మున్నగు నవ్యయములు, విశేష్యాదికములోను, క్రియాదికములోను జేరును. సారాంశ మేమనఁగా, "విశేష్యాదు లుద్దేశ్య విధేయములు రెండును నగు. క్రియ లుద్దేశ్యములు కానేరవు" అనఁగా విశేష్యము, విశేషణము, సర్వనామము, అన్నంతక్రియలు, ఏల, మున్నగు నవ్యయములు నుద్దేశ్యవిధేయములు రెండును నగును; క్రియలుమాత్రము విధేయములేయగును; ఉద్దేశ్యములు కానేరవు. ఈ హయంబులు పవనగతింబఱచు. ఇట హయముల నుద్దేశించి చెప్పుచుండుటచే, హయంబులు–ఉద్దేశ్యము. హయంబులు–అని వక్త యుచ్చరింపఁగానే, యీయుద్దేశ్యము వక్తతోపాటు శ్రోతకును దెలిసినది. హయములను గూర్చి చెప్పఁబోవు విషయమేమో, వక్తకు మాత్రమే, తెలియును. పఱచున్–అను క్రియ, విధేయము. అనఁగా హయములు, పవనగతింబఱచునని, వక్త చెప్పఁబోవు విషయము చెప్పక పూర్వము, వక్తకు మాత్రమే తెలియును. వక్తచెప్పిన మీఁదట శ్రోతకుఁ దెలియును. కాన నిది విధేయమయినది. ఉద్దేశ్యవిధేయములను వ్యాకర్తయే లక్ష్యములయొద్ద వివరించెను.

## సంపూర్ణ మసంపూర్ణమని వాక్యంబు ద్వివిధంబు. 7

సమాపక క్రియలు గల వాక్యము సంపూర్ణవాక్యము. అసమాపక క్రియలుగల వాక్యము, అసంపూర్ణవాక్యము. ఉ: ఆ. దాని విడిచి పోవఁగా నోపకఱచుచు, నంతరిక్షమునను హంసలెల్లఁ, బిందుగట్టి తిరుగుచుండె. భార. అర. 2ఆ–13. క. నలుఁడును ధరణీ రాజ్యము, దలఁగఁగ సర్వంబు నపహృతంబైనఁ గడుం, దలరి దమయంతిఁ దోడ్కొని, వెలువడియె నశేషరాజ్య విభవ చ్యుతుఁడై. భార. అర. 2ఆ–64. మధ్యాక్కర. నన్ను, నారాజునకు నెఱిఁగించి కరుణ నాయందుఁ గావింపు, మారంగ ననుడు నిషధ విషయమున కరిగి యాహంస, వీర సేనజునకు దాని గుణరూప విభవముల్ సెప్పె, భార. అర. 2ఆ–22 మొ॥ ఇందు–విడిచి, ఓపక, అఱచుచు, నిత్యాది క్రియాభిన్న కర్తృకంబులగు నసమాపక క్రియలు గల ఉండెన్, వెలువడియెన్, చెప్పె – నిత్యాది సమాపక క్రియలతోడి వాక్యము సంపూర్ణవాక్యము. తలఁగఁగన్, ఐనన్, అనుడున్, ఇత్యాది క్రియావిభిన్న కర్తృకంబులగు నసమాపక క్రియలతోడి వాక్య మసంపూర్ణ వాక్యము నని యెఱుంగవలయు.

వ్యా. వాక్యము, రెండు విధములు. (1) సంపూర్ణవాక్యము=సమాపక క్రియలుగల వాక్యము. (2) అసంపూర్ణవాక్యము=అసమాపక క్రియలుగలవాక్యము. సంపూర్ణ వాక్యమునకు:– దానివిడిచి పోవఁగా నోపకఱచుచు. నంతరిక్షమునను హంసలెల్లఁ బిందుగట్టి తిరుగుచుండె. హంసలు–కర్తృపదము. తిరుగుచుండె–సమాపకక్రియ. కనుక సమాపక క్రియతోఁ గూడుకొనుటచే నిది సంపూర్ణవాక్యము. విడిచి, ఓపక, అఱచుచు, పిండుగట్టి–అనునవి క్రియాఽభిన్నకర్తృకములగునసమాపకక్రియలు. ఉండెన్–అను, సమా

పక్రియకుఁ గర్త–హంసలు. ఈ యసమాపక క్రియలకును గర్త–హంసలు, కనుక, నివి క్రియాఽభిన్న కర్తృకములు. (విడిచి, పిండుగట్టి–క్త్వార్థకములు, ఓపక–వ్యతిరేకక్త్వార్థకము; అలుచుచున్–శత్రర్థకము) నలుఁడును–కడుం, దలరిదమయంతిఁ దోడ్కొని, వెలువడియెన్. నలుఁడు–కర్తృపదము. వెలువడియెన్–సమాపకక్రియ. కనుక. సమాపకక్రియగల యీ వాక్యము సంపూర్ణము. వెలువడియెన్–అను, సమాపకక్రియకుఁ గర్తయగు, నలుఁడు–అను, పదమే, తలరి, తోడ్కొని–అను క్త్వార్థకములగు నసమాపకక్రియలకును గర్తయై యున్నది. కాన నివి క్రియాఽభిన్నకర్తృకములు. నిషధవిషయమున కరిగి యాహంస వీరసేనజునకు దాని గుణరూప విభవముల్ సెప్పె. హంస–కర్తృపదము. చెప్పె–సమాపకక్రియ, సమాపకక్రియగలది గాన,నిది,సంపూర్ణవాక్యము. అరిగి–అను, క్త్వార్థకము క్రియాఽభిన్నకర్తృకమగు నసమాపక క్రియ. ఏలయన సమాపకక్రియకుఁ గర్తయగు హంస శబ్దమే, అరిగి–అను, క్త్వార్థకమునకును, గర్తయైయున్నది. అసంపూర్ణవాక్యమున కుదాహరణము:– నలుఁడును ధరణీరాజ్యము, దలఁగఁగ సర్వంబు నపహృతంబైన. ఇట సమాపకక్రియ లేదు. తలఁగఁగ, ఐన–అను నసమాపక క్రియలుగల వాక్యము గాన నిది యసంపూర్ణ వాక్యము. కరుణ నాయందుఁ గావింపుమారంగ ననుఁడు. ఇట, సమాపకక్రియ లేదు. అనుడున్–అను, నసమాపకక్రియగల వాక్యముగాన, నసంపూర్ణవాక్యము. తలఁగఁగన్, ఐనన్, అనుడున్–అనునవి క్రియావిభిన్న కర్తృకములగు నసమాపకక్రియలు. నలుఁడును ధరణీరాజ్యము, దలఁగఁగ సర్వంబు నపహృతంబైన...వెలువడియె–అనుచో, వెలువడియె నను, సమాపకక్రియకుఁ గర్త–నలుఁడు. తలఁగఁగ– అను భావలక్షణార్థకమగు నుబ్యంతమునకుఁ (బా. క్రియా 40) గర్త–ధరణీరాజ్యము; ఐనన్–అను వృత్తమగు భావలక్షణార్థమునందైన, నవర్ణకాంతమునకుఁ గర్త–సర్వంబు. (బా. క్రియా 41) కావున, తలఁగఁగన్, ఐనన్–అనునవి క్రియావిభిన్న కర్తృకములు. కరుణ నాయందుఁ గావింపు మారంగననుఁడు...ఆహంస...దాని గుణరూపవిభవముల్ సెప్పె. ఇట, చెప్పె–అను. సమాపకక్రియకుఁ గర్త–హంస. అనుడున్–అను నానంతర్యార్థక డువర్ణకాంతమునకుఁ (బా. క్రియా 42) గర్త–దమయంతి. కాన, అనుడున్–అనునది క్రియావిభిన్నకర్తృకము. క్రియాభిన్నకర్తృకము, క్రియావిభిన్నకర్తృకము, అను వ్యవహారము 6వ సూత్రమునఁజెప్పిన యసమాపకక్రియలను దృష్టిలోఁ బెట్టుకొని చేసినది.

## వాక్యసముదాయము మహావాక్యము నాఁబడు. అయ్యది రామాయణాదికము. 8

వ్యా. వాక్యముల సమూహము మహావాక్యమనఁబడును. అనగా నితివృత్తము గల ప్రబంధము (కావ్యము) నందలి వాక్యముల సమూహమంతయుఁ గలిసి మహావాక్యమనఁబడును. రామాయణాదు లిందు కుదాహరణములు. ఇతివృత్తములేని ముక్తకాదులలోని వాక్యములు (చాటువులు, శతకములు మొ॥) కలిసి మహావాక్యమనిపించుకొనవు. (చూ. అనుబంధము. విషయసంఖ్య–136; మూలములు)

## క్రియాన్వయ వాక్యంబులు కొన్ని వ్యంగ్యార్థ ద్యోతకంబులగు 9

భావక్రియలు గల వాక్యము వ్యతిరేకక్రియలుగల వాక్యమునకును, వ్యతిరేకక్రియలుగల వాక్యము భావక్రియలుగల వాక్యమునకును, ఉభయము లుభయమునకును వ్యంజకములగునని యర్థము. అప్పుడు భావక్రియ లేన్యంత తద్ధర్మార్థకములుగాను, లేక, యినన్నంతములుగాను; దద్ధర్మార్థకములుగాను; వ్యతిరేకక్రియ లేన్యంత వ్యతిరేకార్థకములు గాను, వ్యతిరేకార్థకములుగాను

నుండును. ఉ॥ వాఁడువచ్చునేని (లేక) వాఁడువచ్చిన, వీఁడువచ్చును. వాఁడు వచ్చునేని(లేక)వాఁడు వచ్చిన, వీఁడురాఁడు. (వీనికి వ్యంగ్యార్థములు– వాఁడురాడేని వీఁడు రాఁడు, వాఁడురాఁడేని వీఁడు వచ్చును.) నీవియ్యవేని, నేనియ్యను. నీవియ్యవేని, నేనిత్తును. (వీనికి వ్యంగ్యార్థములు– నీవిత్తువేని నేనిత్తును, నీవిత్తువేని నేనియ్యను) ఇత్యాది. ఆదిపదముచే నితరంబు లూహ్యంబులు. ఇది యేతన్మార్గ సూచనాక్రమము. ఇట్లు దీనినింక ననేకప్రకారంబులఁ జెప్పవచ్చును.

వ్యా. సమాపకక్రియలతో నన్వయము గలిగిన కొన్ని వాక్యములు వ్యంగ్యార్థమును ద్యోతకముచేయును. (క్రియ=చూ. 1 సూ.) అప్పుడు (i) భావక్రియలుగల వాక్యము వ్యతిరేకక్రియలుగల వాక్యమునకు వ్యంజకమగును. భావక్రియలు=వస్తువు యొక్క యునికిని దెలుపుక్రియలు, భావక్రియలు. "భావక్రియలు ఏన్యంత తద్ధర్మార్థకములుగాను లేక యినన్నంతములుగాను; దద్ధర్మార్థకములుగాను ఉండును" అనగా భావక్రియలుగల వాక్యముయొక్క ప్రథమఖండమునందలి భావక్రియలు, ఏనిశబ్దమంతమందుఁగల తద్ధర్మార్థకములు గాని లేదా యినన్నంతములుగాని యగును. ద్వితీయభాగమునందలి భావక్రియలు తద్ధర్మార్థకములగును. ఇనన్నంతము=చేదాద్యర్థక నవర్ణకాంతము. (బా. క్రియా 41) ఉదా. వచ్చినన్. వచ్చు+ నను=వచ్చు+ఇ+నను=వచ్చినను–అగును. ధాతువున కగు ఇగాగమమును ద్రుతాంత నవర్ణకమునుగలిపి, ఇనను= ఇనన్–అని గ్రహించి, వ్యాకర్త యినన్నంతమని వ్యవహరించెను. భావక్రియలు గల వాక్యము వ్యతిరేకక్రియలుగలవాక్యమును వ్యంజితము చేయుటకు:– వాఁడు వచ్చునేని–వీఁడువచ్చును, వాఁడువచ్చిన–వీఁడువచ్చును. వచ్చునేని–ఏన్యంతమగు తద్ధర్మార్థకము. వచ్చిన–ఇనన్నంతము. ఇవి ప్రథమఖండమునందున్నవి. వచ్చును–అను ద్వితీయఖండమునందలి క్రియ తద్ధర్మార్థకము. ఈభావక్రియలుగల వాక్యములు వ్యతిరేక క్రియలుగల వాక్యములను వ్యంజితము చేయును. ఎట్లనఁగా, వాఁడువచ్చు నేని వీఁడు వచ్చును=వాఁడురాఁడేని వీఁడురాఁడు. ఇట్లే వాఁడువచ్చినవీఁడు వచ్చును–అను వాక్యము, వాఁడురాఁడేని వీఁడురాఁడు–అను వాక్యమును వ్యంజితముచేయును. రాఁడు–వ్యతిరేకక్రియ గావున నిది వ్యతిరేకక్రియలుగల వాక్యమును వ్యంజితము చేయుట కుదాహరణము. (ii) వ్యతిరేకక్రియలుగల వాక్యము భావక్రియలుగల వాక్యమునకు వ్యంజకమగును. అప్పుడు "వ్యతిరేకక్రియ లేన్యంతవ్యతిరేకార్థకములు గాను; వ్యతిరేకార్థకములు గాను నుండును" అనగాఁ వ్యతిరేక క్రియలుగల వాక్యమునఁ బ్రథమఖండమునందలి వ్యతిరేకక్రియలు, ఏనిశబ్దమంతమందు గల వ్యతిరేకార్థకములుగా నుండును. ద్వితీయఖండమునందలి క్రియలు, వ్యతిరేకార్థకములుగా నుండును. వ్యతిరేకక్రియలు గల వాక్యము, భావక్రియలు గల వాక్యమును వ్యంజితముచేయుటకు:– నీవియ్యవేని–నేనియ్యను. ప్రథమఖండమున, ఇయ్యవేని–అను, వ్యతిరేకక్రియ, ఏని–అంతమందుఁ గలదై యున్నది. ద్వితీయఖండమునందలి క్రియ, ఇయ్యను–అని వ్యతిరేకార్థకమై యున్నది. ఈ వ్యతిరేకార్థక వాక్యము, భావక్రియలు గల వాక్యమును వ్యంజితముచేయును ఎట్లనఁగా, నీవియ్యనేని నేనియ్యను=నీవిత్తువేని నేనిత్తును. ఇట, ఇత్తును–భావక్రియ (iii) "ఉభయము లుభయములకును వ్యంజకము లగును" అనఁగా–(1) ప్రథమఖండమున భావక్రియ ద్వితీయఖండమున వ్యతిరేకక్రియ గల వాక్యము–ప్రథమఖండమున వ్యతిరేకక్రియ. ద్వితీయఖండమున భావక్రియ గల వాక్యమును వ్యంజితము చేయును. ఉదా: వాఁడు వచ్చెనేని (లేదా) వాఁడువచ్చిన వీడురాఁడు=వాఁ డురాఁడేని వీఁడువచ్చును. వచ్చెనేని, వచ్చిన– అన్నవి, భావక్రియలు. రాఁడు–వ్యతిరేకక్రియ. వ్యంజితమైన వాక్యములో–రాఁడేని– వ్యతిరేకక్రియ. వచ్చును–భావక్రియ (2) ప్రథమ ఖండమున వ్యతిరేకక్రియ, ద్వితీయఖండమున భావక్రియగల వాక్యము–ప్రథమఖండమున

భావక్రియ, ద్వితీయఖండమున, వ్యతిరేకక్రియ గల వాక్యమును వ్యంజితముచేయును. ఉదా: నీవియ్యవేని నేనిత్తును=నీవిత్తువేని నేనియ్యను. ఇయ్యవేని–వ్యతిరేకక్రియ. ఇత్తును–భావక్రియ, ఇత్తునేని– భావక్రియ. ఇయ్యను–వ్యతిరేకక్రియ. ఇత్యాదు లూహింపఁదగును. ఇది మార్గసూచకముగాఁ జెప్పఁబడినది. ఇట్లు దీని నింకను బెక్కురీతులఁ జెప్పవచ్చును.

## ఇట్లనియె, అనియె నని భావ్యర్థ కథన ప్రారంభ పరిసమాప్తులం గ్రమంబుగ నగు. 10

భావ్యర్థ కథన ప్రారంభంబునఁ బూర్వ వాక్యాంతమునందు "ఇట్లనియె" అనియును, ప్రారబ్ధ వాక్య పరిసమాప్తియందు "అనిన" అనియును బదంబులు క్రమంబుగఁ బ్రయుక్తంబులగునని యర్థము. ఉ: వ. అయ్యింద్రునకుఁ గలి యిట్లనియె. తే. గీ. అవనిలో దమయంతీ స్వయంవరంబు, విస్తరిల్లుట విని కడువేడ్కతోడ, నేను దమయంతిచే వరియింపఁబడుదు, నని తదర్థమ్మైయరిగెద నాసఁజేసి. వ. అనిన నందఱు నగి. భార. 2 ఆ 56, 57, 58 మొ॥

వ్యా. భావ్యర్థకథన=భవిష్యదర్థమును జెప్పుటయొక్క, ప్రారంభ పరిసమాప్తులన్=ఆరంభమునందును ముగింపునందును, క్రమముగా, "ఇట్లనియెన్" "అనియెన్" అనునవి యగును. అనఁగా, భావ్యర్థమును జెప్పుటకారంభించు నప్పుడు, పూర్వవాక్యము చివర, "ఇట్లనియెన్" అనుపదము, ప్రయోగింపఁబడును. ప్రారబ్ధ=ఆరంభింపఁబడిన, వాక్య=వాక్యముయొక్క, పరిసమాప్తియందున్= ముగింపునందు, "అనినన్" అను పదము ప్రయోగింపఁబడును. భావ్యర్థమును జెప్పుటకు మొదలిడునప్పుడు, ఇట్లనియెన్–అనునది యగుటకు:– "అయ్యింద్రునకుఁ గలి యిట్లనియె. అవనిలో దమయంతీ స్వయంవరంబు, విస్తరిల్లుట విని..." ఇట, అవనిలో దమయంతీ స్వయంవరంబు విస్తరిల్లుట విని–ఇత్యాది భవిష్యదర్థమును జెప్ప మొదలిడునప్పుడు, పూర్వవాక్యాంతమున, కలియిట్లనియె–అని, "ఇట్లనియెన్" అను, పదము, ప్రయోగింపఁబడినది. ఆరంభించిన వాక్యము, ముగిసినప్పుడు, "అనినన్" అనునది ప్రయోగింపఁబడుటకు:– అవనిలో దమయంతీ స్వయంవరంబు, విస్తరిల్లుట విని...యరిగెద నాసఁజేసి. అనిన నందఱునగి. అవనిలో దమయంతీ స్వయంవరంబు–ఇత్యాది వాక్యము ముగిసిన పిమ్మట. అనిన నందఱునగి–అని "అనినన్" అను, పదము, ప్రయోగింపఁబడినది.

## కొన్నియెడలం దదాదులు విశేషణంబు లధ్యాహార్యంబులగు. 11

ఉ: క. కలకంఠకంఠి కన్నీ, రొలికిన సిరి యింటనుండ నొల్లదు సుమతీ. సుమతీ. 37. (ఇంటన్=ఆ యింట) క. పురుషుండు రెండు దెఱఁగుల, ధరనుత్తముఁ డనఁగఁ బరఁగుఁ దానెయ్యెడలన్, బరుసములు పలుక కునికిన్, దురితంబులు వొరయు పనులఁ దొరఁగుటవలనన్. (రెండుదెఱఁగులన్=ఈరెండు తెఱఁగుల చేత) భార. ఉద్యో. 2ఆ–41 మొ॥

వ్యా. కొన్నిచోట్ల, విశేషణములగు, తదాదులు="తద్" మున్నగు శబ్దములు అనఁగా, "ఆ" మున్నగుశబ్దములు, అధ్యాహార్యంబులు=అధ్యాహారము చేయఁగినవి, అగును. అధ్యాహారము=ఆకాంక్షను (చూ. 1సూ.) బూరించుపదముల ననుసంధించుట యధ్యాహార

మనఁబడును. కలకంఠకంఠి కన్నీరొలికిన సిరి యింటనుండ నొల్లదు సుమతీ. ఇంటన్–అనగా, ఏయింటన్? అనునాకాంక్షరాఁగా, ఈయాకాంక్షను బూరించుటకు, "ఆ" అనుతచ్ఛబ్దము ననుసంధింపవలెను. ఇట్లాకాంక్షను బూరించు పదముల ననుసంధించుట, యధ్యాహారము. ఆయింటన్=కలకంఠకంఠికన్నీ రేయింట నొలుకునో యాయింట. అనగా, కలకంఠకంఠి కన్నీ రొలికిన యింట నన్నమాట. పురుషుండు రెండు దెఱఁగుల, ధరనుత్తముఁడనఁగఁ బరఁగు–అనుచో, ఏరెండు తెఱగులన్? అన్న యాకాంక్ష రాఁగా "ఈ" అను, నేతచ్ఛబ్దము, నీయాకాంక్షను బూరించుట కనుసంధింపవలెను. ఈరెండు తెఱఁగులన్=చెప్పఁబోవు రెండు తెఱఁగులచేత, నని యర్థము. (చూ. అనుబంధము. విషయసంఖ్య–137)

## కొన్నియెడల సంబంధంబునం బూర్వవాక్యంబునందలి పదం బధ్యాహార్యంబగు. 12

ఉ: గొంతి సంకటపాటు కోడలిబన్నంబు. భార. భీష్మ. 2ఆ. పంక్తిముఖునాతనితమ్మునిఁ గుంభకర్ణునిం, దనయుని మేఘనాథుని. నిర్వ. 2ఆ–14. దానవేశ్వరునకుఁ దమ్ములకును. నిర్వ. 2ఆ 82 మొ॥

వ్యా. కొన్నిచోట్ల సంబంధమునందుఁ బూర్వవాక్యమునందలి పదము, అధ్యాహార్యంబు= అధ్యాహారము చేయఁదగినది, అగును. అధ్యాహారము=చూ. 11 సూ. గొంతిసంకటపాటుఁ గోడలిబన్నంబు. ఇట, ఎవరికోడలి బన్నంబను నాకాంక్ష రాగా, నీయాకాంక్షను బూరించుటకు, గొంతిసంకటపాటు–అను పూర్వస్థలము నందలి గొంతియొక్క అనుపదము ననుసంధింప వలెను. కోడలిబన్నంబు=గొంతి కోడలి బన్నంబు– అన్నమాట. పంక్తిముఖు నాతని తమ్మునిఁ గుంభకర్ణునిందనయుని మేఘనాథుని. తనయుని–అనుచోట నెవరితనయుని? అను నాకాంక్షరాఁగాఁ బూర్వస్థలమునందలి, ఆతనియొక్క–అను పదము ననుసంధింపవలెను. తనియుని=ఆతనితనయుని, అనఁగాఁబంక్తిముఖుని యొక్క తనయుని. దానవేశ్వరునకుఁ దమ్ములకును. తమ్ములకును–అనుచో, నెవరితమ్ముల కను నాకాంక్షరాఁగాఁ, బూర్వస్థలము నందలి, దానవేశ్వరునకు–అను దానిని బట్టి దానవేశ్వరునియొక్క, అను, పదము ననుసంధింపవలెను. సంబంధంబున–అనుటచే నధ్యాహారము చేయుపదము శేషషష్ఠ్యంతమై యుండవలెనని భావము. (చూ. బా కారక 15) కాన, దానవేశ్వరునకు–అని కాక దానవేశ్వరునియొక్క–అనునదే యధ్యాహారమగును. (చూ. అనుబంధము. విషయసంఖ్య–117)

## న్యూనవచో వాక్యంబునఁ దద్వచనంబు లధ్యాహార్యంబులగు. 13

(న్యూనవచనంబులు=ఐన, ఏని, ఏ, ఓ మొ॥) ఉ: ఎత్తెఱఁగున ధర్మ క్రియఁ, జిత్తంబునఁ జేర్పవలయు జీవించు తఱిన్. భార. అను. 4ఆ–251. (ఎత్తెఱఁగునన్= ఎత్తెఱఁగుననైనను, లేక ఎత్తెఱఁగుననేని అని యిక్కడ ఐన, ఏని యవ్యయంబు లధ్యాహార్యములు. ఇట్లు మీఁదను నెఱుఁగునది.) అక్కట మందభాగ్యనకు నట్టి తనూభవ రత్న మెవ్విధిన్, దక్కునె? భార ద్రోణ 2ఆ240. తరుణీ యేరికిఁ జెల్లునె, యరయఁగ నేమింతవారమనుకొన. కళా. 1ఆ. 72. వీని నెమ్మెయిన్, బట్టి వధింతు. వి.పు. 7ఆ–163. అన్నం బొండొకలేదు. పాండు. 4ఆ–176. దైవమకటా యిటఁ దెచ్చునె

యేమివచ్చెనే. చంద్రా. కర్మములు మేలునిచ్చును. భాగ. 10స్కం పూ. 32 (కర్మములు=కర్మములే యని యిక్కడ నేవార్థమధ్యాహార్యము)డప్పిఁజెందును. (చూ.మీఁదు)డప్పిఁజెందునోయని యిక్కడ "ఓ" యధ్యాహార్యము. మొ॥

వ్యా. న్యూనవచనములుగల వాక్యమున, తద్వచనంబులు=అన్యూనవచనములు, అధ్యాహారములు(=చూ 11 సూ) చేయఁదగును. న్యూనవచనములు=ఐన, ఏని, ఏ, ఓ–మొ॥ న్యూనవచో వాక్యము=తక్కువయైన వచనములుగల వాక్యము. అనఁగా, నవశ్యముప్రయోగింపవలసిన, ఐన, ఏని, ఏ, ఓ–మున్నగుశబ్దము లేవాక్యమున న్యూనములగునో (తక్కువపడునో) యావాక్యము న్యూనవచో వాక్య మనఁబడును. తప్పక ప్రయోగింపవలసిన, న్యూనవచనములు=ఐన, ఏని, ఏ, ఓ మున్నగు శబ్దములు, వాక్యమునఁ బ్రయోగింపఁ బడనిపక్షమున, నాన్యూనవచనములను నధ్యాహారము చేయఁదగునని తాత్పర్యము. ఎత్తెఱఁగున ధర్మక్రియఁ, జిత్తంబునఁ జేర్పవలయు–అనుచో, నన్వయమునకై యాకాంక్షితమైన ఐన, ఏని పదముల ననుసంధింపవలెను. ఎత్తెఱఁగునన్=ఎత్తెఱఁగుననైన; లేదా, ఎత్తెఱఁగున నేని–అని యర్థము నెన్నవలెను. ఇట్లే ఎవ్విధిన్=ఎవ్విధినైన, ఎవ్విధినేని. ఏరికిన్=ఏరికైన, ఏరికేని; ఎమ్మెయిన్=ఎమ్మెయినైన, ఎమ్మెయినేని, ఒండొక=ఒండొకయైన, ఒండొకయేని; ఇటన్=ఇటనైన, ఇటనేని – అని గ్రహింపవలెను. కర్మములు మేలునిచ్చును. అనుచో, కర్మములు+ఏ–అని, ఏవార్థము నధ్యాహారము చేయవలెను. (ఏవ+అర్థ=ఏవశబ్దముయొక్క యర్థముగలది, యేవార్థము. ఏ–అనునది యేవార్థము.) డప్పిఁజెందును–అనుచో, చెందునో–అని 'ఓ' శబ్దము నధ్యాహారము చేయవలెను. చూ. మీఁదు=పూర్తిపద్యమునకు, మీఁది సూత్రము (15 సూ.) చూడవలెనని సూచితము.

విమర్శ:- ఈ వాక్యము లనుసరణీయములుకావు. (చూ. అనుబంధము. విషయసంఖ్య. 118–119.)

## కొన్నియెడలం గర్తృకర్మక్రియ లధ్యాహార్యంబులగు. 14

ఉ: కర్తకు: నన్నుఁజూచి నగరె? (జనులు–కర్త యధ్యాహార్యము.) భార. అర. 2ఆ–136 క. సరకుగొనరు సురవరులను, గురుశక్తినిభీష్మబాహ్లికులఁ గైకొన రుద్ధురత జరాసంధుని వెర, వరిగా మెచ్చరు మహేశవర గర్వమునన్. (హంస డిభకులు–కర్త. యధ్యాహార్యము.) ఉ. హరి. 4ఆ. 99, మొ॥ కర్మమునకు:- దవదహనం బుదగ్ర తరుదాహము సేయుచునున్నఁ జూచి. (దాహము చేయుటను కర్మము, అధ్యాహార్యము) భార. అర. 2ఆ–123. మొ॥ క్రియకు:- ప్ర: అక్కడ నెవఁడున్నాఁడు? ఉ: రాముఁడు. (ఉన్నాఁడు–క్రియ, అధ్యాహార్యము) మొ॥

వ్యా. కొన్నిచోట్లఁ గర్త, కర్మ, క్రియ, యధ్యాహారము చేయఁదగినవి యగును. అధ్యాహారము=11 సూ. కర్త యధ్యాహారమగుటకు:- నన్నుఁజూచినగరె? ఇట నెవరు నవ్వుదురను నాకాంక్షరాఁగా, జనులు–అనుకర్త నీయాకాంక్షను బూరించుట కనుసంధింపవలసి యుండును. కావ, జనులు–అను కర్త, యిట నధ్యాహార్యము. "సరకుగొనరు, కైకొనరు...మెచ్చరు..." అనుచో, ఎవరు? అను నా కాంక్ష రాఁగా హంసడిభకులను కర్తృపదము నీయాకాంక్షను బూరించుట కనుసంధింపవలెను. కావ, నిట, హంసడిభకులను కర్తృపద మధ్యాహార్యము. కర్మమునకు:- దవదహనం బుదగ్ర తరుదాహము సేయుచునున్నఁ జూచి–అనుచో, దేనిని

జూచి-అను నాకాంక్షరాఁగా, నీయాకాంక్షను బూరించుటకు "దాహముచేయుటను" అను కర్మపదము ననుసంధింపవలెను. (దాహము చేయుటనుజూచి-అన్నమాట) కావునిట, "దాహముచేయుటను" అను కర్మ మధ్యాహార్యము, క్రియ యధ్యాహార్యమగుటకు-ప్ర (=ప్రశ్న) అక్కడ నెవఁడున్నాఁడు? ఉ: (=ఉత్తరము) రాముఁడు. ఇట రాముఁడేమయ్యెనను నాకాంక్ష రాఁగా, నీయాకాంక్షను బూరించుటకు "ఉన్నాఁడు" అను క్రియ ననుసంధింపవలెను. కావున ఉన్నాఁడు-అను క్రియ యిట నధ్యాహార్యము. (చూ. అనుబంధము. విషయసంఖ్య-120)

## అనేక కర్తృక క్రియకు సమీపకర్తయొక్క లింగవచనంబు లగు. 15

ఉ: ఏవాని బంధుమిత్రులు, జీవధనంబులును డప్పిఁ జెందును గృశునిం, గా వానినెన్నఁగాఁ దగు. భార శాంతి. 1ఆ-52. క. సుర గంధర్వప్రభృతులు, ధరణీ శైలాపగాబ్ధి ధాత్రీజాదుల్, నరవర నీకేయపకృతి నరయఁగఁ గావించె? రా. అర. కాం. 1ఆ-342. తమసేనలు వారును విశ్రమించిరి. ఉ. హరి. 4ఆ-31 వ. సర్వభూతంబులు దేవాసురులు వినాశగతులు కారె. రా. అర. కాం. 2ఆ-345 మొ॥

వ్యా. అనేక కర్తలుగల క్రియకు దగ్గఱనున్న కర్తయొక్క లింగవచనము లగును. ఇట లింగమనునది, మహదమహదర్థ, బోధకము. ఏవాని బంధుమిత్రులు, జీవధనంబులును డప్పిఁజెందును. ఇట, చెందును అను క్రియకు-బంధుమిత్రులు, జీవధనంబులు-ననునవి కర్తలుగాఁ గలవు. కాన, నిది, యనేక కర్తృకక్రియ. దీనికి సమీపకర్తలగు, జీవధనంబులు-అను నమహద్బహువచనము ననుసరించి, చెందును-అని క్రియ, యేకవచనాంత మైనది. జీవధనంబులు-అమహత్తుగాన క్రియ యేకవచనాంత మగును. (చూ. బా. క్రియా25) బంధుమిత్రులు-అనుదానిని బట్టి, చెందుదురు-అని కాలేదు. సురగంధర్వప్రభృతులు, ధరణీ శైలాపగాబ్ధి ధాత్రీజాదుల్, నరవర నీకే యపకృతి, యరయఁగఁ గావించె. ఇట, కావించె-అను క్రియకు-సురగంధర్వ ప్రభృతులు, ధరణీశైలాపగాబ్ధి ధాత్రీజాదుల్-అనునవి, కర్తలగుటచే, నిది, బహుకర్తృకక్రియ. దీనికి సమీపకర్తలగు, ధరణీశైలాపగాబ్ధి ధాత్రీజాదుల్, అను నమహత్తుల ననుసరించి, క్రియ, కావించె-అని యేకవచనాంత మయినది. సురగంధర్వ ప్రభృతులు-అనుదాని ననుసరించి, కావించిరి-అని కాలేదు. తమసేనలు వారును విశ్రమించిరి. ఇట సమీపకర్తయగు వారును-అనుదాని ననుసరించి, క్రియ మహద్బహు వచనమైనది. సేనలు- అనుదాని ననుసరించి, విశ్రమించెను-అని కాలేదు. సర్వభూతంబులు దేవాసురులు వినాశగతులు కారె, అనుచో సమీపకర్తలగు దేవాసురులను దానిననుసరించి క్రియ, 'కారె' అని మహద్బహువచనాంత మైనది. సర్వభూతంబులు- అనుదాని ననుసరించి "కావె" అని యమహద్బహువచనాంతము కాలేదు. (చూ. అనుబంధము. విషయసంఖ్య-121)

విమర్శః- కొన్నియెడల వివక్షాధీనత గ్రాహ్యము. (ము.కా.క్రియా 40)

## భూతార్థకా సమాపక క్రియ వలయుచో వాక్యాంతర జని స్థానంబగు. అగుచోఁ గర్త తత్కర్తలందలిదియ యెద్దియే నొండగు. 16

వలసినప్పుడు కొన్నియెడల భూతార్థ కాసమాపకక్రియ నుండి వాక్యాం

తరము పొడమును. అప్పుడు దానికిఁ గర్త యాయసమాపక క్రియాకర్తృ సముదాయంబునందుండునదియే యేదైననొక్కటి యగునని యర్థము.

ఉ: మ. ధవళాక్షుల్ చనికాంచి రంత నెదురన్ దత్తీర దేశంబు నం, దవతారాంబుజ ఫేనపుంజ నిభునయ్యశ్వోత్తమున్ దవ్వులన్. వ. కని కద్రువ వినతంజూచి (ఇక్కడ, కని, కనఁగా నందు ననునర్థము నిచ్చుచున్నది.) భార. ఆది. 2ఆ–30, 31. వ. దేవలోకంబున కరుగువారెదుర ద్వాపరంబుతోవచ్చు కలిం గని శక్రుండిదియేమి యెందులకుం బోయెదవని యడిగిన నయ్యింద్రునకుఁ గలియిట్లనియె. (ఇక్కడ, కని–కనిరి అందు నను నర్థమునిచ్చుచున్నది) భార. ఆర. 2ఆ–58. ఇట్లంతటఁ నూహ్యంబులు. చ. శుంభ నిశుంభులుగ్రకో, పనులయి డాసి శుంభుఁడతిభైరవసైన్య సమేతుఁడై రయం, బునఁ గవిసెన్. మార్కం. 6ఆ–189. మొ॥ ఏతల్లక్షణానుక్త విశేషప్రయోగంబులుం గలవు.

ఉ: వ. నలుండు...దమయంతీ ద్వితీయుండై యుండి బుభుక్షాపీడ సహింప నోపక హిరణ్య పక్షంబులతోఁ దమ ముందటఁ దిరుగుచున్న పక్షులంగని యవి భక్ష్యంబగునని యప్పక్షులం బట్టికొన సమకట్టి కట్టినపుట్టంబు వానిపై వైచిన నవి పుట్టంబుతోన గగనంబున కెగసి నవ్వుచు విగతవస్త్రుండైన నలునకిట్లనియె. (ఇందు ఉండి–అనునంతవఱకుఁ గల యసమాపక క్రియలకుఁ గర్తలు నలదమయంతులు. ఓపక–అనునది మొదలు, వైచినన్–అనునంతవఱకుఁ గల యసమాపక క్రియలకుఁ గర్త నలుఁ డధ్యాహార్యము.) భార. ఆర. 2ఆ–66. సీ. ఆహవసన్నద్ధులై భీమకర్ణనం,దన మేఘవర్ణులుధర్మతనయు, పాదంబులకు మ్రొక్కి పంకజాక్షునకు దం,డముపెట్టి యంతఃపురమున కరిగి, కుంతికి నెఱిఁగి వీడ్కొనివచ్చి వివ్వచ్చు, గ్రుచ్చి కౌఁగిటఁజేర్చి కుస్తరించి, యనఘ నేఁడురగంబు గొనివచ్చు నందాఁక, నంగరక్షకుఁడవై యధిపుఁ గాచి; యుండుమని మాద్రి పుత్రుల నుపచరించి, ద్రౌపదికిఁ జెప్పి మఱియును దానవారి, యడుగులకువ్రాలి యద్దేవు ననుమతమున, నరిగె ననుమోదమున యౌవనాశ్వు పురికి. (ఇందు, వచ్చి–అనునంత వఱకుఁగల యసమాపక క్రియలకుఁ గర్తలు భీమకర్ణనందన మేఘవర్ణులు. గ్రుచ్చి యనునది మొదలు, అరిగె నను నంతవఱకుఁ గల యసమాపక క్రియలకుఁ గర్త భీముఁ డధ్యాహార్యము. జై. 1ఆ–138. ఇట్టివి ప్రయోగంబులవలన నెఱుంగునది.)

వ్యా. భూతార్థ కాసమాపకక్రియ=క్త్వాప్రత్యయాంతము (సంధి2) వలయుచోన్= కావలసినచో, వాక్యాంతర=వేఱొక వాక్యముయొక్క, జని=జననమునకు (పొడముటకు) స్థానమగును. అగుచో, తత్కర్తలందదియ= ఆ క్త్వాప్రత్యయాంతములకుఁ గర్తలుగాను న్నవానిలోనిదే, ఎద్దియేన్+ఒండు=ఏదోయొకటి, కర్తయగును. క్త్వాప్రత్యయాంతమునుండి

కొన్నిచోట్లఁ గావలసినచో వేఱొక వాక్యము కలుగును. అప్పుడు దానికి, నా క్త్వాప్రత్యయాంత కర్తల సమూహమునందలిదే, యేదో యొకటి కర్తయగును-అని భావము. ధవళాక్షుల్ సని కాంచిరి...కని కద్రువ వినతంజూచి. ఇట, కని-అను, క్త్వాప్రత్యయాంత మునుండి "కద్రువవినతంజూచి" ఇత్యాదిగా వాక్యాంతరము పొడమినది. కని-అనుదానికిఁ గర్తలు ధవళాక్షుల్-కద్రూవినతలు. వాక్యాంతరమునకు, నాకద్రూ వినతలను రెండు కర్తలలో నొకటియగు కద్రువశబ్దము కర్తగా నైనది. కద్రూవినతలు, కని=కనఁగా. అందున్=ఆకద్రూవినతలలో నొకతెయగు కద్రువ యని యర్థమగును. దేవలోకంబునకరుగు వారు...కలింగని శక్రుండిది యేమి యెందులకుం బోయెదవని యడిగిన. ఇట, కని-అను క్త్వాప్రత్యయాంతమునకుఁ గర్తలు-దేవలోకంబున కరుగువారు=ఇంద్రాగ్ని యమవరుణులు. శక్రుండిది యేమి-అను వాక్యాంతరమునకు, నీనలుగురలోనొకఁడగు, శక్రుఁడు-కర్త. కని= కనిరి, అందున్=ఆయింద్రాగ్ని యమవరుణలందొకఁడగు శక్రుఁడు-అని యర్థము: శుంభనిశుంభులు...డాసి...శుంభుఁడు...కవిసెన్. డాసి-అను క్త్వాప్రత్యయాంతమునకుఁ గర్తలు-శుంభనిశుంభులు. శుంభుఁడు...కవిసెన్-అను వాక్యాంతరమునకు శుంభనిశుంభులలో నొకఁడగు శుంభుఁడు-కర్త. ఈలక్షణమునఁ జెప్పఁబడని విశేషప్రయోగములును గలవు. నలుండు దమయంతీద్వితీయుండై యుండి, బుభుక్షాపీడ సహింపనోపక...యుప్పక్షులం బట్టికొనసమకట్టి కట్టిపుట్టంబు వానిపై వైచిన. ఇట, ఉండి-అను, క్త్వాప్రత్యయాంతమునకుఁ గర్తలు-నలదమయంతులు. ఓపక, మొదలుకొని వైచిన-వఱకుఁ గల యసమాపకక్రియలకు నలుఁడు-కర్త. ఈకర్తృపదమిట నధ్యాహారమగుట విశేషము. అధ్యాహారము=చూ. 11. సూ. "...భీమ కర్ణనందన మేఘవర్ణులు...కుంతికి నెఱఁగి వీడ్కొని వచ్చి, విప్పచ్చుగ్రుచ్చి గొఁగిటజేర్చి కుస్తరించి-అరిగె..." ఇట, వచ్చి-అగుదానికిఁ గర్తలు-భీమకర్ణనందన మేఘవర్ణులు. గ్రుచ్చి-మొదలుకొని, అరిగె-వఱకుఁగల యసమాపక క్రియలకుఁ గర్త వారిలోనొకఁడగు భీముఁడు-అధ్యాహార్యమగుట, విశేషము. ఇట్టివి ప్రయోగము వలనఁ దెలిసికొనవలెను.

విమర్శ:- నలుఁడు దమయంతీద్వితీయుండై యుండి-అనుచో ఉండి-అను క్త్వార్థక మునకు నలదమయంతు లిద్దఱును గర్తలనుట సరికాదు. దమయంతీశబ్దమునకుఁ గ్రియతో నన్వయముశాబ్దికముగ లేదు. (చూ. అనుబంధము. విషయసంఖ్య-57)

## కొన్నియెడల నవయువకర్తృక క్రియ తదవయవి కర్తృకంబగు 17

ఉ: తలవడంకుచునుండు తన పితృవరుల. (తలవడంకుచునుండు=తల వడఁకుట గలవారగుచు నుండు నని యర్థము.) భార. ఆది. 2ఆ-151. తేఁకువ సెడియె నీపాఱుఁడు. (చెడియెన్=చెడుట కలవాఁడాయెనని యర్థము.) భార. అర. 4ఆ 353. ఇట్లంతట నెఱుఁగునది. చెలువేదెఁ జందురుండు. భార. ఉద్యో 2ఆ-107. ఎ.గీ. సుభటవర్గంబు లొక్కట సొబగుమాలె. రా.యు. కాం. 1140. అక్కట యీాలతాంగి హృయంబున నీదెసఁ గూర్మియెంతయున్, నెక్కొనియున్నది. మార్క. 2ఆ-309. తే. బడిలికలువాసి చనుము. స్వా. 2ఆ-47. మొ॥

వ్యా. కొన్నిచోట్ల, నవయవము కర్తగాఁ గలిగిన క్రియ, యవయవి కర్తగాఁ గలది యగును. అవయవము=అంగము, అవయవిలో నొకభాగము. అవయవి=అవయవముగలది. అవయవము, అవయవి- అనునవి ధర్మము, ధర్మి-అనువాని కుపలక్షణము. (ధర్మి=ధర్మ ముగలది)తలవడంకుచునుండు తన పితృవరుల. వడంకుచునుండు-అనుదానికిఁ గర్త-తల,

ఇది యవయవము కాన, వడంకుచునుండు-అవయవకర్తృక క్రియ. పితృవరులు-అవయవి. (తల-అను నవయవము గలవారు పితృవరులు గనుక, పితృవరులు-అను పద మవయవి.) అవయవము కర్తకాఁ గలిగిన, వడంకుచునుండు-అనునది, పితృవరులు-అను నవయవి కర్తగాఁగలది యగుచున్నది. ఎట్లన, తలవడంకుచునుండు=తలవడంకుట కలవారగుచునుండు, తనపితృవరుల-అనియర్థము. తేఁకువ సెడియె నీపొఱుఁడు. ఇట, చెడియె-అను క్రియకుఁ గర్త-తేఁకువ, యను ధర్మము. పొఱుఁడు-ధర్మి. (తేఁకువ-అనుధర్మముగలవాఁడు) ధర్మవాచకమగు తేఁకువ, కర్తగాఁ గలిగిన, చెడియె-అనుక్రియ, ధర్మివాచకమగు, పొఱుఁడు-కర్తగాఁ గలది యగుచున్నది. పొఱుఁడు, తేఁకువచెడియె. తేకువచెడుట కలవాఁడాయెనని యర్థము. చెలువేదెఁ జందురుండు. ఏదు-అనుక్రియకుఁ గర్త, చెలువు- అనుధర్మవాచకము. ఇది, ధర్మివాచక మగు, చందురుఁడు-కర్తగాఁగలది యగుచున్నది. ఎట్లన-చందురుండు, చెలువేదె=చెలువు, ఏదుట కలవాఁడాయెనని యర్థము. (ఏదు=నశించు.) సుభట వర్గంబు లొక్కట సొబగుమాలె. మాలె-అనుక్రియకుఁ గర్త,సొబగు-అను,ధర్మవాచకము. ఇది సుభటవర్గంబులు-అను ధర్మివాచకము కర్తగాఁ గలది యగుచున్నది. ఎట్లన-సుభటవర్గంబులు. ఒక్కటన్, సొబగుమాలెన్=సొబగుమాలుట కలవి యయ్యెనని యర్థము. ఈలతాంగి హృదయంబున నీదెసఁ గూర్మి యెంతయున్, నెక్కొని యున్నది. నెక్కొనియున్నది-అను క్రియకుఁ గర్త-కూర్మి, యను ధర్మవాచకము. ఇది, ధర్మివాచకమగు, లతాంగి-కర్తగాఁ గలది యగుచున్నది. ఎట్లన-లతాంగి, నీదెస కూర్మి, ఎంతయున్, నెక్కొనియున్నది=నెక్కొనుట కలదై యున్నది. బడలికలు వాసి చనుము. చనుము- అనుక్రియకుఁ గర్త, బడలికలు-అను, ధర్మవాచకము. ఇది ధర్మివాచకమగు, నీవు-అనునది కర్తగాఁ గలది యగుచున్నది. ఎట్లన-నీవు, బడలికలువాసి=బడలికలు పాయుట కలవాఁడవై, చనుము-అని యర్థము.

విమర్శ:- (i) లతాంగి హృదయంబునన్=లతాంగి యొక్క హృదయమునందు, నీదెసన్, కూర్మి=ప్రేమ, ఎంతయున్, నెక్కొని యున్నది-అని యన్వయము. లతాంగి నెక్కొనియున్నది-అని క్రియతో లతాంగి శబ్దము నన్వయింప నక్కఱలేదు. కాన నిది సరియగు లక్ష్యము కాదు. (ii) తేఁకువసెడు, చెలువేదు, సొబగుమాలు, బడలికలువాయు-అనునవి శబ్దపల్లవములు. వీనియందవయవి కర్తృకత్వము చెప్పుట సరికాదు. (విషయసంఖ్య-122)

## వాక్యసంగ్రహంబునం దినన్నంత క్రియాపూర్వకంబులగు కాక కాన్వ్యయంబు లనుక్తవాక్యపద గ్రాహకంబులగు. 18

ఉ: కాకకు:- తే. నీవునలునకుఁ బేర్మితో దేవివైనఁ, గాని నీసముజ్జ్వల రూపకాంతి విభవ, నిత్య సౌభాగ్య భాగ్యాభి జాత్య భద్ర, లక్షణావళు లవి సఫలంబులగునె? భార అర 2-ఆ20. (వాక్యవ్యాసమునందు:- నీవు నలునకుఁ బేర్మితో దేవివైన నీసముజ్జ్వల రూపకాంతి విభవ నిత్య సౌభాగ్య భాగ్యాభిజాత్య భద్రలక్షణావళులవి సఫలంబులగును. కాకున్న నీస ముజ్జ్వల రూపకాంతి విభవనిత్యసౌభాగ్యభాగ్యాభిజాత్య భద్రలక్షణావళులవి సఫలంబులు కావు) కానికి: ఆ. నలునకాని నళినదళనేత్ర వరియింప,దట్టె (వాక్యవ్యాసమునందు:- నలునే వరియించునుగాని వేఱొకని నళినదళనేత్ర వరియింప దట్టె) భార అర. 2ఆ-52.

వ్యా. వాక్యసంగ్రహంబునన్=వ్యాసవాక్యమును సంగ్రహవాక్యముగామార్చునప్పుడు (చూ. 20 సూ.) ఇనన్నంత క్రియా పూర్వకంబులగు=ఇనన్నంతక్రియలు (=చూ

9సూ.) ముందుగాఁగలవియగు, కాక, కాని–అను నవ్యయము లనుక్త వాక్యపద గ్రాహ్యకంబులు=వచింపఁబడని (వ్యాసవాక్యమునందలి) వాక్యములను బదములను గ్రహించునవి, యగును. వాక్యవ్యాసము=వాక్యముయొక్క విస్తరణము. వాక్యసంగ్రహము=వాక్యముయొక్క సంక్షేపము. ఇనన్నంత క్రియ, ముందుగాఁ గలిగిన "కాక" శబ్దమనుక్తవాక్యమును గ్రహించుటకు:– నీవు నలునకుఁ బేర్మితో దేవివైన నీసముజ్జ్వల రూపకాంతి విభవ నిత్యసౌభాగ్య భాగ్యాభిజాత్య భద్ర, లక్షణావళులవి సఫలంబు లగును. కాకున్న నీసముజ్జ్వల రూప కాంతి విభవ నిత్యసౌభాగ్య భాగ్యాభి జాత్య భద్ర లక్షణావళులవి సఫలంబులు కావు–ఇది వ్యాసవాక్యము. ఈవ్యాసవాక్యమును సంగ్రహవాక్యముగాఁ జేయునప్పుడు, ఇనన్నంతము ముందుగా గలిగిన కాక శబ్దము (లేదా) కాని శబ్దము వాడినచో నది యనుక్తవాక్యమును గ్రహించును. ఎట్లనఁగా– నీవు నలునకుఁబేర్మితోదేవివైనఁగాక, ఇట, ఐనన్–అను, ఇనన్నంతము ముందుగాఁ గలిగిన "కాక" శబ్దము, "నీసముజ్జ్వల రూపకాంతివిభవ నిత్యసౌభాగ్య భాగ్యాభిజాత్య భద్రలక్షణావళులవి సఫలంబు లగును" అను ననుక్తవాక్యమును గ్రహించుచున్నది. ఇనన్నంతమని సూత్రమున నున్నను నవధారణార్థకము ముందుగాఁ గల కాక కాని శబ్దములు ననుక్తవాక్యపద గ్రాహకములు కావచ్చును. అవధారణార్థకము ముందుగాఁ గలిగిన "కాని" శబ్ద మనుక్తపదమును గ్రహించుటకు:– నలునే వరియించును గాని వేఱొకని నళినదళనేత్రవరియింపదట్టి–అనునది వ్యాసవాక్యము. దీనిని సంగ్రహవాక్యము చేయునప్పుడవధారణార్థకము ముందుగాఁ గలిగిన, "కాని" శబ్దమును వాడినచో, నది యనుక్త పదగ్రాహకమగును. ఎట్లనఁగా, నలునకాని నళినదళనేత్ర వరియింపదట్టె. ఇట నవధారణార్థకమగు అకారము ముందుగాఁ గలిగిన (నలున్+అ) కాని శబ్దము, "వరియించును. గాని, వేఱొకని" అను ననుక్తపదములను గ్రహించుచున్నది.

విమర్శ:– "ఇనన్నంత" అను నియమము నియతముకాదు. అవధారణముపై సూత్రకర్తయే చూపెను.

## కొన్నియెడలం గాని క్రియాపూర్వకంబు పూర్వ విరుద్ధోత్తరార్థకం బగు. 19

వాక్యంబులందు పూర్వార్థమునఁ గ్రియమీఁద వచ్చిన కాని యవ్యయ ముత్తరార వాక్యముయొక్క యర్థము పూర్వార్థవాక్యము యొక్క యర్థమునకు విరుద్ధముగా నుండుననుటను దెలుపుచున్నది యని యర్థము. ఉ: వాఁడువచ్చును గాని కార్యవ్యాసంగముచేత రాఁడాయెను. వాఁడు–రాఁడుగాని నీనిర్బంధము చేతవచ్చినాఁడు. మొ॥

వ్యా. కొన్నిచోట్ల, క్రియాపూర్వకంబు=క్రియముందుగాఁ గలదియగు, కాని=కాని శబ్దము, పూర్వవిరుద్ధ=పూర్వార్థమునకు విరుద్ధమైన, ఉత్తరార్థంబు=ఉత్తరార్థముగలది, యగును. వాక్యములలోఁ బూర్వార్థమునఁ గ్రియమీఁదవచ్చిన, "కాని" శబ్దము, పూర్వార్థవాక్యముయొక్క యర్థమున కుత్తరార్థ వాక్యముయొక్క యర్థమువిరుద్ధముగా నుండునన్న విషయమును దెలుపునని తాత్పర్యము. వాఁడువచ్చును గాని–కార్యవ్యాసంగముచేత రాఁడాయెను. ఇట, వచ్చును–అనుపూర్వార్థమునందలి క్రియమీఁద వచ్చిన "కాని" శబ్దము, పూర్వార్థముయొక్క యర్థమున కుత్తరార్థవాక్యముయొక్క యర్థము విరుద్ధమని తెలుపును. ఎట్లన– పూర్వార్థమున, వచ్చును–అని యుండఁగా, నుత్తరార్థమున, రాఁడు–అని కలదు. వాఁడురాఁడు గాని–నీ నిర్బంధముచేత వచ్చినాఁడు. ఇట, రాఁడు– అను పూర్వార్థమునందలి క్రియమీఁద వచ్చిన "కాని" శబ్దము, పూర్వార్థవాక్యముయొక్క యర్థమున కుత్తరార్థ వాక్యముయొక్క యర్థము

విరుద్ధమని తెలుపును. ఎట్లన-పూర్వార్ధమున-రాఁడు, అని, యుండఁగా, నుత్తరార్ధమున, వచ్చినాఁడు-అని కలదు.

## కొన్నియెడల వ్యాసవాక్యమునకు ముందు సంగ్రహ వాక్యంబు నొండగు. 20

ఉ: వ. అయ్యా! యేను నీకుం బ్రియంబు సేసెద. నీహృదయేశ్వరియైన దమయంతి పాలికిం బోయి నీగుణంబులు దానికి వర్ణించిచెప్పి యక్కన్య యన్యుల నపేక్షింపక నీయంద బద్ధానురాగ యగునట్లు చేసెద. భార. అర. 2ఆ-14 వ. ఇదియెట్లు? ధర్మ పరిపాలన పరులై వీరులై రణనిహతులైన రాజు లక్షయలోక సుఖంబు లనుభవింప నతిథులై యిందుల కెంతకాలంబయ్యె రాని కారణంబేమి? భార. అర. 2ఆ-30. శక్రుండిదియేమి? యెందులకుఁ బోయెదవని యడిగిన. భార. అర. 2ఆ-56 మొ॥

వ్యా. కొన్నిచోట్ల, వ్యాసవాక్యమునకు ముందు వేఱొక సంగ్రహవాక్యము, సహిత మగును. వ్యాసవాక్యము= విస్తరించిచెప్పిన వాక్యము. సంగ్రహవాక్యము=సంగ్రహించి, అనఁగా సంక్షేపించి చెప్పినవాక్యము. అయ్యా యేనునీకుఁ బ్రియంబు సేసెద-సంగ్రహవాక్యము. ఇందుఁ బ్రియముచేసెదనని సంక్షేపముగాఁ జెప్పఁబడినది. నీహృదయేశ్వరియైన-ఇత్యాది వాక్యము వ్యాసవాక్యము. ఇందుఁ జేయఁబోవు ప్రియమేమో విస్తరించి చెప్పఁబడినది. ఇది యెట్లు-సంగ్రహవాక్యము. ధర్మపరిపాలన పరులై-ఇత్యాది వాక్యము వ్యాసవాక్యము. ఇందు సంగ్రహవాక్యమున సంక్షేపముగా వేసిన ప్రశ్నయొక్క స్వరూపము, విస్తరింపఁబడినది. ఇట్లే-ఇదియేమి సంగ్రహవాక్యము. ఎందులకుంబోయెద వని యడిగిన, నమనది, వ్యాసవాక్యము.

## కొన్నియెడల వాక్యంబు వాక్యాంతర గర్భంబు నగు. 21

ఉ: వ. ఇందుల కెంతకాలంబయ్యె రానికారణంబేమి? భార. అర. 2-ఆ-30. మొ॥ (చూ. క్రిందు)

వ్యా. కొన్నిచోట్ల, వాక్యము వేఱొకవాక్యము మధ్యయందుఁ గలది యగును. అనఁగా, వాక్యమధ్యమున వేఱొకవాక్యము చేరుననిభావము. ఇందుల కెంతకాలంబయ్యె, రానికారణంబేమి? ఇట, ఇందులకు రాని కారణంబేమి? అను వాక్యము, "ఎంతకాలంబయ్యె"-అను, వేఱొక వాక్యము మధ్యగలది యయినది. అనఁగా, ఇందులకు రాని కారణంబేమి? అను వాక్యములో, ఇందులకు-అను దానికిని, రానికారణంబేమి? యను దానికిని మధ్య, ఎంతకాలంబయ్యె-అను వేఱొక వాక్యము చేరినది. చూ. క్రిందు= పూర్తివాక్యమునకుఁ బూర్వకాలికసూత్రము (20. సూ.) చూడవలెనని సూచన.

**విమర్శ:-** అర్థ విశేషాదులున్నప్పుడే గర్భితము గ్రాహ్యము. (చూ. అనుబంధము. విషయసంఖ్య-123)

## హొమ్ము నిశ్చయార్థంబునం దగు. 22

ఉ: అల్లునిఁ గళ్యాణగుణోత్తరుంబడయ కెట్లుంబోవఁ బొమ్మంచు. నిర్వ 3-43 మొ॥

వ్యా. పొమ్ము-అనునదినిశ్చయార్థమునం దగును. పోవఁబొమ్ము=నిశ్చయముగాఁ బోవను-అని యర్థము. (చూ. అనుబంధము. విషయసంఖ్య-124)

విమర్శ:- అర్థనిర్ణయము నిఘంటువులపని.

## పద్యంబులకుఁ గులకంబగు. 23

కులకంబనఁ బద్యమునకుఁ బద్యాంతరముతో నన్వయము. ఉ: తానొక పందు చెచ్చెరన్. కొనిప్రచ్చుదు. భార. ఆది. 2ఆ-198, 199. మొ॥

## ఇది వాక్యపరిచ్ఛేదము

వ్యా. పద్యములకుఁ గులకమగును. కులకము=పద్యమునకుఁ బద్యాంతరముతో (=వేఱొక పద్యముతో) నన్వయము. కాఁగాఁ బద్యమునకు వేఱొక పద్యముతో నన్వయమగునని యర్థము. తానొకపందుచెచ్చెరన్. కొనిప్రచ్చుదు. ఇట, తానొక పందుచెచ్చెరన్- అనుటతో నొకపద్యము ముగిసినది. కాని వాక్యము ముగియలేదు. ఇది కొనిప్రచ్చుదు- ఇత్యాదిగాఁ గల యనంతర పద్యముతో నన్వయించుచున్నది గాన నిది కులకమని తాత్పర్యము.

విమర్శ:- నాలుగుపద్యములకంటె నెక్కువ పద్యముల కన్వయమున్నప్పుడు కులకమని సాహిత్యదర్పణము. ఇటఁ బద్యసంఖ్యానియమము లేకుండఁ బద్యమునకుఁ బద్యాంతరముతో నన్వయము కులకమనఁబడెను. (చూ. అనుబంధము. విషయసంఖ్య-138)

## ఇది ఘంటాపథము

* * *

# ముక్తలక్షణ వివేచనము

## సంజ్ఞ

### దీర్ఘపూర్వకమగు లఘురేఫము హ్రస్వపూర్వక మగుచో నలఘురేఫంబగు. 1

ఉ: క. వెఱవక కలలోఁజేసిన, కొఱగామికి వగచుచోట గుణరత్నము చే,కుఱె నీకు నలిగితన్నినఁ, బఱపుపయిం ˚బడిన యట్లు పద్మదళాక్షీ. ఉ. హరి. 5ఆ–153 మొ॥

వ్యా. దీర్ఘము ముందుగాఁగల లఘురేఫము, హ్రస్వముముందుగాఁ గలది యగు నప్పుడలఘురేఫమగును. చేకూరు. బా. ప్రకీర్ణక 11చే, "కూ"–లోని దీర్ఘమునకు హ్రస్వముకలుగుచో, నీ 1చే–లఘురేఫమున కలఘురేఫమగును: చేకుఱు. రేఫఱకారప్రాసము లక్షణవిరుద్ధమగుటచే నిట, చేకుఱు– అనుచో నలఘురేఫమే కలదనవలెనని భావము.

విమర్శ:- (i) చేకూరున కీ విధి వైకల్పికమన వలెను. చేకూరు=చేకుఱు, చేకురు(కు. సం. 3–36) లేదా, చేకురు–విచార్యమనవలెను. (ii) ఆరయు=అరయు–అనుచో, నలఘురేఫము కాదు. నామపదములలో, నలఘురేఫము కాదు. నల్లేరు=నల్లెరు. ఆరాటము=ఆరటము; గోరువంక=గొరువంక. మొ॥ (బా. ప్రకీర్ణక 3, 11,12) (అనుబంధము. విషయసంఖ్య–125) కాఁగా, నీవిధి బహుళమనవలెను.

### అలఘురేఫము లుప్తాచ్కమగుచో లఘురేఫంబగు. 2

ఉ: ఎ.గీ. నీవును నాపద, కోర్చి భంగపాటు తీర్చికొనుము. భార. విరా 1ఆ–54 మొ॥ "లఘుర్బ వేద్గురుః కుత్రచి ద్గురుశ్చ లఘుస్తథా, ఉచ్చారణస్య కల్ప్యత్వాన్నిదానం తత్రసద్వచః" అని యథర్వణాచార్యులు. మఱియు "నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తునిత్యం స్యాత్" "అనయో స్సంగతిం యస్తు, కరోతి కవితాకృతౌ, అస్యా అత్యంత దోషత్వాద్దుష్కృవి స్సహి కథ్యతే" అని, ప్రథమాచార్యులును, ద్వితీయాచార్యులును నియ మించి యుండుటంజేసి, యవి పూర్వరేఫంబులే యనుటకు వల్లకాదు. (చేకూరు–లఘు రేఫము. తీఱు–అలఘురేఫము)

వ్యా. అలఘురేఫము, లుప్తాచ్కంబగుచోన్ (లుప్త+అచ్+క)=లోపించిన యచ్చుగలది, యగునపుడు, లఘురేఫమగును. శకటరేఫము మీఁది యచ్చులోపించి పరహల్లుతో సంయోగము చెందునపుడు శకటరేఫము సాధురేఫముగా మాఱునని భావము. ఓర్చి భంగపాటు

తీర్చికొనుము. ఓరుచు=ఓర్చు. తీఱు+చు. బా. ప్రకీర్ణక 16 సూత్రమునందలి రేఫ మలఘురేఫమున కుపలక్షణమనుకొని, ఉత్వము లోపింపఁ జేయవలెను. తీఱ్+చు. ఈ 2చే-తీర్+చు=తీర్చు-అగును. కుత్రచిత్=ఒకానొకప్పుడు, గురుః=గురురేఫము, (ఱ) లఘుః=లఘురేఫము, భవేత్=అగును. ఉచ్చారణస్య కల్ప్యత్వాత్=ఉచ్చారణము వ్యవహారాధీనమగుటవలన, తత్ర=వాని లఘుత్వాలఘుత్వముల విషయమున, సద్వచః=సత్కవి ప్రయోగము, నిదానమ్=మూలము, అనఁగాఁ ప్రమాణము-అని, యథర్వణాచార్యులు చెప్పినారు. కావున తీఱులోని యలఘురేఫము లుప్తాచ్కమగు, తీర్చులో లఘురేఫమగుట యథర్వణ కారికచే సిద్ధించునని భావము. (అనుబంధము. విషయసంఖ్య-126)

అన్యేషామ్=రేఫముకాక తక్కిన, య-ల-వలనెడు, లఘు+అలఘూనామ్=లఘువులు నలఘువులు నగు నంతస్థములకు, వైధర్మ్యమ్=యతిప్రాసాది వైరము, న=లేదు. రయోస్తు= లఘువులు నలఘువులు నగు రేఫముల కన్ననో, నిత్యమ్, స్యాత్=వైరము నిత్యముగా నగును. అని ప్రథమాచార్యులు (=నన్నయ) నియమించినారు. అనయోః=ఈ రేఫఱకారములకు, యస్తు=ఎవఁడు, కవితాకృతౌ=కావ్యమునందు, సంగతిమ్=మైత్రిని, కరోతి=చేయునో, అస్యాః, అత్యంత దుష్టత్వాత్=ఈమైత్రి మిక్కిలి దుష్టమగుటవలన, సః=వాఁడు, అనఁగా రేఫఱకారసాంకర్యము చేసినవాఁడు, దుష్కవిః=కుకవియని, కథ్యతే=చెప్పఁబడును" అని ద్వితీయాచార్యులు (=అథర్వణులు) నియమించినారు. కావున నవి పూర్వరేఫములే యనుటకు వీలులేదు. అనఁగా చేకుఱు-లోఁ, బూర్వరేఫమగు చేకూరు-లోని లఘురేఫమే కలదనుటకు, వీలులేదు. ఏలయన, చేకురు-అన్నచో రేఫఱకారప్రాస నాచనసోమనాథ ప్రయుక్త మనవలసి వచ్చును. అప్పుడతఁడు దుష్కవి కావలసివచ్చును. (1 సూ.) ఇట్లే తీర్చు-అనుచోఁ బూర్వరేఫమగు దీఱుచులోని యలఘురేఫమే యగుననుటకు వీలులేదు. తీఱ్చు-అని గ్రహించినచోఁ దిక్కన రేఫఱకారములకుఁ బ్రాసయతి ప్రయోగించె ననవలసి వచ్చును. అప్పుడతఁడు దుష్కవి కావలసివచ్చును. కాన, తీర్చు-అనియే గ్రహింపవలెనన్నమాట.

విమర్శః- రేఫఱకార సాంకర్యము చేసినవాఁడు దుష్కవి, యనుట యర్థవాదము. రేఫఱకార సాంకర్యము దుష్ప్రయోగమగుటచే నవశ్యము పరిహరణీయమనుట.

## సంధి

### ద్విత్వరహితంబగు ద్వితీయా విభక్తి యుకారమున కచ్చు పరంబగుచో సంధి రాదు. 3.

ఉ: ననునెఱిఁగె, నినునెఱిఁగె మొ॥

వ్యా. ద్విత్వములేని, యనఁగా ద్విత్వములోపించిన ద్వితీయా విభక్తియొక్క ఉకారమునకు, నచ్చు పరమగునపుడు సంధిరాదు. నిన్నున్, నన్నున్, తన్నున్-అనువానిలో ద్విత్వము, శబ్ద73చే-లోపించి, నినున్, ననున్, తనున్-అనురూపము లేర్పడును. ఈద్విత్వము లోపించిన ద్వితీయావిభక్తి ఉకారమునకు అనఁగా "న్ను" వర్ణమున ద్విత్వము లోపింపఁగా మిగిలిన "ను" వర్ణమునందలి యుకారమునకు, అచ్చు పరమగునపుడు సంధిరాదు. ననున్+ఎఱిఁగె=ననునెఱిగె; నినున్+ఎఱిఁగె= నినునెఱిఁగె. (ననెఱిఁగె, నినెఱిఁగె-కావన్నమాట.) ద్విత్వరహితంబు-అనుటచే ద్విత్వసహితమగు ద్వితీయావిభక్తి ఉకారమునకు సంధివైకల్పికముగనే యగును. (బా. సంధి. 2)

విమర్శ:- నన్నున్+ఎటిఁగె, నిన్నున్+ఎటిఁగె-ఇత్యాదులలో బా. ప్రక్రీర్ణ 9చే-సంధిజరుగు పక్షమున ద్విత్వము లోపింపదు. సంధికాని పక్షమున ద్విత్వములోపించి-నమన్+ఎటిఁగె=నమనెటిఁగె, నినున్+ఎటిఁగె=నినునెటిఁగె-అనురూపములు సిద్ధించును. కావున నీసూత్ర మనావశ్యకము. వ్యాకర్త చూచుకొనలేదు.

# సమాసము

## తఱచుగ సర్వనామంబుతోడం గర్మధారయంబు చూపట్టదు. 4

వ్యా. సర్వనామముతోఁ తఱచుగాఁ గర్మధారయ సమాసము కనఁబడదు. బా. సమాస 5వ సూత్రమునఁ గర్మధారయ పూర్వపదమునకు నియమములు విధింపఁబడెను. ఉత్తరపదమున కెట్టి నియమములు చెప్పఁబడలేదు. కాన నుత్తరపదమేదయినను గావచ్చును. కనుకఁ గర్మధారయమునఁ దఱచుగా నుత్తరపదము సర్వనామముగఁ గనఁబడదని యాసూత్రమునకుఁ దాత్పర్య మనఁదగును. తఱచుగ-అనుటచే సర్వనామ మరుదుగా నుత్తరపదము కావచ్చును. ఉదా: ఆయాకాలము (బా. సమాస 21) అయిా నేరములు, ఈయాదేశంబు. (ప్రౌఢ. సమాస 17)

## ద్విగువు మహదర్థఘటితం బదృష్టంబు. 5
## ఇది ముక్తలక్షణ వివేచనము

వ్యా. మహద్వాచకములతోఁ గూర్పఁబడిన ద్విగుసమాసము కనఁబడదని యర్థము. సంఖ్యావాచకము మహద్వాచకముతో ద్విగుసమాసమగుట కానరాదని భావము.

విమర్శ:- మహదర్థఘటితమగు ద్విగువుగ్రాహ్యము కాదనుట. అదృష్టశబ్దమును వాడుట గ్రంథమును మంగళాంతముగా ముగించుటకు. (ముప్వేలుపుల యుక్క ముప్వేల్పుటిక్క-అను రూపములు కనఁబడును. ఇవి యగ్రాహ్యములు.)

## ఇది ఘంటాపథము

* * *

# ప్రౌఢవ్యాకరణ ఘంటాపథ నికషోపలానుబంధము

## I. వివాదాంశ పరిష్కారములు

### (i) బాలప్రౌఢవ్యాకరణ మతభేద పరిష్కారములు (1-12 విషయములు)

బాలప్రౌఢవ్యాకరణములకుఁ గొన్నివిషయములలో మతభేదములు గలవు. వాని సామంజస్యము నిష్పాక్షికముగఁ దత్త్వనిర్ణయదృష్టితోఁ బరిశీలించి సోపపత్తికముగ నాయాసూత్రముల వ్యాఖ్యానమున వివరింపఁబడెను. విశేషాంశము లిట నిర్దేశింపఁబడును.

**విషయసంఖ్యలు:**

**1 క్షారము-కారము (సంజ్ఞా 10):-** క్షారశబ్దము కొన్ని పప్పాదినుసులకు వాచకమనుటకు- "అక్షారాలవణాశినౌ బ్రహ్మచారి ణావలంకుర్వాణావధః శాయినౌ శ్యాతామ్" . (అశ్వ. గృహ్య) "వివాహాదారభ్య ఏతే నియమా భవన్త్యుభయోః. 'హైడింబికా రాజమాషా, మాషాముద్గా మసూరికా, లంక్యాఢక్యాశ్చ నిష్పావాస్తిలాద్యాః క్షార సంజ్ఞితాః'" (నారా) "తిలముద్గాదృతే శైబ్యం సస్యే గోధూమకోద్రవౌ, ధాన్యాకం దేవధాన్యంచ, శబాధాన్యంతథై క్షవమ్, స్విన్న ధాన్యం తథా పణ్యం, మూలం క్షారగణ స్మృతః" (నిర్ణయ-భారతి. జులై 1964-వెం.సూ.)

ఇట, క్షారశబ్దమునకు విడ్లవణమనియు, గుడమనియు నర్థములు. "క్షార లవణవర్జన = Keeping off alkaline substances and Salt." "క్షార=A factitious or medical salt...Vidlavana (మోనియర్) క్షారమ్=విడ్లవణమ్-ఇతిరా జనిర్ఘంటః. గుడమ్-ఇతి హేమచంద్రః" (శబ్దక) "గుడాదిరిక్షువికారఃక్షారః" (హిరణ్య 1-82) "అక్షార · లవణ = Kulluka on MN (Manusmriti) better (food) not containing acrid substance nor salts" (మోనియర్) "అక్షారలవణమ్-హవిష్యాన్నవిశేషః-యథాహమనుః. అక్షారలవణంచైవ, ప్రకృత్యాహవిరుచ్యతే" (శబ్దక)

**2 కోటకుండశబ్దములు (సంజ్ఞా 11):-** (i) కోటశబ్దము సంస్కృతమున నెటఁగనఁబడునో వ్యాకర్తసూచింపలేదు. ఇది మేదినీ విశ్వకోశములలోఁ గలదు. "కుటః కోటే పుమానస్త్రీ ఘటే స్త్రీపుంసయో ర్గృహే" మే.ని. "కుటః కోటే ఘటే గేహే శిలాకుట్టక పూరుషే" విశ్వ (11) సూరిగారు తమ నిఘంటువులో "కోట=కోట్టమ్. కోట్ట దుర్గే పునస్పమే-ఇతి హేమచంద్రః" అని వ్రాసియున్నారు. బాలవ్యాకరణమున

దేశ్యమన్నారు. ఈ భేదమునకు హేమచంద్రుని వ్రాతలే మూలము. కోట్ట శబ్దము దేశీనామమాలలో నిర్దేశింపఁబడినది. "కేఆరబాణకోట్టాకిం" (దేశీనా 2-45) "పేఁట (V పేఁడు)=హారములో నొక సరము" అని, సూ.ని.లో నిర్బిందుక పేటశబ్దము సబిందుకముగ గ్రహింపఁబడెను. (పేఁడు=పేను.) ఈ పక్షమునందును విది దేశ్యమే యగును. కోటకుండలు సంస్కృత సమములనరాదు. చూ. 60.

3 ప్రాణగొడ్డము (సంజ్ఞా 12):- ప్రాణగొడ్డము, ప్రాణకుట్టక శబ్దభవమను విషయమునఁ గొన్ని సందేహములుగలవు. వానిని వరుసగాఁ బరికింతము.

(i) ప్రాణగొడ్డము సమస్తపద తద్భవమేని ప్రాణశబ్దమున రేఫలోపించి యుండదా?

సమా:- రేఫ మనాచ్ఛిక వర్ణము కాకుండుటచే లోపింపవలసిన నిర్బంధము లేదు. "క్రారయొక్కొకచోఁ దొలంగకయ యుండు" అని కవిసంశయ విచ్ఛేదము. (కవి సం.) ద్రౌపది=ద్రోవది; ప్రతిజ్ఞ=ప్రతిన; ప్రాయశ్చిత్తము=ప్రాచితము; ప్రాపము=ప్రాపు; యంత్రము=జంత్రము; సముద్రము=సంద్రము మున్నగుచోట్ల రేఫము లోపింపలేదు.

ఇంతేకాక కొన్నిచోట్ల రేఫము తద్భవములలో లోపించుట గ్రామ్యలక్షణ మనిపించు కొనును. కేతన "గద్దగుద్దనాఁగ గ్రామ్యమయ్యె" (ఆం. భూ.) అని వచించెను. గృధ్ర శబ్దభవము గ్రద్ద. గద్ద- అని రేఫలోపించిన రూపము గ్రామ్యమని కేతన యాశయము. దీనినిబట్టి తద్భవపదములలో రేఫలోపము కొన్నిచోట్ల గ్రామ్యతా పాదకమని తెలియుచున్నది. (నేఁటి నిఘంటువులలో గద్ద-గ్రద్దకు రూపాంతరముగ నీయఁబడినది. అది వేఱేవిషయము.) ఇట్లే ప్రాణశబ్దమున రేఫము లోపించుట గ్రామ్యభాషాలక్షణము. కావున ప్రాణగొడ్డము- అనుచోఁ బ్రాణశబ్దమునందలి రేఫము లోపింపకపోవుట గ్రాంధిక భాషాలక్షణము. రేఫలోపించుట గ్రామ్యభాషాలక్షణము. ఇట్లగుటచే రేఫలోపింపలేదు గాన ప్రాణగొడ్డము- సమస్తపదతద్భవము కాదను నభిప్రాయము సరికాదు.

(ii) ప్రాణగొడ్డము తద్భవమయినచో 'ప్రాణ' శబ్దమునందలి ణకారము నకారముగా మాఱియుండదా? గుణము=గొనము-ఇత్యాదులలో ణకారము నకారముగా మాఱినదిగదా?

సమా:- ణకార మనాచ్ఛికవర్ణము కాకుండుటచే మాఱి తీరవలసిన పనిలేదు. దీర్ఘము మీఁది ణకారము నకారముగా మాఱకుండుట గలదు. ఉదా:- వీణిక=వీణియ, వీణె. నాణకము=నాణెము. ఇట ణకారము నకారముగా మాఱలేదు. మాణిక్యము= మానికము. ఇట మాఱినది. దీర్ఘముమీఁది నకారము సైతము తద్భవములలో ణకారమగుట కలదు. విజ్ఞానము=విన్నాణము, విన్నాణువు. ఇట నకారము ణకారముగా మాఱినది. విన్నాణువు=విన్ననువు-అనుచో హ్రస్వముపై ణకారము నకారమయినది. రేఫము మీఁది ణకారము, నకారము కాదు. హారణము=అరణము. కాఁగా ప్రాణగొడ్డము- అనుచో దీర్ఘము మీఁది ణకారము నకారము కాకుండుట శంకాస్పదము కాదు.

(iii) ప్రాణకుట్టకశబ్దము నిఘంటువులలో లేదు.

సమా:- సమస్తపదములు నిఘంటువుల కెక్కు నవకాశము తక్కువ. ప్రాణసంకట మన్నట్లే (కాశీ 2-74) ప్రాణకుట్టక మన్నది పూర్వకాలమున వ్యవహారసిద్ధమై

యుండును. దానినుండి కలిగిన ప్రాణగొడ్డము కావ్యముల కెక్కియుండును. ప్రాణశబ్దము, కుట్టక, కుట్టన (కాశీ 3-120; క్రీడా 235) కుట్టనీ శబ్దములు ప్రసిద్ధములు. కాన నిఘంటువున నీసమస్తపదములేకుండుట బాధకము కాదు.

(iv) గొడ్డము-అను పదము ప్రత్యేకముగా లేదు. కాన, ప్రాణగొడ్డము-తద్భవము కాదు.

సమా:- సమాసఘటితపదములు కొన్ని వ్యస్తముగ లేకపోవచ్చును. ఒల్లఁ బాటు, ఒడఁబాటు-అను సమాసములందున్న ఒల్లన్, ఒడన్-అనునవి విడిగాలేవు. కొన్నిచోట్ల జంటపదములందు సైతమిట్టిది కలదు. ఎట్టకేలకు, ఎట్టకేని-అనుచోట్లఁ గల ఎట్టకున్ ఏలకున్ అనునవి విడిగాఁ గానరావు. ఇంతేకాక, గొడ్డగము-అను పదముగలదు. "గొడ్డగము లిట్లు సేయఁగ" వరాహ. "గొడ్డగము-వై. బాధకము. గొడ్డగపు జరావ్యాధుల. (శివయో 3-74)-సూ.ని;శ.ర. కుట్టకము=గొడ్డగము, గొడ్డము. కుట్టము=గొడ్డము అనియుఁ గావచ్చును. మఱియు సమస్తపద తద్భవములందలి పదములు వ్యస్తమున వాడుకలోనుండవలసిన నిర్బంధము లేదు. ఉదా:- అంతఃపురము=అంతిపురము. "అంతి" అనునది వ్యస్తముగ లేదు. కావున, గొడ్డము-వ్యస్తముగ లేదన్నంతమాత్రమున, ప్రాణగొడ్డము-సమస్తపద తద్భవమనుటలోఁ బ్రతిబంధకము లేదు.

అసలు ప్రాణగొడ్డము వైరిపదమనుట కవకాశము లేనేలేదు. కేతన యాంధ్ర భాషాభూషణములో వైరిపదమును దోషముగాఁ బేర్కొనియున్నాఁడు.

క. దినకరకొడుకునకును సరి
యనిమిష మొదవునకు సాటి యని యిబ్భంగిన్
దెనుఁగింప సంస్కృతములం
దెనుఁగులు సంధించిరేని దెగడుదు రార్యుల్. (ఆం.భూ.131 ప.)

పైలక్షణమునుబట్టి ప్రాణగొడ్డము-అనునది వైరిపదమేయయినచో నది కేతన సమ్మతము కానేరదు గదా! ప్రాణగొడ్డమును గేతనయే తనదశకుమారచరిత్రమున రెండుసార్లు ప్రయోగించియున్నాఁడు. (దశ 3-70, 6-94) ఆర్యగర్హితమని తాను పేర్కొన్న వైరిపదమును గేతన ప్రయోగించెననుటకన్న నార్యగర్హితమగు వాదము వేఱొకటి యుండదనక తప్పదు. కావున ప్రాణగొడ్డము వైరిపదము కానేరదు. ఇది సమస్తపదతద్భవమనుటయే సత్యము, నిర్బాధము. సమస్త పదతద్భవములను నన్నయాదులెల్లరు వాడియున్నారు. ఉదా॥ అంతఃపురము=అంతిపురము. వైరిపదమును గేతనయే కాక పూర్వలాక్షణికులెల్లరు దూషించియున్నారు. "తుద వేఱుసేసి మఱి చక్కదపుం దెనుఁగున నమర్చి కలవంబుజముల్, పదియు ననక కలవంబుజ, పదియని కృతిఁజెప్ప వైరిపదమనఁబరఁగున్." (కవిజనా. దోష 22 ప.) "క్షీరార్ణవకూఁతురు సం. సారార్ణవ యోడ శుభమొసఁగు మీకనఁగా వైరిపదంబగుఁ దెనుఁగునఁ గూరనిసంస్కృతముఁ దెనుఁగుఁ గూర్చుటచేతన్." (కావ్యాలం. 9. 135) "తుదలు తెలుఁగుఁజేసి యదికి పుష్పవిల్లు, పరఁగ భూరుహంపుఁ బండ్లునాక, పుష్పవిల్లునాఁగ భూరుహపండ్లునా, వైరివర్గమంద్రు వనజనాభ" (ఛందో. 4-22) అనంతుఁడు మిశ్రసమాసములను వైరిపదమును గలిపి వైరివర్గమనెను. పుష్పవిల్లు భూరుహపండ్లు-దుష్టములనుటలో నతనికిని నభిప్రాయభేదములేదు. కాఁగా, ప్రాణగొడ్డము వైరిపదము కాదు. సమస్తపదతద్భవమే.

**4 కవిల (సంజ్ఞా 13):-** కవిల-అనునది ప్రాకృతభవము. (చూ-ము.కా. సంజ్ఞా. 11) ఈ ప్రాకృతభవమునే నన్నయ ప్రయోగించియుండును.

**5 పూ పూవు (సంధి 11):-** "పూ-దీనికి వృత్తియందు ఉకారమునకు వలె నుమాగమాదికార్యము నెఱుంగవలెను;" "పూఁదేనియ (పూ+తేనియ) పూఁబాళ (పూ+పాళ) పూఁబిందె (పూ+పిందె) పూఁబోఁడి (పూ+పోఁడి)"-శ.ర. కావున, పూ+పోఁడి-అనుచో నుమాగమము కలుగుట వ్యాకర్తకభిమతము.

అహోబలపండితుడు-"పూఁబొదలు-ఇత్యత్ర పువుశబ్దస్య పూనిత్యాదేశః ఊదంతా న్నుమోఽసంభవా దితిజ్ఞేయమ్" (అహో 359) అని వచించెను. ఈ పక్షమున-పువు+ పొదలు=పూన్+పొదలు=పూఁబొదలు-అని ప్రక్రియ. ప్రౌఢ వ్యాకర్త 'పూ' అను నేకాక్షరశబ్దమును గ్రహించి సాధింపవలెనని తలఁచెను. సూరి ప్రాఁతాదులలో పూవుశబ్దమును జేర్చి రూపసాధన చేసెను.

పూశబ్దమునకుఁ బ్రయోగాంతరములు-సిందువారమునఁ బూశిథిలపడఁగ- భీమ 2-46. తలపూ-పారిజా 1-64. తొలుపూఁ దుఱిమె-మను 3-84. చిన్నిపూ గుస్తరించి-కాశీ. 7-148. ఒక్కపూఁ గోసి-విక్రమా 8-66. ఇత్యాదులు.

రేయి ఱాయి వేయి శబ్దముల తుది యివర్ణమునకు లోపము చెప్ప నెట్లావశ్యకమో (చూ. బా. అచ్చిక 21- ఘంటాపథము). యిట, పూశబ్దమునకు నుమాగమమును విధించుట యట్లే యావశ్యకము.

**6 నెఱి-నెఱ (సంధి 14):-** నెన్నడాదులలోనిది నెఱి శబ్దమను ప్రౌఢ వ్యాకరణా శయము సరికాదు. "ఉత్తమగుణసూచకమగు, నెత్తమ్మియు నెమ్మొగంబు నెత్తావియు నాన్" ఆం.భూ. 185 ప. క్రొత్తయు నెఱయును-125 ప. "నెఱ=ప్రశస్తము. ప్రాసఁగువిత్తువంటి నెఱపాఱు కొలంబునఁ బుట్టి-పాండు 3-1"-సూ.ని.

**7 పోఁడి-బోఁడి (సమాస 19):-** మేనునకు బోఁడి నాదేశము చేయు బాలవ్యాకరణ మార్గమే సరియయినదని యిట్లుపపత్తులు సెలవిత్తురు. వానిని వరుసగాఁ బరికింతము.

**బాలవ్యాకరణమతపరిశీలనము:-** (i) మన భాషలో, తీవబోఁడి అలరుబోఁడి, ఇత్యాది సమాసములు లతాంగీ, సుమాంగీ-వంటి సంస్కృతసమాసముల ననుసరించి కల్పింపఁబడి యుండును. కాన మేనునకు బోడినాదేశము చేయుటయే యుక్తము.

సమా:- లతాంగీ, సుమాంగీవంటి సంస్కృతసమాసముల ననుసరించి సమాస ములు కల్పింపనెంచినచో మేను, ఒడలు, మెయి, మే, లోనగు శరీర వాచకశబ్దములతో సమాసములను గవులు కూర్చుట సహజముగాని మేనుశబ్దమును నిల్పి దానికి బోఁడి నాదేశముచేసి సమాసకల్పనచేసి యుందురనుట హాస్యాస్పదము. మేనునకు బోఁడి నాదేశించుట వర్ణనాత్మక వ్యాకరణ ప్రక్రియామార్గమగును గాని కవులు సమాసకల్పన చేయు పద్ధతికాదు. కాన నీయూహ యసంగతము. తీయఁబోఁడి, అరఁటిబోఁడి, బంగారుఁబోఁడి, మెఱుఁగుఁబోఁడి, చిగురుఁబోఁడి-మున్నగు సమాసములు సంస్కృ తానుసారులు కావు. ఏలయన, మధురాంగి (ఇక్ష్వంగి), నీరాజనాంగి, సువర్ణాంగి, విద్యుదంగి, పల్లవాంగి-వంటి సిద్ధసమాసములు కనబడవు. కావున మేనునకు బోఁడి యగుననుట సకలరూప సాధకమును గాదు. కానఁ బైయూహ సరికాదు.

(ii) తీవ+పోఁడి–అనుచో, పోఁడి శబ్దము బోఁడిగా మాఱుట కవకాశము లేదు. నుగాగమమును విధించినచో తీవఁబోఁడి–వంటి రూపములేర్పడును. బిందుఘటిత రూపములు ప్రామాణిక కృతులలో లేవు. ఒక్కపాంచాలీ పరిణయ ప్రయోగమునుబట్టి యట్టి ప్రయోగములు సకల కవి సమ్మతములనరాదు. కాన మేనునకు బోఁడి యగుననుటయే యుక్తము. (బా. ర) ఇది వేఱొకయుక్తికి సారాంశము.

సమా:- (i) తీవ+పోఁడి–అనుచో బిందువు సమ్మతము కానిచో, పకారమునకు బకారమును విధించి ప్రక్రియ నడపవచ్చును. అప్పుడర్ధబిందువు ప్రసక్తము కాదు. ఇట్లు 'పోఁడి' శబ్దముతోనే రూపసాధన కవకాశముండఁగా మేనునకు బోఁడి యగుననుట సరికాదు. (ii) ననబోఁడి, విరిబోఁడి–మున్నగు రూపములలో బకారశ్రుతి సర్వసమ్మతము. ఈ బకారశ్రుతిని బట్టి నుగాగమము సకల కవిసమ్మతమని తెలియును. తీయంబోఁడి–అను ప్రయోగము దీనినే బలపఱుచును. కాఁగా, బిందుఘటితరూపములు కలుగకుండుటకు మేనునకు బోఁడియగుననుట యుచితము కాదు.

(iii) ననబోఁడి–మున్నగువానిలోనిది పోఁడి శబ్దమన్నచో, ననఁబోణి, వంటి ణకార ఘటితరూపము లుండవలసివచ్చును. ణకార ఘటితరూప మొక్కటయినను బ్రయోగములలో లేదని యహోబలపండితుఁడు వక్కాణించియున్నాఁడు. (బా–ర.)

సమా:- (i) "వాణివోని కీరవాణిఁ బీనశ్రోణి, నళినీలవేణి నలరుఁబోణి" భోజరా 5ఆ." "మేటిరతులకు సురతాణి మించుఁబోణి" (శశాం. 4ఆ) ఓలయా చిగురాకుఁబోణికి, నోలయా యంబురుహపాణికి (ప్రబంధ 263ప) అనుప్రయోగములు గలవు. పెక్కు కావ్యములలో ణకారఘటిత పాఠములు గలవు. వాని నన్యథాకరింపవలె ననుటయు యుక్తముకాదు. (హరి. పూ. భా. 3–171; భీమ 5–191; హర 5–37; శృ. నై 3–198; నిరం 2–15. మొ॥) (ii) "పువ్వుఁబోణి, పువ్వుంబోణి, పువ్వున్బోణి" అని బాలసరస్వతి ణకార ఘటితరూపముల నుదాహరించి యున్నాఁడు. (నుమ్యోతః–సూత్రవాఖ్య.) ఈణకారఘటితరూపములు పోఁడిశబ్ద పక్షముననే సిద్ధించును. బోఁడి శబ్దాదేశపక్షమున సిద్ధింపవు. కాన మేనునకు బోఁడి యగుననుట సరికాదు. మేనునకు బోఁడినాదేశముచేయు పద్ధతిని సమర్థించుటకుఁ జెప్పిన యుపపత్తులు సముచితములు కావనుట స్పష్టము.

పూర్వలాక్షణికులు పోఁడిశబ్దముతోనే సమాసములు కల్పించినారు. పువ్వుఁబోణి, పువ్వుంబోణి, పువ్వున్బోణి–బాలస. పోఁడిమి. పోణిమి పువ్వుఁబోఁడి–ఇత్యాదౌ డకారఏవ నణకారఇతి జ్ఞేయమ్–అహో 423. ఇట నహోబలపండితుఁడు ణకారఘటితరూపము లేదన్నను 'పోఁడి'తోనే ప్రక్రియ చెప్పినాఁడు పోఁడి యనఁగ నెల్లెడలను, నాఁడుంబేళ్లకునుజెల్లు నభినవదండీ – అం. భూ. 167 ప. పువ్వుఁబోఁడి, తలిరుఁబోడి...ముక్కంటి యనబహువ్రీహి (కావ్యాలం 9–126) మేర్లుక్–బహువ్రీహే...పువ్వుంబోఁడి. (వై. చం) పువ్వు+పోఁడిమి.

కాఁగా, మేనునకు బోఁడి నాదేశముచేయు పద్ధతి కవి హృదయ విరుద్ధము, పూర్వలాక్షణిక మత విరుద్ధము నగుటచే నగ్రాహ్యమనుట యుక్తము.

**ప్రౌఢవ్యాకరణ మత పరిశీలనము:-** అలరుఁబోఁడీత్యాదు లుపమాన పూర్వపద కర్మధారయములని ప్రౌఢవ్యాకర్త వచించెను. "మెఱుఁగుఁబోఁడి, పాణిపల్లవము–ఇవి

యుపమాన సమాసములు" (బాలస.246 పు) అను బాలసరస్వతి వచనమును ప్రౌఢ వ్యాకర్త యనుసరించి యుండును. కాని యివి యుపమాన పూర్వపద కర్మధారయము లనుట స్వరసము గాఁ గన్పట్టదు. మెఱుఁగుఁబోఁడి=మెఱుగువలె మనోజ్ఞురాలు, తీయఁబోఁడి=చెఱకువలె మనోజ్ఞురాలు, అరతిఁబోఁడి (శృ.శా 3–75)=అరతివలె మనోజ్ఞురాలు, బంగారుఁబోఁడి (పరమ)= బంగారువలె మనోజ్ఞురాలు–అనుట బాగు కాదు. అహోబలపండితుఁడు "మెఱుఁగుఁబోఁడి, తమ్మికంటి–ఇత్యాద్యా ఉపమాన గర్భబహువ్రీహయః" (అహో) అనెను. ఈ పక్షమున, మెఱుఁగుఁ బోఁడి=మెఱుఁగువంటి పోఁడి దేనికిఁగలదోయది–అని గ్రహింపవలెను. కాని, విరిఁబోఁడి– మున్నగుచోట్ల నీ ప్రక్రియ సరిపడదు. ఏలయన, ఉదంత స్త్రీ సమేతరములకు నుమ్ము రాదు. విరిఁబోఁడి=విరిని బోలు పోఁడి దేనికిఁ గలదో యది–అని విగ్రహము నెన్నవలెను. మెఱుఁగుఁబోఁడి=మెఱఁగును బోలుపోఁడి దేనికిఁ గలదోయది–అని పక్షాంతరముగాఁ జెప్పవచ్చును. తీయఁబోఁడి=తీయని పోఁడిదేనికిఁ గలదో యది. తీయని+పోఁడి. ము. కా. సంజ్ఞా 7 చే–తీయన్+పోఁడి=తీయంబోఁడి, తీయఁబోఁడి. పోఁడి=ఆకృతి, రూపము, ఒప్పిదము. "అనాద్యస్యాపిశబ్దస్య కల్పనా క్వచిదిష్యతే" అనున థర్వణ కారిక కివి లక్ష్యములగును. (వికృ)

**8 కలికంఠుఁడు** (సమాస 27):- కలికంఠా! క్షమియింపుము (అరణ్య 1–326) అనుచో, కలికంటా! అనునది నన్నయపాఠమని యందురు. కంఠశబ్ద భవము–కంటు. కలి+కంటు=కలికంటు. (కలియైనకంటు=కంఠము, కలవాఁడు) దీని సంబోధనరూపము–కలికంటా–అగు నందురు. (వ్యా. సం. స. 181–186 పు.) ఈ సమర్థనము ప్రతిభావంతముగానున్నదే కాని విశంసనీయముగాలేదు. ఇందుకు బాధకములు– కలికంఠ ముఖాహితాః (వికృ.29) అను నథర్వణకారికలో 'ఠ'కారమే యుపలబ్ద పాఠము. వాఁడిమయూఖములనఁగా, వేఁడిపయోధారలనఁగ వింజామరనా, మూఁడస్త్రంబులనంగాఁ, బోఁడిమి కలికంఠ నామముంబోలి తగున్–ఆం. భూ 134. ఈ కేతన లక్షణము, నన్నయప్రయుక్తమగు కలికంఠా! అను ప్రయోగమునే సూచించు ననుటయుక్తము.

కలికంఠుఁడు–ఇత్యత్ర మిశ్రబహువ్రీహిః–అహో 523. కలికంఠుఁడు–ఇత్యత్ర ఠకారః–అహో 534 పు. "దినవెచ్చము కలికంఠుఁడు, నను గ్రామ్యపదములు గొన్ని యలరుం గృతులన్" సర్వల. 2–20. (దినవెచ్చము–వైరిపదము కాదు. దినవెచ్చము=దినము+చేయు+వెచ్చము. ము.కా. సమాస 18)

పైహేతువులనుబట్టి కలికంఠుఁడు–మిశ్రబహువ్రీహి యనుటయే సముచితము. (కలి+ము+కంఠ+ము). బా. సమాస 25చే–కలికంఠ–ప్రాతిపదికము. కలికంఠ=కలి కంఠుఁడు (బా. తత్సమ 21, 22, 19 సూ.)

**9 విధము** (శబ్ద 24): (i) అప్రసిద్ధమగు విధ శబ్దమునుండి విధము–అను రూపమును సాధింపవచ్చునను పక్షమునందును, సుప్రసిద్ధమగు విధాశబ్దమునుండి విధ–అను ననిష్టరూప మేర్పడకుండుటకు విధాశబ్దమును కంధరాదులలోఁ జేర్పకతీరదు. కావున విధాశబ్దమునుండి విధము–అను రూపమును సాధించుటయే యుక్తము. (ii) దంష్ట్ర–అను పుంలింగశబ్దము శబ్ద కల్పద్రుమాది నిఘంటువులలోలేదు. ఎటనేని

దం(ష్ట్ర శబ్దముండవచ్చును. కాని యట్టి య(ప్రసిద్ధ దం(ష్ట్రశబ్దము నా(శయించుట సరికాదు.

**10** ఊరుచోటు మేన్వాదులు (శబ్ద 106):- కేషాంచి దుదంతానాం నేతివిభక్తా వునోలుక్ స్యాత్-అను సూ(త్రముండఁగా ఔపవిభక్తిక నామ్నామత్వం స్యాత్ సప్తమీ తృతీయార్థే-అను సూ(త్రమేల? యను (ప్రశ్న నహోబలపండితుఁడు లేవనెత్తెను. గుద్దలి, చేయి, వాయి, దాయి శబ్దము లుదంతములు కావు గావున వీనిపై నవర్ణకము నిలువకుండుటచే, గుద్దంటన్, కొడవంటన్, గొడ్డంటన్-ఇత్యాదుల సాధనకు ఔపవిభక్తికనామ్నామ్-అను సూ(త్ర మావశ్యకమని వక్కాణించెను. "గుద్దలి, కొడవలి, చేయి, వాయి, రోయి, దాయి-ఇత్యాది శబ్దేభ్యస్తృతీయా సప్తమ్యోః (ప్రాప్తౌ గుద్దంట కొడవంట గొడ్డంట-నిత్యాది రూప సిద్ధ్యర్థ మిదం సూ(త్రమావశ్యక మిత్యవధేహి" (అహో 402 పు.)

పై యహోబలపతిచర్చను బరిశీలించు నప్పుడు, ఔపవిభక్తకనామ్నామ్-అను సూ(త్రముండఁగా కేషాంచిదు దంతానామ్-అను సూ(త్రమేల? యని (తిప్పి (ప్రశ్నింపవచ్చును. కనుక, కేషాంచిత్సూ(త్రమునకు విషయములయిన శబ్దములను సయితము, ఔపవిభక్తిక నామ్నామ్-అను సూ(త్రమునకు విషయములుగానే సరి పెట్టవచ్చునను నభి(ప్రాయముతో సూరి ఔపవిభక్తికనామ్నామ్-అను సూ(త్రము ననువదించి కేషాంచిత్సూ(త్రము నుపేక్షించెను. "ఔపవిభక్తికముల తృతీయాసప్త ముల కత్వంబాదేశంబు బహుళంబుగా నగు" (అచ్చిక 38) అను బాలవ్యాకరణ సూ(త్రమునందలి బహుళ(గహణముచే ఊరుచోటు మేన్వాదులందుఁ దృతీయార్థము లేదని వ్యాఖ్యానించుకొననగును. అనఁగాఁ దృతీయాసప్తమ్యర్థములు రెండును గల శబ్దములును, సప్తమ్యర్థము మా(త్రమేగల, ఊరుచోటు మేన్వాదులు నొక్క, ఔపవిభక్తిక నామ్నామ్-అను సూ(త్రమునకే విషయములుగా సం(గహింపఁబడె నన్నమాట. (ప్రౌఢవ్యాకర్త, సప్తమ్యర్థము మా(త్రమే గల, ఊరుచోటు మేన్వాదులు, కేషాంచిత్సూ(త్రమునకు విషయములనియుఁ; దృతీయాసప్తమ్యర్థములు రెండును గల శబ్దములు, ఔపవిభక్తికనామ్నామ్-అను సూ(త్రమునకు విషయములనియు స్పష్టపఱిచెను. కాఁగా, బాలవ్యాకర్త రెండువర్గముల నేకసూ(త్రమున నిబంధించెను. (ప్రౌఢవ్యాకర్త మూలమునందువలె రెండువర్గములు వేర్వేఱుగా నుండఁదగునని యభి(ప్రాయపడెను. కావున బాలవ్యాకర్తది సంక్షేపదృష్టి, (ప్రౌఢవ్యాకర్తది విశ్లేషణాత్మకదృష్టి, యని (గహింపవలెను.

**11** తద్భవములలో నలఘురేఫము (సంజ్ఞా 9):- సంజ్ఞా 9వ, సూ(త్ర ఘంటాపథముతోఁ (గింది విషయమును యథోచితముగ నను సంధించుకొనవలెను. శకటరేఫము తద్భవములందును గలదను (ప్రౌఢవ్యాకరణము సరికాదని యిట్లు విమర్శింతురు.

"(క్రియాపదముల తుదలను, సంస్కృతపదము లందును, తద్భవముల యందును, అకారములు లేవు. (అప్పక 2-196)" అని యప్పకవి చెప్పినాఁడు..... "తద్భవంబుల రేఫగాని శకటరేఫ గాదు" అని దిట్టకవి వేంకటార్యుఁడు (ప్రతిపాదించినాఁడు. కూచిమంచి తిమ్మకవియు సమ్మతించి నటులున్నాఁడు-చూ. సర్వలక్షణ-3 ఆ-శకట రేఫ(ప్రకరణము-10, 11 పద్యములు. "తద్భవ పదములఁ దవిలిన యారేఫ రేఫగాని

శకటరేఫగాదు–కవిసంశయ విచ్ఛేదము 3–1. అని సూరకవి నిరూపించినాఁడు. ఇది పదుగురాడినమాట" (బా.ర.)

సమా:- ఒక విషయమును సప్రమాణముగా నిరూపింపవలెఁ గాని మంది బలముతోఁ గాదు. కొన్నిచోట్ల గతానుగతికముగాఁ బలువు రొకవిషయమును జెప్పవచ్చును. తద్భవములలో నలఘు రేఫము గలదని యహోబలపండితాదులు చెప్పియున్నారు. వాని నొప్పరికించి స్వవాదానుకూలములగు లాక్షణిక వచనములను, జూపి లాక్షణికులు పరిశోధకులు చేసిన యపారమయిన పరిశ్రమను మేనమామ పోలికలని, కొండగుర్తులని లఘూకరించుట కేవల మసంగతము. (చూ–వై.పా. 404–551 పు)

కాఁగాఁ దద్భవములలో నలఘురేఫము క్వాచిత్కముగాఁ గలదనుటయే సత్యము. సూరియే యంగీకరించుటచే నిట వివాదమునకుఁ దావు లేనేలేదు. బా. సంజ్ఞా 18 ఘంటా.

**12 ఎల్లశబ్దము (సంధి 7):-** ఎల్ల శబ్దవిషయమున సంధి 7వ, సూత్ర ఘంటాపథముతోఁ గ్రింది విషయములను యథోచితముగ ననుసంధించుకొనవలెను.

"ఎల్లయందు–ఇత్యాదులు సప్తమ్యంతములని తలంపరాదు. అందు–అనునది విభక్తిప్రత్యయమే గాక ప్రత్యేక శబ్దమును గలదని "సాశ్రయానాశ్రయాపి స్యాత్త్రార్థ గత సప్తమీ" యను నథర్వణకారిక వలన తెలియఁ బడుచున్నది...కావున నెల్లపద మవ్యయమనుటయే యుచితము." (తత్త్వ) అందురు. కాని వీరుదాహరించిన యథర్వణకారికయే వీరి వ్రాఁత సరికాదని తెలుపుచున్నది. ప్రకృతి నాశ్రయించి యుండు, అందుశబ్దము ప్రత్యయమనియు, స్వతంత్రప్రయోగముగల, అందు శబ్దము, అత్రార్థమగు దేశ్యశబ్దమనియు నథర్వణకారిక కర్థము. "నను అంద్విత్యస్యసాశ్రయత్వ మనాశ్రయత్వ మప్యస్తీతి సాశ్రయత్వే విభక్తిత్వ మనాశ్రయత్వే అత్రేత్యవ్యయపర్యాయ త్వమే వేతి" (అహో 310 పు) అని యహోబలపండితుఁడు వివరించియున్నాఁడు. "ఎల్లయందు"అనుచో అందుశబ్దము ఎల్ల–అను ప్రకృతి మీఁద నిల్చుటచే నది ప్రకృతి నాశ్రయించియున్నదనుట స్పష్టము. కాన ఎల్లయందు అనుచోట అందు శబ్దము విభక్తియేకాని ప్రత్యేకపదము కాదు. ప్రత్యేక పదమన్న పక్షమున–ఎల్లన్+అందు=ఎల్లనందు అని కావలసియుండును. ఎల్లయందు–కాదు. కాఁగా ఎల్లయందు–సప్తమ్యంతమే యని గ్రహింపవలెను. ఎల్లశబ్దము మహదమహదర్థక మగు సర్వనామము.

"ఎల్లాశిష్యంగుళు" అను కన్నడ సమాసమును శ్రీనాథుఁడు, ఎల్లాశిష్యులు– అని తత్సమముగా ప్రయోగించియుండును. వ్రాయసకాండ్రో ఇతరులో ఎల్లన్ శిష్యులు–అని సవరించియుందురు. ఇట్టి ప్రయోగ మాకవి వాఙ్మయమం దెచ్చటను గానరాకుండుటయు నాకవిత్వంబు నిజము కర్ణాటభాష–అని చెప్పిన భీమఖండము నందే యీయొక్క ప్రయోగమే యుండుటయుఁ గర్ణాటకసమమని ధ్రువపఱచు చున్నది" (భారతి 1964 జూలై సంచిక. వెం.సూ.) అని చెప్పఁబడెను. కాని యీయభిప్రాయమును సమంజసముగాఁ గానరాదు. కారణములివి–(i) శ్రీనాథుఁడు, ఎల్లాశిష్యులు– అని వ్రాసెననుట నిరాధారమగు నూహ మాత్రమే కాని యిట్టిపాఠ ముపలబ్ధము కాదు. తిమ్మకవి "ఎల్లన్ శిష్యుల"అను పాఠముతోనే యుదాహరించెను. (సర్వల 1–77) (ii) నాకవిత్వంబు నిజము గర్ణాటభాష– అను పద్యపాదమునందలి కర్ణాటశబ్దమునకుఁ గన్నడమే యర్థమన్నచో శ్రీనాథునకుఁ దాను వ్రాయుచున్నది

తెలుఁగో కన్నడమో తెలియ దనవలసివచ్చును. ఇట్టి యర్థము ప్రకరణోచితము కాదు. (iii) "ఎల్లన్ శిష్యులఁ గొంచువత్తునా" అన్నది వ్యాసమహర్షి చేత ననిపించినది. వ్యాసమహర్షినోటఁ గన్నడ సమాసము ననిపించుటలోఁ బాత్రౌచిత్యము లవలేశమును లేదు "బిజమాడు దేవరు నిజకృపాదృష్టిఁ జెన్నారు నాయిల్లు బిడారనీకు" (కాల.హ. 1-35) మున్నగు చోట్లఁ గన్నడపదములు పాత్రౌచిత్య దృష్టితోఁ బ్రయోగింపఁబడినవి. ఇట్టి యౌచిత్య మేమియుఁ బ్రకృతసందర్భమున లేదు. "ఖుసిమీఱన్ సురధాణి నిండుకొలువై కూర్చున్నచో" (హర 1-22) అని శ్రీనాథుఁడు సుల్తానుగూర్చి చెప్పినప్పుడు ఖుసి శబ్దము నౌచితీరుచిరముగఁ బ్రయోగించియున్నాఁడు. కావున ఎల్లాశిష్యులు-అను కన్నడసమమును శ్రీనాథుఁడు వాడెననుట విశ్వసనీయము కానేరదు.

## (ii) ఇతర వివాదాంశ పరిష్కారములు (13-29 విషయములు)

**13** ళాకారగ్రహణము (సంజ్ఞా 1): ళాకారగ్రహణము సంస్కృతప్రాకృత భాషావ్యాకరణజ్ఞుల సమ్మతము. అయ్యది మంత్రశాస్త్ర ప్రసిద్ధము. (సంజ్ఞా 1) అని ప్రౌఢవ్యాకర్త వ్రాసెను. ళాకారము పాణినీయసమ్మతముకాదు గావున, సంస్కృత వ్యాకరణజ్ఞుల సమ్మత మనుటయెట్లు? ప్రాకృతమున ళాకారము లేకుండుటచే (ప్రాకృతమున ళాకారముకలదను, సుబోధిని తప్ప) నిది ప్రాకృత వ్యాకరణజ్ఞుల సమ్మతమనుట యెట్లు? అని ప్రశ్నించుకొని, సంస్కృత ప్రాకృత వ్యాకరణజ్ఞుల కసమ్మతము-అని వ్యాకర్త వ్రాయఁగా 'క'వర్ణము లోపించి యుండునని కొందఱు సెలవిత్తురు. కాని యిది సరికాదు. కారణములివి-(i) ళాకారము ప్రాకృత వ్యాకరణజ్ఞుల కసమ్మతమన్నచో ళకారము ప్రాకృతవ్యాకరణజ్ఞులకు సమ్మతమను విరుద్ధార్థము నంగీకరింపవలసి వచ్చును. (ii) అసలు ప్రాకృతములో ళాకారము లేదని చెప్పవలసిన యావశ్యకత లేదు. ప్రాకృతసమ మచ్చతెనుఁగుననే చేరును గావునఁ దక్కిన యనాచ్ఛికవర్ణములగు వర్గయుక్కులకు వలెనే ళాకారమునకును బ్రాకృతసమ రూపమునఁ బ్రవేశములేదు. కావున సంస్కృత ప్రాకృతవ్యాకరణజ్ఞుల సమ్మతము అనుచో కవర్ణము ముద్రణమున లోపించెననుట సరికాదు. కావలసినచో "కు" వర్ణము లోపించె ననుకొనవచ్చును.

ళాకారము పాణినీయేతర సంస్కృత వ్యాకర్తృసమ్మతము. "ళత్రయం తథ ధనలసవో దంత్యాః, ముగ్ధ-సంజ్ఞా 6. ళాకారము సంస్కృతమునఁ గలదనుట ప్రాకృతవ్యాకరణజ్ఞులకు సమ్మతమని యహోబలపండితుఁడు వివరించియున్నాఁడు. (చూ. సంజ్ఞా 1 సూత్రపుమూలము.) ఆ వివరణముననుసరించియే ప్రౌఢవ్యాకర్త ళాకారము సంస్కృత ప్రాకృతవ్యాకరణజ్ఞులకు సమ్మతమని వివరించెను.

కాఁగా, ళాకారము సంస్కృతమునఁ గలదనుట పాణినీయేతర సంస్కృత వ్యాకర్తలకు వరరుచిహేమచంద్రాది ప్రాకృతవ్యాకర్తలకు సమ్మతమని ప్రౌఢ వ్యాకర్త యాశయము.

మంత్రశాస్త్రప్రసిద్ధమగు మాతృకాపూజ తెనుఁగుకవుల కవశ్య కర్తవ్యమనుటకు- "ప్రభూనుద్దిశ్యపద్యంవా ప్రబంధంవా కదాచన, నవక్తవ్యం నవక్తవ్యం మాతృకాపూజనం

వినా" సా.ర. (అప్పక 2-388 తరువాత) మాతృకాపూజచేయునపుడు ఔకారము నీశాన్యమూలయింట వ్రాయవలెను. అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఔ ఔ ఏ ఐ ఓ ఔ అం అః...విప్రమాతృకలు, ఇవి యీశాన్యమూల యింట వ్రాసేది." (అప్పక 2-394 తరువాత) తెలుఁగుకవులు మాతృకాపూజచేయునప్పుడు ఔకారమును లిఖింపవలసియుండుటచే వర్ణసమామ్నాయమున నిది చేర్పఁబడె నన్నమాట.

ఔ-అనునేకాక్షర శబ్దము సంస్కృత నిఘంటు సమ్మతము.

"అథావ్యయాని-ఔకారోదేవనార్యాస్యాన్నార్యాత్మన్యపిమాతరి" (మే.ని.)

"ఔకార స్స్మర్యతేపూర్వైర్దనవీశబ్దకోవిదైః" (ఏ.కో)

"ఔకారఃకృకలాసేద్రావం గేక్షిమకరే సురే, లీలాగతాలోచనాస్థినాగమాతరి మాతరి" (నానా)

"ఔః స్త్రీ. దైత్యస్త్రీ-ఇత్యేకాక్షర కోషః. దనుజమాతా, కామధేనుమాతా-ఇతి కశ్చిదేకాక్షర కోషః"

"ఔః పుం. సర్వః, మహాదేవః-ఇతి కశ్చిదేకాక్షర కోషః" (శబ్దక.)

**14 ద్రుతస్వరూప నిరూపణము-సాధక బాధకములు:-** "ద్రుతాఖ్యోనః- అని యాంధ్రశబ్ద చింతామణి. వ్యంజన నకారము ద్రుతమని దీనిభావము. (చిం.పరి.) కాని చింతామణి వ్యాఖ్యాతలు నకార నువర్ణములు రెండును ద్రుతములని వివరించినారు. కావుననే సూరిగారు నకారంబు ద్రుతంబు-అని సూత్రించియు నువర్ణమునే ద్రుతపూర్ణరూపముగా భావించినారు. (చూ. బా. సంజ్ఞ 11-ఘంటా) "విభక్త్యాగమ చార్థో నుర్ద్రుతః-" అని సూత్రాంధ్ర వ్యాకరణమున సూరిగారు సూత్రించి యుండుట గమనార్హము. సీతారామాచార్యులుగారు "ప్రత్యయాగమా వ్యయాత్మకమై యుత్వవిశిష్టమయిన నకారంబు ద్రుతసంజ్ఞకంబని యర్థము" అని వక్కాణించినారు. (సంజ్ఞా-7) నువర్ణమున స్వరలోపము కలుగఁగా వ్యంజన నకారము సిద్ధించును. (చూ. బా. సంధి 27-ఘంటా.) కాఁగా చింతామణి మతమునఁ బొల్లునకారము మాత్రమే ద్రుతము. బాలప్రౌఢవ్యాకరణముల మతమున నువర్ణము ద్రుతమూలరూపము. ఇది యొక భేదము. వేఱొక భేద మేమనఁగా స్వరవిశిష్ట నకారములలోని స్వరములకు లోపము కలుగఁగా, శేషించిన వ్యంజన నకారములు చింతామణి మతమున ద్రుతములగును. అనఁగా నావయవిక నకారము చింతామణిమతమున ద్రుతమన్నమాట. బాలప్రౌఢ వ్యాకరణముల మతమున నావయవిక నకారము ద్రుతముకాదు; కళయే యగును. ఈవిషయమునఁ గ్రింది యప్పకవి వచనము వీరికి మార్గదర్శకమయి యుండును.

*గీ. గూను నెమ్మేను మెడవాను మీను పేను*
*మ్రాను పఱిచెను బులిబోను మఱియునిట్లు*
*భువి నకారంబుతోఁ గూడఁ బుట్టు శబ్ద*
*ములు ద్రుతప్రకృతులు గావు మునిశరణ్య.* అప్పక *5-26*

అవయవిక నకారమునకు ద్రుతకార్యములు కలుగు విషయము నథర్వణాచార్యు లిట్లు వివరించినారు. "వినాద్వితీయంస్యా దస్మ, దాత్మనో స్వంతయోరపి, నోరన్యస్యాపి సర్వం స్యాద్బహుళం సత్ప్రయోగతః" (వికృ. సంధి 32కా) దీని భావమిది-నేను తాను శబ్దములలో స్వరలోపము కలుగఁగా మిగిలిన ద్రుతమునకు సంశ్లేషము తప్పఁ

దక్కిన ద్రుతకార్యములు జరుగును. (సంశ్లేషము=ద్రుతము పూర్వాచ్చునత్తియుండుట యని నన్నయాథర్వణమతము.) తక్కినస్వరవిశిష్ట నకారములలో స్వరలోపము కలుగఁగా మిగిలిన ద్రుతమునకు ద్రుతకార్యములు బహుళముగా నగును. ఉదా॥ కన్ను–కళ, కన్–ద్రుతప్రకృతికము. కన్+దోయి=కందోయి, కన్దోయి, కన్ దోయి; కన్+కవ=కన్గవ. చన్+కవ=చన్గవ. చన్+కట్టు=చన్కట్టు (రామా 3–15) చన్గట్టు (విజయ 3ఆ.) చెన్+కలువ=చెంగలువ; మ్రాన్+పడు=మ్రాన్పడు–ఇత్యాది.

బాలవ్యాకరణపక్షమున నావయవిక నకారము ద్రుతముకాకుండుటచే కన్ను+ను+దోయి–అని నిల్పి, యాగమ నకారముతో, కందోయి లోనగు రూపములు సాధింపఁబడును. (చూ. బా. సంధి 19–ఘంటా) నిక్కలాదులలోఁ జేర్చుటవలనఁ బ్రయోగ సిద్ధములగు రూపములనే సాధించుకొనవలెను. కన్+దోయి=కందోయి, కన్దోయి (కన్ దోయి.) కన్+కవ=కన్గవ–అనుచోఁ బూర్ణబిందు రూపము ప్రయోగములలోఁ గనబడకపోవుటచే దానిని సాధింపరాదు. చన్+కట్టు=చన్కట్టు–అను పక్షమున, చన్ను=చన్–అని సాధించుకొని, యావయవిక నకారముతో రూపసాధన చేయవలెను. చన్+కట్టు=చన్గట్టు అను పక్షమున, చన్ను+ను+కట్టు=చన్+కట్టు–అని పదచ్ఛేదము నెన్నవలెను. చెన్ను+కలువ–అనుచో నిది సమాసస్థలము కాదుగాన, నుగాగమము ప్రసక్తముకాదు. కావున నావయవిక నకారము ద్రుతముకాదుగాన, నుగాగమము ప్రసక్తముకాదు. కావున నావయవిక నకారము ద్రుతముకాకుండుటచే మ్రాన్పడు–అను రూపమే యేర్పడును. (ప్రకీర్ణక.16) సూరిగారు "కన్దెదరె–ఇతినా 'కన్నెదరె' ఇతివేతి సన్దేహః" అని సూత్రాంధ్రవ్యాకరణమున వ్రాసియున్నారు. కన్+చెదరె–అనునది సమాసస్థలముకాదు గావున నిందలి 'కన్'లోని నకార మావయవికమే యగును. కనుక ద్రుతకార్యమునకుఁ బ్రసక్తియేలేదు. కన్నెదరె–అనియే కాని కన్దెదరె–అని కాదు. ఈ విధముగా సూత్రాంధ్రవ్యాకరణము నాఁటి సందేహమునుండి బయలుపడి సూరిగారు ప్రక్రియను సమర్థనీయముగా బాలవ్యాకరణమున నడపుట ప్రశంసనీయము.

ప్రౌఢవ్యాకర్తమతమునందును నావయవిక నకారము ద్రుతముకాకుండుటచే కమ్మందేనె (ప్రౌఢ. సమాస 13) చక్కంగ (సమాస 14) ఏఁబది (సమాస 24) అను రూపముల ప్రక్రియను గొంత క్లేశపడి సమర్థింపవలసి వచ్చెను. (చూ. ప్రౌఢ–ఘంటాపథము) నూతిలోవెలువడ (ప్రౌఢ. కారక 11.) అను ప్రయోగస మర్థనకై ప్రౌఢవ్యాకర్త "లోనన్" అనురూపమున "న" అనునక్షరము లోపించునని ప్రక్రియ యుద్దేశించెను. ఏనియున్–అనురూపమున 'యు' వర్ణము లోపించిన, ఏనిన్–మిగులుననియు, దీనిలో 'ని' వర్ణము లోపించిన 'ఏన్' అను రూపము సిద్ధించుననియుఁ బ్రౌఢవ్యాకర్త శబ్దరత్నాకరమున వ్రాసెను. నన్నయాథర్వణ పక్షమున, ఏని–కళ. ఏన్–ద్రుతప్రకృతికము. లోను–కళ. లోన్–ద్రుతప్రకృతికము. ఇట్లావయవిక నకారముతోనే రూపసిద్ధి సరళముగా జరుగును. నన్నయాథర్వణమతమున–నేను తాను కళలు. నేన్, తాన్–అనునవి ద్రుతప్రకృతికములు. నేను, తాను, శబ్దముల విషయమును బాలప్రౌఢవ్యాకరణములు సరిగాఁ బరిష్కరింప లేకపోయెనని చెప్పకతప్పదు. నేనుతానులు ద్రుతప్రకృతికములనుట లక్ష్యలక్షణ విరుద్ధము. ఎట్లన–(i) చింతామణిలోను దుదకు సూత్రాంధ్రవ్యాకరణములోను నేనుతానుల నువర్ణకము సుప్రత్యయ స్థానమున విధింపఁబడియున్నది. అనఁగా నిది ప్రథమావిభక్తి యన్నమాట.

ప్రథమావిభక్తి కళయేకాని ద్రుతప్రకృతికము కాదుగదా! బాలవ్యాకరణమునందును నివి ప్రథమాంతములుగానే నిపతింపఁబడియున్నవి. స్త్రీ సమములన్న పక్షమునందైనను నివి ప్రథమాంతములు కాక తీరదు. (ii) నేనుతానులపై గసడదవాదేశమే మహాకవి సమ్మతము; పూర్వలాక్షణిక సమ్మతమునై యున్నది.

సూరిగారు తమ యాంధ్రశబ్దశాసనమున "నేను తానులు ద్రుతప్రకృతిక తుల్యంబులు" అన్నారు. బాలవ్యాకరణమున నివి ద్రుతప్రకృతికములే యన్నారు. ఇవి ద్రుతప్రకృతికము లనుటవలన 'ఏ ను విదప' (శల్య 2-333) వంటి గసడదవాదేశ రూపములు సిద్ధింపవు. ఏ, న విదప-అనుట తప్పు. అవధారణార్థకముపై గసడదవలు వచ్చుట భారత సమ్మతము కాదు. పర్వం,. బకడున్ ఆది 1-58. ఏను బిదప-వంటి రూపములు నిర్మూలములు. కాన, నేను తానుల విషయమును వేఱుగా సూత్రించుకొనుట యావశ్యకము. (చూ-ము. కౌ. సంజ్ఞా 6.) ఇట్లే యేని, లోను శబ్దముల విషయమును, నిగాగమాదులవిషయమును వేఱుగా సాధింపవలెను. (చూ. ము. కౌ. సంజ్ఞా 7)

**15 అందిమ్ము:-** "ఇది క్త్వార్థకసంధియను ప్రౌఢవ్యాకర్త యాశయము సరికాదు. దీనిని బాలవ్యాకరణపక్షమున శబ్దపల్లవ మననగును." అంది+ఇచ్చు-అనుచోట...'అందు నట్లుగా ఇచ్చుట' అని యర్థమును చెప్పి...ఆకారణముచే శబ్దపల్లవమే యనియుఁ జెప్పినను మీఁదఁజెప్పిన రీతిని సంధివిధాన మావశ్యకమే" (తత్త్వ) అని చెప్పఁబడెను. అనఁగా శబ్దపల్లవపక్షమునందును క్త్వార్థకసంధి చెప్పక తప్పదని వీరి యభిప్రాయము. వీరికి శబ్దపల్లవపక్షమునఁ జెప్పవలసిన ప్రక్రియ యవగతము కాలేదు. అందు+ఇచ్చు=అందిచ్చు. దీని మధ్యమపురుషైకవచనము-అందిమ్ము. ఇట, అంది+ఇచ్చు=అందిచ్చు-అని కాదు. అందు+ఇచ్చు-అనుచో ఇగాగమము కలిగిన పక్షమున-అందు+ఇ+ఇచ్చు=అంది+ ఇచ్చు-అని నిల్చును. యడాగమముకలిగి-అందియిచ్చు, అను రూపమేర్పడును. ఈ విధముగా, అందిచ్చు, అంది యిచ్చు-అను ద్వివిధరూపములు శబ్దపల్లవపక్షమున సిద్ధించును. ఇట క్త్వార్థక సంధికిఁ బ్రసక్తిలేదని గ్రహింపవలెను. (భారతి. జూలై 1964-వెం. సూ.)

**16 ద్రుతద్విత్వము:-** (సంధి 3,9):- ద్రుతద్విత్వము క్వాచిత్కముగ నన్నయప్ర యోగములందుఁ గలదు. "ధైర్యవృత్తికి, న్నరుదుగ" అరణ్య 1-321. ఈప్రయోగమును జూపి (ధైర్యయుక్తికి, న్నరుదుగ అనిపాఠము) "మిన్నగ నకార హల్లుల, కున్నచ్చులతోడ సంధి గూర్పఁగఁ జెల్లున్" అని ముద్దరాజు రామన లక్షణము చెప్పియున్నాఁడు. (కవిజ4-1) అహోబలపండితుఁడు- "ఏతదాచార్యస్యాపి సమ్మతమ్...అతనిధైర్యశక్తికి, న్నరుదుగ మెచ్చి ఇత్యాది తత్ప్రయోగాత్" (అహో 343 పు) అనెను. అన్నిష్టసఖి (ఆది 3-140) వృత్రుఁడన్నసుర (అరణ్య 3-3) నం, దినియన్నేటితరంగలన్ (ఆది 8-79) అనునవియు నన్నయమతమున ద్రుతద్విత్వములే యగును. నన్నయాథర్వణమతమున నావయవిక నకారమును ద్రుతమే (చూ. చిం. పరి)

**17 తెనుఁగులమీఁది సాంస్కృతిక కళపలకు గదవలు. (సంధి 5):** (1) ప్రౌఢవ్యాకర్త "ప్రాసంబులందు" అని నియమించుటకుఁ గారణ మథర్వణకారికల ప్రభావము కావచ్చును. "క్వచిదాద్యస్య పోవస్స్యా, న్నచప్రాసే యతౌ తువా, క్వచిద్వయోర్వికల్పత్వం యతౌసర్వత్ర కేచన." వికృ. సూరిగారు "నాచ్ఛికాదప్రాసే సాంస్కృతికానామ్" అని సూత్రాంధ్రవ్యాకరణమునఁ జెప్పియున్నారు. ఇదియుఁ బ్రౌఢవ్యాకర్తకు మార్గదర్శకము కావచ్చును.

(2) తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకుద్రసడదవలుకావనుట చింతా మణిమతము. పద్యలక్షణ గ్రంథములలో, నిట్టినిషేధము లేదు. ఎట్లన–

"రుచిరముగఁ బిలుచుచోటను, బ్రచురంబుగఁ బ్రథమపొంతఁ బడియుండెను న,క్క చటతపంబులపట్లను, ప్రచురించుం గసడదవలు పరిపాటి మెయిన్. విశ్వవిభుఁడు గడిఁది వీరుండు సతురుండు, డక్కుఁద్రిక్కులేని చొక్కులాఁడు, దత్త్వవిదుఁడు వరవిదారణ శీలుండు, ననఁగఁ దెనుఁగుసంధి యలరునిట్లు." కావ్యాలం 9–66,67. (3) "ప్రథమాంత విభక్తులపైఁ, గథితములగు కచటతపలు గసడదవలగున్–ఛందో 1–61; వాఁడు గనువాఁడు సేకొనువాఁడు డెక్కు, లాఁడు వాఁడు దపోనిధి వాఁడు"పెద్ద–ఛందో 1–62 (4) "అమరఁ గృతులందుఁ బ్రథమాం,తముల పయిన్ నిలుచు కచటతపలకు నాదే, శము గసడదవలగున్"–సర్వల 1అ–215; సంస్కృత పదము తెనుఁగు పదముమీఁద నాదేశము వచ్చుటకు...సర్వల 236; 238. (5) అంధ్రపదము, సంస్కృతంబుమీఁద సంధి చేయఁగవచ్చు–కవిసం. 1–31. ..ఎం, తగుమతులైన–ఉద్యో (1–286) ప్రయోగాంతరములు–ఎవ్వం, డవరించును (కాశీ 6–260) పెం,పువరీక్షింపమె (వసు 3–6) గసడదవలు రామికి–ఇలు పయోధి (హ.న. 1–6)

**18** వేవణములు (సంధి 5):- ఇది సమాసాశ్రయవిధి. ద్వంద్వేతర సమాసములలో గసడదవలగుట విశేషము. చూ. ము. కౌ. సంధి 13.

**19** అన్నురంబు,చన్త్రోవ (సంధి 13):- ఇవి (కర్మధారయ) సమాసములను వ్యాఖ్య (తత్త్వ) భ్రాంతి మూలకము (చూ. 38) గిరివ్రజ మన్నురంబు–అనుచోఁ బురము గిరివ్రజమని యనుచుండునా? అను– ధాతుజవిశేషణ మగుటచేఁ గర్మధార యభ్రాంతి. (బా. సమాస 5) ఇట, అను–ఇత్యర్థకము. "చూత ఇతి వృక్షః"–అను వాక్యము వంటిదిది.

తొడువింటి వాఁడు చన్త్రోవన్=తొడువింటివాఁడే త్రోవను జనుచో యాత్రోవనని యర్థము. (బా. సమాస 26) ఇది కర్మధారయాభాసమనఁబడును. అనఁగా వ్యస్తమనుట. "స్యాత్కర్మధారయాభాసః కర్తృత్వేకారకాశ్శ్రితే" (వికృ.)

అన్నిష్ట సఖి–అన్నది కూడఁ గర్మధారయమను వ్యాఖ్య యిట్లే భ్రాంతి మూలకము.

**20** ద్రుతమునకు మకారాదేశము (సంధి 22):- "ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశంబగు (సంధి 22) అని సూత్రించి ప్రౌఢవ్యాకర్త–కమ్మని లతాంతముల కుమ్మొనసి (ఆది), వృష్టిచే, సెమ్మపోనది (అరణ్య) అను నన్నయప్రయోగములను జూపెను. "ద్రుతంబునకు మకారంబురాఁ బర సవర్ణంబు విభాషనగు" (శబ్దల 5–64) ఇట్లు ద్రుతమునకు మకారము పరమగునపుడు మకారమగుననుట ప్రయోగవిరుద్ధము. పూర్వలాక్షణిక మత విరుద్ధమునై యున్నది. ఇట ద్రుతమునకుఁ బూర్ణబిందువగునని గ్రహింపవలెను.

(i) బిందుం ప్రవదంతి తంక్వచిత్కేచిత్ (అం. చిం. సంధి 26) అని అంధ్రశబ్దచిం తామణియందు ద్రుతమునకు సరళస్థిరములు పరములగునపుడు పూర్ణ బిందువు క్వాచిత్కముగ విధింపఁబడినది. వర్గయుక్సరళములని కాక సరళస్థిరములని విధించుట యిట గమనార్హము. ఇది మకారము పరమగుచో ద్రుతమునకుఁ బూర్ణబిందువగునని సూచించును. ఏలయన వర్గయుక్సరళములు పరమగుచో

ద్రుతమునకుఁ బూర్ణబిందువు వచ్చు ప్రయోగము నన్నయ భారతమున లేదు. కాఁగా, లతాంతములకుం మొనసి, చే, సెం మహానది–అనియే నన్నయ ప్రయుక్తపాఠములు, (కుం మొనసి–ఇ,ఔ,క,ట,జ,డ, ద, ప్రతులపాఠము. చూ. సంశో.)

(ii) పైచింతామణి సూత్రవ్యాఖ్యలో, బాలసరస్వతి–"మెచ్చెంమాధవుఁడు" అని యుదాహరించి మకారము పరమగుచో ద్రుతమునకుఁ బూర్ణబిందువగునని స్పష్టపఱిచి యున్నాఁడు.

(iii) కేచిద్వదం త్యభేదత్వ మనుస్వారమకారయోః (వికృ. సంధి 12 కా.) అను నథర్వణకారిక ద్విత్వమకారమునకు బిందుపూర్వక మకారమునకుఁ బ్రాసమున నభేదత్వమును సాధించుచున్నది. ఇది చింతామణి సూత్రానుసారులగు నన్నయ ప్రయోగములయందలి ప్రాసమైత్రిని సరిపెట్టుట కుద్దేశించిన పూరణమనుట స్పష్టము.

ఇచ్చట అభేదశబ్దము లడయోరభేదః–అనుదాని వంటిదని కొందఱనుట యపరిజ్ఞానమూలకము. ఏలయన–

౧ లడయోరభేదః – అనుదానివంటిదన్నచో, కుంమొనసి, కుమ్మొనసి – అను ద్వివిధరూపములు సమ్మతింపవలసివచ్చును. 'కుమ్మొనసి' అన్న రూపము గల దన్నపక్షమున కుంమొనసి–అనురూపము నంగీకరింపవలసిన పని లేనేలేదు. అపక్షమున విధింపవలసినది యభేదత్వము కాదు; మకారాదేశమునే విధింపవలసి యుండును.

౨ అథర్వణకారిక చింతామణిసూత్రమునకుఁ బూరణముగ నుద్దిష్టమయినది. చింతామణిలో నున్నది–'బిందుంప్రవదంతి' అని కాని ద్విత్వం ప్రవదంతి – అని కాదు. కాన కుమ్మొనసి–అనియు నుండు నట్లథర్వణ కారిక కర్థము చేయుట సందర్భశూన్యము.

3 ప్రత్యేకపదముల యెడ వర్తించు లడయోరభేదః– అనునది సంధి స్థలములలో వర్తింపనేరదు. వసంతర్తువు– అనుచో లరయోరభేదః–అన్నది వర్తింపదు గదా!

(iv) చింతామణి సూత్ర వ్యాఖ్యలో నహోబలపండితుఁడు "అనుస్వార మకారయోరభిన్నత్వంచ మకారపరవివవ–కమ్మనిలతాంతముల కుంమొనసి వచ్చు మధుపమ్ముల నిత్యాది రాచార్యస్యాపి ప్రయోగః" (అహో 244 పు) అని వివరించెను.

(v) ముద్దరాజు రామన కవిజన సంజీవనిలో ద్రుతసంధి సందర్భమున నిట్లు చెప్పియున్నాఁడు. "నందనందనుఁ డారగించెం దవంబు, నంబుజాక్షుండు మద మడఁచెం బలీంద్రుఁ, దమ్మియిమ్మగు కొమ్మ దాల్చెం మురారి, యనఁగ వర్తిల్లు నంబుద శ్యామ ధామ (కవిజన 1–34)

(vi) చింతామణిసూత్రము నప్పకవి యిట్లు వివరించియున్నాఁడు. "ముందర గజబ మకారము, లొందిన నాంతముల తుదల నుండు ద్రుతములం, గ్రందుకొని వికల్పంబున, బిందువులుగఁ జేసి కృతులఁ బెట్టుదు రొకచోన్ (అప్పక 5–157) అమ్మకుండలములిచ్చెం మహీసుతుఁజంపె (అప్పక 5–158, 159) అని యుదాహరణము చూపియున్నాఁడు. ద్విత్వమకారమునకు బిందుపూర్వక మకారమునకుఁ బ్రాసమైత్రి చెల్లునని యప్పకవి అనునాసిక ప్రాస మనుపే

లక్షణము చెప్పియున్నాఁడు. (అప్పక 3-34) కావున, కమ్మనిలతాంతములకుం మొనసి-ఇత్యాదు లనునాసిక ప్రాసమునకు లక్ష్యములని గ్రహింపవలెను.

(vii) కూచిమంతితిమ్మకవి యిట్లు లక్షణముచెప్పి లక్ష్యములు చూపియున్నాడు "తెల్ల ముగ గజడదబమలు, పొల్లు నకారంబుతోడఁ బొదలినయెడలం, బొల్లులె నిలుచునొకొకచోఁ జెల్లును నెఱసున్నలగుచు శ్రీగౌరీశా-(సర్వల. సంధి) మకారమునకు-కమ్మనిలతాంతములకుం మొనసివచ్చు...(అది 5-138) ఒకుక్కమ్మడి పరాక్రమములం మెఱసి...(రుక్మా 5-38) అమ్మునీశ నివాస శక్తి...వృష్టిసే, సెం మహానదులున్...(అరణ్య 3-113) ప్రౌఢవ్యాకర్త చూపిన రెండుప్రయోగములు నెఱసున్నలతో నుండుటయే తిమ్మకవి యుద్దిష్టమనుట తెల్లము.

(viii) కస్తూరిరంగకవి (రంగరాట్) బిందు ప్రాసమునకిచ్చిన యుదాహరణములలోఁ బ్రకృత భారతప్రయోగములను,చే సెం మహానదులున్, లతాంతముల కుంమొనసి-అను పాఠములతోనే చూపినాఁడు (రంగకవి-కమ్మని లతాంతముల కుంమ్మొనసి-వంటి లేఖన సంప్రదాయమును బురస్కరించుకొని లక్షణముచెప్పినట్లున్నాఁడు. ఏమయినను, కుంమొనసి-అనుపాఠమే తదభి ప్రేతమనుటలో విప్రపత్తి లేదు.)

(ix) అక్కందళిత-అను రాఘవపాండవీయ ప్రయోగమునొద్ద (రాఘవ2-13) వ్యాఖ్యాత ముద్దరాజురామన-"ఏయక్షరమున్న గాని సున్ననిలువఁజెప్పవచ్చునందుకు లయ గ్రాహి:-కమ్మని లతాంతముల కుంమొనసివచ్చు-అని యాదిపర్వప్రయోగము" అని తెలిపినాఁడు.

(x) "మఱియు నకారము బిందువై నిలిచినందుకు...అది పర్వము...కమ్మని లతాంతములకుం మొనసివచ్చు" (ల. శి. 4-422) అని పొత్తపి వేంకటరమణకవి చెప్పినాఁడు.

(xi) ద్రుతమునకు మకారము పరమగుచో మకారమగు నన్నచో ద్రుతము పరహల్లుగా మాఱినట్లగును. ఇది ద్రుతధర్మము కాదు. లోప సంశ్లేష స్వత్వబిందువులు కలుగుటయే ద్రుతధర్మము. కాన ద్విత్వవిధానము ద్రుతస్వభావమునకు విరుద్ధము.

కాఁగా, ద్రుతమున కచ్చు పరమయినపుడు మకారమాదేశమగుననుట లక్ష్య లక్షణ విరుద్ధము, ద్రుతస్వభావ విరుద్ధము నగుటచే నగ్రాహ్యమన్నది సిద్ధాంతము. మకారము పరమగునపుడు నొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువు కనఁబడునని బాల. సంధి 19 సూత్రమును బూరించు కొనవలెను. (చూ-ము. కౌ. సంధి. 17) నన్నయమతమున వ్యంజన నకారము ద్రుతమగుటచే-లతాంతములకున్+ మొనసి-అని తన్మతమునఁ బదచ్ఛేదము.

**21 ఇరులు, కేలు:-** ఇరులు, కేలు శబ్దములు నిత్యైకవచనాంతములని ప్రౌఢ వ్యాకర్తచెప్పెను. (శబ్ద28) ఇరులున-అను కేతన ప్రయోగమునుబట్టి యిది నిత్యైక వచనాంతమనుటయుక్తమే. ఇరుళ్-అను తమిళరూపమునుబట్టియు నిది నిత్యైక వచనాంతమనుట స్పష్టము. అహోబలపతి-"ఇరులు, ఇత్యాద్యా బహువచనాంతాః" (అహో 392 పు) అనిచెప్పెను. "ఇరులకెల్ల బహువచనమె తగు" (కవిజ) అని ముద్దరాజు రామన వచించెను. ఇరులకు (ఉ.రా. 3-191) ఇరులమోవి (ఆముక్త 4-135) ఇరులదాయ (శృ. నై8-201) అను పాఠములు కనఁబడును. వీనిని,

ఇరులుకు, ఇత్యాదిగా సవరింప నగుననియు "హరి నీలపు సరుల కిరుల కబ్బాక్షి కురుల్ గురులై" (చం.రా.) అను ప్రయోగమును బట్టి యిరులు శబ్దము కాలక్రమమున నిత్య బహువచనాంతముగఁ బరిణమించి యుండుననియు నందురు. (భారతి. జులై 1964 వెం.సూ.) ఈ పక్షమున, ఇరులు-బహువచనాంతముగ వాడుట, భ్రాంతి మూలకమనవలెను.

కేలు-ఇత్యాద్యా ఏకవచనాంతాః. (అహో 392 పు) అని యహోబల పండితీయము. "కేలేక వచనమరయఁగ" (కావ్యాలం 9-91) అని కావ్యాలంకార చూడామణి. ఒక కేలఁబట్టి వేఱొక్క కేల-వంటి ప్రయోగములను మాత్రమేచూచి వీరిట్లు చెప్పియుండవచ్చును. కాని, కేల్లింతికిన్ (ఆముక్త) అను ప్రయోగమును జూపుచు, "ఏకవచనంబె కేలునకు" అని కవిజన సంజీవనీ కర్త చెప్పుట వింత. పెఱకేలులు- అను ప్రయోగమును జూపుచు నిది నిత్యైకవచనాంతమని ప్రౌఢవ్యాకర్త చెప్పుటయు వింతయే. "పెఱకేలి యణఁకువ-అన్నదే ప్రౌఢవ్యాకర్త యుద్దేశించిన పాఠము కావచ్చును." (వ్యా. సం. స. 836 పు) కేలు-నిత్యైకవచనాంతముకాదు. ఏకవచనరూపము మాత్రమే. ఏలయన, కేలులు, కేళ్లు-అను బహువచన రూపములు ప్రయోగములందుఁగలవు. ఇరుగేలుల-వి.పు. 3-101 బోడబాసికము దండల్ వోలెఁ గేల్లింతికిన్-ఆముక్త 5-22 మూఁడు కేళ్లు-హరి. ఉ. భా. 8-107. కే,ళ్లును మస్తంబులుఁ గాళ్లునుం దనకు నాల్గున్ నాల్గు నాల్గుం దగన్. (ఉ.హ. 6-98)

కొందఱు, కేలు-నిత్యబహువచనాంతమనవచ్చు నందురు. "ధర్మసూనుఁడు కృతాంజలియై తగభీష్ముఁడాయన,ల్లనఁ జని కేలఁబాదకమలంబు లమర్చి" (శాంతి 2-156) ఇట రెండు చేతులందుఁ బాదకమలము లమర్చినట్లు చెప్పఁదగియుండుటచే కేలు- నిత్యబహువచనాంతమని వీరియాశయము. కేలు-అను బహువచనాంత తుల్య ప్రాతిపదికముపై బహువచనముచేరి-కేలు+ లు=కేళ్లు అగునని సమర్థింపవచ్చునందురు. (భారతి. జులై 1964 వెం.సూ) కాని యీ మతము సముచితముగఁ గన్పట్టదు. ఏలయన-(i) కేలఁ బాదకమలంబు లమర్చి-అనుచో కేలు శబ్దమును జాత్యేక వచనముగ గ్రహింపవచ్చును. తత్పదమున వ్రాలి-హ.న. 5-56. జాత్యేకవచనము-టీక. కాన నిది బలమైన ప్రయోగము కాదు. (ii) కేలచేత, కేలయందు-వంటి లడాగమ రూపములు కానరావు. మూఁడుకేలు, నాలుగు కేలు-వంటి ప్రయోగములును గనఁబడవు. కాన, కేలు-నిత్య బహువచనాంతమనుట కవకాశములేదు. ఒక కేలఁబట్టి వేఱొక్క కేల(కళా) అను ప్రయోగమును,కే,లున (శుక2-469-నూ.వి.) కాలికెంగేలి చిల్కల రాజుఁ గొనితెచ్చి (పాండు 5-125.) వంటి యౌపవిభక్తిక రూపములును, కేలు-ఏకవచనాంత మనుటకు సాధకములు.

కాఁగా, కేలు-నిత్యైక వచనమునుగాదు, నిత్యబహువచనమునుగాదు. కేలు-ఏకవచన రూపము; కేలులు, కేళ్లు-బహువచన రూపములు నని నిర్ణయింపఁదగును.

**22 కోడంౘ్రురు-మొ. (శబ్ద 48):-** అహోబలపండితీయము ననుసరించి యిట్టి రూపములను బ్రౌఢవ్యాకర్త సాధించెను. "రువర్ణక పునఃప్రాప్తికి నన్నయాథర్వణీయ సమ్మతి కన్పట్టలేదు. కాన కోడంౘ్రురు...మున్నగు రూపములు సాధువులు కావనుటకు సందేహము లేదు." (వ్యా. సం. స. 762 పు.) అని వక్కాణింపఁబడెను. కోడండురు మున్నగు రూపములే గ్రాహ్యములనఁబడెను. కాని యీ సమన్వయము సరికాదు. ఇందలి లోపములు (i) అంౘ్రు, కోడంౘ్రు, మఱఁదంౘ్రు (అది

4-217) మొదలగు రూపములు చింతామణి సాధ్యములు కాకుండఁ బోవును. (ii) ఉతోలోపశ్చలులయోస్తథాపుంసిరురౌస్మృతౌ (వికృ.అజం 52) అను నథర్వణ కారికలోని, "ఉతోలోపశ్చ" అనుదానిచే, అండురు-మున్నగువానిలో, ఉత్వలోపము పాక్షికముగ నగునని వ్యాఖ్యానింపఁబడెను. ఈ కారిక, తద్ధిత ప్రత్యయప్రసంగములోనిది. "కాఁడుర్గాఁడు భవేదీఁడుః....ఉతోలో పశ్చ" (వికృ. అజం 51 కా) ఈ కారికకు, వన్నెకాంద్రు-లోనగునవి యుదాహరణములు. (అహో 384 పు. కవిజన 84 పుట.) దీనిని దెచ్చి, అల్వాదులతో ముడిపెట్టుట యసంగతము. ఇంతేకాక, యథర్వణకారిక (వికృ. అజం 50 కా)లోని, "బహూతా" అను పాఠమును బహుళమ్-అని సవరించి వేఱువేఱు కారికలతో (వికృ. అజం 53, 88 కా) నన్వయించుటయు నసంగతములే.

"నిత్యం దారాదేశ్చస్యాల్లో, ర్లులయోరురౌచతత్రస్థః" (అం.చిం. అజం 73) అను సూత్రములోనికి, "సలలో బిందుయుతౌడుర్వా,లులయోరుల్లు గపితయోః పరతః" (అం.చిం. అజం 72) అనుసూత్రములోని "వా- ఉల్లుగపి" అనునవి యనువృత్తములగు నన్న భ్రాంతి కవకాశము గలదు. ఈ పక్షమున, అండురు, అంద్రు- అనురూపద్వయ మేర్పడవలసియుండఁగా, "నిత్యంలులౌరురౌస్యాతా, ముల్లోపోబహూతాడుఃజామ్" (వికృ. అజం. 50 కా) అనునథర్వణ కారిక "ఉల్లుగపి" అనునదియు, నిత్యశబ్దముతో నన్వయిం చుననియు, 'వా' శబ్ద, మనువృత్తము కాదనియు వివరించినది. అనఁగా, నుక్తార్థచింతన చేసినది. బాలసరస్వత్యహోబలపండితులు చింతామణి సూత్రమునకుఁజేసిన వ్యాఖ్య సరిగానే యున్నది.

పెక్కు తాళపత్త్రిమాతృకలలో 'ద్రురు' యుక్తపాఠములే కలవు. అంద్రురు (విరాట 2-140; స్వర్గా 1-65) అంద్రురలో (స్త్రీ 2-133) వెలివాంద్రుర (శాంతి 3-284) అనుచోట్ల 'ద్రురు' యుక్తపాఠములే కనఁ బడును. "కోడదుర-ఇ" (సఁభా 2-257) "ఏనమండురు-వ,హ" ప్రతులు, "పెక్కంద్రులు-గి,శ,ష,భా,కూ"-ప్రతులు. (ఆది 8-25) - సంశో.

"డువర్ణమె కలదని కాని...రేఫసంయుక్త డకారము కలదనికాని నిర్వహింపఁ జాలు యతిప్రాసాదిస్థల ప్రయోగము...లభింపలేదు" (వ్యా.సం.ప.762 పు) కాన, అంద్రు, కోడంద్రు మున్నగు నిర్వివాద రూపములనే వాడుట మేలు.

**23 కన్నియ, కన్య (శబ్ద 49):-** కన్యకలను-అనునది మిశ్రకర్మధారయమనియు, నప్రౌఢమనునది యర్థవిపరిణామమనియుఁ గొందఱందరు(తత్త్వ)గాని యది సరికాదు. ఏలయన-(i) కన్యకలను- వంటి మిశ్రకర్మధారయము బాలప్రౌఢవ్యాకరణములందు సాధింపఁబడలేదు. విశేషించి-కర్మధారయంబు త్రికస్త్రీసమముగంత ధాతుజవిశేషణ పూర్వపదంబయి యుండు- అను బాలవ్యాకరణ నియమమున కిది విరుద్ధమగును. కాన, ముత్తియశబ్దే తరములలో ఇత్వలోపము లేదను బాలవ్యాకరణాశయమును నిలఁబెట్టుటకుఁ దెచ్చి పెట్టిన యీ మిశ్రకర్మధారయపక్షము, ముల్లుపుచ్చికొఱ్ఱుడిచినట్లున్నది.

(ii) కన్య-అను సంస్కృతసమ రూపమునకు "అప్రౌఢ" మన్నది యర్థవిపరిణామ మనుట యనాలోచితము. అనుమానాది శబ్దములకు వ్యస్తతయందర్థ విపరిణామము గోచరించును. ఆవిధముగా, కన్యశబ్దమున కప్రౌఢమనునర్థము వ్యస్తతలోలేదు. కనుక నిది యర్థవిపరిణామము కాదు. (iii) దివ్య, కళ్యము, పళ్యము, వీడ్యము-మున్నగు

చోట్లముత్తియేతరశబ్దములలో ఇత్వలోప మంగీకరింప వలసియుండుటచే కన్య- అనునది ఇత్వలోపరూపము కాదని లేనిపోని సమర్థనలకు దిగుట "భక్షితేపిలశునే నరోగశాంతిః" అనుటకు నిదర్శనము.

కన్యశబ్దమును గూర్చి యహోబలపండితుఁ డిట్లు తెలిపియున్నాఁడు "కన్నియ, కన్నె, కన్య, అత ఏవ రాఘవపాండవీయే-నెయ్యపుఁ గన్యకలన ఇత్యుక్తమ్. తత్ర, పాండవపక్షే-కన్యకలన్-ఇత్యేకపదమ్. రాఘవపక్షేతు కర్మధారయసమాసః-కన్యకలనన-అప్రౌఢ యుద్ధ ఏవేత్యర్థః. కన్యశబ్ద స్యాత్ర లాక్షణికత్వమ్" (అహో 411-పు.) కాఁగా, కన్యకలనన-అనుచో, కన్యశబ్దమున కప్రౌఢమన్నది లాక్షణికార్థము. కన్య=క్రొత్త-అని రాఘవపాండవీయ వ్యాఖ్యలో ముద్దరాజురామన యర్థము వ్రాసెను. ఈయర్థమే శ-ర-లో గ్రహింపఁబడెను. కాని యహోబలపతిచేసిన యర్థమే రాఘవపాండవీయ పద్యమునఁ బ్రకరణోచితముగఁ గన్పట్టును. కన్య=క్రొత్త- అనుటకు: నీరాళ్లగొందిఁగన్నియ మెఱుంగు(పాండు4-21) ఇట. కన్నియమెఱుంగు- క్రొత్తమెఱుంగు-అనియే యర్థము. తొలకరిమెఱపనుట. కన్నె కయ్యము-భీష్మ 1-110, "కన్నెకయ్యంబనంగఁ బ్రథమయుద్ధాఖ్య" ఆం. భా. 2-22-సూ. ని. కాఁగా కన్నియ, కన్నె, కన్య-రూపాంతరములు. వీనికి, అప్రౌఢము, ప్రథమము. నూతనము ననునవి సమాసములందుఁ గలుగు లాక్షణికార్థములు.

**24 ఏక దేశాన్వయము (కారక 21):-** విశేషణములతోఁ గూడిన పదములకు వృత్తి కాదు. వృత్తి యందున్న పదములకు విశేషణయోగము లేదు. ("సవిశేషణానాం వృత్తిర్న, వృత్తస్యచ విశేషణయోగో, న")

పార్థివ ప్రాగ్రసరుయొక్క ధర్మసుతుయొక్క పంపు-అనుచో, ధర్మసుతుయొక్క+పంపు=ధర్మసుతుపంపు-అని సమాసము కానేరదు. ధర్మసుతు పంపు-అనుచో, పార్థివ ప్రాగ్రసురుయొక్క- అను విశేషణమునకు, సమాసైకదేశమగు, ధర్మసుతుశబ్దముతో నన్వయము కలుగనేరదు. ఇట్లే తక్కిన ప్రయోగములు నగ్రాహ్యములు. సమాసాది వృత్తుల కాధారమగు, నేకార్థీభావ సామర్థ్యమునకే మూలచ్ఛేదము తలపెట్టుట "అహో మూలచ్ఛేదీతవ పాండిత్య ప్రకర్షః" అనుటకు లక్ష్యమగును. కాననీ ప్రయోగములకు, "ప్రమాదోధీమతామపి" అన్నదే సమాధానము.

వృత్తియందున్న పదములు సంబంధిపదముల నన్వయమున కపేక్షించును గావున, శేషషష్ఠ్యంతములు సమాసైకదేశముతో నన్వయంపవచ్చును.

'సంబంధిశబ్దః సాపేక్షో,నిత్యం సర్వః ప్రయుజ్యతే
స్వార్థవత్సావ్యపేక్ష వృత్తావపినహీయతే."

(వాక్యప. వృత్తి 47)

ఉదా॥ దేవదత్తస్య గురుకులమ్. గురుకులమ్ (=గురువుయొక్క యిల్లు)-అనుచో, నెవరియొక్క గురువను నాకాంక్షరాఁగా, నాయాకాంక్షను బూరించుటకు, దేవదత్తస్య-(దేవదత్తునియొక్క) అనువ్యస్తపదము, సమాసైకదేశమగు గురుశబ్దముతో నన్వయించును.

ఇట్లే, కారకపదము, సమాసైకదేశముతో, నన్వయింపవచ్చునని కొందఱందురు. ఈ పక్షమున, సమాస 35వ, సూత్రమునందలి ప్రయోగములు గ్రాహ్యములగును. "బహువేద ఘోషములఁజేసి నిరస్త సమస్త సద్గుణో,త్వరులగుచున్న ధన్యులు" -

అనుచో, దేనిచేత నిరస్తమను నాకాంక్షరాఁగా, బహువేద ఘోషములఁజేసి–అనునది, యాయాకాంక్షను బూరించుట కపేక్షితమగును. కాన, నీకారక పదము సమాసైక దేశమగు నిరస్తశబ్దముతో నన్వయించును. "అఖండితరూప విలాస సంపదన్, వంచిత పంచబాణుఁడగువాని"– అనుచో, దేనిచేత వంచితమను నాకాంక్షరాఁగా, "అఖండిత రూపవిలాస సంపదన్"– అనునది యాయకాంక్షను బూరించుటకపేక్షితమగును. కాన, నీకారక పదము సమాసైక దేశమగు 'వంచిత' శబ్దముతో నన్వయించును.

"యత్ర ప్రతియోగికారక భిన్నపదాపేక్షా వర్తతే తత్ర సమాసో నస్యాత్. యథా–బుద్ధస్య రాజ్ఞో మాతంగా ఇత్యత్ర బుద్ధస్యేతి విశేషణస్య రాజ్ఞ ఇతి విశేష్యేణ సమాసాభావే రాజ్ఞ ఇతి పదస్య మాతంగా ఇతి పదేన సమాసో నస్యాత్. తేన బుద్ధస్య రాజమాతంగా ఇతి నస్యాదితి. యత్ర ప్రతియోగి కారక పదయో రపేక్షా వర్తతే తత్ర స్యాదేవ. యథా–రామస్య నామ మహిమా, కృష్ణ మాశ్రిత మనాః, బాణేన భిన్నహృదయః, రామేణ హత భర్తృకా, విప్రాయ దత్త భూమిః వ్యాఘ్రాల్లబ్ధభయః, సింధో నిమగ్న సర్వస్వ ఇత్యాది." (ముగ్ధ 317–దుర్గా) తరుణ్యోవృషలీ భార్యః, ప్రవీరఃపుత్ర కామ్యతి, బుద్ధస్య రాజ్ఞోమాతంగా ఇతినస్యుః ప్రయుక్తయః. చైత్రస్య దాసభార్యేయం లూన చక్రరథోమయా, శరైః శాతిత పత్రోయం, వృక్షాదితి సతాం మత, మిత్యాహుః. (ముగ్ధ–శ్రీరామ.)

**25 బిరుదాద్యుత్తర పదక కర్మధారయములు (సమాస 2-6):-** ఇట, అనాపామాయాగమ విధానము (4 సూ) సరికాదు. అన్నాది పదము లాగమములనుట యసంగతము. తిక్కన సోమయాజి=సోమయాజియయిన తిక్కన. సోమయాగముచేసిన బ్రాహ్మణ సంజ్ఞలకుఁ జేర్చు,ను ప పదము–సోమయాజి. ఇది శ్రేష్ఠార్థకము కాదు. నన్నపార్యుఁడు=ఆర్యుఁడయిననన్నప. ఆర్యుఁడనఁగానిటఁ బూజ్యుఁడని యర్థము. శ్రేష్ఠుఁడని కాదు. కృష్ణమనాయఁడు. ఇట, 'అమ' శబ్దము ప్రేమ సూచకము. (5 సూ.) ప్రేమసూచకమనుచునే యాగమమనుట విరుద్ధము. కృష్ణమ్మ–స్త్రీ సంజ్ఞ. కృష్ణశబ్దము పురుషసంజ్ఞ. కనుక, కృష్ణ+నామముగల+అమ్మ=కృష్ణమ్మ–మధ్యమ పదలోపి సమాసమనుట యుక్తము. స్త్రీల సంజ్ఞలు కొండొకచోఁ బురుష సంజ్ఞలుగాఁ వాడఁబడును. నాయఁడు– కులసూచకమగు, నుపపదము. ఇట శ్రేష్ఠార్థకము కాదు. (పురుష సంజ్ఞలు కొండొకచో స్త్రీ సంజ్ఞలుగాను వాడఁబడును. ఉదా॥ అమ్మన–పాండు 1–60) నన్నయభట్టు. "భట్ట=వేదాభిజ్ఞేపండితేచ" (శబ్దస్తో) ఇది పండిత బ్రాహ్మణ సంజ్ఞలకుఁ జేర్చు, నుపపదము. శ్రేష్ఠార్థకము కాదు. మల్లయ్య శాస్త్రి. శాస్త్రి=శాస్త్రజ్ఞుఁడు. ఇదియు భట్టశబ్దము వంటిదే. (తాత పేరు మనుమనికిఁ బెట్టునాచారముండుటచే నామకరణ కాలముననే మల్లయ్యశాస్త్రి వంటి పేరులు శిశువులకుఁ బెట్టుట జరుగును.)

ఇట, పత్వమత్వాగమ విధానము వికృతి వివేకమునఁగలదు. "క్వచిత్పతా, క్వచిన్మత్వం యథాయోగ మన్యచ్ఛవ్యవహారతః" (వికృ. అజం 109, 110 కా) ఇదియు నగ్రాహ్యమనుట యుక్తము.

సంజ్ఞావాచకమునకు గుణవాచకములతో సమాసము చేయునప్పుడు బిరుదాది వాచకమునకుఁ బూర్వనిపాతము కావలదా? ఇట, బిరుదాది వాచకము లుత్తర పదములగు టెట్లను ప్రశ్న పుట్టును.

విశేషణం విశేష్యేణ బహుళమ్ (2-1-57)="అత్ర, జాతి సంజ్ఞయోః గుణ క్రియాభ్యాం సమభివ్యాహారే విశేష్యత్వైవ, గుణయోః, క్రియయోః, గుణక్రియయోశ్చా నియమ ఏవవ్యాప్యవ్యాపకభావాపన్నజాత్యోరప్యేవమ్. యథా-శింశుపావృక్ష ఇతి, యత్రైకః అవయవశబ్దః పరస్సముదాయశబ్దః తత్ర అవయవ శబ్దస్య విశేషణత్వమేవ" (ల.శ.శే.)

"జాతి శబ్దస్య గుణక్రియా సమభివ్యాహారే విశేష్యబోధకతా-నీలో త్పలమ్, వికసితమాలతీత్యాదౌ. సంజ్ఞా శబ్దస్య తత్త్వమ్-పండితచైత్రః, పాచకచైత్ర ఇత్యాదౌ, అనియమ ఏవ-కుబ్జఖంజః, ఖంజకుబ్జః, పాచకపాఠకః, పాఠక పాచకః ఇత్యాదౌ యథా" (భై.వా.వ్యా.) వా. వ్యా.

1. కర్మధారయమున జాతి వాచకమునకు గుణవాచకముతోఁగాని, క్రియావాచక ముతోఁగాని సమాసకల్పన చేయునప్పుడు, జాతి వాచకము విశేష్యమగును. ఉదా॥ నీలోత్పలము, వికసితమాలతి.
2. సంజ్ఞావాచకమునకు గుణవాచకముతోఁగాని క్రియావాచకముతోఁగాని, సమాస కల్పన చేయునప్పుడు సంజ్ఞావాచకము విశేష్యమగును. ఉదా॥ పండితచైత్రుఁడు; పాచకచైత్రుఁడు
3. సమసించు పదములు గుణవాచకములయినచో, నియమము లేదు. యథేష్టముగా వాడవచ్చును. ఉదా॥ ఖంజకుబ్జుఁడు, కుబ్జఖంజుఁడు.
4. సమసించు పదములు క్రియావాచకములయినచో, నియమములేదు. యథేష్టముగ వాడవచ్చును. ఉదా॥ పాచకపాఠకుఁడు, పాఠక పాచకుఁడు.

   "ఏవంచ సామాన్య విశేషవాచకపద సమభివ్యాహారే సామాన్య వాచకస్యైవ విశేష్యత్వమ్. యత్రతూభయోరపి పరస్పరాపేక్షయా సామాన్యత్వం విశేష్యత్వంచ తత్రానియమ ఏవ. యథా-బ్రాహ్మణదేవదత్త; దేవదత్తబ్రాహ్మణః, ఇతి" (మ.భా.ఉ.)-వా. వ్యా.

5. సామాన్య విశేష వాచకములు సమసించునప్పుడు సామాన్య వాచకము విశేష్యమగును. ఉదా॥ శింశుపావృక్షము.
6. సామాన్య విశేషభావము పరస్పరాపేక్షమగునప్పుడు నియమములేదు. యథేష్టముగా వాడవచ్చును. ఉదా॥ దేవదత్త బ్రాహ్మణుఁడు, బ్రాహ్మణ దేవదత్తుఁడు.

భట్టు, శాస్త్రి, సోమయాజి యనునవి పూర్వపదములుగా వాడవలసి యుండఁగాఁ (2వ నియమము) బరపదములుగా వాడఁబడెను. "లక్షణ హేత్వోః క్రియాయాః; సముద్రాభ్రాద్ఘః, అనుపాణిని నిర్దేశముల వలనఁ బూర్వనిపాతప్రకరణమున కనిత్యత్వము" (ద్వంద్వ) కాన, నన్నయభట్టు, మల్లయ్యశాస్త్రి, తిక్కన సోమయాజి, లోనగునవి గ్రాహ్యములగును.

ప్రెగ్గడ, (నియోగి బ్రాహ్మణ సంజ్ఞలకుఁ జేరు నుపపదము) రాజు, సెట్టి, రెడ్డి, నాయఁడు లోనగునవి. దేవ దత్త బ్రాహ్మణుఁడను రీతిని (6వ, నియమము) గ్రాహ్యములననగును.

రాయఁడు, రావులోనగునవి "రాజదంతా దిషుపరమ్" (పాణి) అను సూత్రముచే బర నిపాతములగును. రామారాయఁడు. రామారావు-మొ॥

కృత్తద్ధిత సమాసములు ప్రాయికముగా నభిధానమూలకములు. (ప్రాయేణ కృత్తద్ధిత సమాసా అభిధానమూలాః) అనఁగా శిష్టప్రయోగమూలకములు. కావున, భట్టబాణుఁడు (కాశీ 1–19; శృ.నై 1–7) వలె, భట్టనన్నయ–కావలసిన పనిలేదు.

నన్నపార్యుఁడు (1 సూ.)–నన్ని+అప–నన్ని(క–నన్ని.త–నన్ను)=సుందరము. నన్ని నారాయణాయ– నందంపూడి శాసనము. నన్నిమార్తాండ–ద.శా. 4–976 సూ.ని. నన్ని+అయ=నన్నయ–అని పదచ్ఛేదము. (నన్నయ=సుందరయ్య; నన్నినారాయణ=సుందర నారాయణ; నన్నెచోఁడుడు=సుందర చోడుఁడు. చొక్కనాథుఁడు, చొక్కెడుఁడు.)

తిక్కయజ్వ (కాశీ 1–13.) తిక్కనయజ్వ (ఉ. రా 1–14) అను ద్వివిధ రూపములు గలవు.

శ్రేష్ఠార్థ గోచరములగు నార్యాంబాద్యర్థకముల మీఁద శ్రేష్ఠార్థ గోచరములు చేరరాదు.

*"ఆర్యాంబాదిక శబ్దాఃస్యుః, శ్రేష్ఠతావాచకాయతః*
*తతస్తదంత శబ్దేభ్యో, నైవశ్రేష్ఠత్వగోచరాః"* (వికృ. అజం 111 కా)

"రామయప్రభుఁడు, రామయమంత్రి, రామయప్రధానుఁడు, కోనమాంబ–ఇత్యాదయోన ప్రయోగార్హశ్శబ్దాః, కింతు, రామప్రభుఁడు, కోనాంబ–ఇత్యాద్యాకాకారేణ ప్రయోగార్హాః. లక్కమాంబకు మారేత్యాది ప్రయోగస్తు ప్రౌఢోక్తి మాత్రనిష్పన్న ఇతిజ్ఞేయమ్." (అహో 443–444 పు)

మంత్రి ప్రధాన శబ్దములు నియోగి బ్రాహ్మణ సంజ్ఞలకుఁ జేర్చు నుపపదములు. ఇవి శ్రేష్ఠార్థ గోచరములు కావు. కావున, రామయ మంత్రి, రామయ ప్రధానుఁడు, గ్రాహ్యములగును.

లక్కమాంబ, అన్నమాంబ (విరాట 1–10) తిమ్మమాంబ (పాండు 1–55)లోనగునవి ప్రౌఢోక్తి మాత్రనిష్పన్నములు. అనఁగాఁ గృతకముగాఁ గల్పించుటచే, నసాధువులన్నమాట. ఇట్టివి యనుసరణీయములుకావు.

**26 విశేష్య పూర్వపద కర్మధారయములు (16 సూ.):-** విశేషణం విశేష్యేణ బహుళమ్ (సి.కౌ. 736) అను సూత్రముచే విశేషణము పూర్వపదమై విశేష్యముత్తరపదమై యుండవలెను. కాని విశేష్యము కొన్నిచోట్లఁ బూర్వపదముగ నిపతింపఁబడెను. "మయూరవ్యంస కాదయశ్చ" (2–1–72) ఏతేనిపాత్యంతే. మయూరోవ్యంసకః మయూర వ్యంసకః వ్యంసకో ధూర్తః. సి.కౌ. 754 సూ. ఇట విశేష్యమగు మయూరశబ్దము పూర్వపదముగ నిపతింపఁబడెను. కాన నిట్టివి విశేష్య పూర్వపద కర్మధారయము లనఁబడును. వీనిని విశేషణోత్తరపద కర్మధారయము లనుట యుచితము కాదు. విశేషణపూర్వపద కర్మధారయములను విశేష్యోత్తర పద కర్మధారయములనుట యెట్లు సరికాదో; విశేష్య పూర్వపదములను విశేషణోత్తర పదములనుట యట్లేసరికాదు. కాఁగా, తమ్ముఁ గుఱ్ఱలు. లోనగునవి విశేష్య పూర్వపద కర్మధారయములనుటయే శాస్త్రీయము,

**27 "విశేషణోభయపద కర్మధారయములు (17 సూ.)** "పిన్న పెద్దయైన

పింగళి సూరయ్య, గారిc దలcచి వేcడిగారవమున-ఇతి యయాతి చరిత్రే, పిన్న పెద్దలైన ఇతి బహువచన మపి. వయసా న్యూనోపి వివేకేన గరీయా నిత్యర్థః. విశేషణ సమాసోపి క్వచిదిష్టో భవేన్మమ-ఇత్యథర్వణ వచనాత్ విశేషణ సమాసః. మెత్తని వలుద పొదుగు, వినని కనని మహిమలు. సంస్కృత భాషా విదోవిశేషణస్యాపి విశేష్యత్వ వివక్షాయాం స్నాతానులిప్త ఇత్యాదౌ "విశేషణం విశేష్యేణ బహుళమ్" ఇతి సూత్రేణ సమాస నిర్వాహ ఇతి వదంతి" అహో 418 పిన్న పెద్దగా (ఉ.హ. 5-90).

**28 నాయcకరము (తద్ధిత 12):-** నాయcక+ర+ము=నాయcకరము- ఒకటీక. (సుబో) కొందఱు నాయcక+అర-అనిరనియు శబ్దరత్నాకరము ననుసరించి, కరవర్ణకమునే గ్రహించినట్లు వేఱొక టీక. (తత్త్వ) కుమారదేవపండితీయమున, కర వర్ణకమే కలదు. సుబోధిని దాని నాక్షేపించుట యపరిశీలన మూలకము. శబ్దరత్నాకరమున "నాయంకరము (నాయcకుcడు+కరము)= అధిపత్యము" అనియే కలదు. కావున కర వర్ణకమే ప్రౌఢవ్యాకర్తకు సమ్మతమనుట స్పష్టము. నాయcక+ర+ము; నాయcక+కర+ము-అని వ్యాఖ్యాతలు ప్రక్రియ చెప్పcబోవుట తప్పు. 'ర' ప్రత్యయముద్దిష్టము కాదుగాన నది త్యాజ్యము. కరవర్ణక పక్షమునందైనను వ్యాఖ్యాతలు (తత్త్వ) నాయcక+కర+ము. అని నిల్పుట యసంగతము. సుబంతముకంటెc తద్ధితప్రత్యయము నిల్చును. కాన నాయcక+యొక్క+కర అను నలౌకికవిగ్రహము నుండి రూపసాధన చేయవలెను. శ.ర.లో నాయcకుడు+కరము-అని చూపcబడెను. కాని, ప్రక్రియలో 'కర'వర్ణకము నిల్ప వలసినది షష్ఠ్యంతముపైగాని ప్రథమాంతముపైc గాదు. రవర్ణకమనక, కర వర్ణకమనుటకుc బైయాశయమే మూలము. "నాయcకుcడు+ర" అని నిల్పినను, "నాయcకు యొక్క+ర" అని నిల్పినను, నాయcకర మను రూపము సిద్ధింపదు. నాయcకురము-అను నవిష్ట రూప మేర్పడవలసి వచ్చును. కాన, కరవర్ణకము విధింపcబడి యుండును. "కరజ్ వర్ణకంబు నాయశబ్దంబునకు భావంబునందగునని సూత్రింపనగును" అను వ్యాఖ్య సరికాదు. (తత్త్వ) ఒకవంక, నాయcక శబ్దము కలదని చెప్పచు (ఎఱుకునాయంకుcడొక్కరుcడు వచ్చి చంద్రా-శ.ర.) నాయcకుయొక్క భావము=నాయcకరము కాదనియు, నాయని యొక్క భావము నాయcకరమనుట బాగనియు వ్రాయుట యవిచారమూలకము. నాయcకశబ్దమునందలి 'క' వర్ణలోపమునకు దారిలేదను కొనుట యీ యనర్థమునకు మూలము.

**29 టవర్ణక లోపము (క్రియా 14):-** "కొఱకు కంటె పొంటెలు పరమగునపుడు భావార్థక టవర్ణకంబునకు లోపంబు విభాషనగు" అని ప్రౌఢవ్యాకర్త సూత్రించెను. కాని టవర్ణకము లోపింపరాదని యహోబలపండితుc డథర్వణకారికా వివరణమున వక్కాణించెను. "విభక్తిమాత్రంసర్వత్ర, మహితస్యాట్టవర్ణకాత్" (వికృ. క్రియా 19) "విభక్తిమాత్రమితి-ఘటించుటకొఱకున్, వచ్చుటకొఱకున్- ఇత్యాద్యాకారేణ సర్వత్ర టవర్ణకాదేవ విభక్తయః. ఏవంస్థితే, సుతులc గనియెడుకొఱకు నీవు ఘటించుకంటె-ఇత్యాది భాస్కర తిక్కయజ్వాది కవివచనానాం కిం మూల మితి వయం న విద్మః" (అహో 613 పు) ఈ భాస్కర తిక్కయజ్వల, ప్రయోగములకు నన్నయ ప్రయోగములే మూలములని యహోబలపతి గుర్తింపలేదు. "పురుషుల రక్షించుకంటెc బుణ్యముగలదే" (ఆది 2-91) ఎలుకచేc జచ్చుకంటె (ఆది 8-308)

"రక్షించుకంటె మున్నగు చోటులందెల్ల రక్షించుదానికంటె మున్నగు వానిలోని తచ్ఛబ్దము తచ్ఛబ్దవస్యలోపః స్యాత్తను నథర్వణసూత్రముచే లోపించుచున్నదని సమర్థించు కొననగును." (వ్యాసం.స. 1433 పు) అని యందురు. కాని యీ యథర్వణ కారిక తచ్ఛబ్ద వకారలోపమును విధించుచున్నదిగాని తచ్ఛబ్ద లోపమునుగాదు. వండినవాఁడు=వండినాఁడు-ఇత్యాది. ధాతుజ విశేషణములకు విభక్తి వివక్షించినచోఁ దచ్ఛబ్ద, మనుప్రయుక్తము కావలెను. "ధనము వడయుదానికంటెఁ దక్కువె చెపుమా" (విరాట 3-234) పడయుకంటె-అనరాదు. ఇట్లే కనినదానికంటె-అనవలెను. కనినకంటె-అనరాదు. (ప్రౌ. క్రియా 21) టవర్ణక లోపము, తచ్ఛబ్దలోపము, రెండును సరికావు.

## (II) ఆక్షేపణలు - సమాధానములు [30-57 విషయములు]

**30 క్షవర్ణము (సంజ్ఞా 1):-** విలక్షణోచ్చారణముగల జ్ఞవర్ణాదు లుండఁగా నొక్క క్షవర్ణమునే వర్ణాంతరము కాదని ప్రౌఢవ్యాకర్త చెప్పనేల?

సమా:- క్షవర్ణము వర్ణాంతరము కాదన్నది విలక్షణోచ్చారణమును బట్టి కాదు. అనంతామాత్యాదులు క్షవర్ణమును వర్ణాంతముగాఁ బేర్కొనియున్నారు. "సొరిది క్షకారము గూడఁగ, సరి నేఁబదియయ్యె వర్ణసంఖ్య ధరిత్రిన్. (ఛందో 124 ప) "క కారాదిగా, క్షాంతమైన వర్ణసంచయంబు" (కవిచిం-నై.పా. 233పు) ఈయభిప్రాయము నప్పకవి యిట్లు విమర్శించెను. "కాకు షా జడ్డమైన క్షకారమగుటఁ, దలఁప కేఁబది లిపులలో దానిఁగూర్చి...ళాను, విడిచిపెట్టె ననంతుండు వెట్టిగాఁడె; "ఆగమజ్ఞులు బీజోపయోగి గాన, క్షాను జేకొని రదిశబ్దసరణి గాదు." (అప్పక 2-52; 50)

అహోబలపండితుఁడు క్షవర్ణము, వర్ణాంతరము కాదని సహేతుకముగ నిర్ణయించెను. తన్నిర్ణయానుసారముగనే ప్రౌఢవ్యాకర్త క్షవర్ణము వర్ణాంతరము కాదని వివరించెను. జ్ఞవర్ణాదులు వర్ణాంతరములని యెవరును జెప్పలేదు.కానఁబైయాక్షేపణ యసంగతము.

**31 రాజు-రాజే:-** (సంజ్ఞా 6)

వైకృతరాజు శబ్దమే లేదనియుఁ దత్సమరాజు శబ్దమునందలి జకారము దంత్యమే యనియుఁ గొన్ని యుపపత్తులు సెలవిత్తురు. వాని సామంజస్యమును బరికింతము.

(1) రాజుశబ్దమునందలి జకారము దంత్యమగుట యుచ్చారణానుభవమును బట్టి ప్రత్యక్షమగుటచే దానిం గూర్చి యభిప్రాయభేదములకుఁ బ్రసక్తియే యుండరాదు. (బా. ర.)

సమా:- రాజు శబ్ద దంత్యతకు నేఁటి యపభ్రష్టోచ్చారణము ప్రమాణమనుట యసంగతము. ఈపక్షమున, జేడ, జేముఁడు-లోనగు శబ్దములలోని జకారము నేఁటి యుచ్చారణానుభవమునుబట్టి తాలవ్యమనుటలో నభిప్రాయభేదములకుఁ బ్రసక్తి యుండరాదు. అట్లయిన బాలవ్యాకర్త వీనిని దంత్యజకారములతో నుదాహరించుట తప్పు కావలసివచ్చును. దంత్యతాలవ్యతలను నిర్ణయింపవలసినది పూర్వ కవి ప్రయోగాదులను బట్టి కాని యీనాఁటి యపభ్రష్టోచ్చారణములను బట్టి కాదు. కావుననే సూరి

"అక్క_జాదిషు" అని సూత్రాంధ్ర వ్యాకరణమున సూత్రించియు "అద్దంత్యః" అను చింతామణికిని బూర్వకవి ప్రయోగములకు విరుద్ధమని భావించి జేడ, జేముడు-లోనగు వానిని దంత్య జకారములతోనే యుదాహరించెను. తత్సమ రాజుశబ్ద దంత్యతను నేఁటి యుచ్చారణానుభవమును బట్టి సూరి సూత్రించినమాట వాస్తవమే. కాని నేఁటి యుచ్చారణానుభవము పూర్వకవి ప్రయోగాదులకు విరుద్ధము కానంతలోనే గ్రాహ్యమగును. బాలవ్యాకరణము వ్యావహారిక భాషా వ్యాకరణము కాదన్న విషయము మఱవరాదు.

(2) "ఎటులో, రాజు శబ్దమును వైకృతముగ సమ్మతించినను ఖగరాజు శబ్దమును వైకృత మనఁజాలరు గదా? ఖకారము వైకృతమున నుండదు గదా? ఆ తత్సమమునందలి జకారము దంత్యమగుటలోని విలక్షణత నంగీకరింపక యెట్లును దప్పదుగదా? అట్టియెడ వ్యస్తమగు రాజు శబ్ద జకారము దంత్యమగుట విశేషమని యంగీకరించుటలో మాత్రము బాధ యేమిగలదు." (బా. ర.)

సమా:- ఇట వివాదము తత్సమ రాజు శబ్దముగలదా? లేదా? యని కాదు. ఖగరాజు-అను సిద్ధసమాసమును బట్టి తత్సమరాజు శబ్దము గలదని తెలియుచున్నది.కాని యందలిజకారము దంత్యమని తెలియఁబడుటలేదు. కాన నిది వ్యస్తమగు రాజు శబ్ద జకారము దంత్యమనుటకు సాధకము కాదు. సిద్ధసమాసమందయినను, వ్యస్తత యందయినను దత్సమ రాజు శబ్ద జకారము తాలవ్యమే కాని దంత్యము కాదు. ఇది నేఁటి యపభ్రష్టోచ్చారణమునుబట్టి నిర్ణయింపవలసినదికాదు. ఈవిషయము నప్పకవి యిట్లు స్పష్టపఱిచియున్నాఁడు. "అకట పాండురాజ...(రాఘవ)...అద్యప్రకృతి యందు దంత్య చజలు లేవు గనుక శుద్ధసంస్కృతమైన పాండురాజ శబ్దమునందుఁ గల జకారము తాలవ్యమే కాని దంత్యము కానేరదు. ఇది తెలియక కేవలాంధ్రులు దంత్యాక్షరముగా నుచ్చరింతు రది లాక్షణికమతము కాదు. (అప్పక 2-137)

(3) పూర్వలాక్షణికు లెల్లరును తత్సమమని తలంచిన శబ్దమును వైకృతమనుటలోని సామంజస్య మెట్టిది? ఆవశ్యకత యెట్టిది? (బా.ర)

సమా:- పూర్వలాక్షణికులు రాజు-అను తత్సమ శబ్దమునుజెప్పిన మాట నిజమే కాని వారెవ్వరు నందలి జకారము దంత్యమని చెప్పియుండలేదు. వైకృత రాజు శబ్దమును బూర్వలాక్షణికులు చెప్పకపోలేదు. కేతన యాంధ్రభాషా భూషణములో "వలరాజు రేఁచేఁడు వాలుఁగంటి...కెంజాయ...తామరకంటి... దేశ్యంపుఁ దెనుఁగులయ్యె" అని చెప్పియున్నాఁడు. (ఆం. భూ. 25 ప.) ఈ దేశితెనుఁగులోని పదములు సంస్కృత సమములు కారాదు గావున వలరాజు-అను పదమునందలి రాజుశబ్దము కేతనమతమున వైకృతమనక తీరదు. అడిదము సూరకవి-"ఓలిఁ గొన్నిటి కాదేశ ముత్వమగును." (కవి సం. 3-4) అని లక్షణము చెప్పి రాజు-అను వైకృతరూపము నుదాహరించెను. కావునఁ బూర్వలాక్షణికుల మతమునందును వైకృత రాజు శబ్దముగలదు. ఇంక వైకృతరాజు శబ్దము నంగీకరించినప్పుడే యచ్చ తెనుంగు కావ్యములయందలి ప్రయోగములు సిద్ధించును. కానఁ బ్రయోగదృష్టితో రాజు-అను వైకృతము నంగీకరించుట యావశ్యకము.

(4) ప్రకృతివర్ణముల పరిణామము లేనిదానిని వైకృతమనుటలోని సామంజస్య మెట్టిది? (బా. ర.)

సమా:- వైకృత లక్షణమగు దంత్యత కనఁబడుచుండఁగాఁ బ్రకృతివర్ణముల పరిణామములేదనుట సరికాదు. "చజలు గారవి రెండు చేజెలగు" (కవి సం. 3-1) అని సూరకవి తాలవ్యచజలు తద్భవములగుచో దంత్యములగునని పేర్కొనెను. "ప్రాకృతే తద్భవేచాపి చజౌ దంతభవౌస్మృతౌ" అను నథర్వణకారికచే సంస్కృతసమ చజలు దంత్యములుకావని తెలియుచున్నది. కావున రాజు = రాజో-అగుటలోఁ బ్రకృతివర్ణముల పరిణామము గలదనుట స్పష్టము. ఇట్లే, జగము-జేగము (య1-19; నీలా 1-5) జలకము=జేలకము(య1-52) పంజరము=పంజేరము (అచ్చ. రా) పూజ=పూజో (నీలా 1-6)-మొ॥

(5) అచ్చతెనుఁగు కావ్యమున, ఏమూలనో ఎట్టి యనవధానతవల్లనో ఎట్టి యవసరముననో ఒకతత్సమశబ్దము దొరలినయెడ ఆశబ్దము వైకృతమనుటలో ఆ ప్రయోగమునే పరమప్రమాణముగా నంగీకరింపనురాదు. అచట నా తత్సమప్రయోగము దుష్టమని దూషింపనురాదు. నిర్బంధ కవితలో నిట్టినెరసులు గణనీయములు కావను నుదారభావముతో అట్టివానిని చూచిచూడనట్టు లుపేక్షించుట యుచితమేమో! యోచింపుడు. (బార.)

సమా:- ఇందు యోజింపవలసినది నిజమున కేమియు లేదు. యయాతిచరిత్రమున రాజోశబ్దము పలుసార్లు (48 సార్లు) ప్రయోగింపఁబడి యుండుటచే నేమూలనో యెట్టి యనవధానతవలననో ప్రయోగించినదికాదు. రాజు అను తత్సమరూపమును వాడక తప్పని పరిస్థితియేమియునులేదు. రాజ శబ్దార్థకములగు నాచ్ఛికపదములు లేనపుడుగదా తత్సమపదమును వాడవలసిన నిర్బంధముకలుగును. ఒడయఁడు, ఏలిక, ఎకిమీఁడు. పుడమి ఱేఁడు, ఱేఁడు, దొర, సామి, పాదుసా, మన్నీఁడు, సాహెబు, రాయఁడు, పబువు, జియ్య, తుపాసి, (అంధ్రనా; సాం.ని) దునెచారి, రా, (నేఁడు అంధ్రనా; సాం. ని) మున్నగు పదములుండఁగా రాజు-అను తత్సము నెట్టియవసరముననో యయాతిచరిత్రకర్త వాడెననుటసరికాదు.

వైకృతరాజో శబ్ద మచ్చతెనుఁగు నిఘంటువుల యందును గలదు. "రాచవాఁడనగను రాజన క్షత్రియుఁ డొప్ప...రాజెకిమీఁడు" అం. భా. బ్రహ్మవర్గు. వానీఁడు రారాజు-సాం ని. దేవవర్గు. వలరాజు మరుఁడు-అం. శే.

కాఁగా సంస్కృతసమ రాజు శబ్దము, వైకృత రాజో శబ్దము రెండునుగలవు. సంస్కృతసమ రాజు శబ్దమునందలి జకారము తాలవ్యము.

'రాజో. సం. దీనిఁ గొందఱు వైకృతపదముగా వాడియున్నారు. అది చింత్యము.' అని, శ.ర.లోఁ గలదు. "రాజువైకృతంబని కొందఱందురు" అని ప్రౌఢవ్యాకరణమునఁ దెలుపఁబడెను. "కొందఱందురు" అనుటచే నిది మతాంతరముగ సూచింపఁబడె నన్నమాట. తత్సమ రాజు శబ్ద జకారమును ప్రౌఢవ్యాకర్త దంత్యముగ భావించుటచేతనే "జకారం బుభయంబునగు" అని సూత్రించుట తటస్థించెను. కాని మతాంతరముగ సూచింపఁబడినదే యుక్తమని పైపరిశీలనవలనఁ దెలియుచున్నది.

**32** నకారగ్రహణము (సంజ్ఞా 7):- శబ్దశాసనుఁడు ద్రుతాఖ్యోనః- అని కేవల నకారగ్రహణము చేయుట ద్రుతమునకు స్థిరత్వసిద్ధికై యని తెలియవలయును. (సంజ్ఞా 7) అని ప్రౌఢవ్యాకర్త వివరించెను. ఇది సరికాదని యిట్లాక్షేపింతురు. "పూచెంగుముదము-ఇత్యాదుల నుత్వ విశిష్టమగు కకారమునకుఁ బరుషసంజ్ఞలేక

పోయెనా! అట్లే 'ను' అనుదానిలో నున్న నకారముగూడ స్థిరసంజ్ఞనెట్లయినను బొందుచుండును...కాన సీతారామాచార్యులు గారి యీసమర్థనము యుక్తియుక్తముగాఁ గాన రాదు." (తత్త్వ) ఇట వ్యాఖ్యాతలకు సూత్రకర్త యాంతర్యము బోధపడలేదు. వ్యాకర్త యీవాక్యమును గ్రింది యహోబలపండితుని చర్చను దృష్టిలోఁ బెట్టుకొని వ్రాసెను.

"ద్రుతాఖ్యోనః...స్థిరా ఇతరే (అం. చిం)–ఇతరే పరుషసరళ వ్యతిరక్తాస్సర్వే ప్రాణినః స్థిరసంజ్ఞకా భవంతి. తేన–నస్య ద్రుతాఖ్య స్యాపి పునస్థిర సంజ్ఞా. తేన–మెచ్చె నలినాక్షుఁడు–ఇత్యాదౌనలోప స్సిద్ధ్యతీతిజ్ఞేయమ్" (అహో. 201 పు) ఇట నహోబలపండితుఁడు నకారమునకు ద్రుతసంజ్ఞ తోపాటు స్థిర సంజ్ఞయుఁ గలుగునని చెప్పెను. నకారమునకు స్థిరసంజ్ఞ కలుగుటచే, మెచ్చెన్+నలినాక్షుఁడు–అనుచో "లుగ్వా ద్రుతప్రకృతికాత్ పరత స్సరళే స్థిరేచ నస్యస్యాత్" అను సూత్రముచే ద్రుతలోపము కలిగి, మెచ్చెనలినాక్షుఁడు–అనురూపము సిద్ధించునని వివరించెను. ఈచర్చను దృష్టిలో నిడుకొని "ద్రుతాఖ్యోనః..స్థిరాఇతరే" అని సూత్రించినచో, నువర్ణేతరములు స్థిరములు కావలసివచ్చుననియు నప్పుడు నువర్ణమునకు ద్రుతసంజ్ఞయే కాని స్థిరసంజ్ఞ కలుగదనియుఁ బ్రౌఢవ్యాకర్త భావించెను. నువర్ణమునకు స్థిరసంజ్ఞ కలుగనిచో, త్రవ్వెను+నూతులు– ఇత్యాదులలో నువర్ణము పరమగునపుడు ద్రుతలోపము సిద్ధింపకుండఁబోవును. కావున ద్రుతమునకు (నువర్ణమునకు) స్థిరత్వ సిద్ధికై ద్రుతాఖ్యోనః– అని సూత్రించినట్లు ప్రౌఢవ్యాకర్త వివరించెను. కాని యీ యాశయము మాత్రము చింతామణీ సమ్మతముకాదు. చింతామణీమతమున వ్యంజన నకారము ద్రుతమన్నది సిద్ధాంతము. (చిం. పరి. 194–196) ప్రౌఢవ్యాకర్త చింతామణి మతమున నువర్ణము ద్రుతమనుకొని పైరీతి సమర్థనము చెప్పెను. అది యగ్రాహ్యమని తెలియవలెను.

**33 కారో-కారము (సంజ్ఞా. 10):** "ప్రౌఢవ్యాకర్త, కారో–అను పదము క్షారశబ్దభవమ్మై యుండునని వ్రాయఁదగును." (తత్త్వ)

సమా:- (i) క్షారః–కారో, అని సవరణ ప్రతిపాదించుటకుఁ బ్రౌఢవ్యాకరణము– త్రిలింగలక్షణ శేషముగాని ప్రాకృత లక్షణశేషము కాదు. (ii) ప్రాకృతమున, క్షారశబ్దము కారో–అనికాదు. "ఉపరిలోపః కగడతదషసామ్ (ప్రా. ప్ర) అను సూత్రముచే క్షారశబ్దమునందలి కకారము ప్రాకృతమున లోపించును, గావున 'కారో'అను ప్రాకృతరూపము సిద్ధింపదు. కాఁగా 'కారో' అను ప్రాకృతరూపము క్షారశబ్దభవమని ప్రౌఢవ్యాకర్త చెప్పవలెననుట కేవలము పొరపాటు.

**34 ద్రుతద్విత్వము-పెన్వాదులు (సంధి, 3, 9, సూ):-** "3వ, 9వ, సూత్రములను రెండింటిని దీసివేసి, కొన్నియెడల నకారంబున కచ్చుపరంబగునపుడు ద్విత్వంబు గానంబడియెడినని సూత్రించిన నుభయ విధ లక్ష్యములును సిద్ధించి యుండును" (తత్త్వ)

సమా:- 3వ సూత్రము ద్రుతద్విత్వమునకు సంబంధించినది. 9వ సూత్రము నందలి, పెన్–మున్నగు వానిలోని నకార మావయవిక మగుటచేఁ బ్రౌఢవ్యాకర్త మతమున నిందలి నకారము ద్రుతము కాదు. ద్రుత ద్విత్వమును నితర నకారద్విత్వములను గలిపి వేయవలెననుట సముచితము కాదు. (i) 3వ, సూత్రము

వ్యస్తస్థలములకుఁ జెందినది. 9వ సూత్రము సమాసస్థలములకుఁ జెందినది. ఈభేదము నొప్పరికింపవలె ననుట యనాలోచితము. (ii) 9వ సూత్రమునందలి పెన్వాదులలో నొక్క నకారద్విత్వము మాత్రమే లేదు. ఇతర వ్యంజనముల ద్విత్వమును గలదు. ఉదా॥ పల్+అఱపు=పల్లఱపు, ఇట్లే చిట్+ఉద్దులు=చిఱ్ఱుద్దులు, లోనగునవి. పైకారణములచే నీ రెండు సూత్రములు వేర్వేఱుగా నుండుటయే సమంజసము.

**35** ద్వంద్వమున గసడదవలు (సంధి 6):- ప్రౌఢవ్యాకర్త నిషేధించిన రాకపోకలు–మున్నగు వ్యావహారిక ప్రయోగముల మూలముగాఁగల నిషేధము నిరాధారము. అట్టివి ప్రాసాదిగత ప్రయోగములు లేవు" బా. ఉద్యో.

సమా:- "అర్వాచీన మహాకవు లీగసడదవాదేశ విషయమున నియతత్వము నుపేక్షించిరి" అనియుద్యోతకర్తలే తెలిపియున్నారు. (వ్యా. సం. స. 278 పు) కావునఁ బ్రౌఢవ్యాకర్త చూపిన తిక్కన సోమ నేతర కవిప్రయోగములు గసడదవాదేశము రాకుండుట కుదాహరణ యోగ్యములే యనఁదగును. భారతేతర కావ్యములలో నీగసడదవాదేశము నియతముగాలేదు.

**36 షష్ఠిలో నుగాగమ లోపము (సంధి 10):-** "గోకులము అనుదానిని గ్రుమ్మరున్–అను క్రియలోని కన్వయింప వచ్చును. మిగిలిన రెండుదాహరణములు నాధునికములు" (తత్త్వ)

సమా:- తిక్కనాదుల ప్రయోగములు కలవని తెలియకపోవుట యీ యాక్షేపణకుఁ గారణము. దీపమట్లు–కర్ణ 3–49, గొడుగీగి (గొడుగుయొక్క యీగి) అను 5–196; మాల్యవంతమొప్పు (మాల్యవంతముయొక్క యొప్పు) పండితా. భావుక మోజు (భావుకముయొక్కయోజు) బసవ 841 పు. నిషధరాజంతవాని–శృ.నై 2–92. వరాటరాజడప–శృ.నై 6–141; గట్టురాజల్లునికిన్–హర 5–47. ఇత్యాదులు.

**37 శిరసుపూ గగనగంగ (సంధి 11):-** ప్రాఁతది యగు నిల్లు ప్రాయిల్లు–అయినట్లే, శిరసుపూవగు గగనగంగ, శిరసుపూ గగనగంగ యయ్యెను. అప్పుడీసూత్రమనావశ్యకము" (తత్త్వ)

సమా:- సూత్రము నెట్లో యనావశ్యక మనుటయే యభీష్టము గాని వ్యాఖ్యాతలకుఁ గవిహృదయముతో సంబంధములేదు. ప్రయోగాంతరములకు–చూ. విషయసంఖ్య–5.

**38 అన్నురంబు మొ॥ (సంధి 13):-** బా. ప్రకీర్ణక 16చే–అన్నురంబు వంటి రూపములు సిద్ధించును. "సమాసమందున్న నుకారముల కీవిధి వర్తింపదని బాలవ్యాకర్త చెప్పియుండలేదు. కావున నీసూత్ర మనావశ్యకము" (తత్త్వ)

సమా:- అన్నురంబు–సమాసమనుట యవిచారమూలకము (చూ–19) ప్రౌఢవ్యాకర్త యీ సూత్రమును వ్రాయుటకు వేఱే కారణముగలదు. చిన్నయసూరిగారు ప్రకృత సభాపర్వ పద్యమున, "అన్నురంబు" అని పరిష్కరించియున్నారు. "కన్నెదరె ఇతి నా కన్నెదరె ఇతివేతి సందేహః" అని సూత్రాంధ్ర వ్యాకరణమున సందేహము వెల్లడించి యున్నారు. వీనిని దృష్టిలో నిడుకొని ప్రౌఢ వ్యాకర్త యీసూత్రమును సందేహ నివృత్తికై యిటఁ జేర్చెను. కాన నీసూత్రము బాలవ్యాకరణమునకు వివరణముగ గ్రాహ్యము.

**39** రెన్నాళ్లు–మొ॥ **(సంధి 15):-** "వ్యవహారమున రెణ్ణాళ్లు, మూణ్ణాళ్లు వేణ్ణేళ్ల

అని ణకారము వినవచ్చుచున్నది. కావున నీ సూత్రమున డకారము ణకారం బగునని సూత్రించుట యుచితము" (తత్త్వ)

సమా:- రెణ్ణాళ్లు-వంటి వానికి నేఁటి వ్యవహారము నాధారముగా గ్రహించి సూత్రింపవలె ననుట గ్రాంథిక భాషా విషయమునఁ జెల్లదు. ణకార ద్విత్వమును గాని ణకార నకార సంయోగమును (=ణ్న) గాని నిర్వహించు ప్రయోగము కనఁబడదు. "రెన్నెలల దాఁక మీఁదట, నన్నొల్లకయున్న (బా.రా. సుందర. 202) అని యిట్లు దంత్యనకార ద్విత్వమె ప్రాసస్థల నిబద్ధముగఁ బ్రయుక్తమై యున్నది." (వ్యా.సం.స.) తెనుఁగున వర్ణసమీకరణమే సహజ మనవచ్చును. కానఁ బ్రౌఢ వ్యాకరణ మార్గమే యుచితము.

**40 ఆడిదె, చెప్పనినన్ (సంధి 18):-** ఆడిదె, చెప్పనినన్-అనునవి సాధు పాఠములు కావని వ్యాఖ్యాతలు వ్రాసిరి. కావున "లక్ష్యములు జీవింపని లక్షణమెట్లు నిలుచును" (భారతి, జులై 1964 సంచిక నెం. సూ.)

సమా:- నిజమే, కాని సూత్రమునకుఁ బ్రయోగాంతరములు గలవు. కావు కావనుట రక్కసులమూఁకనెకాని, ననిచె నీయెడ సింహనాద విహ్వతి-పాండు 1-145. కావుకావనువారిఁ గదిసి తుంగపయోధ,ర పదాంతరంబు సేరంగ నీదు-వసు 1-56 కావుము+కావుము=కావుకావుము. కావుకావుము+అను=కావుకావను, (ఇట ముపర్ణక లోపము) పక్షాంతరము-కావుకావు+అను=కావుకావను. ఇది నిపాతన్యాయమున గ్రాహ్యము.

**41 లేలెమ్ము, పోపొమ్ము (సంధి 23):-** (i) "త్వరితాద్యర్థంబులందు ప్రక్రియావస్థ యందే ధాతువునకు ద్విత్వము రాఁగా, లే+ము+లే+ము-అని యుండఁగా పూర్వరూపమునందలి ముపర్ణకమునకు లోపము రాఁగా లేలెమ్ము-అని యగును" (తత్త్వ)

సమా:- త్వరితాద్యర్థములం దగు ద్విరుక్తి లెమ్ము+లెమ్ము-అని యగును గాని (శబ్ద 113) లే+ము+లే+ము- ఇత్యాదిగాఁ గాదు. కానఁ బై యాశయము సరికాదు.

(ii) కొందఱు, లెమ్ములెమ్ము, పొమ్ముపొమ్ము-అనుచోటులందుఁ గూడ ఆమ్రేడితము పరమయినది గావున నీసూత్రముచే హ్రస్వమునకు దీర్ఘముకలిగి లేమ్ము లెమ్ము, పోమ్ము పొమ్ము-అను నపరూపములు సంభవించుచున్నవే! ఈదీర్ఘములను వారించుటయెట్లు? అని ప్రశ్నింతురు (బా. ర)

సమా:- (i) లేమ్ము+లెమ్ము-అని యగునన్న పక్షమున, "ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముడుజ్ఞులకు లోపము విభాషనగు" (బా. సంధి 49) అను సూత్రమునందలి విభాషచే నిట్టిచోట్ల ముపర్ణక లోపము నిత్యమని వ్యవస్థ కల్పించి యనిష్టరూపములను వారింప వచ్చును.

**42 భూపాలుర్ (శబ్ద 16):-** "భూపాలుర్-అని యాతఁడిచ్చిన రూపముల వంటి రూపములు విరళములే యనుట యథార్థము. కావున నీ సూత్ర వునావశ్యకము" (తత్త్వ)

సమా:- ప్రౌఢవ్యాకర్త ప్రయోగములు స్మరింపక, భూపాలుర్-అని చూపి వదలెను. వ్యాఖ్యాతలు ప్రయోగములు విరళములనిరే గాని యొక్క ప్రయోగమునైనను జూపి యుండలేదు. ప్రయోగములు-

(i) "అసు, హృద్దర్పోన్నతులు సూచియెట్లు సహింతుర్. (సభా 2-141) ఇత్యాచార్యస్యాపి ప్రయోగః"
(ii) చతుర్దశ, జాతుల ప్రజలకును దుర్దశలు సంధింతుర్. (హార 5-18-సర్వల 1-293)
(iii) విషయం, బున జన చాళుక్యరాజు మొదలుగc బలువుర్, (కు. సం. 1-23)
(iv) జన లోకంబునకుc బోయి సంచారింతుర్. (వి.పు. 8-840)
(v) పరమంపద మనుచు నెచట భక్తిc దలంతుర్. (వి.పు. 8-186)
(vi) ఒండుని, మిత్త్రంబుననైన బ్రదుకు మెయికొనc జేర్తుర్. (భోజ 1 అ)
(vii) అ,యనకు నుశీనరతితిక్షులాత్మజులిరువుర్. (హరి 3-71)
(viii) బాచన్ననుజూచి పట్టపగలే వెఱతుర్. (అడిదము-చాటు)

ఈ ప్రయోగము లనుసరణీయములుకావు.

**43 ముత్తియేతరములం దిత్వలోపము (శబ్ద 49):-** (i) నేcడు కంటcబడు పాఠము కవిదో! లేఖకునిదో! పాఠకునిదో! పరిష్కర్తదో! ముద్రాపకునిదో! (బా.ర)

సమా:- ఎట్టిపాఠపరిశోధనమును జేయకయే యిట్లు సంశయములను బ్రకటించి సూత్రము నిర్మూలమనుకొనుట ధర్మముకాదు. అథర్వణకారికయే కొన్నియెడల ఇత్వలోపము నంగీకరించియుండcగా నిట్లు శంకలు లేవcదీయుటకుc గారణము సూరివచనమును నిలc బెట్టవలెనను నాగ్రహము తప్ప వేఱుకాదు. "సత్యము సర్వశ్రేయము. అది లేనిచో సర్వధర్మములు వ్యర్థములు" అని సూరి హెచ్చరిక.

(ii) "దివ్వియ నార్వు బ్రువ్వని యున్నను బాధలేదు...కల్లియములc బదిలంబుగాని-అని యున్నను నుండవచ్చును. ప., క్లైంబిడినారు పంకజదళేక్షలు..." (తత్త్వ)

సమా:- ఈధోరణి కేవలము సాహసము. "ఇయాంతత్వే కుత్రచిత్ స్యాత్" అను నథర్వణకారికచే ఇత్వలోపము సాధువగుచుండcగా ఇత్వలోపముగల పాఠములను దిద్దివేయవచ్చుననుట తత్త్వవైముఖ్యమునకు నిదర్శనము. "కల్లియములc బదిలంబు గాని గుల్లంబుల" అను తమ సవరణలో గణభంగమును గలదు. ఆక్షేపకులు చూచుకొనలేదు!!

**44 నామపునర్గ్రహణము (శబ్ద 76 సూ):-** "వెనుకటి సూత్రముననే వికల్పముగా నగునని విధించియుండిన నామపదమునకును బ్రయోగము సిద్ధించుచునే యుండును. అట్లయిన నీ సూత్రమును రచింప నక్కఱలేకయుండును...మొదటి పదమునే మరలగ్రహించుట సామాన్యముగానుండదు" (తత్త్వ)

సమా:- ఇట నామపునర్గ్రహణమున నదే నామము కాక దాని పర్యాయపదములు వచ్చుట విశేషము. కాన వెనుకటిసూత్రమున వికల్పపదమును వాడినచో సూత్రము వ్యర్థమనుట సరికాదు. వ్యాఖ్యాతలకుc బ్రయోగము నందలి విశేష మవగతము కాలేదనుటకు "మొదటి పదమునే మరల గ్రహించుట సామాన్యముగా నుండదు" అన్న వాక్యమువలనc దెలియుచున్నది. నామ పునర్గ్రహణమున నదేనామము ప్రయుక్తము కావలెను. అట్లు కానిచో దానిని బర్యాయ ప్రక్రమ భంగ దోషమని యాలంకారికు లందురు. "ఉదన్వచ్ఛిన్నభూః సచ నిధిరపాం యోజన శతమ్" అనుచో నామపునర్గ్రహణమున ఉదన్వచ్ఛబ్దమునే వాడవలసి యుండcగా నపాంనిధి శబ్దమును వాడుట పర్యాయ ప్రక్రమభంగ దోషము (వ్యక్తి) ఇట, సురవరులు...ఇట్టి

యాపదలుసేసిరో సురవరులు, సురవరుల కోపమునన యయ్యోనాకు-అను రీతి నుండవలెను అట్లుకాక వేల్పుశబ్దమును నమర శబ్దమును గ్రహింపఁబడుటచేఁ బర్యాయప్రక్రమ భంగముకలిగెను. ఇది వ్యాకరణమునకు విషయము కాదు. ఇట్లే, "అపుష్టార్థోనదోషః స్యాద్యదిచేతస్సుఖావహః" అనునథర్వణ కారియు నగ్రాహ్యము.

**45 ఆత్మార్థము నామాస్మదర్థాభిధాయియగుట (శబ్ద 78):** "వెనుకటి సూత్రమే యీ యుదాహరణములను సరిపెట్టుచున్నది. రుక్మాంగద చరిత్రోదాహరణ మున మాత్రము నస్మదర్థమునఁ దాశబ్దము కానఁబడుచున్నది. కాని యట్టివెచ్చటను గానరావు...ఇయ్యది యప్రమాణము" (తత్త్వ)

సమా:- (i) వెనుకటి సూత్రమే యుదాహరణములను సరిపెట్టుచున్నదనుట సరికాదు. ఏలయన వెనుకటి సూత్రము (77 సూ) నామ పునర్గ్రహణమునకు సంబంధించినది. ఇటఁ బునర్గ్రహణ ప్రసక్తిలేదు. కాన, తనకు మఱితాన చుట్టంబు తనతొంటి కర్మరాశికి-అను ప్రయోగములు వెనుకటి సూత్రముచే గతార్థములు కావు. వ్యాకర్త-కర్తలు దనకున్ గర్మములు-అను ప్రయోగమును 77వ సూత్రమునఁ జేర్చుట మాత్రము పొరపాటు. అది యీ 78వ, సూత్రమునఁ జేర్పఁదగును. (ii) రుక్మాంగద చరిత్రోదాహరణము కలదని చెప్పఁచు సూత్ర మనావశ్యకమనుట యసంగతము. అట్టి వెచ్చటను గానరావు-అనుట సరికాదు. తన తనుచ్ఛాయ మస్తకహీనమై తోఁచె-అను జైమిని భారతప్రయోగమును వ్యాకర్తచూపుచుండఁగా దానిని గమనింపక యొక్క రుక్మాంగదచరిత్ర ప్రయోగమే కలదనియు నట్టి వెచ్చటను లేవనుట యపరిశీలన మూలకము. సూత్రకర్త చూపిన లక్ష్యములనే సరిగాఁ బరిశీలింపని వారికి వేతే ప్రయోగములు కనఁబడక పోవుటలో వింతలేదు. ప్రయోగాంతరములు-భక్తితమకున్ శ్రీ వాద మింకేటికిన్ (కాలహ 4-38. తమకున్-మాకున్) వచ్చు నపాయంబు తన కవశ్యము. (జై. భా 8-66 తనకున్= నాకున్) తన్నుఁబోలంగ నిటులున్న వారె. (పండితా 1 భా-334 పు.) తన్నుం గృపంగావఁడే (భాగ.10. ఉ.199 తన్నున్=నన్నున్.) తక్కినమాటలు దనకింపవనుచు (బసవ 56 పు. ఆంధ్ర.) తనకు రోగంబులు (బసవ 61 పు.) తనకు నెప్పుడు సావుదప్పదు. (బసవ 62 పు. తనకున్=నాకున్.) ధారుణి యేలంగఁ దమకింకఁ బాసె. (బసవ. 126 పు.) పొరినిఁ బునర్ధారఁ బోయరే తమకు (బసవ 187 పు. తమకున్=మాకున్.) మాని యిటకు వచ్చినాఁడ మగువలుఁ దానున్-(వి.పు. 7-183. తానున్=నేనున్) కాఁగా నీసూత్రము త్యాజ్యమన్న వ్రాఁతయే త్యాజ్యము.

**46 తనతన-తమతమ (శబ్ద 79):-** "కర్తృ బహుత్వంబునఁ దనతనకుఁ దమతమయు నగు" అని సూత్రించి వ్యాకర్త "తమతమ పుత్రుఁడుగా" అను నన్నయ ప్రయోగము నిచ్చెను. "ఈ విధాన మేలకో తెలియదు. ఈకార్యము వైకల్పికమని సూత్రము చెప్పుచున్నది. వ్యవహారమున నిట్టిచోట బహువచనమే కాన్పించుచున్నది." (తత్త్వ) అన్నారు. అనఁగానీసూత్ర మనావశ్యకమన్నమాట.

సమా:- ప్రయోగ పరిజ్ఞానములేమిపై యాక్షేపణకుఁ గారణము. ప్రయోగములు

(i) తనతన మది నున్న తెలఁగుఁ దథ్యము సెప్పుఁడా-విరాట 1-65
(ii) తనతన వాహనములు-విరాట 4-89

(iii) అమ్ముమ్వురు, దనతన చిత్తమున నట్ల తలఁపఁగ–శల్య 2–180
(iv) అనవిని వారలందఱు...తనతనతెఱఁగు మెఱయ–భీష్మ 1–100.
(v) చెవియుఁ గన్ను దనతన యంతన్–శాంతి 6–84
(vi) తనతన వర్ణంబునకు–అను 5–13
(vii) తనతన ధర్మములు విడిచి–కాశీ 6–84

తానిత్యాములె (పండితా) అను ప్రయోగము సరికాదు. ఇతర సర్వనామములకు బహూత్వము నిత్యము.

ఉదా॥ మీమీ మదినున్న తెఱఁగు మేలుగఁ జెపుఁడా. (కల్పితము)

**47** నివర్ణమున కత్వము:- "ఎనిమిది నివర్ణంబున కత్వంబగు" (శబ్ద 101) అనుచో నిట్లాక్షేపించినారు. "ని" అను నంతకును నత్వమువచ్చునని తలంచినచో ననిష్ట రూపము రావలసి వచ్చును. కాన, సూత్రమున 'నివర్ణంబు నికారమునకు' అని యుండ వలయును" (తత్త్వ)

సమా:- అలోంత్యస్య–అను పాణినీయ పరిభాషచే "నివర్ణంబు న కత్వంబగు" అనుచో, నివర్ణములోని యిత్వమునకే 'అ'త్వమగును. కావున "నివర్ణంబు నికారమునకు అని యుండవలెననుట కేవల మపరిశీలనమూలక మనక తప్పదు.

**48** అయియును=అయ్యును:- "అయి+ఉను–సంధిలో యకార ద్విత్వము (అన్నిష్టసఖి వలె) అయ్య్+ఉను= అయ్యును. ఇచ్చట, అయి+యును–అని యున్నచో, అయియును–అనియే కావలసియున్నది. అయ్యున్–అని కాఁజాలదు" (తత్త్వ)

సమా:- అయ్యున్–అనునది ద్రుతద్విత్వము వంటిదనుట యపరిజ్ఞాన మూలకము. అయి+ఉను–అన్న పక్షమునందును యడాగమమువచ్చి–అయి+యును, అని నిల్వక తప్పదు. ఈపక్షమునందును, అయి+యును–అను పక్షమునందును, "అన్యేషాంచ ప్రయోగ మహితానామ్" అను చింతామణిచే ఇత్వలోపము కలిగి అయ్యున్–అను రూపమేర్పడును. కానఁ బైయాక్షేపణ సరికాదు.

**49** నూతిలో వెలువడ (కారక 11):- ప్రౌఢవ్యాకర్త "వలన కాదేశంబగు ద్వితీయా సప్తములమీఁది యుండికి లోపంబు బహుళంబుగా నగు" (కారక 11) అను సూత్రము నొద్ద–"నూతిలో, వెలువడఁ గోడలిందిగిచె (అది) అను నన్నయ ప్రయోగమును జూపెను. "లోన్ అనునది...షష్ఠీప్రత్యయము. అందుచే దీనిమీఁద నుండికిఁ బ్రాప్తియుఁ గానరాదు. ప్రౌఢవ్యాకర్త...సప్తమి యని భ్రాంతిపడి...ఉదాహరించెను" (తత్త్వ) అని వ్యాఖ్యాతలు వ్రాసినారు. ఇటఁ బ్రౌఢవ్యాకరణాశయము గమనింపక భ్రాంతిపడినారు వ్యాఖ్యాతలు. "లో. వి. లోను శబ్దముయొక్క సప్తమీ విభక్తియందు నాక్షరములోపింపఁగా మిగిలినరూపము. (నాలో నేమియుఁ గపటములేదు. ఇదిచోటు శబ్దమువంటిది.) శ.ర. కాఁగా లోనన్–అను లోను శబ్ద సప్తమ్యంత రూపమున 'న' అను నక్షరము లోపింపఁగా "లోన్" అను రూపము సిద్ధించునని వ్యాకర్త యాంతర్యము. అచ్చోటన్=అచ్చోన్; ఒకచోటన్=ఒకచోన్. ఇత్యాదులలో టాక్షరములోపించునట్లు, నూతిలోనన్=నూతిలోన్–అనుచో నాక్షరము లోపించెనని "ఇది చోటుశబ్దము వంటిది" అనుదానికిఁ దాత్పర్యము. కాఁగా, ప్రౌఢవ్యాకర్త పక్షమునఁ బ్రక్రియ నిట్లు చెప్పవలెను. నూతియొక్క+లోను (=అంతరము)=నూతిలోను. బా. కారక 9చే–నూతిలోను+వ

లన+వెలువడ. బా. కారక 10చే-నూతిలోను+వలన+ఉండి+వెలువడ. బా. కారక 11చే-నూతిలోను+ అందు+ఉండి+వెలువడ. బా. ఆచ్ఛిక 30చే-నూతిలోని+అందు+ఉండి+వెలువడ. ఆచ్ఛిక 38చే-నూతిలోని+అ+ఉండి+వెలువడ. తత్సమ 8-చే నూతిలోని+అ+ను+ఉండి+వెలువడ. బా. సంధి 11-చే నూతిలోనను+ఉండి+వెలువడ. ఇట లోనను-అను దానియందలి "అను" అనునది సప్తమీ ప్రత్యయ మనిపించుకొనును. (ఇది, అక్కడన్, ఊరన్-ఇత్యాదుల వంటిది.) ఈ "లోనను" అను దానిలో 'న' అను నక్షరము లోపించిన, "లోను" అను రూపము మిగులును. "ఏకదేశ వికృత మనన్యవత్" అను పరిభాషచే, (పరిభా) నాక్షరము లోపింపఁగా మిగిలిన 'లోను' శబ్దము, 'లోనను' వంటిదే యగును. కనుక, నూతిలోను+ఉండి-అనుచో, 'లోను' అనునది వలన కాదేశమగు సప్తమి యగును. పై ప్రౌఢ 11చే-ఉండి, లోపించి-నూతిలోను+వెలువడ-అని నిలుచును. బా. సంధి 18చే-ద్రుతలోపము నూతిలో వెలువడ.

ప్రౌఢవ్యాకర్త మతమున నావయవిక నకారము ద్రుతము కాకుండుటచే నిట్టి క్లిష్టకల్పన మావశ్యక మయ్యెను. (లోనను-అనుదానిలో 'న' అను నక్షరము లోపించిన, లోను శబ్దముతో లోను+పడు=లోఁబడు- వంటి రూపములును సాధింప నగును) కాని యీప్రక్రియ నన్నయ సమ్మతముకాదు.

**నన్నయమతమునఁ బ్రక్రియ:-** నూతిలోను+వలన+వెలువడ-అనుచో "అన్యస్యాః క్వచిద్భవేచ్చాన్యా" అను చింతామణిచే (అం. చిం. హలం 15 కా; బా. కారక 21) వలనకు ద్వితీయ: నూతిలోను+ను+వెలువడ. "తస్యాః ప్రథమాచ జడపదానాం స్యాత్" (అం. చిం, అజం 15 కా; బా. కారక 24) అను సూత్రముచే ద్వితీయకుఁ బ్రథమ=నూతిలోను+వెలువడ. కవిభల్లభైః క్రియాణాం నామ్నాంచోల్లోప ఇష్యతే హ్యేషు" ఇత్యాది చింతామణి సూత్రముచే, లోను-శబ్దమున, ఉత్వము లోపించును. నూతిలోన్+వెలువడ. ద్రుతాఖ్యోనః-అను చింతామణిచే నిందలి నకారము ద్రుతమగును. "ఉగ్వాద్రుతప్రకృతికాత్ పరతః, సరళే స్థిరేచ నస్య స్యాత్" అను చింతామణిచే ద్రుతలోపము. నూతిలో వెలువడ. దీనికిఁ బ్రయోగాంతరములు,-"నీరిలో,ను వెడలఁ గూర్మ మతనుస్థితి" (అను 1-232) "కూ, ర్మ ముమ్మ గడంగి, నీర్వెడలి" (అను 1-233) ఇట ద్వితీయకుఁ బ్రథమ రాకుండుటయుఁ గలదు. చేదినం, దను తనువున్ బృహద్రుధిరధారలు బోరన మీఁది కొల్కఁగన్". సభా 2-68. తనువు+వలన+ఒల్కఁగన్=తనువున్...ఒల్కఁగన్-అని ద్వితీయాంతము నిల్చెను. "మృత్యువున్, గావంగోరు బహుప్రకారముల లోకంబు" (నిర్వ 3.69) మృత్యువు+వలన+కావన్= మృత్యువున్+కావన్-అయినది. ఇట్లు గ్రహింపక యీ ప్రయోగములలో "ఉంచి" శబ్ద మధ్యాహార్యమను బా. ఉద్యోతము, ప్రాచీన కవి ప్రయోగ విరుద్ధము. కాగా, వలనకు ద్వితీయయు, నాద్వితీయకుఁ గొన్నిచోట్లఁ బ్రథమయుఁ గలుగునని సారాంశము. నూతిలో వెలువడ-అను ప్రయోగమునందలి లోనుశబ్దము వలన కాదేశమగు ద్వితీయకయిన ప్రథమాంత రూపమని నన్నయ యాశయము.

**50 అజడము తృతీయకు నవర్ణకము (కారక 17):-** అజడము తృతీయకు

నవర్ణకమగుటకు–ఏనుఁగున నేనుఁగు వైచుచు వాజి వాజిచే రూపడఁగంగ మోదుచును, అను ప్రయోగము చూపఁబడెను. "ఏనుఁగుల నేన్గుల వైచుచు–అనియె గ్రంథకృత్పఠియుక్త మన్నను క్షతిలేదుగాన నీప్రయోగము సమర్థముకాదు." (వ్యా. సం. స.)

సమా:- ఏనుఁగుల నేన్గుల వైచుచు–వంటి పాఠము కనఁబడదు. వాజి వాజిచే–అనుదానినిబట్టి యేనుఁగున నేనుఁగు–అను నేకవచనమే గ్రంథకృత్పఠియుక్త మనఁదగును.

**51 అజడముతృతీయకుద్వితీయ (కారక 18):-** ఈ సూత్రము నొద్ద వ్యాకర్త యజడము తృతీయకు ద్వితీయ యగుటకు–అతని దోర్మధ్యసరసి నోలాడుచున్న ఘనతర స్తన చక్రవాకముల నలరు నంబను" అను ప్రయోగమును జూపెను. ఇది సరికాదని యిట్లు విమర్శింతురు.

(i) స్తనములందుఁ జక్రవాకత్వ మారోపిత మగుటంజేసి చక్రవాక నిష్ఠమగు నజడత్వమున కిటఁ బ్రసక్తి యంతగా లేమిని స్తనధర్మము ననుసరించి చక్రవాకములను గూడ జడములుగఁ దలంపనగుం గాన నిది యంతగా నీవిధి కుదాహరణముగాఁ జాలదేమో! యని తోఁచెడి" (బా. సా. పే.)

సమా:- "స్తనములందుఁ జక్రవాకత్వము నారోపించుటచేఁ జక్రవాకముల నజడములుగా భావింపనగుననుట కేవలము పొరపాటు. ఇట్లయిన నిఁక ముఖచంద్రుఁడనుచోఁ జంద్రుఁడును జడవాచకమె యగును గాన ముఖ చంద్రము–అనవలసినదేనా" (వ్యా. సం. స.)

(ii) ఇచట నంబను వర్ణించుచున్నాఁడు. కావున నంబకన్వయించు తీరున స్తనములకుఁ బ్రాధాన్యము కలుగునట్లు ఉపమిత సమాసమునే చెప్పి చక్రవాకముల వంటి స్తనములతో నలరుచున్న అని యన్వయించుటయే యుచితము. అప్పుడు స్తనశబ్దార్థమునకే ప్రాధాన్యము గల్గును. కావున నయ్యవి జడములే కనుక తృతీయా స్థానమున ద్వితీయ వచ్చుట బాలవ్యాకరణము చేతనే సిద్ధించును." (తత్త్వ) అనఁగాఁ దృతీయస్థానమున ద్వితీయను వ్యాకర్తవిధించుట సరికాదని తాత్పర్యము.

సమా:- స్తనచక్రవాకములన్నది రూపకమన్నను నుపమితమన్నను దృతీయ నిర్చినది యజడమగు చక్రవాక శబ్దముమీఁదనే కాని జడమగు స్తనశబ్దము మీఁదఁ గాదు. కాన నజడము తృతీయకు ద్వితీయ యగుట కిది లక్ష్యమనక తప్పదు. దీనికిఁ బ్రయోగాంతరము–"అగ్ని కాష్ఠముల మహాంబుధి యేఱుల, నంతకుండు భూతసంతతులను, వనజముఖులు పురుషులను దృప్తిఁబొందుట, గలుగదంద్రు గోవిదులు మహాత్మ" (అను 2–175) ఇట, పురుషులను=పురుషులచేత నని యర్థము, కాఁగా నజడము తృతీయకును ద్వితీయ యగును.

**52 అజడము ద్వితీయకుఁ బ్రథమ (కారక 19):-** ఈ సూత్రమునొద్ద వ్యాకర్త– అమ్మదనాగమెదిర్చి, వారణేంద్ర మక్కురుకుల వీరుమీఁద నెసకొల్పిన, క్రతుహయోత్తమ మొక్కెడ. అను ప్రయోగముల నుదాహరించెను. "అమ్మదనాగ మెదుర్ప...గ్రంథకృత్పఠియుక్తపాఠమన్నచో క్షతికానరాదు...తనవారణేంద్రునక్కురుకుల వీరుమీఁద...ఇట్టిపాఠమె వావిళ్ల వారిముద్రణమునఁ గన్పట్టుచున్నది. క్రతుహయోత్తము

నొక్కెడ...పాఠమనుటలో బాధచూపట్టదు.. .పైరీతిని మార్పరాని ప్రమాణాంతరము దీని నిర్వహించుటకుఁ గన్పట్టలేదు. (వ్యా. సం. స.) మదనాగముఁ ద్రిప్పి-అను పాఠముగలదు. (సం శో) మదనాగమెదుర్ప అను సవరణ ప్రకరణ విరుద్ధము.

**53 విభక్తివిపరిణామము (కారక 26):-** "కర్తృకర్మాధికరణ సంప్రదానా పాదానములలోఁ బరవిభక్తి బాధితమై పూర్వపూర్వ విభక్తులునిల్చును. గంగను గూర్చియేగిస్నానముంజేసెను-అనుచో, గంగయందనెడియధికరణము బాధితమయ్యె... ఇట్టి యుక్తమార్గమును గ్రహింపక ప్రౌఢవ్యాకర్త కొన్నియెడల విభక్తి విపరిణామంబు గ్రాహ్యంబు...అని సూత్రించి యుదాహరించెను. ఇది సరికాదు. తెల్గున విభక్తి విపరిణామాన్వయమే, సమ్మతముకాదు." (బా. ఉద్యో 230 పు)

**సమా:-** (i) గంగను గూర్చియేగి స్నానమును జేసెను-అనుచో నధికరణము బాధితమయ్యెననుట యసంగతము. ఉద్దేశార్థక ద్వితీయ, యధికరణ కారకముగా విపరిణామము నందెనన్ననే వాక్యాన్వయము సరిపడును. పరవిభక్తి బాధితమై పూర్వవిభక్తి నిల్చుననుటకు శాస్త్రప్రామాణ్యమును లేదు. ప్రయోగాంతరములు:- "బహుధాన్యములు చేలఁబడియొరగ" (పాండు 5-216) చేలన్=చేలయందు, బహుధాన్యములుచేల పండి, ఒరగన్=చేలు-ఒరగఁగా-అని యర్థము. సప్తమి, ప్రథమగా విపరిణామమునందెను. "ముట్టికందముల్ వడిఁగత్తిపెట్టి పెట్టి (హరి. పూ 6-165) కందముల్=కందములను, ముట్టి, వడిన్, కత్తిపెట్టిపెట్టి=కందములందుఁ గత్తిపెట్టిపెట్టి-అని యన్వయము. ద్వితీయార్థక ప్రథమ సప్తమిగా విపరిణామము నందెను. విభక్తి విపరిణామము గ్రాహ్యము కాదనుట శాస్త్రవిరుద్ధము; ప్రయోగ విరుద్ధము.

**54 షష్ఠిలో నగాగమము (సమాస 1):-** ఎలజవ్వనంబున విలసనంబు-లోనగు ప్రయోగములను జూపి వ్యాకర్త షష్ఠిలో నగాగమము విభాషనగునని సూత్రించెను. "ఈ సూత్రముచే (=సమాస 37 సూత్రముచే) గతార్థమగుటంజేసి...సమాస 1 సూత్రము అనావశ్యకము." (తత్త్వ).

**సమా:-** సూత్రము నెట్లయిన ననావశ్యక మనవలెనన్న చింతయే కాని వ్యాఖ్యాతలకుఁ గవి హృదయముతోఁ బనిలేదు. సప్తమీ తత్పురుష పక్షమున, ఎలజవ్వనంబునందలి విలసనంబు, యోగక్షేమంబునందలి తెఱఁగు, అరదంబునందలి యురవడికిన్-అను రూపములు పాక్షికముగ నేర్పడవలసియుండును. ఇట నూత్న యౌవన విలాసము, యోగక్షేమవిధము, రథవేగము నన్నవే వివక్షితార్థములు. ఇందులకుఁ బ్రయోగాంతరములు-(1) ఇమ్మహనీయ రూపమున యేడ్తెఱఁ గన్గొని-విరాట 1-226 (రూపాతిశయము.) చెల్వమున యేడ్తెఱ-విరాట 1-295 (=సౌందర్యాతిశయము.) శిరంబుగ్రిందుగ నజస్రము వ్రేలఁ గలాఁడవీ భవం,బున తుది-శాంతి 3-348 (=జన్మాంతము) కడుపుశోకమున పెంపు-స్త్రీ 2-34(=గర్భశోకాతిశయము.) ఔత్సుక్యంబున కలిమి-విరాట 1-45 మలీమసవృత్తంబున పొంతఁ బోవడెన్నఁడు-విరాట 1-106. ఇవ్విధమున చెలువు-విరాట 2-43.

**55 కూడుగుడ్డ (సమాస 30):-** "సమాహారము వివక్షితమగునపుడు కూడుగుడ్డని యేకవచనాంతముగా నుండుననియు...సిద్ధించుచుండఁగా నీసూత్రమనావశ్యకము." (తత్త్వ)

**సమా:-** ఇది కేవల మనాలోచితమయిన యాక్షేపణ. కూడుగుడ్డ-వంటివి

సంస్కృత లక్షణానుసారముగ సమాహార ద్వంద్వములు కానేరవు. "కాలుసేయాడు తలిఁయంద కదలవలయు" (కాశీ 3-81) అనుచో, కాలుసేయి-సమాహార ద్వంద్వమగును. "ద్వంద్వశ్చ ప్రాణి తూర్య సేనాంగానామ్. (2-4-2) ఏషాం ద్వంద్వ ఏకవత్ స్యాత్. పాణిపాదమ్..." (సి. కౌ. 906) అను సంస్కృత లక్షణమున కిది లక్ష్యమగును. కాన నిట సమాహార వివక్షచే నేకవచనము సిద్ధించును. కూడుగుడ్డ, కూడుసీర-ఇత్యాదులం దేకత్వము సంస్కృత లక్షణమునకు విషయము కాదు. కావుననే యథర్వణాచార్యులు "అన్యత్రాపి క్వచిద్భవేత్" అని వక్కాణించి యున్నారు. ఈ విషయము నహోబలపండితుఁడిట్లు వివరించి యున్నాఁడు "అన్యత్రాపి క్వచిద్భవే దిత్యనేన, కాలుసేయి-ఇత్యాదానేకత్వమితి జ్ఞేయమ్. వస్తుతస్తు ప్రాణ్యంగత్వేనై వాత్రైకత్వం సిద్ధమ్. సూత్రారంభేణతు తనకూడు సీరకై కాంచన మడిగి, ఇత్యాదయ స్తిక్కయజ్వాది కవి ప్రయోగా స్సాధవః." (అహో 517 పు.) కాఁగా వ్యాఖ్యాతల యాక్షేపణ సరికాదు.

**56** ఆఁదోఁక (సమాస 36):- "ఆఁదో కేత్యాదులం దీకార్యములు నిత్యములని వ్యాకర్త వివరణమునఁ జెప్పెను. కాని ఆవుతోఁక అనియును వ్యవహారమున నున్నది." (తత్త్వ) అనఁగా ఆఁదోఁకకుఁ బర్యాయపదముగ ఆవుతోఁ నంగీకరించి యీవిధిని వైకల్పికమనవలె నన్నమాట.

సమా:- ఆఁదోఁక యనఁగా ఆవు తోఁక కాదు. కాన నిట వర్ణలోపాదులు నిత్యములే కాని వైకల్పికములు కావు. (చూ. సమాస 36-ఘంటాపథము)

**57** వాక్యాంతర కర్తకు క్త్వార్థక కర్తలలో నొకటి కర్తయగుట (వాక్య 16):- ఈ సూత్రమునొద్ద చూపిన లక్ష్యములనుగూర్చి యిట్లు విమర్శింతురు. "ఇట్టి ప్రయోగములు (ఆహవసన్నద్ధులయి...ఇత్యాదికము.) ప్రామాదికము లనుటయే యుచితము. ధవళాక్షుల్...అనుచోట కని అనుపదములోనికి కద్రువయే కర్త్రియని భావింపవలయును. దేవలోకంబున...కలింగని-ఇట కలింగనన్-అనియే సాధుపాఠమయి యుండును. మార్కండేయ పురాణప్రయోగము గూడ సరికాదని పాఠాంతరము (ఉగ్రకోపనులయిరా నికుంభుఁ డతిభైరవ) ఉండుటం బట్టియే యూహింపవచ్చును" (తత్త్వ)

సమా:- బాహవసన్నద్ధులయి-ఇత్యాది జైమిని భారత ప్రయోగమును అమాదికమ నుట సరియేకాని, ధవళాక్షుల్ సనికాంచిరి...కని కద్రువ-అనుచో, వ్యాకర్తచేసిన యర్థమే సందర్భోచితమై యున్నది. ప్రయోగవిశేషనిర్మూలనకై యర్థాంతరకల్పన యనుచితము. దేవలోకంబున కరుగువా రెదుర ద్వాపరంబుతో వచ్చు కలింగని శక్రుండిదియేమి-అనుచో కలింగన-అను దిద్దుపాటు సాహసము. దేవలోకంబునకరుగు వారిలో శక్రుఁడు గూడ నొకఁడన్న యాలోచనలేక చేసిన సవరణమిది. మార్కండేయపురాణమునఁ బాఠాంతరము, కవిపాఠము సరికాదన్న భ్రాంతిచేఁ గల్పితమైనదై యుండును. కానఁ బాఠాంతరము గ్రాహ్యము కానేరదు. ఈ సూత్రమునకు బ్రయోగాంతరము-"అయ్యి ద్దఱుఁ జేరనరిగి...ప్రణామంబు లాచరించి కృష్ణుండు ప్రాంజలియై యతని కిట్లనియె" (హరి. ఉ. భా. 1-34. అయిద్దఱిలో నొకఁడగు కృష్ణుఁడిట్లనియెనని యర్థము)" వ్యా.సం. స. కాఁగా వ్యాఖ్యాతల ధోరణి సరికాదనుట స్పష్టము.

# (III) కతిపయ విశేషాంశముల వివరణము [58-138 విషయములు]

**58 క్షవర్ణము:-** (i) (సంజ్ఞ) క్షవర్ణము సంస్కృత వ్యాకరణమునందు షాంతధాతువులమధ్యఁ బఠింపఁబడెను. "భిక్ష...ఈక్ష...ఈష...వర్ష" (సి. కౌ. భ్వాది) సంస్కృత నిఘంటువులందు షాంతపదమధ్యమున క్షవర్ణము పఠింపఁబడెను. "సురమత్స్యావనిమిషౌ... పక్షస్సహాయే పృష్ణీషశ్శిరోవేష్ట కిరీటయోః...ఇతిషాంతాః" (అమ.) ఇట, అనిమిష–పక్ష–ఉష్ణీష, ఇత్యాదిగా . క్షాంతములు షాంతముల మధ్యఁ గలవు. "భ్రాష్ట్రేయుధ్యంబరీషం...కక్షస్తు దోర్మూలే శుష్కకాననే... ఘోషః శబ్దాభీర నివాసయోః..." ఇతిషాంతాః (త్రి.వి.) ఇట అంబరీష–కక్ష–ఘోష, ఇత్యాదిగా, క్షాంతములు షాంతముల మధ్యఁగలవు. విశ్వకోశాదులలో క్షాంతములు వేఱుగాఁ బఠింపఁబడియున్నను, క్షాంతములు, షాంతములుగనే గుర్తింపఁబడెను. "షాంతాః స్యుర్యద్యపి క్షాంతాః" విశ్వ. (ii) క్షకారము షాంతపద మధ్యమునందుఁ బేర్కొనఁబడెనని ప్రౌఢవ్యాకర్త వ్రాసెను. కాని ధాతువులు పదములు కాకుండుటచే షాంతపదమధ్యమున ననుట ధాతువుల విషయమున సరిపడదు. (iii) క్షకారము–అనుచో 'కార' ప్రత్యయము వర్ణసంఘాత నిర్దేశమున వాడుట సరికాదు.

**59 చజలు (5 సూ):-** పాండురాజీవ రమాధుర్య (రాఘవ 3–6) పాండురాజు+ఈ+వర+మాధుర్య–అని భారతార్థమునఁ బదచ్ఛేదము. పాండు+రాజీవ+రమాధుర్య–రామాయణార్థమునఁ బదచ్ఛేదము. కాని పాండురాజు శబ్దమునందలి జకారము తాలవ్యమే యన్నది సిద్ధాంతమగుటచే నీ ప్రయోగమును బ్రకృతమున కుపకరింపదు.

**60 కోటకుండలు (సంజ్ఞ 11):** ఇవి సంస్కృతసమములుగా నిర్దిష్టములయ్యె ననువ్యాఖ్య (తత్త్వ) సరికాదు. కలిగిన దందురేని–అనుటచే నివి తద్భవములుగ నిర్దిష్టములయ్యెననుట స్పష్టము, ఇవి, "శ.ర" లోఁ దద్భవములుగానే నిర్దిష్టములు.

**61 సంస్కృత వాక్యము లనుకరణ విరహితము లగుట (14–16):-** (i) "అను కారేచ సర్వేషాం దోషాణాం నైవ దోషతా" (సా.ద.) (ii) జయపూతనా ఘాత–లోనగునవి సంస్కృతవాక్యములనియు నివి 15వ సూత్రమునకు లక్ష్యములనియు నొక వ్యాఖ్యలోఁ గలదు. (తత్త్వ) అది యవిచారమూలకము. జయనారాయణ పుండరీక నయనా (ఉ. హ 6–20) అనుచో, పుండరీక నయనా– అనుసంబోధన సంస్కృతముకానేరదు. ప్రయోగాంతరము–నమోవిశ్వస్రుజే (ఉ.హ. 1–94) ఇది 15వ, సూత్రమునకు లక్ష్యమగును.

## సంధి పరిచ్ఛేదము

**62 గసడదవాదేశము సంధి (6):-** తిక్కన నిర్వచనోత్తరరామాయణమునందును గసడదవాదేశమును నియమబద్ధముగనే వాడెను. ఇందుకుఁ బ్రాసగత ప్రయోగములు:– (i) ఉర్వీవలయం, బుదనకు (1–25) శ్రీ వెంపారుట (4–26) పెం, పుగనుట. (4–28) మీ,రుగనిన (5–134) మో,పుగొనుచు (5–134) చేయున, దిగలదె (5–139) వంశాధముం, డుగరంబు (6–16) తా, నుదొలఁగి (6–130) త,

ప్రాదలంప (7–67) బాష్పవా,రిగడలు కొన్ని (8–112) (ii) ఇ,ట్లుదపంబు (5–8) (iii) వే తురగంబులన్ (6–114) వేకొనిపోయి (9–15) ఓ, హోకృపమాలి (9–9) (iv) లేదుగదా (6–16)–(v) ఎక్కి కడున్ (5–35) అగ్గలం, బైతగు (3–75) సమగ్రుఁడనైచేసెద (6–23) నివాసం, బైపాలించెను. (8–81) (vi) రాజ్య, శ్రీ పెంపు (8–81) ఆకోమలి (9–46) నియమములకు (వ్యా.సం.స. 258–275 పు)

**63** నాఁడు-నాడు (15 సూ.):- "నాడు–ప్రామాణిక ప్రయోగము లందిది నిర్బిందువుగాను గానంబడియెడి...మఱియు, చూ. రెన్నాళ్లు, మూన్నాళ్లు. మొ॥–శ.ర. ఈయాశయము సరికాదు. కాలవాచకమగు నాఁడుశబ్దము సబిందుకమే. వీఁడు పుట్టిన పదియవనాఁడు వెలుచ" (అది) అని నన్నయప్రయోగము. కాన, పదపడి రెన్నాండ్లు–అనియే నన్నయపాఠము. నాళ్లు–అర్వాచీన కవి సమ్మతము. చూ.ము.కా. అచ్చిక 9.

**64** మికారము (16 సూ.): (i) ఇట "యికారము" అనునది ముద్రణస్ఖాలిత్యము. మికారము– అన్నదే సాధుపాఠము. వర్ణసంఘాత నిర్దేశమున "కార" ప్రత్యయము వాడుట సరికాదు. (ii) ఏమి+రా=ఏరా. (పాండు 3–33.) ఏమిరా (ద్రోణ 4–288)

**65** నిగాగమ స్వర లోపము (17 సూ):- ప్రయోగాంతరములు–అయ్యువిద పల్కుల్యంటి–పాండు 1–29. ఊ, రులు నిజమింత కోమలి మరుం బ్రసవాస్త్రహతిం జలింపదే (కు.సం. 5–133 వ్రాఁతప్రతిపాఠము.) మరునియొక్క+ప్రసవాస్త్రహతిన్–అని ఛేదము.

"తూలె రజనీచర భాస్కర బింబముల్ రుచుల్" అని వ్యాకర్త యుదాహరించెను. ఇది సరియగు లక్ష్యముకాదు. "హరిత్కరీంద్రముల్ నెప్పఱికూలి తూలె; రజనీచర భాస్కర బింబముల్ రుచుల్ దప్పె; సమస్త తారక వితానము రాలె నరాళభంగులన్" (రామా) అని పద్యాన్వయము. బింబముల్–లడాగమాంతము కాదు. ప్రథమాంతమే.

**66** ముగాగమము (19) సూ:- సూత్రమున 'ముగాగమంబగు' అని కలదు. ముగాగమ మనుచో ఉకార ముచ్చారణార్థక మనఁదగును. లేనిచో, కనకనము+అని–ఉత్వ సంధిచే; కనకమను–అయ్యెనని చెప్పవలసియుండును. ఇది ప్రక్రియా గౌరవము కానమకారమునే యాగమము చేయఁదగును.

## శబ్ద పరిచ్ఛేదము

**67** మహత్సమూహార్థక విశేషణ క్రియలు (17 సూ.):- "మహత్సమూహార్థక శబ్దం బమహత్కార్య, యుక్తంబయ్యుఁ దద్విశేషణ క్రియలు మహత్కార్య యోగ్యంబులు విభాషనగు." అను సూత్రమునొద్దఁ జూపిన ప్రయోగముల విషయమునఁ గ్రింది విశేషములు గుర్తింపవచ్చును.

(i) నిషాదగణము...విషమమును జేయు, వారిన్, అనుచో సర్వనామమునకు మహత్కార్యమయినది. (ii) సమూహార్థకము లేక వచనాంతములయ్యు బహుత్వ బోధకము లగును గావున, విద్యాధరీ కోటి–అనుచో, బా. అచ్చిక 26చే–మహత్కార్యము కావచ్చునని చెప్పనగును. (iii) మహతీ సమూహార్థకముల క్రియలకు మహత్కార్యము లగును గాని విశేషణములకు మహత్కార్యములు కావు. మోహన రూపము విద్యాధరీ

కోటి-అనురీతిని బ్రయోగింప రాదన్నమాట (iv) గీర్వాణగణంబు-అను సమూహార్థక మేకవచనాంతముగ నున్నను నిది బహుత్వబోధకమే యగుటచే, విశేషణములు, అఖండ పరాక్రములు, కడు నుద్ధతులు, అని బహువచనాంతములయినవి.

**68** నగాగమము రామి (19 సూ):- ఇటఁ గవిత్రయేతర ప్రయోగము లనఁగా భారతప్రయోగములని తాత్పర్యము. ఏలయనఁ గవిత్రయమువారు కలిసి వ్రాసిన గ్రంథము భారతము మాత్రమే. కావున, పద్మజుకైనఁ బాడియే (నృసింహ 2-28) అను ప్రయోగముండుట విరుద్ధము కాదు. కాని యిట్టివి యనుసరణీయములు కావు.

**69** అందుపరమగుచో నగాగమము (21 సూ.):- ఈ లక్షణ విశేషమును దిమ్మకవి తెలిపి లక్ష్యములు చూపియున్నాఁడు. (సర్వల 1-389 ప.) సూరకవియు నీ లక్షణ విశేషమును దెలిపియున్నాఁడు. (కవిసం 1తరం-94-97)

**70** మల్లులు-మల్లురు (శబ్ద 23):- "మల్లులను శబ్దమునకున్, మల్లులు మల్లురని కృతుల మానుగఁబలుకం, జెల్లును" (సర్వల 1-260) తిక్కన ప్రయోగము, రామాభ్యుదయ ప్రయోగమునిటఁ జూపఁబడెను.

**71** వర్గువు, వర్గు (శబ్ద 25):- మానవ వర్గువు (అం. 81) నానార్థవర్గువు (సాం. ని. 99ప) ఇదిదేవవర్గుదీనిన్ (సాం. ని 42) ఈతిర్యగ్వర్గుజగము లెన్నఁగ (సాం. ని. 84) ఉత్వవువర్ణకము లేక యోగనిర్దిష్టములు. "ఏకయోగనిర్దిష్టానాం సహవా ప్రవృత్తిః సహవానివృత్తిః" (పరిభా)

**72** ఉప్పాలు (శబ్ద 30):- ఉప్పాలుదెత్తురే...ఉప్పనఁబట్టెలాడు నెడ నుప్పాలు దెత్తురుగాక యాదవుల్ (ఉ.హ 4-155)

**73** నలుపులు-తెలుపులు (శబ్ద 33):- తెలుపులగు చీరలును (విరాట 5-315) ఇటఁ దెలుపులను విశేషణము విశేష్యమునకు ముందు వాడఁబడెను. "కలయ జగములఁగల యట్టి నలుపులెల్లఁ, దెలుపులుగఁజేసి" (మను 3-27-సమాస 41) నలుపులు, తెలుపులు- విశేష్య లక్షకములు.

**74** బిల్లగోడు-మొ॥ (శబ్ద 38):- "ఒకానొక కవియిందు గొన్నిటి నేకవచ నాంతములుగాఁ బఠించి యున్నాఁడు. అది విచార్యము." అనివ్యాకర్త వ్రాసెను. ఈ సూత్రమునకు-అచ్చనగాయలు, ఓమనగుంటలు, కనుమూసి గంతలు, గుజ్జెనగూళ్లు, బొమ్మపెండ్లిండ్లు, ఉప్పనఁబట్టెలు, కుప్పిగంతులు, గొబ్బిళ్లు, దాఁగిలిమ్రుచ్చులు, పుట్టచెండ్లు, బిల్లగోళ్లు, సరిబేసులు-అనునవి యుదాహరణములుగా నీయఁబడెను. కాన వీనిలోఁ గొన్ని యేకవచనాంతములుగా నొకానొక కవి ప్రయోగించి యుండవలెను. ఆ 'ఒకానొకకవి' ఎవరు? అన్నది ప్రశ్న. ఈరూపములలో నొకటగు బిళ్లగోళ్లు-అను రూపము నొద్ద "ఇదిబిల్లగోడని ఏకవచనాంతముగాను గానఁబడుచున్నది." అని, శ.ర. లోఁగలదు. పిల్లదీవి, అలంకి-అను శబ్దములయొక్క, శ.ర.లో "పిల్లదీవాలంకి బిల్లగోడు (కాళహ 3 అ) అను కాళహాస్తి మాహాత్మ్యప్రయోగము చూపఁబడెను. కాన బిల్లగోడు-అను ధూర్జటి ప్రయోగముచే శ.ర.కర్త యిటఁ బ్రౌఢవ్యాకరణమున సూచించెననుట స్పష్టము. కాఁగా ధూర్జటి ప్రయోగించిన బిల్లగోడు శబ్దమును బ్రౌఢవ్యాకర్త విచార్యమనెను. కారణమేమనఁగా అచ్చనగాయలు లోనగు కొన్ని క్రీడావాచకములు బహువచనాంతములే కావలెనని వ్యాకర్త యభిప్రాయము. కొన్ని

యేకవచనాంతములు కావచ్చును. తన్నుబిల్ల, చిడుగుడు, ఉప్పలపోటి, చెండు, చిట్లపొ ట్లాకాయ, కుందెనగుడి-అను నేకవచనాంతములను జూపి వ్యాకర్త, శ.ర.లో ధూర్జటి ప్రయోగములనే యుదాహరించెను. దీనినిబట్టి క్రీడావాచకము లేకవచనాంతములు గాని, బహువచనాంతములుగాని కావలెననియు నుభయములు కారాదనియు వ్యాకర్త యభిప్రాయమని తెలియుచున్నది. ఓ,మనగుంటల్ కనుమూసి గంత నలుగంబాలాట లోనైన ఖే,లనముల్-కళా 6-202. ఇట కనుమూసిగంత-అని యేకవచనము ప్రయుక్తము. ఈపాఠము చిన్నయసూరి నిఘంటువునందును, సూర్యరాయ నిఘం టువు నందును గలదు. శ.ర.లో కనుమూసిగంతలును గంబాలాట-అను పాఠముతో నిది యుదాహరింపఁబడెను. పాటించెఁగం బాలయూట (పాండు 3-47) బొమ్మ పెండిలి-అను నేకవచనాంతము సమాసమునఁ బ్రయోగదృష్టము. బొమ్మ పెండిలిపాటఁ బ్రొద్దుపుచ్చు నెలుంగు-హర 4-11 బొమ్మపెండ్లిండ్లు-అను రూపము పొరపాటు. పెండిలి శబ్ద బహువచనము-పెండిండ్లు. "పెండిలి, పెండిండ్లు-అనౌపవిభక్తికత్వేప్యత్ర ప్రవృత్తిః" (అహో 398 పు.)

**75** గారు (89 సూ.):- (i) "గారు. దే. అప. పూజ్యత్వమును దెలుపునది. (అయ్యగారు, అమ్మగారు-శ.ర.) (ii) ఏకత్వంబున-అని కాక యేకవచనాంతంబులగు దేశ్య శబ్దంబుల కడపల-అన్నచో నసందిగ్ధముగ నుండును. (iii) మహారాజులుంగారు-వంటివి కావ్యములలో లేవు. కావున నేకవచనాంతముల మీఁద 'గారు' చేరు ననుటలో క్షతిలేదు.

**76** ద్వితీయాదులందు (40 సూ.):- ద్వితీయాదులందు-అన్నది సప్తమీ నిర్దిష్ట కార్యము. "తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య" (సి. కౌ. 40 సూ.) సప్తమీ నిర్దిష్టమగు కార్య మవ్యవహితమగు పూర్వమున కగునని యర్థము.

**77** వారు (42 సూ.):- అమ్మ లోనగు శబ్దములకే పూజ్యార్థాదులు గలవు. కాన అమ్మవారు- ఇత్యాదులందలి వారుశబ్దము ద్యోతకము. దేవరపంపఁగాఁ జని (ఉద్యో 2-3) అనుచో దేవరశబ్దమునకే పూజ్యార్థము గలదు. కాన, దేవరవారు-అనుచో, వారుశబ్దమును ద్యోతకమే. (భారతి. జులై 1964 వెం. సూ)

**78** సంబంధమున యుష్మదస్మచ్ఛబ్దముల కేకవచనము (46):- నాతమ్ముండు ఘనుండు మల్ల రథినీ నాథుండు. (హరి. పూ. 1....) నాయిల్ల యిల్లుగా నతిశయిల్లి (విరాట 2-216) నాతండ్రి (ఉ.హ. 6-80)

**79** నీవెవ్వరు (47):- ముద్రణములలో "నీవెవ్వరు" అనునది లోపించినది. కాన జేర్చఁబడెను.

**80** చూపఱులు (శబ్ద 48):- విరాట 1-82

**81** దేవళ్ళు, ఎడ్లు (50):- నట్టింట దేవళ్ల పెట్టెఁ బెట్టిన తిన్నె-శుక 3-50-సూ.ని. చిన్నచిన్న ఊళ్లు చిల్లరదేవళ్లు-శ్రీనా. చాటువు. దేవళ్లటెంకుల-య. 3-35, ఎడ్లను-అను 4-318.

**82** ఏప్రహస్వంబగు (55):- ఏప్రహస్వంబగు-అన్నది బాలవ్యాకరణానువాదము. (బా. సమాస 13 సూ.)

**83 నలుగాలివాన (62 సూ.):-** నలుగాలివాన–అను రూపము నలుగాలివి–అ నుదాని సప్తమ్యంతము. నాలుగు+కాలులు=నలుగాలు. నలుగాలియొక్క+అవి=నలుగాలివి. అనఁగా నాలుగుకాళ్లు గలవి– చతుష్పాత్తులు. ఇది యాభాస బహువ్రీహి. "స్యాదాభాస బహువ్రీహిః ప్రథమాది ప్రయోగతః" (వికృ. హలం. 19)

**84 నిన్, నన్, తన్:-** నిన్, నన్, తన్–అను వాని ద్రుతమునకుఁ బరుషములు పరమగునపుడు పూర్ణబిందువు కలుగదని, అవసానము పరమగునపుడు వీని ద్రుతమునకు లోపము లేదని వేఱుగా సూత్రింపవలెను. (ము.కౌ. సంధి 15.)

**85 కర్తలు దనకున్, గర్మములు (77 సూ.):-** ఇట "బ్రహ్మకైనను దనకుఁ గర్మములు కర్తలు, అనునన్వయమునఁ దనకనునది పాదపూరణార్థకము" అనువ్యాఖ్య (తత్త్వ) సరికాదు. "కర్తలు దనకున్, గర్మములు" అనియే సరియగు నన్వయము.

**86 సముచ్చయము (శబ్ద 116):** సముచ్చయ శబ్దము బాలవ్యాకరణమున, లౌకికా ర్థమున, వాడఁబడెను. ప్రౌఢవ్యాకర్త, అన్నయుందమ్ముండును–లోనగు స్థలములయందలి 'ను' శబ్దములు సముచ్చయార్థకములని పొరపడెను. పరస్పర నిరపేక్షములగు పదార్థముల కేకక్రియాన్వయము, సముచ్చయము. ఇందుఁదుది పదమునకే 'చ' శబ్ద సమభివ్యాహా రముండును. "పరస్పర నిరపేక్ష స్యానేక స్యైకస్మిన్నన్వయ స్సముచ్చయః. ఈశ్వరం గురుంచ భజస్వ". పరస్పరాపేక్ష గల యనేక పదార్థముల కేకార్థమున నన్వయమున్నచో నితరేతరయోగము. ఇందుఁబరస్పర సాహిత్యసూచనార్థము పదములకన్నింటికి 'చ' శబ్ద సమభి వ్యాహారముండును. "ఇతరేతరయోగః పరస్పరనిరపేక్షాణామనే కేషామేకస్మిన్నర్థే సమన్వయే సతి సంభవతి" (మ.భా. ప్ర) అన్నయుందమ్ముండును–అనుచోట్ల 'ను' శబ్దము లితరేతర యోగార్థములు. ఇతరేతరయోగమున ద్వంద్వమగును. అన్నదమ్ములు.

**87 కారకము (కారక 1):-** క్రియాన్వయము గలది కారకమను మతమును భట్టోజీదీక్షితుఁడు తన ప్రౌఢమనోరమలోను, విపులముగా శబ్దకౌస్తుభములోను జూపినాఁడు.

ఈ మతములో–"కారకాణాంక్రియాన్వయః", అను వ్యవహార ముపపన్నము కాదు. ఏలయనఁ గారక శబ్దమునకు, "క్రియాన్వయి" యని యర్థము చెప్పినచో–"కారకాణాం= క్రియాన్వయినాం (క్రియాన్వయముగలవానికి) క్రియాన్వయః (క్రియాన్వయము) యని యర్థము వచ్చును. అప్పుడుద్దేశ్య విధేయ భావము కుదురదు. ఉద్దేశ్య విధేయములు భిన్న విషయములై యుండవలెను. క్రియాన్వయినాం క్రియాన్వయః– అన్నచో రెండును నేక విషయములేయగుటచేఁ గారకమునుద్దేశించి క్రియాన్వయము విధించుట కుదురదు– అని నాగేశుఁడు దీక్షిత మతము ఖండించినాఁడు. (కౌం. స)

కారక శబ్దమునకుఁ గ్రియాజనకమని యర్థము.

**88 తప్పఁజేసి, పనుపుఁజేసి (4 సూ.):-** (i) తప్పఁజేసి– అనునది శబ్దపల్లవము గాన దీనిని, తప్ప చేసి–అని దిద్దవలెనను నాశయ మొకటి గలదు. అది సరికాదు. "ప్రథమాయాః ద్వితీయాయాః సంబంధ స్తత్ర సమ్మతః" (వికృ. క్రియా 31) అని యథర్వణాచార్యులు. "అతనిఁ బెండ్లికొడుకుఁ జేసి–ఇత్యాదీని" అహో 625 పు. ద్వితీయాయాః–అని యుండఁగా ద్వితీయాంత పాఠములనెల్ల దిద్దివేయఁజూచుట సరికాదు. ద్వితీయాంతమన ద్వితీయార్థక ప్రథమ యను వ్యా. సం. స. నిరూపణమును సరికాదు. చూ. ము. కౌ. క్రియా 31 (ii) పనుపుఁజేసి, అనుచో, పనుపున్=అజ్ఞను, చేసి=నెఱవేర్చి–అని యర్థము చెప్పవచ్చుననుట యుక్తముకాదు. ఇట్టి

యాశయమే యున్నచో పనుపుఁజేయ–అనియే నన్నయ ప్రయోగించి యుండును. (iii) ఇవ్విధమున చెలువు (విరాట 2–43.) షష్ఠిలో, నగాగమము (సమాస 1) కాన, ఇవ్విధము నాననముల్–షష్ఠియే.

**89 తోడకుఁ బ్రత్యేక ప్రయోగము (కారక 6):-** "కేచిత్తు వైకృతాశ్శబ్దా విభక్త్యర్థాభిధాయకాః" (వికృ) ఇది తోడు శబ్దనుజ్యంతము. "తోడంబుట్టువు–అయంశబ్దః సహజన్మపర్యాయః" (అహో) ఇట, తోడన్–సహార్థకము. వచ్యర్థయోగమున, నిది, సహార్థకము. వేయేల తోడఁబలుకుదు (శివత)–సూ.ని.

**90 యొక్క ప్రత్యయము (16 సూ.):-** యొక్క ప్రత్యయము చింతామణిలోఁ గళామధ్యమునఁ బఠింపఁబడుటచే, యొక్క ప్రత్యయ ప్రయోగము కొన్నియెడల సమ్మతమగును. "యద్యపి యొక్క షష్ఠ్యర్థ ప్రతిసంధానం సమాస ఏవ వాక్యస్యతు ప్రయోగ ఇష్టఏవ. కళామధ్యే తత్పాఠేన ప్రయోగస్య జ్ఞాపితత్వాత్." (అహో 318 పు.) చూ.ము.కౌ. కారక 14 సూ.

వారివ ధమ్మిల్లభారావ కలిత (ఆది) వారివి=వారియొక్క. "ఏకత్వేచ బహుత్వేచ సంబంధే దివి వర్ణకా." (వికృ. అజం 36) దానిది కలరూపెఱుంగ (ఆది 4–30) దానిది=దానియొక్క వారివ–దామములయు ఇట, కారక 21చే,షష్ఠికి ప్రథమ యయ్యెనను వ్యాకర్త యభిప్రాయము సరికాదు. (ము.కౌ. కారక 15.)

**91 స్వస్వామి సంబంధమున షష్ఠికి ద్వితీయ (కారక 23):-** ప్రౌఢవ్యాకర్త రాముతమ్ముఁన్ లవుం, డిరుమూఁడమ్ముల చాపముందునుమ" అను జైమిని భారత ప్రయోగము నొకదాని నొసఁగెను. ఇచ్చటఁ బద్యాన్వయమున వ్యాకర్త పొరపడెను. పూర్తిపద్యమిది–

*"భరత ప్రేరితమైన సైన్య మెదిరింపన్ రాముతమ్ముఁన్, లవుం*
*డిరుమూఁడమ్ముల చాపముందునుమ భగ్నేష్వాసనుండైన భా*
*స్కరవంశున్, గుశుఁ డుగ్రమార్గణములం గారింపఁ గాఁ జేరిపై*
*నొరుగంబాఱెడువానిఁ గన్గొని మరుత్పూనుండు కట్టల్కతోన్."*

లవుం డిరుమూఁడమ్ముల చాపముందునుమ భాగ్నేష్వాసనుండైన భాస్కరవంశున్–అనునది 'రాముతమ్ముఁన్' అనుదానికి విశేషణమనుట స్పష్టము. వ్యాకర్త చేసికొన్న యన్వయము ప్రామాదికము. (భారతి. జులై. 1964–వేం.సూ.)

**92 తచ్ఛబ్దాంత ధాతుజవిశేషణముల మీఁద, "అరు" (కారక 27):-** కూచిమంచి తిమ్మకవి లక్షణము చెప్పి లక్ష్యము చూపియున్నాఁడు. వ్యాకర్తచూడలేదు.

"విన్నారరు కన్నారరు, నున్నారరుననుచుఁబలుకనొప్పం గృతులన్" (సర్వల 1–263)

"ధరయేలింపఁగనున్నా, రరుమీకుందగునె సంగరములోఁ గలఁగన్"(ద్రోణ 5–111)

## సమాస పరిచ్ఛేదము

**93 రేవగల్లు (30 సూ.):-** వాల్మీకి 2–77.

**94 వినివినములు (31 సూ):-** వినికి+వినమి–అను వ్యాకర్త పదచ్ఛేదము సరికాదు. విని+వినమి–అనియే ఛేదము. విని=వినుట–అని యర్థము. ఇది భావార్థకమే.

**95 కన్న పెంచిన వారు మొ॥ (32 సూ.):-** "కన్న పెంచినవారు, విన్నకన్న వారు-ఇత్యాదౌ ద్వంద్వ సమాసః" అహో 522 పు. కన్నవారు, పెంచినవారు, విన్నవారు-అనునవి కర్మధార యాభాసములు. కన్నవారు+ పెంచినవారు=కన్నపెంచి నవారు. (వసు 3-128) విన్నవారు+కన్నవారు=విన్నకన్నవారు. ఇట్లే వచ్చినవారు+ పోయినవారు=వచ్చిన పోయినవారు (బసవ 55 పు.)

**96 సప్తమీ తత్పురుషమున నవర్ణకము (37 సూ.):-** ప్రయోగాంతరములు-నీదు గర్భమునవాఁడు-ఆది. 4-60; మధ్యం, దినమున యును మాడ్కి బయలఁదేజో నిధిశం, తను సూనుఁడొప్పి-భీష్మ 3-393. తన గృహమున కల్మి కనురూపముగ. అను 4-118. మూఁడునఁ గండలు-పాండు. 3-77.

**97 ఇవార్థకములతోడి సమాసములు (38 సూ):-** "ఇవేన సమాసో విభ క్త్యలోపశ్చ" (వా. 1236, 1341) అను వార్తికముచే ఇవార్థకములతో సమాసము లేర్పడును.

**98 తుది యుపమానముపై 'అట్లు' (40 సూ):-** ప్రయోగము-"పాండుభూ, పాలుని ధర్మనందనుని పంకజనాభుని యట్ల కావె"-ద్రోణ 3-54.

## తద్ధిత పరిచ్ఛేదము

**99 స్వార్థిక ప్రత్యయములు (6 సూ):-** స్వార్థమునగు తద్ధితములు ప్రాతిపది కముల మీఁదనే చేరును. "నామ్నః కవర్ణకః స్యాత్ స్వార్థే" అం చిం. హలం 11 కా.

**100 ఎఁడు వర్ణకాంతములు (16 సూ):-** ఎఁడువర్ణకము ప్రథమైక వచనము మీఁదనే చేరు ననుటచే నితరవిభక్తులీ యెఁడు వర్ణకముమీఁదఁ జేరునని గ్రహింపవలెను. ఎఁడు వర్ణకాంతము లోపవిభక్తికము లగును.

**101 దివ్యతేజంబున వాఁడు (19 సూ):-** ఇట నవర్ణకము తద్ధిత ప్రత్యయమను వ్యాకర్త యాశయము సరికాదు. ఇది యాభాస బహువ్రీహి. "స్యాదాభాస బహువ్రీహిః ప్రథమాది ప్రయోగతః" (విక్ర. హలం. 19 కా.) ఇది ప్రౌఢ. సమాస1 సూత్రమునకు లక్ష్యము. దివ్యతేజంబుయొక్క+వాఁడు=దివ్యతేజంబునవాఁడు, దివ్యతేజంబువాఁడు. ఇది తృతీయార్థక నవర్ణకాంతముతోఁ గూడిన తత్పురుష సమాసము (తత్త్వ) అను వ్యాఖ్య యవిమర్శ మూలకము.

## క్రియా పరిచ్ఛేదము

**102** భిన్న వాక్య కల్పనము (క్రియా 6) సముచ్చయార్థము వివక్షితమగునప్పుడు, తుదిపదమునకే 'చ' శబ్ద సమభివ్యాహారముండును. అప్పుడే భిన్నవాక్యకల్పన కవకాశముండును. ఉదా॥ ఈశ్వరం గురుంచభజస్వ. (సి. కా 901) కాన, అడిగినఁ జెప్పని వాఁడును- అను పూర్వపదాంత్య నువర్ణము పాదపూరణార్థకమని సరిపెట్టవలసియుండును. అనఁగా 'ను' శబ్దము వ్యర్థమనుట. అడిగినఁ జెప్పనివాఁడు, సత్యముచెప్పనివాఁడును... పడున్- అనురీతిని బ్రయోగించుటయే గ్రాహ్యము. (విషయసంఖ్య-86)

**103** కదవే (9 సూ):- దీనికి భారతప్రయోగమును గలదు. "పెంపని పాటించెదిట్టి బేలవు గదవే" శాంతి. 4–370.

**104** ఇమ్ము-ఈ(10 సూ): (1) ఇమ్మున కీ విభాషనగు–అనుచో అలోం త్యస్య అను పరిభాషచే స్థానియందలి (ఇమ్మునందలి) తుదివర్ణమునకు "ఈ" కావలసియుండును. కాన నిట నిర్దేశసామర్థ్యమున ఇమ్మునకు "ఈ" సర్వాదేశమగునని గ్రహింపనగును.

**105** తెచ్చికోలు (13 సూ):- కోలు–అనునది విశేష్యమగు భావార్థమున కాదేశమయినను విశేషణముగను వాడఁబడును. తెచ్చికోలు మౌగ్ధ్యమున డాచి–మను 3–77. తెచ్చికోల్ బీరము–రామా. తెచ్చికోలేద్పులు–కాలహ 4–30 (భారతి జులై 1964. వెం. సూ.)

**106** చకారమునకు, పకారము కామి (16 సూ):- ప్రయోగాంతరములు–సహ కారంబు లనేక లీల సమయించన్ సాగె–హ.న జపముచేసిన నశించని యఘంబు–వి.పు. 3–135. పరసత్వంబని ప్రాజ్ఞులార నిరసించం బోకుఁడీ–ఉ.రా 1–14 ఇత్యాదులు.

**107** తివ్వు ధాతువు (20 సూ):- దృగ్జాలంబుల్ గలయంగ విచ్చి విటమత్స్య వ్రాతమున్ దివ్వుచున్–కు. సం. 8–58. భారతి జులై 1964 వెం.సూ.

**108** కాను=కను (క్రియా 23):- కవలయు (అను 4–26 మొ) కఁదలఁచెను. (ద్రోణ 3–71)

**109** శబ్దపల్లవము-ఘటకక్రియ (24, 25 సూ): ఇవి యథర్వణోప దిష్టములగు సంజ్ఞలు. "క్రియాప్రసిద్ధా బహవః శబ్దపల్లవ సంజ్ఞికాః, ప్రథమాయా ద్వితీయాయా స్సంబంధ స్తత్ర సమ్మతః" (వికృ. క్రియా) క్రియలకు, అగు, పోవులోనగు ధాతువులు చేరి యేర్పడు జంటపదములు ఘటకక్రియ లనఁబడును. "భూగమి క్రియ యేరంతే ఘటకాఖ్యా నిరుచ్యతే" (వికృ. క్రియా) ఘటకక్రియలను ప్రౌఢవ్యాకర్త ద్వ్యవయవ క్రియలనెను. చనుదెమ్ము, చననిచ్చు–అనునవి ఘటక క్రియలు. చనుదెమ్ము–అనుదానిని బాలవ్యాకర్త వేఱుగా సాధించెను. (బా. క్రియా III.) ప్రౌఢవ్యాకర్త శబ్దపల్లవ మనెను. బాలవ్యాకరణపక్షమున శబ్దపల్లవ పూర్వావయవము ధాతువును గావచ్చును. ఇది యథర్వణాశయ విరుద్ధము. శబ్దపల్లవములను గూర్చి యథర్వణులు తెలిపిన విశేషాంశములను బాలప్రౌఢవ్యాకర్తలు గ్రహింపలేదు. కావున వేఱుగ సూత్రింపవలసి వచ్చెను. చూ–ము. కౌ. క్రియా 31–33 సూ.

**110** నీ-నాశబ్దము లభిహితములగుచోఁ క్రియ కేకవచనము (26 సూ):- పురుష భేద ముండుటచే నీసూత్రో దాహరణములలోఁ బ్రత్యేకాన్వయము చెప్పఁట కవకాశము లేదు. ప్రయోగాంతరము–"నీవు నీయొంటి కొడుకుఁ, బాడుచేసితి గృహము నిర్భాగ్యురాల" (కాశీ 4–108)

**111** కదే (28 సూ):- భారతప్రయోగము–"మముఁ జింతం బాపరాదోకదే"– ఉద్యో. 3–72.

**112** కాదె (31 సూ):- భారతప్రయోగము–"మహోప, కారు లరయంగ దైవముల్ గాదె" ఆశ్రమ. 1–19

**113 అంతర్భావిత ప్రేరణములు** (34 సూ.):- "కరఁగు (అప్రే)=ద్రవించు...ప్రే=కరగించు. కుసుమ బాణుని బాణముల్ గూడనైదుఁ, గరఁగి–విరాట 2ఆ. తలఁగు (అప్రే)=తొలఁగు...ప్రే=తొలఁగించు. ఉత్తమ క్షత్రియుం డొరుల దుఃఖంబులు, దలఁగంగఁ బుట్టిన ధర్మశీలుఁడు–ఆది 6ఆ. మెఱయు(అప్రే)=బయలు పడు... ప్రే=బయలుపఱుచు. అపారబలంబుల్, మెఱయునెడ–ఆది 5ఆ. కురియు (అప్రే)=వర్షించు...ప్రే=కురియించు. అమరకామినీ నేత్ర తోయములు గురిసి, యంబుద ద్యుతిఁ ద్రిదశ సస్యంబుఁ బ్రోచు, నెవ్వఁ డవ్విష్ణుఁడు–హరి. పూ. 4ఆ" (శ. ర.)

**114 ద్వికర్మక ధాతువులు** (35 సూ.):- "దుహ్యాచ్ పచ్ దండ్ రుధి ప్రచ్ఛి చిబ్రూ శాసిజి మథ్ముషామ్, కర్మయుక్ స్యా దకథితం తథా స్యా న్నీ హృకృష్వహామ్." సి.కౌ. 539 సూ. దుహ్–యాచ్–పచ్–దండ్–రుధి–ప్రచ్ఛి–చి–బ్రూ–శాసి–జి–మథ్–ముష్–నీ–హృ–కృష్–వహ్, అను 16 ధాతువులు ద్వికర్మకములు. ఇవి తెనుఁగున యథాప్రయోగముగ గ్రాహ్యములు.

## కృదంత పరిచ్ఛేదము

**115 మన్వాదులలో నంతి మాక్షర లోపము** (6 సూ.):- బా. కృదంత 17వ సూత్ర మాకృతిగణముగఁ బేర్కొనఁ బడలేదు. కాన నిట ఉలియు ధాతువునకు వువర్ణకము విధింపఁబడెను. "అంత వర్ణలోపధాతువులు మన్వాదులలోఁ జేరనట్లు అందలి యుదాహరణములను బట్టి తోచుచున్నందున నిట వువర్ణకము విధింపఁబడెను", (తత్త్వ) అను వ్యాఖ్య యపరిశీలన మూలకము. మన్వాదులలో, కాచు–లోనగు పెక్కుధాతువుల కంతి మాక్షరలోపము గలదు.

## వాక్యపరిచ్ఛేదము

**116 క్రియాఽభిన్నకర్తృకములు** (1సూ.):- సంస్కృత లక్షణము చెప్పిన క్త్వార్థక వ్యతిరేక క్త్వార్థకములు (సమానకర్తృకయోః పూర్వకాలే – సి.కౌ.) సమాన కర్తృకములు కావలెను. కాని యా నియమము తెలుఁగున లేదు. కావుననే బాలవ్యాకరణమున "సమానాశ్రయంబులన్" అని మార్పు చేయఁబడెను. (బా.క్రియా.38) పంటలు పండక కఱవు వచ్చెను. అనుచోఁ బండుటకుఁ గర్త–పంటలు; వచ్చుటకుఁ గర్త – కఱవు. కాన నిది క్రియాఽభిన్నకర్తృకముకాదు.

**117 గొంతి సంకట పాటు** (వాక్య 12):- ఇది షష్ఠీతత్పురుష సమాసము. కాన సమాస 34లోని మూఁడుప్రయోగములనిటఁ జేర్పవలెను. (చూ. సమాస 34.)

**118 వాచ్య వివర్జిత దోషము** (13సూ.):- తప్పక చెప్పవలసిన దానిని జెప్పక పోవుట వాచ్యవివర్జిత దోషము. అనభిహితవాచ్య మనియు దీని నందురు. ఇవి న్యూన వచోవాక్యములనుట సరికాదు. (నరస 4–31; కావ్య.ప్ర.)

**119 ఒండొక - ఒండిఁక** (13.సూ.):- "అన్నంబు+ఒండు+ఇఁక–అనియే యిటపదములు. అన్నంబొండు=అన్న మొక్కటియైనను, లేదు–అను నర్థమిట వివక్షితము. అన్న మొకటి యయినను లేదు. ఇతరములగు వస్త్రభూషణ సౌఖ్యాదుల విషయము

చెప్పనేల? అని యర్థము స్ఫురించుచు" (తత్త్వ) ఈ యర్థనిర్ణయము ప్రకరణ విరుద్ధము, నవిమర్శమూలకము. ఒండొక–అనునది కొండొకవంటి శబ్దము. (చూ–సూ.ని.) ఒండొక లేదు=ఇంచుకయైనను లేదని యర్థము. (భారతి. జూలై 1964–వెం.సూ.)

**120** దాహము చేయుట–అధ్యాహార్యము (14.సూ.):– "ఉదగ్ర తరుదాహము చేయుచునున్నc జూచి, అనుచో, "దాహముచేయు టను కర్మము అధ్యాహార్యము" అని వ్యాకర్త వచించుచుండగా, "వనము అధ్యాహార్యము" (తత్త్వ) అని వ్యాఖ్యాతలు వ్రాయుట యసంగతము.

**121** సమీప కర్తయొక్క లింగ వచనము లగుట (15సూ.):– ప్రయోగాంతరము – "ధరణియును ఋక్షములుc బరాశరుcడు గో స, మూహములు వత్సములు గౌతముండుc గవులుc, దోయధియు నింత పుణ్యంబు సేయునే? జ, నంబు భాగ్యంబు నభివర్ణనమున కెక్క" శాంతి 2–98.

**122** తేcకువ సెడు–మొ. (17 సూ.):– తేcకువసెడు–లోనగునవి శబ్దపల్లవ ములు. "క్రియాయా ఉపచారః స్యాత్ ప్రథమా పద సంగతౌ (విక్ర)–అత్రాధేయ నిష్ఠ క్రియాయా ఆధార ఆరోప ఉపచార ఇత్యుచ్యతే" (అహో 624 వు) తేcకువ సెడియె నీపాలుcడు – అనుచో, తేcకువ – ఆధేయము. పాలుcడు – ఆధారము. చెడినది యాధేయ భూతమగు తేcకువయే యయినను, నది యాధారభూతమగు పాలుcడను కర్తయం దుపచరిత మగుచున్నది. ఇట్లే తక్కిన లక్ష్యములు.

**123** గర్భితము (21సూ.):– వాక్యమధ్యమున వేఱొక వాక్యము చేరినచో నది గర్భితమను వాక్యదోషమగునని యాలంకారికులు. ఈగర్భితము గొన్ని యెడల గుణమే యగునని వారే తెలిపిరి. "ఇందుల కెంత కాలంబయ్యె రాని కారణంబేమి" అనుచో ఎంతకాలంబయ్యె – అనునది వక్తయొక్క యారాటమను జెప్పనుగాన గుణమనుట కవకాశము గలదు. అర్థవిశేషము లేనప్పుడు గర్భితము దోషమేయగును.

**124** పొమ్ము–పో (24సూ.):– పొమ్ము అనునది, పో– అనుదాని కుపలక్షణము. దీనికిc బ్రత్యయం బిదియ పో–శ్వ.నై. 4–43 అం., తేపో – ఉద్యో 1–821 పొమ్మన కాశ్చర్యాద్యర్థ విశేషములును గలవు (సూ.ని.) కాని యార్థిక విషయములను సూత్రించుట యనావశ్యకము.

## ముక్తలక్షణ వివేచనము

**125** చేకూఱు=చేకుఱు (1సూ.):– "చేకూఱె ననుటకుc చేకుఱెనని యిట్లు, పొడవులెల్లను హ్రస్వములుగc జేసి పలికెడు వేళ రేఫములును ఱాలును, మునుపటియట్లనే తనరుచుండు" అప్పక 2–196. కాని చేకూఱు–నిర్మూలము.

**126** ద్విరేఫ వర్ణక శబ్దములు (2 సూ):– లఘుర్బ వేద్గురుః–అను నథర్వణ కారికచే రేఫము లభయములు కావచ్చును. "గురుత్వం లఘుత్వంచాప్యస్తి–పరమాత్మ పదములc దొరcగి పాఱెడు నీటి తరcగలపై లీల దాcటి దాcటి...తొఱcగి నెత్తావి యందును నెఱయ నొప్పె–ఇతి నృసింహ పురాణే ప్రయోగః. ఏవం తత్ర తత్ర సుకవి ప్రబంధేషు ద్వైరూప్యం ద్రష్టవ్యమ్–(అహో 183 వు) చూ–ము కౌ. సంజ్ఞా 9.

**127** సంహిత (శబ్ద 51):- పరస్సన్నికర్షః సంహితా (1-4-109) వర్ణానా మతిశయితః సన్నిధిః సంహితా సంజ్ఞః స్యాత్ (సి. కౌ.) "పరః అతిశయితః-సన్నికర్షః సామీప్యమ్, అర్ధమాత్రాకాల వ్యవధా నాభావః" బాలమ.

**128** లుక్ (సమాస ప్రారంభము; శబ్ద 106):- లుక్-అనునది ప్రత్యలోపమును దెలుపు పారిభాషికపదముగఁ బాణినీయమున విధింపఁబడి యున్నది. "ప్రత్యయస్య లుక్ శ్లు లుపః (1-1-61) లుక్, శ్లు, లుప్, శబ్దైఃకృతం ప్రత్యయాదర్శనం క్రమాత్ తత్ సంజ్ఞం స్యాత్" సి. కౌ. 260. లుక్సమాసమునందలి లుక్కు పాణినీయ లుక్కు.

ఉన్లుగ్విషయంబులు (శబ్ద 106) ఇత్యాదులలోని లుక్కు పాణినీయ లుక్కు కాదు. ఇది ప్రాకృత వ్యాకరణ ప్రసిద్ధమగు లుక్కు. "ప్రాయోలుక్ కటచతదప యవౌ మితి" వాల్మీకి సూత్రము. (అహో 407 పు) కగచజతదపయవాం ప్రాయోలుక్" (చండ. వ్యంజన 38 సూ) "జ్ఞకార సంబంధినో ఞకారస్య లుగ్భవతి తు (త్రి. ప్రా. 1-4-82) ద్వారే దకార వకారయోః పర్యాయేణ లుగ్భవతి తు" (త్రి. ప్రా. 1-4-83) ఈ విషయమును గమనింపక నన్నయాదులు పారిభాషిక పద వ్యవహారమున జాగరూకత లేనివారని మాత్రమనుకొనక తప్పదనుట (బా. ర.) యజాగరూకత కాకతప్పదు.

**129** నుమ్ (సమాస 19):- నుమ్-అనునది, "మిదచోంత్యాత్పరః (1-1-47) అచః-ఇతి షష్ఠ్యంతమ్. అచాం మధ్యే యోంత్య స్తస్మాత్పరస్యైవాంతా వయవోమిత్ స్యాత్" (సి. కౌ. 37) అను పాణినీయ ప్రసిద్ధమగు మిత్తుగాఁ గొందఱు భ్రమింతురు. (బా-ర) ఇది మిదంత్యే అను ప్రాకృత వ్యాకరణ ప్రసిద్ధమగు మిత్తు. చింతామణి ననుసరించి ప్రౌఢవ్యాకర్త యీ మిత్తును వాడెను.

**130** తాదర్థ్యము (సమాస 41):- "తాదర్థ్యే చతుర్థీ వాచ్యా" (వా 1458-సి. కౌ. 580) "తస్మై ఇదం తదర్థమ్. అర్థేన నిత్యసమాసః, తదర్థస్య భావః తాదర్థ్యమ్." (బాలమ)

**131** మయట్ (తద్ధిత 18):- తత్ప్రకృతవచనే మయట్ (5-4-21) ప్రాచుర్యేణ ప్రకృతం ప్రస్తుతమ్. తస్య వచనం ప్రతిపాదనమ్-అన్నమయమ్, అపూపమయః (సి. కౌ. 20-89) "ప్రకృత మన్నమయ మితి-ప్రచుర మన్న మిత్యర్థః"-అపూపమయ ఇతి ప్రచురోఽపూప ఇత్యర్థః" (బాలమ)

**132** పదము (వాక్య 2):- సుప్తిఙంతం పదమ్ (1-4-14) సుబంతం తిఙం తంచ పదసంజ్ఞం స్యాత్ (సి.కౌ. 29) "నకేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా, నాపి ప్రత్యయః" మ. భా. (అనభిహిత సూత్రమునొద్ద) ఖంబు-ఏకాక్షర పదమను వ్యాఖ్య (తత్త్వ) తప్పు.

**133** నామ (పద) ము (వాక్య 3.):- "నామపదేనచ సుబంతమేవ, ఉక్తయుక్తేః ప్రకృతిః ప్రత్యయో విభక్తి రిత్యే తావన్నామ, సత్తా ద్రవ్యం లింగసంఖ్యేతి నామార్థః. తేషు ద్రవ్యం ప్రధాన మితి నిరుక్త భాష్యోక్తేః." 'నమత్యాఖ్యాతార్థ ప్రతివిశేషణీభవతీతి నామ ఇతిచ నిరుక్తభాష్యమ్. ఇదమ్-అవ్యయాతిరిక్త నామలక్షణమ్. 'ఉపసర్గ నిపాతా

ఇత్యత్ర నిపాతపద మవ్యయమాత్రోపలక్షణ మితి తద్భావః' (ల. మ. నామశబ్దార్థ నిర్ణయః)

**134** అవ్యయము (వాక్య 3 సూ):- "సదృశం త్రిషులింగేషు, సర్వాసుచ విభక్తిషు, వచనేషుచ సర్వేషు, యన్నవ్యేతి తదవ్యయమ్" (అథర్వణశ్రుతిః) "స్త్రీ పుం నపుంసకత్వాని సత్వగుణాః. ఏకత్వ ద్విత్వ బహుత్వానిచ. ఏతాన్యర్థాన్ యేన వియంతి తదవ్యయ మితి లింగ కారక సంఖ్యాః అనాదృత్య యన్నవ్యేతి వికారంన ప్రాప్నోతి, కింతు సదృశమ్=ఏకప్రకారమేవ భవతి తదవ్యయ మిత్యుదాహృత శ్రుతేరర్థః" బాలమ. యన్నవ్యేతి నానాత్వం, నగచ్ఛతీతి సత్త్వ ధర్మాన్ నగృహ్ణాతీత్యర్థః (మ.భో.ఉ.) స్త్రీ పుంసనపుంసకత్వాని సత్వగుణాః (బాలమ)

**135** (8) అన్వయము (వాక్య 4 సూ):- "పదానాం పరస్ప రాకాంక్షా యోగ్యతాచ-ఇతి దుర్గాదాసః. పరస్పర సంబంధః- ఇతి రామతర్క వాగీశః- శబ్దక."

**136** (9) వాక్యము-మహావాక్యము (8 సూ.):- "ఇత్థం వాక్యం ద్విధామతమ్. ఇత్థమితి వాక్యత్వేన మహావాక్యత్వేనచ. ఉక్తంచ-స్వార్థబోధే సమాప్తానా మంగాంగిత్వ వ్యపేక్షయా, వాక్యానా మేకవాక్యత్వం పునః సంహృత్యజాయతే - ఇతి. తత్రవాక్యం యథా - శూన్యం వాస గృహమ్-ఇత్యాది" (సా.ద.) శూన్యం వాసగృహం విలోక్య-అను శ్లోక మమరుక శతకములోనిది. కావున నీపద్యము పద్యాంతర నిరపేక్ష మగుటచే నిందలి వాక్యముల సమూహము మహావాక్యము కాదు.

**137** అధ్యాహారము (11 సూ):- "అకాంక్షా సమాపక పదానుసంధానమ్" శబ్దక.

**138** కులకము (23 సూ):- "ఛందో బద్ధం పదం పద్యం, తేన ముక్తేన ముక్తకమ్, ద్వాభ్యాంతుయుగ్మకం సందానితకం త్రిభిరిష్యతే, కలాపకం. చతుర్భిశ్చ, తదూర్ధ్వం కులకం మతమ్" (సా.ద.) అను సాహిత్యదర్పణ లక్షణము చొప్పున నాలుగు పద్యములకంటె నెక్కువ పద్యముల కన్వయ మున్నచోఁ గులక మనబడును. కాని యీ లక్షణము నహోబలపతియుఁ దదనుయాయి ప్రౌఢవ్యాకర్తయుఁ బాటింపలేదు. పద్యసంఖ్యా నియమములేదని వీరు తలంచినారు.సంస్కృతకోశములలోఁ బద్యసంఖ్యా నియమము కనఁబడదు. "కులకంతు పటోలే స్యాత్ సంబద్ధ శ్లోక సంహతౌ" (మే. ని) "స్యాత్కులకం శ్లోకైకార్థ పటోలయోః" (త్రి. ని.) "కులకస్తు...ఏకాన్వయ శ్లోక బృందే" నానా.

## IV. ప్రౌఢవ్యాకరణము - మూలములు

### సంజ్ఞా

1 సూ:- (i) ద్విధాక ఏచోనుస్వారౌ విసర్గష్షోడశ స్వరాః.
(వృత్తి) స్పర్శా అంతస్థ ఊష్మాణ శ్చతుస్త్రింశ ద్దలః స్మృతాః
సిద్ధి స్సంస్కృత శబ్దానాం భవే త్పంచాశ దక్షరైః
ప్రాకృతానాంచ సిద్ధిఃస్యాత్తై శ్చత్వారింశ దక్షరైః
ఋౠ వర్ణావినైకారౌకారాభ్యాంచ దశస్వరాః

శేషా వసంయుక్త జఙా వినైవాన్యే హలోమతాః
ఋౣ వర్ణౌ హ్రస్వదీర్ఘౌ వైజాద్యా వనునాసికా
శేషాచ దశతే న్యూనాః ప్రాకృతో క్తిషు సర్వతః-

"ఇత్యాది వరరుచి హేమచంద్రాది వ్యాకరణోక్తిర్మానమితి". (అహో 163 పు.) ఇది ౣకార ప్రసంగమునకు మూలము.

(ii) 'అత్ర సంప్రదాయాభిమానో వదంతి. అదిక్షాంతాః స్మృతా వర్ణా' ఇత్యాగమజ్ఞ వ్యవహారమాత్రేణ న క్షకారస్య వర్ణాంతరత్వేన గణనా. అన్యథా సంయుక్తత్వావిశేషాత్ తాదీనామపి వర్ణాంతరత్వేన పరిగణనా స్యాత్. క్షస్యవర్ణాంతర త్వాభావే ధాతు పారాయణికైర్భిక్షాది ధాతూనాం షాంతమధ్యే పాఠ ఏవ మానమ్. (అహో 161పు) ఇది క్షవర్ణ ప్రసంగమునకు మూలము.

2 సూ:- "వర్ణాత్కారః; రస్యేఫః" (సి.కా. వార్తికములు) "కేషాంచిత్ ప్రత్యయేనైవ తత్ప్రయోగస్తు సమ్మతః." (విక్ర. అజం. 4కా) "అకారమనుచోఁ గారప్రత్యయము రాదని కొందఱనిరి. కాని యది ధూర్తవాక్కులని తెలియవలెను. అకారమనుటకు నప్పకవీయము–రేఫము అకారమును నని రెండు తెఱఁగులు." కవిజన.

3 సూ:- "దీర్ఘః స్యాద్వర్ణ నిర్దేశే" (విక్ర. అజం–84 కా)

4 సూ:- "దీర్ఘే ష్వపి తదేవ రూపమ్" (అహో 429 పు)

9 సూ:- "నను పాఱు శబ్దస్య యది తద్భవత్వం తర్హి గురురేఫః కథమితి చేన్నైవ దోషః. ఉక్కెఱ, కఱకు, మొఱకు–ఇత్యాది తద్భవేష్వపితచ్ఛ్రవణాత్. అతఏవాథర్వణః–లక్ష్యాను రోధేన ఉచ్చారణస్య కల్ప్యత్వ మాహ" (అహో 357 పు.)

14 సూ:- "గ్రామ్యం తత్తద్విధౌ సాధు." (విక్ర. సంజ్ఞా. 29)

15, 16 సూ:- "వినానుకరణం కేచి దాద్యశబ్దం ప్రయుజ్యతే." (విక్ర. సంజ్ఞా. 27) "అతఏవ...జయశీతాంశు కులావతంసనిషధస్వామీ–ఇత్యాదీని వాక్యాని ప్రయుక్తాని" అహో 209 పు. (జయ=జా–భీమ 6–59; వరాహ. 1–148.)

## సంధి

1 సూ:- "సంధి ర్నిత్యం ప్రత్యయాచ స్తథార్యాది గతస్యచ." (విక్ర సంధి 4 కా.)

3, 9 సూ:- "నోవాద్విత్వం క్వచిత్ శ్లిష్టః, పరప్రాణేన సంగతేః" (విక్ర. అజం 28 కా.)

20:- "కాంతిశబ్దాది శబ్దాస్తు ద్విరుక్తా స్సంతినైకకే, సాధారణా స్తదన్యేచ వైచిత్ర్యం భూరి వర్తతే." (విక్ర. అజం 65 కా)

23 సూ:- "అన్యేషాంచ ద్విరుక్తాస్యు ర్బహు లోపాగమామతాః (విక్ర. అజం. 81 కా) రారమ్మ, పోపొమ్ము, లేలెమ్ము...ఇత్యాది" (అహో 425 పు.)

## శబ్ద

14 సూ:- "రో ఇతి స్త్రీవాచకో భవేత్, పరత్రైవ ప్రయోగస్తు" (విక్ర. అజం. 1–2 కా)

15 సూ:- "క్వచి దామంత్రణే కానో వైకృతాత్ పరతో మతః" (వికృ. అజం 72 కా.)

19 సూ:- "సర్వేషామేవ చోదంత శబ్దానాం కొపరే భవేత్, నఃప్రాయః స్యాదృకారాచ్చ సర్వపండిత సమ్మతేః" (వికృ. అజం. 15 కా.) అహోబలపతి నగాగమము నిత్యమనున ట్లీకారికను వ్యాఖ్యానించుట పొరపాటు. (వ్యా. సం. స)

20 సూ:- "తత్త్రకృతు శతంబునకంటె సుతుండు మేలు...యది బహుపుస్తక స్థితత్వేన తత్పాఠ ఏవాగ్రహః. తర్హితద్రూపే తదేవ వచనం ప్రమాణ మస్తు" (అహో 431 పు.)

22 సూ:- "అర్థభేద క్వచిచ్ఛబ్దాదిగా స్యాచ్చుతతోపి డుజ్, నామంత్రణేడుజ్ హ్రస్వః స్యా, ద్బహుతా త్వత్రనేష్యతే." (వికృ. అజం. 71 కా.) "ఈ యశోదగారి గోపాలిగాఁ డిట్లు గలదె జగతి; గోపాలిగ రమ్మటంచుఁ గొడుకుం బిలిచెన్" అహో 417 పు.

25 సూ:- "భవేద్ధర్మాది శబ్దానాం ముశ్చేవుశ్చాత్ర కుత్రచిత్." (వికృ. అజం 26 కా) "ఆచార్యస్యా ప్యేతద్రూప మిష్టమేవ...సర్వధర్మువులు దొలంగు-ఇత్యాది ప్రయోగ శ్రుతేః" (అహో 343 పు.)

26 సూ:- "పువర్ణకో భవత్యత్ర క్వచిన్నిత్యం క్వచిత్తువా" (వికృ. అజం 54కా) "ద్వితీయాచార్యేణతు అమహదుదంతేభ్యోసి పువర్ణా విహితాః. తేన...అగ్గలంబు నాయెదుట బాహప్పళించి, పర్వములేకయును రాహు భానునిబట్టెన్-ఇత్యాద్యా స్తిక్కయజ్వాది కవిప్రయోగాః" (అహో 341 పు.) (బాహ+అప్పళించి-అను ఛేదము సరికాదు. ఇట్టి తత్సమాకారసంధి భారతమున లేదు.) బాహ-అను తత్సమ రూపమునకుఁ బ్రయోగములేదు.

28 చూ:- బహుత్వం క్వచి దేకత్వమ్. (వికృ. అజం. 56కా) "కేలు-ఇత్యాద్యా ఏకవచనాంతాః" (అహో 392 పు)

29 సూ:- "ఏకత్వే సస్యవాచిత్వమ్." (వికృ. అజం. 67కా)

34 సూ:- "బహుత్వ ప్రత్యయః క్వచిత్." (వికృ. అజం. 56కా)

37 సూ:- "బహుత్వే ధాన్యవాచితా" (వికృ. అజం 67కా)

39 సూ:- "పూజ్యత్వే సద్రుతో గారుః" (వికృ. అజం 72 కా)

41 సూ:- "తచ్ఛబ్దస్య బహుత్వం స్యా త్తథా తత్ర ద్రుత స్థితిః" (వికృ. అజం. 72కా)

43 సూ:- "స్యాత్పూజ్యత్వ వివక్షాయాం, మహతాం బహుతా మతా." (వికృ. అజం 8)

48 సూ:- "అత్రాపి లువర్ణకస్యోపలక్షణత్వమ్. ఏత చ్చాచార్యస్యాభి ప్రేతమేవ. సుందరి నాకోడంద్రుర, యందభ్యర్థితవు నీవ- ఇత్యాది తత్ప్రయోగాత్." (అహో 398 పు) "కథితార్థాత్ క్వచిల్లుర్లః." (వికృ. అజం 54కా) "క్వచిదత్వం భవేల్లువే" (వికృ. అజం 35)

49 సూ:- "ఇయాంతత్వే కుత్రచిత్ స్యా దత్వం యశ్చాపి తద్భ వే, లఘుస్యోపిచ

సంయుక్త ఇతి కేషాంచి దీరణా." (విక్ర. అజం. 61 కా.) "కన్నియ, కన్నె, కన్య. అతఏవ రాఘవపాండవీయే–నెయ్యపుఁ గన్యకలన, ఇత్యుక్తమ్" (అహో 411 పు)

52 సూ:- జడతా వాచకత్వేతు న్న్యంతతా తత్ర దృశ్యతే. (విక్ర. అజం. 75 కా)

53 సూ:- "భవేత్తదాది శబ్దేవో, డుజాదిస్తు భవేన్నచోత్, ఙసః స్థానే రురత్రస్యాత్, క్వచిదత్వం భవేల్లులే. తయోశ్శసాదౌ రేమాత్ర ఉదతోఃప్రాయ శోత్ర ఇత్." (విక్ర. అజం. 34, 36 కా.)

54, 55, 58-61 సూ:- అద్విత్వంచ భవేద్ ద్విత్వం దీర్ఘో హ్రస్వశ్చ కేషుచిత్, ద్యంతాత్తదాది శబ్దాత్ స్యా ద్బహుత్వే స్త్రీ వివర్ణకః, దాని ర్దీని ర్దేని రమివాన్యాది శ్శస ఉచ్యతే. (విక్ర. అజం. 37 కా.)

62 సూ:- "అత్తు టాఙ్యోశ్చ" (విక్ర. అజం. 38 కా.)

68 సూ:- "రవర్ణస్య తయోగః స్యాద్ ద్విత్వాదేశా భవంతిచ." (విక్ర. అజం. 89 కా.)

70 సూ:- నామ్నః కవర్ణకః స్యాత్, స్వార్థే స్యాదుత్వమపి పరేతస్మిన్. (అం. చిం. హలం 11)

71 సూ:- "యుక్తాయుక్తా వపి మతా నమౌ" (విక్ర. హలం. 5 కా)

81 సూ:- "ఏకత్వే రుః క్వచిల్లోపే భవే ద్వశ్చ డుజాదయః." (విక్ర. అజం. 90 కా.)

85 సూ:- "అన్యేషాంచ ద్విరుక్తాస్యు ర్బహులోపాగమా మతాః" (విక్ర. అజం. 81 కా) "ఒకానొకఁడు, ఒకానొకటి" (అహో 425 పు)

86 సూ:- "కేషాంచిద్ ర్వంత శబ్దానాం తథాడుజ్ వారురౌ స్మృతౌ" (విక్ర. అజం. 53 కా)

87 సూ:- "ఏఁడి, ఏరి–ఇతి రూపద్వయమ్. ఎవఁడు, ఎవరు–ఇతి కిం శబ్దార్థయో ర్వలోపే ఏత్వేచ సిద్ధమ్, ఏతచ్చ ఇవర్ణయోగ ఏవేతిజ్ఞేయ మిత్యాది." (అహో 437 పు)

88, 89 సూ:- "భవంత్యజడవాచిత్వే ర్వంతా శ్శబ్దామనోహరాః." (విక్ర. అజం. 74 కా.)

91, 93 సూ:- "ఆదేశశ్చ వురూ రశ్చ సబిందు ర్డుస్తు మాత్ పరః" (విక్ర. అజం. 88 కా.)

106 సూ:- "కేషాంచి దుదంతానాం నేతి విభక్తౌ వునో లుక్ స్యాత్" (అం. చిం.)

107, 108, 114 సూ:- "అన్యేషాంచ ద్విరుక్తాస్యు ర్బహు లోపాగమా మతాః" (విక్ర. అజం. 81 కా) "తరతరము, తారుతారె, తమకుఁదామె, వారువారె, తనంతదాను". (అహో. 424 పు.)

116 సూ:- "యువర్ణకః స్యాద్యాంతాత్తు నువర్ణక ఉతోభవేత్, ద్యోతకా వర్ణభేదస్య చాన్యత్రాపి క్వచిద్భవేత్, యునూ సుస్యేవ నియతా వయుతావచి సంయుతౌ" (విక్ర. అజం. 23 కా; అహో. 334 పు.)

## కారక

4 సూ:- "భారత భారతీ శుభగభస్తి చయంబునఁజేసి...ఇత్యాది." (అహో. 316 పు.)

8 సూ:- "తోడుత నితి విభక్త్యర్థాభిధాయక శ్శబ్దః" (అహో 312 పు.)

12 సూ:- "కేచిన్నాంతాచ్చ గుర్వాదేః ద్వ్యక్షరాత్ పట్టి మూచిరే" (వికృ. క్రియా 20 కా.) గుర్వాదేః ద్వ్యక్షరాత్-అను నియమములు ప్రౌఢవ్యాకర్త యుజ్జగించి ప్రయోగానుసారముగ సూత్రించెను.

15 సూ:- "నీచెప్పినపెద్దలు-ఇత్యాదీని తిక్కయజ్వాది కవి వచనానితు... జనమేజయుచేయు సర్పయాగము...ఇత్యా ద్యాచార్య వచన మహిమ్నా సాష్ఠవ లభంత-ఇత్యవగంతవ్యమ్." (అహో 189 పు.)

20 సూ:- "అన్యస్యాపి క్వచి ద్భవేచ్ఛాన్యా" (అం. చిం.)

22 సూ:- "షష్ఠీవిశేషణానాం ప్రథమాస్యాత్"-(అం. చిం. అజం 57కా) "అద్యుఁడు హిరణ్యగర్భునందంతకంటె (ఆముక్త 3-80) ఇత్యాది కవిప్రయోగంబులు షష్ఠీ విశేషణానామ్-అను బహువచనంబుచే గ్రాహ్యంబులు." కవిజన. (వికృ. అజం 41 కా) అహోబలపండితుఁడు-"అద్యుఁడు హిరణ్యగర్భునందంతకంటె, నిత్యాది కవిపితామహోద్యుక్తిస్తు నిర్మూలైవ" అని నిరసించెను. (అహో 364 పు)

## సమాస

2-5 సూ:- "ద్వ్యక్షరాది చతుర్వర్ణ పర్యంతం జన నామసు, లోపే స్యాద్ ద్వ్యాది వర్ణానాం శబ్దే రాజాదికే పరే, క్వచిదత్వం క్వచిచ్ఛాత్వం క్వచిదిత్వం క్వచిత్వతా, క్వచిన్మత్వం యథాయోగ మన్యచ్చ వ్యవహారతః" (వికృ. అజం. 108-109)

9 సూ:- "తచ్ఛబ్ద వస్య లోపః స్యాదదాతోః క్వచిదేకతా' (వికృ.అజం. 80 కా.)

17 సూ:- "విశేషణ సమాసోపి క్వచిదిష్టో భవేన్మమ" (వికృ. అజం. 76 కా.)

19 సూ:- "మెఱుఁగుఁబోఁడి, పాణిపల్లవము-ఇవి యుపమాన సమాసములు." (బాలస. 246 పు.)

22, 23 సూ:- "ఏకాదశాది సంఖ్యాయా మునోడశ్చ సబిందుకః, ఆదేశః క్వచిదున్మాత్ర మాదేశః స్యా త్తథైకతా." (వికృ.అజం. 86 కా.)

30 సూ:- "అన్యత్రాపి క్వచిద్భవేత్." (వికృ. హలం. 17 కా.)

31 సూ:- "ద్వంద్వః కేషాంచిదిష్టః స్యాత్ క్త్వార్థశబ్దేన కుత్రచిత్" (వికృ. హలం. 18 కా.) "వచ్చిరాములు, చేసిచేయములు, చొచ్చిచొరములు-ఇత్యాదావపి ద్వంద్వసమాసః సాధురేవ." (అహో 522 పు.) ఇట క్త్వార్థమనునది భావార్థక పరమనఁదగును. క్త్వార్థమునకు భావార్థకత్వమును గలదు. ఏగియెఱుంగవు (కళా 3-139) ఏగి=ఏగుట.

32 సూ:- "క్వచిత్ సమాసేంతగస్య శబ్దస్యా దావపి స్థితిః." (వికృ. హలం. 18 కా.)

## క్రియా

1 సూ:- "తత్రాచార్యైః కాలమనవిక్షిత్యైవ ధాత్వర్థమాత్రే వివక్షాక్రియతే. అతఏవ తద్ధర్మా ఇత్యన్వర్థా సంజ్ఞా. తస్య ధాతోర్ధర్మః వాచ్యార్థమాత్రమితి." (అహో 551 పు.)

2 సూ:- "క్వచిడ్డోశ్చ" (విక్ర. హలం. 7 కా) "రాకుండునె-రాకున్నె ఇత్యాది." (అహో 485 పు.)

5 సూ:- "కిలార్థా దుభయోర్యోగః" (విక్ర. క్రియా 16 కా.) అంట-కిలార్థకము. అటు శబ్దమని ప్రౌఢవ్యా.

9 సూ:- "ప్రార్థనార్థే భవే న్నాంతాత్, కదేత్యర్థ విశేషదః, ఆర్యాది శబ్దో యుక్తః స్యా దసంబంధోర్థ బోధనే.. ..నోభయోపరివర్ణకః" (విక్ర. క్రియా 14-16 కా.)

10 సూ:- "అన్యే శబ్దవిశేషేష్యు రంతే శ్రుతి మనోహరాః." (విక్ర. క్రియా 18 కా.) "కానిమ్ము-ఇత్య స్మిన్నర్థే కానీ శబ్దః...ఇత్యాది శబ్దాః అన్యశబ్దేన గ్రాహ్యాః." (అహో 609 పు.)

18, 19 సూ:- "అన్యశ్చా ప్యర్థ ఘటకాః స్యా దనేకార్థతాపిచ" (విక్ర. క్రియా 24 కా.)

29 సూ:- "అన్యత శ్చాపి సభవేత్, క్వచిదర్థ విశేషదః, ఉత్తమాదావపి భవేత్, ప్రశ్నాద్యర్థ విశేషదః ఆర్యాదిశబ్దో యుక్తః స్యా దసంబంధోర్థబోధనే." (విక్ర.క్రియా 14-15 కా.)

## వాక్య

1 సూ:- (i) "వాక్యంస్యా ద్యోగ్యతాకాంక్షాసత్తి యుక్తః పదోచ్చయః" (సా.ద.)

(ii) యోగ్యతా పదార్థానాం పరస్పర సంబంధే బాధాభావః. పదోచ్చయస్య ఏతదభావేపి వాక్యత్వే వహ్నినా సించతీ త్యపి వాక్యం స్యాత్. ఆకాంక్షా ప్రతీతి పర్యవసాన విరహః. సచ శ్రోతు ర్జిజ్ఞాసా స్వరూపః. నిరాకాంక్షస్య వాక్యత్వే గౌరశ్వః పురుషోహస్తీత్యాదినామపి వాక్యత్వంస్యాత్. ఆసత్తిర్బుద్ధ్య విచ్ఛేదః. బుద్ధి విచ్ఛేదేపి వాక్యత్వే ఇదా నీముచ్చరితస్య దినాంతరోచ్చారితేన గచ్ఛతీతి పదేన సంగతిః స్యాత్." (సా.ద.) "ఆకాంక్షాదిరహితం వాక్యం నప్రమాణమ్." తర్క.

2 సూ:- "వర్ణాః పదం ప్రయోగార్హానన్వితై కార్థబోధకాః. యథా-పటః. ప్రయోగార్హ-ఇతి, ప్రాతిపదికస్య వ్యవచ్ఛేదః. అనన్విత ఇతి వాక్యమహావాక్యయోః. ఏక-ఇతి సాకాంక్షానేకపద వాక్యానామ్. అర్థబోధకా ఇతి, కచటతప-ఇత్యాదీనామ్. వర్ణా ఇతి బహువచన మవివక్షితమ్" (సా. ద.) ఏకవర్ణపదమునకు - ఇా= దేవమాతా (మే.ని.)

8 సూ:- "వాక్యోచ్చయో మహావాక్యమ్...మహావాక్యం యథా-రామాయణ మహాభారత రఘువంశాది తత్రవాక్యం యథా-శూన్యం వాసగృహం విలోక్య——" (సా.ద.) ఈ శ్లోకమమరుక శతకములోనిది.

19 సూ:- "కాని కాక యోరన్వయే బహవో రూప విశేషాదృశ్యంతే" (అహో 620 పు.)

23 సూ:- "క్వచిత్కులక సంబంధోప్యత్ర నాహిత కృద్భవేత్." (విక్ర. అజం 93 కా.) "తానొకపండు సెచ్చరన్. కొనిప్రచ్చుడు...ఇత్యా ద్యావా చార్యస్య కులక మిష్టమేవ." (అహో 437 పు.)

## ముక్త

1 సూ:- "యే దీర్ఘపూర్వాఃస్యు ప్రాగ్వై యదితే హ్రస్వ పూర్వకాః భవంతి శకటాస్తేతు ప్రాసాద్వైర్బాధితం వినా." (శ.ర.)

# V. కతిపయ వ్యాసములు

## 1. ప్రౌఢవ్యాకరణనామ సార్థక్యము

బహుజనపల్లి సీతారామాచార్యులుగారు త్రిలింగలక్షణ శేషమునకుఁ బ్రౌఢ వ్యాకరణమను నామాంతరమును నిర్దేశించియున్నారు: ప్రౌఢవ్యాకరణనామ మెట్లు సార్థకమను విచికిత్సకలదు. కొంద ఱిట్లందురు. ప్రౌఢవ్యాకరణమనఁగాఁ బ్రౌఢమయిన వ్యాకరణమని యర్థము. ఈయర్థము ప్రౌఢవ్యాకరణ విషయమున సార్థకము కాదు. ఏలయన బాలవ్యాకరణమే దీనికంటెఁ బ్రౌఢముగ నున్నది. ఈ యర్థనిర్ణయము సరికాదు. బాలవ్యాకరణమనఁగా బాలమైన వ్యాకరణమని యర్థము కాదు. కావునఁ బ్రౌఢవ్యాకరణ మనఁగాఁ బ్రౌఢమయిన వ్యాకరణమని యర్థము చెప్పరాదు. మఱి కొంద ఱిట్లందురు. బాలవ్యాకరణమునందలి బాలశబ్దమునకు గ్రహణధారణపటువని యర్థము. బాలురనఁగాఁ గుఱ్ఱవాండ్రని యర్థము చేసికొని త్రిలింగలక్షణ శేషకర్త ప్రౌఢవ్యాకరణమను నామాంతరమును నిర్దేశించెను. కాన నీ నామాంతరము సార్థకముకాదు. ఈవిషయమును నిర్ధారించుటకు బాలప్రౌఢ శబ్దార్థములను బరిశీలించుట యావశ్యకము.

**బాలప్రౌఢ శబ్దార్థ పరిశీలనము:-** "గ్రహణధారణ పటుర్బాలః" అని తర్కసంగ్రహ దీపికలోఁ గలదు. ఆ సందర్భమును బరికింతము. తర్కసంగ్రహ ప్రారంభమున "బాలానాం సుఖబోధాయ క్రియతే తర్కసంగ్రహమ్" అని అన్నంభట్టు వచించెను. తర్కసంగ్రహదీపిక యను స్వరచిత టీకలో నిట్లు వివరించెను. "నను బహుషు తర్కగ్రంథేషు సత్సు కిమర్థ మపూర్వోయం గ్రంథః క్రియత ఇత్యత అహ....బాలానామితి. తేషా మతివిస్తృతత్వా ద్బాలానాం బోధో న జాయత ఇత్యర్థః. గ్రహణ ధారణ పటుర్బాలః నతు స్తనంధయః" (తర్క. దీ.) పూర్వ తర్కగ్రంథము లతి విస్తృతములగుటచే బాలురకు బోధపడుటలేదు. బాలురనఁగా స్తనంధయులు కారు; గ్రహణ ధారణ పటువులు. గ్రహించుటకు జ్ఞప్తియందుంచుకొనుటకు సమర్థులు. దేనిని గ్రహించుటకు జ్ఞప్తియందుంచుకొనుటకు వీరు సమర్థులు. పూర్వతర్క గ్రంథములనా? కాదు. ఏల? అవి యతి విస్తృతములు. బాలానాం సుఖబోధాయ— అను తర్క సంగ్రహమునఁ బేర్కొనఁబడిన బాలు రెట్టివారు? అతి విస్తృతములగు

పూర్వతర్క గ్రంథముల నర్థము చేసికొనలేనివారు. అట్టివారి ప్రయోజనము నుద్దేశించి తర్కసంగ్రహము రచింపఁబడెనని గ్రంథకర్త యాశయము. కాఁగా, నిట బాలురనఁగా నతి విస్తృతములగు పూర్వతర్క గ్రంథముల నర్థముచేసికొనలేనివారని ఫలితార్థము. తర్కసంగ్రహము వంటి యనతి విస్తృతమగు గ్రంథము నర్థము చేసికొనుటకు జ్ఞప్తియందుంచుకొనుటకు సమర్థులయినవారు బాలురన్నమాట. బాలశబ్దమునకు గ్రహణధారణపటువన్నది ముఖ్యార్థము కాదు. ఇది తర్కశాస్త్ర పారిభాషిక పదమును గాదు. "బాలానాం సుఖబోధాయ, పరిభాషేందు శేఖరమ్" (పరిభా) అని నాగేశభట్టు వచించెను. "గదా" వ్యాఖ్యలో – "బాలానాం భాష్యాదితః పరిభాషార్థ నిర్ణయాసమర్థానామ్" అని వివరింపఁబడెను. ఇట బాలురనఁగా భాష్యాదుల మూలమునఁ బరిభాషార్థమును దెలిసికొనలేనివారు. కావున, బాల వ్యాకరణమునందలి బాల శబ్దమునకును బ్రకరణోచితమును గ్రంథ కృదభిప్రేతమునగు నర్థమును నిరూపించుట కర్తవ్యము. బాలవ్యాకరణ రచనోద్దేశమును బరికించినచో నీవిషయము స్పష్టపడఁగలదు.

బాలవ్యాకరణ పీఠికలో సూరిగారు బాలవ్యాకరణ రచనోద్దేశము నిట్లు వక్కాణించియున్నారు. "సంస్కృతభాషతో సూత్రగ్రంథ మొకటి కావించితిని. అగ్రంథము బాలురకు సుసాధము గాకుండుటవలన దానియందలి సూత్రములు కొన్ని తెనిఁగించి ప్రకృత గ్రంథరూపముగా రచించినాఁడ" (బాలవ్యా. పీఠిక.) దీనినిబట్టి తన సంస్కృత సూత్రగ్రంథమును (సూత్రాంధ్ర వ్యాకరణమును) జదివి లక్షణపరిజ్ఞానమును బడయలేని వారిని సూరి బాలురుగా నిర్దేశించినట్లు తెలియుచున్నది. కావున బాలవ్యాకరణమనఁగా సూరి రచించిన సంస్కృత సూత్రగ్రంథమును (సూత్రాంధ్రవ్యాకరణమును) జదివి లక్షణపరిజ్ఞానమును బడయలేనివారి నిమిత్తము రచింపఁబడిన వ్యాకరణమని తాత్పర్యము. (సూరి సూత్రగ్రంథము చింతామణ్యాదులకు నుపలక్షణ మనవచ్చును.)

ఇఁకఁ బ్రౌఢవ్యాకరణమును గూర్చి గ్రంథకర్త చెప్పినమాటలు పరికింతము. "ఇందలి లక్షణము లసాధారణములనియు, నియ్యది విద్యార్థుల కత్యంతోపకారక మనియు మంచిమనసుతోఁ బరికించు వారలకెల్లఁ జక్కగాఁ దెల్లము గాఁగలదు." (ప్రౌఢవ్యా. ఉపోద్ఘాతము) దీనినిబట్టి బాలవ్యాకరణమునందలి సాధారణ లక్షణముల పరిజ్ఞానము నార్జించిన విద్యార్థులకుఁ బ్రౌఢవ్యాకరణమందలి యసాధారణ లక్షణము లత్యంతోపకారములనుట గ్రంథకర్త యాశయమని తెలియుచున్నది. కానఁ బ్రౌఢులనఁగా బాలవ్యాకరణమందలి సాధారణ లక్షణ పరిజ్ఞానముగలవారని యర్థము. బాలవ్యాకరణ పరిజ్ఞాతలని భావము. కాఁగాఁ బ్రౌఢవ్యాకరణ మనఁగాఁ బ్రౌఢుల ప్రయోజనమునుద్దేశించి (=బాలవ్యాకరణ పరిజ్ఞాతల ప్రయోజనము నుద్దేశించి) రచించిన వ్యాకరణమని తాత్పర్యము. ఇట్లు ప్రౌఢవ్యాకరణనామము సార్థకము.

## 2. త్రిలింగ లక్షణశేష నామ సార్థక్యము

త్రిలింగలక్షణమనఁగాఁ దెలుఁగు లక్షణము. లక్షణమనఁగా వ్యాకరణాది శాస్త్రము. శేషమనఁగా జెప్పఁగా మిగిలినది యని యర్థము. కావునఁ బూర్వాంధ్ర వ్యాకరణములలోఁ జెప్పఁగా మిగిలిన లక్షణవిశేషములను చెప్పునది యని త్రిలింగ లక్షణ శేష శబ్దమున కర్థము లభించును. పూర్వులు రచించిన త్రిలింగలక్షణములు

పెక్కులున్నవి. అవి రెండువర్గములకుఁ జెందియున్నవి. (1) సంస్కృత భాషా మయములు. చింతామణి, వికృతివివేకము లీకోవకుఁ జెందినవి. (2) ఆంధ్ర పద్యమయములు. ఆంధ్రభాషాభూషణాదు లీకోవకుఁ జెందినవి. చింతామణి వికృతి వివేకముల నాధారముగాఁగొని బాలవ్యాకరణము రచింపఁబడినది. ప్రౌఢవ్యాకరణ మీ త్రిలింగలక్షణములకెల్ల శేషగ్రంథముగా నుద్దిష్టమయినదా? వ్యాకర్త యుద్దేశించిన త్రిలింగలక్షణములేవి? యన్నది పరిశీలనార్హము.

త్రిలింగలక్షణశేషము, పద్యగ్రంథము కాకుండుటచేఁ బూర్వపద్యాంధ్ర లక్షణము లకిది శేషగ్రంథముగ నుద్దిష్టము కాలేదనుట స్పష్టము. ఇఁకఁ జింతామణి, వికృతివివేక, బాలవ్యాకరణముల కిది శేషగ్రంథమా? యన్నది ప్రశ్న. ఈ విషయమున శ్రీవజ్ఝలవారిట్లు తెలిపియున్నారు. "బాలవ్యాకరణమున లేని విషయము లాంధ్రశబ్ద చింతామణిలో నున్నప్పుడు త్రిలింగలక్షణ శేషకర్తయట్టి విషయములను సైతము ప్రౌఢవ్యాకరణమున సంగ్రహింపఁడు. చింతామణి, బాలవ్యాకరణములు రెండింటికిని ప్రౌఢవ్యాకరణము శేషగ్రంథమని యాతని యాశయము. కావున నీ సందర్భమునఁ జింతామణిలోని, దేశ్యాదస్మద్యుష్మచ్ఛబ్దాత్సుజసోరిత్యాది శ్లోక త్రయముచే సాధింపఁబడిన, నా–నీ–తా శబ్దరూపముల ప్రక్రియ ప్రౌఢవ్యాకరణమునఁ జూపఁబడలేదు. ఈమూఁడు శ్లోకములలో లేనివిషయములే యధర్వణోక్త విధులతోఁ జేర్చి తాను ప్రౌఢవ్యాకరణమున సంగ్రహించుచు వచ్చెను." (వ్యా. సం. స. 886 పు) "లులలకు రురలగు" (శబ్ద 23) అను సూత్రరచనాక్రమము "లాంతాత్తు రురా తయోః క్రమేణస్తః" అను చింతామణి సూత్రరచనా క్రమమునకు స్ఫోరకముగ నుండుట యీ యభిప్రాయమును బలపఱచును. అథర్వణకారికలలోని లక్షణవిశేషములు పెక్కులు త్రిలింగ లక్షణశేషమున గ్రహింపఁబడెను. (చూ. మూలములు) కావునఁ త్రిలింగలక్షణశేషము వికృతివివేకమునకు శేషగ్రంథముగా నుద్దిష్టము కాలేదనుట స్పష్టము. ఈ పరిశీలనమునుబట్టి త్రిలింగలక్షణశేషము కొంతవఱకుఁ జింతామణికి శేషము కావచ్చునని తెలియుచున్నది. ఇది ముఖ్యముగా బాలవ్యాకరణశేషము. ఇది బాలవ్యాకరణమునకెట్లు శేషగ్రంథమో పరికింతము.

బాలవ్యాకర్త సర్వసాధారణములగు లక్షణవిశేషములను బ్రాయికముగా సూత్రించెను. బాలవ్యాకరణమునఁ జెప్పఁగా మిగిలిన యసాధారణ లక్షణ విశేషములను బూరించుటకుఁ ద్రిలింగలక్షణశేషకర్త పూనుకొనెను. కావునఁ ద్రిలింగలక్షణ శేషమును ముఖ్యముగా బాలవ్యాకరణ శేషమనవచ్చును. అట్లు పూరించుటలోఁ ద్రిలింగలక్షణ శేషకర్త వివరణములుగాను సవరణములుగాను గొన్ని సూత్రములను రచించెను. వికృతి వివేకాదుల ననుసరించియు, భారతాది గ్రంథ పరిశోధనంబుచే దొరకిన విశేషలక్షణ ప్రయోగముల నేర్చికూర్చియు, బాలవ్యాకరణమున లేని కొన్ని లక్షణ విశేషములను సూత్రించెను. కాఁగా, నీ శేషపూరణమును మూఁడువిధములుగా నిర్దేశింపవచ్చును.

(1) **వివరణములు:-** సంజ్ఞా 1, 7, 8, సంధి 12, 13; శబ్ద 13, 16, సర్వనామ ప్రక్రియ; కారక 10, 12; సమాస 36; తద్ధిత 1, 2, (2) సవరణములు – సంజ్ఞా 9, 12, 13; సంధి 2, 7, 18; శబ్ద 19, 27, 49, సమాస 20. (3) పూరణములు:– (i) శేషపూరణములు–శబ్ద 20, 21, కారక 17–22. (ii) నూతనములు–సంధి 15, 17, 19; శబ్ద 12, 17, 78; క్రియా 26; వాక్య 12, 13, 15, 16, 18 మొ॥ వికృతివివేకాదులనుండి గ్రహించి పూరించిన లక్షణవిశేషములు కొన్నిగలవు. చూ–IV)

పాణిని సూత్రములకుఁ గాత్యాయనుని వార్త్తికములును, జింతామణికి నథర్వణకారికలు నెట్టివో బాలవ్యాకరణమునకుఁ బ్రౌఢవ్యాకరణమట్టిదనవచ్చును. "ఉక్తానుక్త దురుక్తార్థ చింతాకారితు వార్త్తికమ్" అను హేమచంద్రోక్త వార్త్తిక లక్షణము ప్రౌఢవ్యాకరణమునకు వర్తించు నననగును. ఉక్తార్థ చింతనములు=వివరణములు దురుక్తార్థ చింతనములు = సవరణములు.

ప్రసంగవశమున వివరణములుగను, సవరణములుగను గొన్ని సూత్రములు రచింపఁ బడినను, బాలవ్యాకరణమునఁ జెప్పఁగా శేషించిన యసాధారణ లక్షణ విశేషములను బూరించుటయే ప్రధానోద్దేశమగుటచేఁ ద్రిలింగలక్షణ శేషనామము సార్థకము.

## 3. ప్రయోగమూలం వ్యాకరణమ్

"ప్రయోగమూలం వ్యాకరణ"మ్మను నభియుక్తోక్తి నిర్వివాదమయ్యు నెవరి ప్రయోగములు ప్రమాణము లన్నవిషయమున మత భేదములు గనఁబడును.

(i) నన్నయప్రయోగము లెల్లఁ బ్రమాణములని యహోబలపండితాదుల మతము.
(ii) కవిత్రయ ప్రయోగములెల్లఁ బ్రమాణములని కొందఱ మతము.
(iii) మహాకవి ప్రయోగము లెల్లఁ బ్రమాణములని కొందఱ మతము.

పై మతము లవిచారిత రమణీయములు. ఏలయన –

(i) ప్రయోగముల విషయమున మహర్షులకే ప్రమాదములుండఁగా నితరులకు లేకుం డుట యసంభవము. ఆలంకారికులు పదవాక్యార్థరస దోషములకుఁ గాళిదాసాది మహాకవుల ప్రయోగముల నుండియే లక్ష్యములు చూపియున్నారు. వ్యాకరణ దోషములు చ్యుత సంస్కారములనఁబడును.

(ii) శాస్త్రము ముందఱ నెల్లరును సమానులే. భారత ప్రయోగములా? భారతేతర కావ్యప్రయోగములా? మహాకవి ప్రయోగములా? సామాన్య కవి ప్రయోగములా? యన్నభేదదృష్టికిఁ దావులేదు. మహాకవి ప్రయోగములయినచోఁ బ్రామాదికములు కాకపోవచ్చునని తోఁచినప్పుడు, "స్థితస్యగతిశ్చింతనీయా" యను న్యాయమున గతి నరయవచ్చును. అదివేఱే విషయము.

ప్రయోగములలో సాధుప్రయోగములు, నసాధు ప్రయోగములు మిళితములయి యుండును. అపరిజ్ఞానము, భ్రమ ప్రమాదములు, గ్రాంథిక సీమోల్లంఘన లంపటత్వము, నవిచారమూలకత్వము, నలసత్వము, నిరంకుశత్వము లోనగు హేతువులచే నసాధు ప్రయోగము లేర్పడును. అట్టివి ప్రమాణములు కానేరవు, చాలనీ (జల్లెడ) న్యాయమున నసాధు ప్రయోగములనుండి సాధు ప్రయోగములను వైయాకరణులు వేఱుపఱుతురు.

"సక్తుమివ తితఉనా పునన్తో
యత్రధీరా మనసావాచమక్రత (మ. భా.)

అట్లు వేఱుపఱిచిన సాధు శబ్దముల నన్వాఖ్యానము చేసి యివియిట్లు ప్రయో గయోగ్యములని శాసింతురు. "శిష్యతే అనేన" అని శాస్త్రశబ్ద నిరుక్తి. శాసించునది గావున, శాస్త్రమనుట. లేనిచో వ్యాకరణము ప్రయోగ సంకలన గ్రంథమగును గాని శాస్త్రము కాదు.

అసాధు ప్రయోగములకుఁ గతిపయోదాహరణములు –

1. **అపరిజ్ఞాన మూలకములు:** లక్ష్యలక్షణ పరిజ్ఞానము కొఱవడుటచేఁ జేసిన ప్రయోగము, లపరిజ్ఞాన మూలకములు.

(i) "వనమునుంచి, ధనమునుంచి యని యుంచి శబ్దానుప్రయోగంబుతోఁ గొందఱు వ్యవహరించెదరుగాని యది సాధుకవి ప్రయోగారూఢంబు గాదని యెఱుంగునది." (బా. కారక 11)

(ii) దుస్సంధికార్యములు – ఒనరించితిన్+ఈశ=ఒనరించితీశ. (కాళహ 4–78. ఒనరించితి నీశ–సాధువు) వచ్చు+అమాత్యులు=వచ్చమాత్యులు (శ్శృ.శా. 3–226 వచ్చునమాత్యులు–సాధువు.) ఇల్లు+అలు=ఇల్లుటాలు. (నీలా 1–71.) ఇల్లాలు–సాధువు. (ము.కౌ. సంధి 26)

(iii) **రో–కానలు:-** "ఒకానొక యాధునిక గ్రంథమునందు, అన్నరో, వీనుంగురో అని ప్రయోగములు కానంబడుచున్నవి. వానికిఁ బ్రామాణిక ప్రయోగములు కానంబడవు" (ప్రౌ. శబ్ద 14) ఇవి కూచిమంచి తిమ్మకవి ప్రయోగములు.

"ఈ కవి, పాపజాతి కాన–అని ప్రయోగించినాఁడు. అది విచార్యము" (ప్రౌ. శబ్ద 15) విచార్యమనఁగా నసాధువని ఫలితార్థము. ఇది చేమకూర వేంకటకవి ప్రయోగము.

(iv) **క్రీడావాచకములకేక వచనము:-** "ఒకానొక కవి యిందుఁగొన్నిటి నేకవచ నాంతములుగాఁ బఠించి యున్నాఁడు. అది విచార్యము." (ప్రౌ.శబ్ద 38) ఇట, బిల్లగోఁడు (కాళహ 3–33) అనుధూర్జటి ప్రయోగమసాధువనఁబడెను. బిల్లగోళ్ళు–సాధువనుట.

(v) **అపశబ్దములు:-** ఉగాగమాంతము, మీఁదిడుజ్బునకు లోపముచేయని రూపములు– ఇంద్రజిత్తుఁడు (రామా 8–23) కాలజిత్తుఁడు (జై.భా. 6–164) ఇంద్ర (కాల) జిత్తు, ఇంద్ర (కాల) జితుఁడు–సాధువులు. మతుబంతము మీఁది సంబుద్ధిడుజ్బునకు లోపము–నయవంతా (భాగ 7–481) నయవంతుఁడా (డ)–సాధువు.

2. **భ్రమమూలకములు:** భ్రమయనఁగా మిథ్యాజ్ఞానము.

(i) "చేతురు కోతురిత్యాదు లసాధువులని యెఱుఁగునది" (బా. క్రియా 108) ఇవి, చూతురు–లోనగువాని సామ్యమున భ్రమపడి వాడినవి.

(ii) కొండేనకు (సారంగ 2–247) ముత్తేలు (య 1–53) ఇవి కయ్యానకు ముత్యాలు లోనగువాని సామ్యమున వాడినవి.

(iii) జంపతీ (విక్రమా 4–35) 'దంపతీ జంపతీ జాయాపతీ' అను నమరకోశోక్తిని జూచి, జంపతీశబ్దము దీర్ఘాంతమని భ్రాంతిపడి వాడినది. జంపతీ – ద్వివచనాంత రూపము.

కేకీ (కు.సం. 6–103) 'శిఖావలశ్శిఖీకేకీ' అనున మరకోశోక్తిని జూచి కేకీ శబ్దము–'ఈ'కారాంతమన్న భ్రాంతితో వాడినది. కేకిశబ్దము, నకారాంతము, కేకీ ప్రథమైక వచనము.

(iv) మేంఠము (కాశీ 7–98) సంఖాతము (వరాహ 5–96) లోనగునవి, యపభ్రష్టో చ్చారణాను గుణముగ వ్రాసిన లిపికర ప్రమాదముల ననుసరించి యేర్పడినవి. మేంఢము సంఘాతము – సాధువులు.

(v) మదావలము (కర్ణ 2–156) ఇది దంతావల శిఖావల శబ్దముల సామ్యమున వాడినది. 'దంత శిఖాత్సంజ్ఞాయామ్' (పాణి)

(vi) డోలా (నిర్వ 7–7) పట్టణ మార్గంబున (శృ.శా. 1–81) డోలా పట్టణ శబ్దములు ప్రాకృత రూపములు. ఇవి సంస్కృతశబ్ద భ్రాంతిని సిద్దసమాసగతములుగ వాడఁబడినవి. దోలా, పత్త(ట్ట)న– శబ్దములు సంస్కృత రూపములు.

(vii) సాందీపుఁడు (పారిజా 3–38) సాందీపని శబ్దము ద్వితీయాంతమని భ్రమపడి, సాందీపుఁడను రూపము కల్పితము. "సందీపన స్యాపత్యం సాందీపనిః"

(viii) తావకీయము (భాగ 7–365) ఇది, త్వదీయాదుల సామ్యమున వాడినది, తావకీనము–సాధువు.

3. **ప్రామాదికములు:** ప్రమాదమన, ననవధానత. ప్రమాదము వలనఁ గలిగినవి ప్రామాదికములు.

(i) మహదాయుధముల (ద్రోణ 5–409) మహదుపకంఠము (జై.భా. 6–61) మహో యుధముల, మహోపకంఠము–సాధురూపములు. "అన్మహతః సమానాధికరణ జాతీయయోః" (సి.కౌ. 807)

(ii) దుర్ణయము (అది 3–12) పునీతము (భాగ 3–556) లోనగునవి యార్ష ప్రయోగములు. అర్షములని చూచుకొనక ప్రమాదవశమున నివి వాడఁబడినవి. "దుర్ణయస్య ఫలోదయః" (సం.హరి) "పునీతాతనుభిః పదైస్సహ" (సం.భాగ) దుర్నయము, పూతము–సాధువులు.

(iii) ప్రభవిష్ణుఁడు (శాంతి 4–204) పరిపంథి (ఉ.హ. 2–174) పలిక్ని (నిరం 2–133) ఇవి వైదిక పదములని చూచుకొనక పొరపడి వాడినవి. తెలిసియే వాడిన పక్షమున నిరంకుశములగుటచే, నగ్రాహ్యము లగును.

"భువశ్చ (3–2–138) ఛందసీత్యేవ. భవిష్ణుః. కథంతర్హి 'జగత్ప్రభోరప్రభవిష్ణువై ష్ణవమ్' ఇతి. నిరంకుశాః కవయః" (సి.కౌ. కృదంత 3118)

"ఛందసి పరిపంథి పరిపరిణౌ పర్యవస్థాతరి (5–289) లోకేతుపరిపంథి శబ్దోనన్యాయ్యః" (సి.కౌ. 1889)

"ఛందసి క్నమేకే" (వా) అసిక్నీ, పలిక్నీ (సి.కౌ. 496)

పరిపంథి పలిక్నీ శబ్దము లమరకోశమున కెక్కుటచేఁ గవులు ప్రమాదపడియుందురు. కవుల ప్రమాదములు కొన్ని పాణినీయేతర వ్యాకరణములలో సాధింపఁబడియున్నవి. పుష్పంధయము, అంబుజనేత్రి, ముష్టాముష్టి, గీష్పతి, విశ్రామము–లోనగునవి. ఇవి యనుసరణీయములు కావు.

(iv) సమానాధి కరణాన్వయము గల యేకదేశాన్వయములు:– ఆ రథాధి రూఢుఁడు (ధరణ్య 2–183) ముల్లోక వంద్య (బసవ 58 పు) ఇవి సమాస మూలస్వరూప భంజకములగుటచే నసాధువులనక తప్పదు.

4. **గ్రాంధిక సీమోల్లంఘన లంపటములు:** ఇవ్వక (రంగ.రా) చెయ్యంగా (కాళహ 1–58) పాడిచింది (భాగ 10 పూ 800) ఎత్తుక (ఆముక్త 6–18) పట్టినావు (నిరం 3–29) ఒనరించినాము (ఘటికా 2–194) వస్తాఁడు, తెస్తాఁడు, ఇస్తాఁడు, చస్తాఁడు (చంద్ర. రే.)

5. **అవిచారమూలకములు:** (i) లడాగమమునందలి యత్తునకు సంధి – తల్లిదండ్రులొద్ద (అరణ్య 2–138) తామరసనేత్రలిండ్ల (మను 2–73) గురువు లిండ్ల (పాండు 4–44). జాతి వాచ్యమగునపుడు సంధి లేమి – పాలయిండ్లు (వీర 1–168) పాలిండ్లు–సాధువు. అమ్మాజియమ్మ (పాండు 1–67) ఇట సంజ్ఞయందు సంధిమానుట సరికాదు. ఇవి యవిచార మూలకములు.

6. **అలసతాప్రేరితములు:** సల్లక్షణముగ రచింపఁగల వ్యుత్పత్తి యుండియు ఛందోయతిప్రాస శ్లేషశబ్దాలంకార నిర్వహణమునఁ బ్రాలుమాలికతోఁ జేయువిశృంఖల ప్రయోగము లలసతాప్రేరితములు.

(i) **ఛందోనిర్వహణమునకుఁ జేసినవి:–** ఎన్దలల్ (ఉ.హ. 5–87 ఎన్నితలల్) కొన్గినిసి (పాండు 4–147 కొన్ని+కినిసి) ఎన్ని మార్గాము (ఆముక్త 6–6. ఎన్నిమార్గు+కాము) గొర్లన్ (య 2–32. గొఱ్ఱెలన్.) అందనరారు (వసు 2–12. అనందనరారు) పాతకులారని (ఆముక్త 7–13) పోచున్నారు. (ప్రభావ 5–39) పోచున్నవాఁడో (కళా 3–96) పోచున్ (కళా 4–151) పోవుచున్న, పోవుచున్–సాధువులు.

(ii) **యతి నిర్వహణమునకుఁ జేసినవి:–** "పెన్నెఱివేణి సొంపు మురిపెంబును" (శృ.శా 2–183) మురిపము–సాధువు. మురియు+ప=మురిపము. "పోకప్రొద్దునఁ జరెంపుట నీతియే" (వరాహ 3–125) చరించుట–సాధువు. "పితరుల ఋణముఁ దీర్పెదుసూను" (రాఘవ 1–46) తీర్చెదు– సాధువు. "ఆఱడి నోముల య్యనుగదా తనకంచు" (శృ.శా. 4–129) అయ్యెను–సాధువు. "అయ్యో నీసుతుగ్రద్దయెత్తుకొని పోయన్" (వేం.ప.చ 1అ) పోయెన్–సాధువు.

(iii) **ప్రాసనిర్వహణమునకుఁ జేసినవి:–** "త, లంపుట భావ్యంబె పెద్దలారా మీకున్" (వరాహ 10–35) తలంచుట–సాధువు. "భీషణాంహోలతల్ విచ్చన్" (కాళహ 3–180) విచ్చున్–సాధువు.

(iv) **శ్లేష నిర్వహణమునకుఁ జేసినవి:–** "నీవిప్ప్రభావము" (రాఘవ 2–107) ఈ+ ప్రభావము=ఇప్ప్రభావము. విప్ప్రభావము–అర్థాంతరము. "అప్ప్రమద" (హ.న 1–30) అ+ప్రమద=అప్ప్రమద. నఞ్+ప్రమద=అప్రమద. "అనచిచ" అను సూత్రముచే–అప్ప్రమద–అర్థాంతరము.

ఒనర్పుదురు మహిమ (హ.న. 4–58)

ఒనర్పుదున్+ఉరుమహిమ=ఒనర్పుదు నురుమహిమ–సాధువు. ఒనర్పుదురు, మహిమ – అర్థాంతరము.

సారంగా, హితమున్ సంపెఁగన హర్షమేపునఁ బొదలన్ (హ.న. 2–23)

సంపెన్+కనన్-అనుచో, సంపెన్-అసాధువు. చంపెన్-సాధువు. సంపెగన్+ అహర్షము-అని యర్థాంతరము. శ్లేష నిర్వహణమునకు సంపుధాతువును వాడుట యసంగతము.

(v) **శబ్దాలంకార నిర్వహణమునకుఁ జేసినవి:-** చంద్రబింబము సొంపు సవతుగాదని పింపు (శృ.శా 2-140) అనిపించు - సాధువు. కనకంపు ననసొంపు కడమంపు బలితంపు (వసు 3-69) ఉంచు-సాధువు. ఉంపు-సరికాదు.

7. **నిరంకుశములు:** (i) "సరులులేని దృక్ఛంజన శాబకముల-అని యొకచోఁ బ్రయోగము కానఁబడుచున్నది. అది శబ్దాలంకార తత్పరత్వమునఁ బ్రౌఢముగాఁ జెప్పఁబడినదని గ్రహింపవలయును." (ప్రౌ.శబ్ద 32 వృత్తి)

ఈ ప్రయోగము శ్రీనాథ మహాకవిది.

తే. ఇరులు గెలిచిన యంతఃపురేందు ముఖుల
కురులు మరుఁడనువేఁటగాఁడురులు సేసి
మరులు గొలుపంగ లేఁడయ్యె మనుజవిభుని
సరులులేని దృక్ఛంజన శాబకముల (శృ.నై. 3-90)

"ఇరులు-కురులు-ఉరులు-మరులు-సరులు" అని శబ్దాలంకార నిర్వహణమునకు సరిశబ్దమునకు సరులను బహువచనము కల్పితము. సరి-నిత్యైకవచనాంతము.

(ii) "లక్కమాంబ కుమారేత్యాది ప్రయోగస్తు ప్రౌఢోక్తి మాత్ర నిష్పన్న ఇతిజ్ఞేయమ్." (అహో 443-444 పు) లక్కాంబ - సాధువనుట. తిమ్మమాంబ (పాండు 1-55) తిమ్మాంబ - సాధువు. (విషయసంఖ్య-25)

(iii) పెక్కు, కొన్ని, మూఁడు శబ్దములను మహద్వాచకములతో సమసింపఁజేయుట.
పెక్కుసఖులకు (శృ.శా 3-178)
కొన్ని వేల్పులు (బసవ 261 మె)
ముప్వేలుపులు (అచ్చ.రా)

పెక్కురు సఖులు, కొందఱు వేల్పులు, మువ్వురు వేలుపులు - అను రూపములే గ్రాహ్యములు.

(iv) కాని నేయుఁడు (భీమ 2-114; 3-214) "కన్యాయాః కనీనచ" అను సూత్రముచే, కానీనుఁడు - సాధువు. శ్రీనాథుఁడు కన్యావాచకమగు 'కనీ' శబ్దమును "కళ్యాణ్యాది" గణమునఁ జేర్చిఁ కాని నేయుఁడను రూపమును గల్పించెను.

"కళ్యాణ్యాదీనామనఙ్ (4-1-126) ఏషామినఙాదేశః స్యాత్, ఢక్చ. కళ్యాణినేయః, బాంధకినేయః" (సి.కా 1131)

కళ్యాణ్యాదిగణము, పఠిత గణము, ఆకృతిగణము గాదు. కానఁగానినేయ శబ్దకల్పన నిరంకుశము.

మహర్షుల యప ప్రయోగముల నార్షములందురు. మహాకవుల యపప్రయోగములను బ్రౌఢములందురు. అసాధువులన్నదే ఫలితార్థము.

కాఁగా, "ప్రయోగమూలం వ్యాకరణ"మ్మను నభియుక్తోక్తికిఁ బ్రయోగములన్నియు వ్యాకరణమునకు మూలమని యర్థము కాదు. శాస్త్రకారులు చాలనీ న్యాయమున

నసాధు ప్రయోగముల నుండి వేఱుచేసిన సాధు ప్రయోగములు వ్యాకరణమునకు మూలమని తాత్పర్యము.

ఇట్లు "ప్రయోగమూలం వ్యాకరణ"మ్మను నభియుక్తోక్తి సమర్థనీయము.

## 4. వ్యాకరణ ప్రయోజనము

"రక్షోహాగమ లఘ్వసందేహాః ప్రయోజనమ్" (మ.భా) అని పతంజలి భగవానులు వ్యాకరణ ప్రయోజనముల నానతిచ్చి యున్నారు. వీనిని యథోచితముగా నాంధ్రవ్యాకరణముల విషయమున సమన్వయించుట కర్తవ్యము.

1. **రక్షః** గ్రాంథిక భాషా రక్షార్థము వ్యాకరణ మావశ్యకము. గ్రాంథిక భాషయనఁగాఁ బూర్వకావ్య ప్రయుక్త భాషయని యర్థము. పద్య (చంపూ) కావ్యభాషయని ఫలితార్థము.

వ్యావహారిక రూపములకంటె గ్రాంథిక రూపములు భిన్నములుగా నుండును. గ్రాంథికము=పూర్వ కావ్యప్రయుక్తమయి, వ్యాకరణ శాస్త్ర ప్రామాణ్యమునొందిన భాష. ఉదా. వచ్చుచున్నది-గ్రాంథికము. వస్తుంది-ఒస్తుంది; వచ్చుతుంది-ఒచ్చుతుంది; వచ్చుతూవుంది-ఒచ్చుతూవుంది; వస్తూంది-ఒస్తూంది; వస్తావుంది- ఒస్తావుంది; వస్తోంది-ఒస్తోంది, ఇవి వ్యావహారిక రూపములు.

కొన్ని వర్ణలోపాదేశాదులు గ్రాంథిక భాషలో వ్యావహారికముకంటె వేఱుగా నుండును. ఉదా॥ తేరఁడు, (తేఁడు) తేరుము (తెమ్ము) చాక (చావక) చాకుము (చావకుము) నాఁడు (అనఁడు) నారు (అనరు) నేచెను (నేరిచెను) లోనగునవి. ఇట్లు వ్యావహారిక రూపములకంటె భిన్నములగు గ్రాంథిక రూపములనెఱుఁగుటకు వ్యాకరణ మావశ్యకము.

2. **ఊహః** "ప్రకృతి వద్వికృతిః" అను మీమాంసా శాస్త్రన్యాయము ననుసరించి ప్రకృతి లింగవిభక్తి వచనములను మార్చుట, యూహయనఁబడును. ఇది కావ్యములందు విభక్తివిపరిణామాదుల రూపమున నుండును.

విభక్తి విపరిణామమునకు - "ఈతనితోసాటి యనంగమేలన" (నిర్వ 3-61) మేలన=ఈతని కంటె మేలన. ఈతనితో- అన్న తృతీయ - పంచమిగా విపరిణామమునందినది. (ప్రౌ. కారక 26)

**ఒక విభక్తికి మఱియొక విభక్తి:-** వారుసుఖమున్నారు. (బా. కారక 21) సుఖము=సుఖముతోనని యర్థము. కోలం గూలనేసె. కోలన్=కోలతో నని యర్థము. లంకంగలకలంబు పుట్టె. లంకన్=లంకయందని యర్థము (బా. కారక 22) శరములు, నెఱఁకులాడి. నెఱఁకులు=నెఱకులందని యర్థము. (ప్రౌ. కారక 20)

ఇట్లు విభక్త్యర్థనిర్ణయమునకు వ్యాకరణ మావశ్యకము.

3. **ఆగమము:** ఆగమ (వేద) విహితమగుటచే వ్యాకరణాధ్యయన మవశ్యకర్తవ్యము. చ్యుత సంస్కార దోషములు కలుగకుండుటకు వ్యాకరణ మావశ్యకము.

4. **లాఘవము:** లక్షణ పరిజ్ఞానము వడయుటకు వ్యాకరణాధ్యయన మొక్కటే లఘూపాయము.

"లఘ్వర్థం చాధ్యేయం వ్యాకరణమ్. నచాంతరేణ వ్యాకరణం లఘునోపాయేన శబ్దాః శక్యాజ్ఞాతుమ్" (మ.భా.) అని పతంజలి భగవానులు స్పష్టపఱిచి యున్నారు.

"తస్యమార్గోయమాంజసః" (వాక్యప. శబ్ద 12) అని భర్తృహరి.

వ్యాకరణము లేకుండ లక్షణ పరిజ్ఞానము వడయవలెనన్న వందలకొలఁది కావ్యములు చదువవలయును. వేలకొలఁది గల పద్యములలోని లక్షల కొలఁది లక్ష్యములను బరిశీలింపవలయును. కావుననే, చిన్నయసూరిగారిట్లు వక్కాణించియున్నారు.

"తుదముట్ట సర్వలక్షణ పరిజ్ఞానము లక్ష్యపరిజ్ఞానము చేతనే సాధించుట మిక్కిలి దుష్కరము" (బా. పీఠిక)

5. **అసందేహము:** నిస్సందేహముగా లక్షణ పరిజ్ఞానము సంపాదించుటకు వ్యాకరణమే శరణ్యము.

"అసందేహార్థం చాధ్యేయం వ్యాకరణమ్" (మ.భా.)

సిద్ధసమాసములకు:– త్రిలోకములు.

"త్రిలోకముల కధికుఁ జూచితిమి యొకయెఱుకిన్" (ఆది 5–239)

శాస్త్ర పరిజ్ఞానము లేనివారు త్రిలోకములు – ద్విగువని భ్రమింతురు. "ద్విగురేక వచనమ్" (ప్రాణి) అను శాస్త్రవచనముచే సిద్ధద్విగువు లేకవచనాంతములేయగును. "దిక్సంఖ్యే సంజ్ఞాయామ్" (పాణి) అను సూత్రముచే సంఖ్యావాచకమగు 'త్రి' శబ్దము సంజ్ఞయందు లోకశబ్దముతో సమసించినది. కాన నిది కర్మధారయ సమాసము. త్రిలోకములన్నది స్వర్గమర్త్య పాతాళములకు సంజ్ఞ. త్రిలోకీ–ద్విగువు.

తెలుఁగు ప్రయోగములకు:–

తే. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁగావు
ఎఱుఁగు మెల్లధర్మంబుల (ఆది 4–95)

సరియుగావు. ఎఱుఁగుము–అనుచో సంధి లేదు. కావున ఉత్త్వ సంధి, వైకల్పిక మనవలెనా? ప్రాయిక మనవలెనా? యనుసందేహములు కలుగును. ఉత్త్వసంధి వైకల్పికము కాదు. ప్రాయికమును గాదు. నిత్యమే.

"వాక్యావసానంబున సంధిలేమి దోషంబుగాదని యార్యులంద్రు" (బా. సంధి 55) – ఇట్లు సంధి విరహంబు కావ్యంబులం బాదాంతమంద చూపట్టెడు. (వృత్తి) అనులక్షణముచే నిట ఉత్తున కవసానము పరమగుచున్నది గాని యచ్చు పరమగుట లేదు. అవసానమనఁగా విరామము. అర్ధ మాత్రాకాలము కంటె నెక్కువ కాలము వేఱు వర్ణముల యుచ్చారణము లేమి యవసానమనఁబడును. కాఁగా ఉత్త్వ సంధి నిత్యమేయని నిస్సందేహముగాఁ దెలియుటయేకాక, వాక్యాంతము పాదాంతమునగుచోట్ల సంహిత వివక్షాధీనమని తెలియనగును. (సంహిత=అర్ధమాత్రాకాలము కంటెఁదక్కువ కాలములో వర్ణముల నుచ్చరించుట. సంహితయందే సంధి వర్తించును.)

6. **అన్వాఖ్యానము:** "శబ్దానా మన్వాఖ్యానం వ్యాకరణమ్" (కావ్యమీ) అని వ్యాకరణశబ్ద నిరుక్తి. "వి+ఆఙ్" అను నుపసర్గములు 'కృ' ధాతువుతో సమసింపఁగా వ్యాకరణ మను, గతిసమాసము నిష్పన్నము: (వి+ఆఙ్+కృ+ల్యుట్)

అన్వాఖ్యానమనఁగా సాధుశబ్దములను బ్రకృతి ప్రత్యయాది విభాగ పూర్వకముగా సాధించుట. దీనిని సంస్కారమని యందురు. (సంస్కారార్థోనియమ–) శబ్దతత్త్వము సమగ్రముగా నవగతమగుట కన్వాఖ్యాన ముపకరించును. కాన శబ్దస్వరూపావగతికి వ్యాకరణ మావశ్యకము.

7. **శబ్దానుశాసనము:** ప్రయోగములలో సాధుప్రయోగములు, నసాధు ప్రయోగములు మిళితములయి యుండును. చాలనీ (=జల్లెడ) న్యాయమున నసాధుప్రయోగము లను బరిహరించి, సాధు ప్రయోగముల నన్వాఖ్యానము చేసి, యివి యిట్లు ప్రయోగయోగ్యములని నియమ కల్పన చేయుట వ్యాకరణ ప్రధాన ప్రయోజనము.

క్షున్నివారణమునకుఁ గుక్కమాంసమునయిన భక్షింపవచ్చును. ఖేదనివారణమునకు వావివరుసలతోఁ బనిలేకపోవచ్చును. కాని, యిది భక్ష్యమనియు, నిది యభక్ష్యమనియు స్మృతులు నియమ కల్పన చేయును. ఇది గమ్యయనియు నిది యగమ్యయనియు నియమ కల్పన చేయును.

"భక్ష్యంచనామక్షుత్ప్రతీఘాతార్థముపదీయతే. శ్వమాంసాది రపి క్షుత్ప్రతిహన్తుమ్. తత్ర నియమః క్రియతే. ఇదంభక్ష్య మిదమభక్ష్యమితి. తథాఖేదాత్ స్త్రీప్ర వృత్తిర్భవతి. సమానశ్చఖేద విగమోగమ్యా యాంచాగమ్యాయాంచ. తత్రనియమః క్రియతే, ఇయం గమ్యా ఇయమగమ్యా ఇతి" (మ.భా.)

నియమ కల్పన చేసి శాసించును గావుననే స్మృతులు ధర్మశాస్త్రములనఁబడును. లేనిచో సాంఘిక చరిత్రలగును గాని శాస్త్రములనిపించుకొనవు. స్మృతులు ధర్మనియమము చేయునట్లు వ్యాకరణము లి ప్రయోగయోగ్యములగు సాధుశబ్దములని నియమ కల్పన చేయును. కావుననే వ్యాకరణము శబ్దశాస్త్రమనఁబడును. "శిష్యతే అనేన" అని శాస్త్రశబ్ద నిష్పత్తి. శాసించునది గావున శాస్త్రమనుట. లేనిచో వ్యాకరణము ప్రయోగ సంకలన గ్రంథమనిపించుకొనును గాని శాస్త్రము కాదు.

కేవల లక్ష్యపరిజ్ఞానముతో నిర్దుష్టముగ లక్షణ పరిజ్ఞానము పడయుట యెవరికైన నసాధ్యము. ఏలయన –

(i) ప్రయోగములలోఁ గొన్ని నిపాతన్యాయమున గ్రాహ్యములగును. ఉదా. కళంకంరుఁడు.

(ii) కొన్ని ప్రాయికముగా గ్రాహ్యములగును. ఉదా. నీవు ధన్యుఁడవు మీరు ధన్యులరు. మొ॥ "గర్వగరిష్ఠుండగునన్ను, మీరలు పెద్దలు – ఇత్యాదులు ప్రాయిక గ్రహణముచే రక్షితంబు లయ్యె" (బా. కారక 34)

(iii) కొన్ని యరుదుగా గ్రాహ్యములగును. వచ్చెను+ధాత్రీపతి=వచ్చెం ధాత్రీపతి. పాడెను+ గంధర్వుఁడు=పాడెం గంధర్వుఁడు, కన్+దోయి=కందోయి, ఇట్లు వర్గయుక్స రళములు పరమగుచో ద్రుతమునకుఁ బూర్ణ బిందువరుదుగానగును. (బా. సంధి 19)

(iv) కొన్ని కేచిన్మతముగ గ్రాహ్యములగును. ఉదా॥

*"మకారంబు పరంబగునపుడును గొన్నియెడల ద్రుతంబునకుఁ బూర్ణ*
*బిందువు గొందఱమతంబున గ్రాహ్యంబగు. (ము.కౌ.సంధి 17)*
*కమ్మని లతాంతములకుం మొనసివచ్చు (ఆది 5–137)*

*"బిందుం ప్రవదంతితం క్వచిత్కేచిత్" (ఆం.చిం.)*

ఇది యనునాసిక ప్రాసమని యప్పకవీయము. *(అప్పక 3–341)*

(v) కొన్నియార్షప్రయోగన్యాయము ననుసరణీయములుకావు. ఉదా॥ సమానాధికరణాన్వయముగల యేకదేశాన్వయములు – ఆ రథాధిరూఢుఁడు (అరణ్య 2–183) చూ–ప్రౌ. కారక 21 సూ. లక్ష్యములు. ఇవి సమాస మూలస్వరూప భంజకములగుటచే, నగ్రాహ్యములు.

ఇట్టి ప్రయోగతత్త్వ వివేచన, లక్ష్య సంగ్రహణ పరాయణులకు సాధ్యముకాదు. కాన, వ్యాకరణ మావశ్యకము.

**8. ఇతర ప్రయోజనములు:** నిఘంటు నిర్మాణమునకు, భాషా పరిశోధనాత్మక రచనలకు, సాహిత్య శాస్త్ర నిర్మితికి వ్యాకరణము తప్పనిసరి. "వ్యాకరణమూలత్వాత్సర్వ విద్యానామ్," (ధ్వన్యా) ఇవి లౌకిక ప్రయోజనములు.

**9. నిశ్శ్రేయసప్రాప్తి:** నిర్గుణ బ్రహ్మరూపమగు స్ఫోట శబ్దము ప్రక్రియా భేదములచే బహుధా విభక్తమగుచున్నది. వ్యాకరణ జ్ఞానముచేఁ బరబ్రహ్మ ప్రాప్తి కలుగును. ఇదే వైయాకరుణుల మతమున నిశ్శ్రేయసము. (మోక్షము)

*"యదేకం ప్రక్రియా భేదై, ర్బహుధా ప్రవిభజ్యతే*
*తద్వ్యాకరణమాగమ్య, పరంబ్రహ్మాధిగమ్యతే" (వాక్యప)*

★ ★ ★

# VI. పారిభాషిక పదసూచిక

| పారిభాషికపదము | సూత్రసంఖ్య |
|---|---|
| అంతర్భావితప్రేరణము | క్రియా 34 |
| అధ్యాహారము | వాక్య 11 |
| అన్నంతక్రియ | కారక 12 |
| అన్వయము | వాక్య 4 |
| అలుక్ (సమాసము) | సమాస 37 |
| అవ్యయము | వాక్య 3 |
| ఆకాంక్ష | వాక్య 1 |
| ఆసత్తి | వాక్య 1 |
| ఉత్తరపదము | శబ్ద 4 |
| కారకము | కారక 1 |
| కులకము | వాక్య 23 |
| క్రియ | వాక్య 1,3 |
| క్రియాజన్యవిశేషణము | శబ్ద 13 |
| తద్ధితము | తద్ధితప్రారంభము |
| తాదర్థ్యకక్రియ | సమాస 41 |
| ద్రుతము | సంజ్ఞా 7 |
| ద్వికర్మకము | క్రియా 35 |
| పదము | వాక్య 2 |
| ప్రయోగము | వాక్య 3 |
| మహావాక్యము | వాక్య 1 |
| యోగ్యత | వాక్య 1 |
| లుక్ | శబ్ద 106 |
| లుక్ (సమాసము) | సమాసప్రారంభము |
| వాక్యము | వాక్య 1 |
| విధేయ విశేషణము | కారక 24 |
| విశేష్యము | శబ్ద 2 |
| విశేషణము | శబ్ద 2 |
| వైకృతము | సంజ్ఞా 6 |
| సంహిత | శబ్ద 51 |

★ ★ ★

# సూత్రానుక్రమణిక

★ ★ ★